Telugu Classics—Popular Edition Series

# భోజరాజీయము

అనంతామాత్య ప్రణీతము

సంగ్రహకర్త - సంపాదకుడు.

దర్శనాచార్య

శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులు




ప్రచురణకర్తలు

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

కళాభవనము - సైఫాబాద్ - హైదరాబాదు - 4.

# తొలిపలుకు

మూడు సంవత్సరాల క్రింద ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వములో సాంస్కృతిక వ్యవహారాల మంత్రిగా ఉండిన శ్రీ ఎం. ఆర్. అప్పారావుగారు చేసిన సూచనల ననుసరించి తెలుగు భాషలోని సాహిత్యము అందరికి అందుబాటులో నుండునట్లుగా ముద్రించి ప్రకటింపవలెనని అకాడమీ నిశ్చయించినది. తెలుగు భాషలోని పూర్వ గ్రంథసముదాయము యీనాడు పాఠకునికి సక్రమముగా సరసమైన ధరకు లభ్యమగుటలేదు. ఈ లోటును తీర్చి ప్రాచీన గ్రంథ సంచయమును విడివిడిగా ప్రకటించుటకు సాహిత్య అకాడమీ, ఒక ప్రణాళికను సిద్ధము చేసినది. ఈ ప్రణాళిక ప్రకారము యీ కార్యక్రమము మూడు తరగతులుగా విభజింపనైనది. మొదటిది ప్రాచీన ప్రబంధాల ప్రకటన, రెండవది మహాభారతము, భాగవతము, హరివంశము, భాస్కర రామాయణము, బసవపురాణము, భోజరాజీయములను సంగ్రహించి ప్రకటించుట, మూడవది భారత భాగవతాల నుండియు నాచన సోమన, కంకటి పాపరాజు, కూచిమంచి తిమ్మకవి రచనల నుండియు భాగాలను యేర్చికూర్చి ప్రకటించుట. మొదటి తరగతిలో 29 ప్రబంధాలను 29 సంపుటాలుగా, రెండవ తరగతిలోని గ్రంథాలను 13 సంపుటాలుగా మూడవ తరగతిలోని గ్రంథాలను 8 సంపుటాలుగా, మొత్తము 50 సంపుటాలను ప్రకటించు కార్యక్రమము స్వీకరింపవలెనని అకాడమీ తీర్మానించినది.

ఈ ప్రణాళిక ప్రకారము ప్రతి సంపుటము 1/8 డెమ్మీ సైజులో క్యాలికో బైండులో 200 పేజీల గ్రంథముగా నుండవలెనని నిర్ణయింపనైనది. ప్రతి గ్రంథములో గ్రంథకర్తను గూర్చి, గ్రంథ ప్రాశస్త్యమును గూర్చి వివరించు సుమారు 40 పేజీల పీఠికను

చేర్పవలెనని నిశ్చయింపనైనది. చౌకగా పాఠకులకు అందజేయవలెనను ఉద్దేశముతో యీ సంపుటాల వెల తక్కువగా నిర్ణయింపనైనది. ఇప్పటివరకు మొదటి తరగతిలో 29 పుస్తకాలను ప్రకటించి ముద్రించుట జరిగినది. ప్రస్తుతము రెండవ తరగతిలోని పుస్తకాల ప్రకటన ప్రారంభమైనది. మేము కోరినంతనే యీ సంపుటము సిద్ధముచేయు బాధ్యతను స్వీకరించి నిర్ణయించిన గడువులోపల వ్రాత ప్రతిని అందజేసిన శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులు గారికి అకాడమీ పక్షాన కృతజ్ఞతలు. ఈ తరగతిలోని మిగిలిన పుస్తకాలను యీ సంవత్సరాంతము వరకు ముద్రితము కాగలవని ఆశించుచున్నాను.

ఈ ప్రణాళికను అమలుచెసి వ్రాత ప్రతులను సిద్ధముగావించి ముద్రించుటకు కావలసిన డబ్బు మొత్తము అకాడమీకి యిచ్చుటకు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు వాగ్దానముగావించి యిప్పటివరకు కొంత డబ్బును గూడ విడుదల చేసినవి. ఇందులకు అకాడమీ పక్షాన కేంద్ర, రాష్ట్రప్రభుత్వాలకు ధన్యవాదాలు. నిర్ణయించిన గడువు లోపల యీ సంపుటాలనన్నిటిని ప్రకటించి ఆంధ్ర పాఠకలోకానికి అందజేయగలమని విశ్వసించుచున్నాను.

హైదరాబాదు<br>1-1-1969.

దేవులపల్లి రామానుజరావు.

# భోజరాజీయము

## విషయసూచిక

---

# సమీక్షలోని విషయములు

# సమీక్ష

కథాకావ్యములు :

మనకు కథాకావ్యములకు కొఱఁత లేదు. రెండు వేల యేండ్లనాఁడే పైశాచీ ప్రాకృతములో గుణాఢ్యపండితుని బృహత్కథ వెలసినది దానిని ఆధారముగా చేసికొని సోమదేవుని కథాసరిత్సాగరము, క్షేమేంద్రుని బృహత్కథామంజరి రచితము లైనవి. సంస్కృతములో నున్న పంచతంత్ర హితోపదేశములుకూడ కథాప్రధానములే కదా! విక్రమార్కచరిత్రములోని కథలు, బుద్ధుని జాతకకథలు మనకు అపరిచితములు కావు. ఈ విధముగా సంస్కృత ప్రాకృత భాషలలో ఏ నాఁడో పెక్కు కథా గ్రంథములు బయలు వెడలినవి.

తెలుగున వెలసిన మొట్టమొదటి పద్యమయ కథాకావ్యము మూలఘటికకేతన అనువదించిన 'దశకుమారచరిత్రము' అనవచ్చును. ఇది అనువాదము కావున మొదటి దనుటకు వీలు కా దన్నచో, మంచనకవి రచించిన కేయూరబాహుచరిత్రమునకు ఆ స్థానము నీయవచ్చును. ఇతడు సంస్కృతములో రాజశేఖరుఁడు వ్రాసిన 'విద్ధసాలభంజిక' అను నాటకము నాధారముగా తీసికొని పెక్కు నీతికథలను కల్పించి చేర్చి ఈ కావ్యమును రచించినాఁడు. తరువాత పేర్కొనఁదగినది జక్కన విక్రమార్కచరిత్రము. ఇది సంస్కృతములోని విక్రమార్కచరిత్రమునకు కేవలానువాదము కాక, కేయూరబాహుచరిత్రమువలెనే చాలవఱకు స్వతంత్ర కథాకావ్యముగానే ఎన్నఁదగినదై యున్నది. సంస్కృతవిక్రమార్కచరిత్రమున కనువాద మని చెప్పఁదగినది కొఱవి గోపరాజు వ్రాసిన సింహాసనద్వాత్రింశిక. ఇది జక్కన విక్రమార్కచరిత్రకు పిమ్మటిది. జక్కన కించుమించు సమకాలికుఁడుగా నెన్నదగిన అనంతయ వ్రాసిన భోజరాజీయము తెలుగున వెలసిన మొదటి స్వతంత్ర కథాకావ్యముగా ఎన్నదగినది. ఇంకను కదిరీపతి శుకసప్తతి, దూబగుంటనారాయణ కవి వేంకటనాథుల పంచతంత్రములు, హంసవింశతి మున్నగునవి చక్కని కథాకావ్యకోటి లోనివే.

## కవి, కృతులు :

భోజరాజీయ కావ్యకర్త అనంతయ ఆఱువేలనియోగి బ్రాహ్మణుఁడు కౌండిన్యగోత్రోద్భవుఁడు. ఇంటిపేరుమాత్రము తెలియబడ లేదు. ఇతని కృతులు 1 భోజరాజీయము. 2 ఛందోదర్పణము. 3 రసాభరణము. వీనిలో భోజరాజీయము కావ్యము. ఛందోదర్పణము ఛందశ్శాస్త్రము. రసాభరణము అలంకారశాస్త్ర గ్రంథము. ఇందు రసమునుగూర్చియు, రససామగ్రినిగూర్చియు, నాయికా నాయకులనుగూర్చియు మాత్రమే నిరూపణము కలదు.

## వంశ ప్రశస్తి :

అనంతయ ముత్తాత బయ్యనమంత్రి. (భైరవామాత్యుఁడు) ఇతఁడు తిక్కన సోమయాజిచేత 'భవ్యభారతి' అని బిరుదము నందిట్లు అనంతయ దిగువపద్యములో పేర్కొనినాఁడు—

చ. క్షితిఁ గ్రతుకర్తృతామహిమ
చేకొని పంచమవేద మైన భా
రతముఁ దెనుంగుబాస నభి
రామముగా రచియించినట్టి యు
న్నతచరితుండు తిక్కకవి
నాయకుఁ డాదట మెచ్చి భవ్యభా
రతియనఁ బేరు గన్న కవి
రత్నము బయ్యనమంత్రి యప్పుఁడే. ౧. ఆ. ౨౪ ప.

ఈ కవిరత్నమగు బయ్యనమంత్రి యే గ్రంథములను వ్రాసి తిక్కనచేత భవ్యభారతి బిరుదము నందినాఁడో అనంతయ చెప్పలేదు. ఇతర మార్గములగూడ ఆతని కృతులసంగతి లోకమునకు తెలియ లేదు. అనంతయ తాత ముమ్మడి ప్రెగ్గడ ఈ ముమ్మడి గుణగణములను ప్రథమాశ్వాసములోని 34 వ పద్యములో కవి విస్తృతముగా వర్ణించినాఁడు. తండ్రి శ్రీకాకుళాంధ్రవల్లభ సేవానిరతు డైన తిక్కన, తల్లి గుణగౌరవశోభిని మల్లమాంబ, గురువు శ్రీ తిరుమలగోవిందచక్రవర్తి. అనంతయసోదరు లార్వురు. వీరి యోగ్యతను కవి ఇట్లు కొండాడినాఁడు.—

ఉ. భూనుతకీర్తి ముమ్మడివి
భుండు మదగ్రజుఁ; డేను వైష్ణవ

ధ్యానసమాహితాత్ముఁడ న
　　నంత సమాఖ్యుఁడ ; నాదుతమ్ముఁ డ
జ్ఞానవిదూరు లక్కనయు
　　సత్కవి చిట్టనయుఙ్ ; వివేకవి
ద్యానిధి రామచంద్రుఁడు ; ను
　　దారుఁడు లక్ష్మణనామధేయుఁడుఙ్. ౧ ఆ. ౪౭ ప.

తమ ఆఱువేలనియోగివంశము ఈ యార్వురిచేతనే వేయేసి యిండ్లుగలదిగా పెరుగు నని యెఱిగిన పెద్దలే దాని కా పేరిడినా రని దిగువ పద్యములో కవి చమత్కరించినాఁడు —

క. ఈ యార్వురు నొక్కొక్కఁడు
వేయిండ్లకు మొదలుగాఁగ వెలయుదు రని కా
దే యాఱువేల పేరిడి
రీయన్వయమునకు నేష్య మెఱిఁగినపెద్దల్. ౪౮ ప.

ఈ కవి తన వంశప్రతిష్ఠనుగూర్చి 44 పద్యములలో విస్తరముగా వర్ణించుకొనినాఁడు. తన ముత్తాతయైన బయ్యనమంత్రిగారి పినతండ్రి త్రిపురాంతకుఁడు నిశ్చల ధ్యాన నిష్ఠా గరిష్ఠుఁడై ఆఱునెలల పురశ్చరణ చేసి తమ యింటిలోని పిల్లికిగూడ నరకము లేనట్లు వరము నందినాఁ డనియు, తనకు పునర్జన్మము కలుగకుండ బ్రతిన బూని బ్రహ్మపదము నందినాఁ డనియు చెప్పినాఁడు. (21 వ. ప.) తల్లివంశము వారి యౌన్నత్యమునుగూర్చియు చెప్పికొని తన ఉభయవంశ పావిత్ర్యగౌరవము నీ కవి స్పష్టపఱచినాఁడు తల్లి బంధువర్గమునుగూర్చి ఒక సీసపద్యములోను (42) ఆమె గుణములనుగూర్చి ఒక సీసములోను (43) తన తలిదండ్రుల యోగ్య దాంపత్యమునుగూర్చి ఒక సీసములోను (44) ప్రస్తుతించినాఁడు. ఛందోదర్పణ రసాభరణములలో స్వీయవంశమును వర్ణించుకొనని కొఱతను కవి యిందు తీర్చుకొనినా డనవచ్చును. పిమ్మట ఇట్టి మహావంశమున బుట్టిన తన్నుగూర్చి ఇట్లు చెప్పికొనినాడు.

క. ఏతద్వంశపయోనిధి
శీతాంశుఁడ, బుధచకోర చిత్తప్రియుఁడఙ్,
పీతకళంకుండఁ, గళో
పేతుఁడ, నిర్ధూతదురిత పృథుతిమిరుండఙ్. ౧-౫౬

క. నరహరి చరణసరోజ
స్మరణామృతపాన సతత సంతుష్టాంతః
కరణుఁడ, సంతత వాణీ
వరప్రసాదానులబ్ధ వాగ్విభవుండన్. ౧. ౫౩

క. శ్రీయువతీ కారుణ్యా ర
సాయత్త కటాక్షవీక్షణాపాదిత సు
శ్రేయస్కుఁడఁ, గవినికరవి
ధేయుండ ననంతనామధేయుఁడ జగతిన్. ౫౦

ఈపద్యములనుబట్టి చూచిన అనంతయ కవిపండితప్రియుఁడు_ విధేయుఁడు ననియు, శ్రీ దేవతానుగ్రహ సంపాదిత శ్రేయస్కుఁ డనియు, వాణీవరప్రసాదలబ్ధ వాగ్విభవుఁ డనియు, దోషరహితుఁ డనియు, నరసింహస్మరణసంతుష్టుఁ డనియు, కళాసముపేతుఁ డనియు తెలియుచున్నది. ఆశ్వాసాంతగద్యములలోగూడ ఈ కవి తన్ను "వాణీవరప్రసాదలబ్ధ వాగ్విభవుఁడ"ననియే చెప్పికొనినాఁడు.

అనంతయ – అనంతామాత్యుఁడు :

ఈ కావ్యమునం దెక్కడను కవి తనకు అమాత్య బిరుదమును వాడుకొన లేదు. అనంతయనామధేయుఁడ నని పై పద్యములలోను__ "వినువైష్ణవధ్యాన సమాహితాత్ముఁడ ననంతసమాఖ్యుఁడ" నని 47 వ పద్యములోను చెప్పినాఁడు. ఆశ్వాసాంత గద్యములందుగూడ__

"ఇది వాణీవరప్రసాదలబ్ధ వాగ్విభవ తిక్కనామాత్యసంభవ సుకవివిధేయ అనంతయనామధేయ ప్రణీతంబైన భోజరాజీయంబను కావ్యంబునందు . "

అనియె చెప్పికొనినాఁడు. అట్లే ఛందోదర్పణము_ ఆశ్వాసాంత గద్యము లందుగూడ 'అనంతయనామధేయ ప్రణీతం బైన ." అనియె వ్రాసికొనినాఁడు కాని, అమాత్యబిరుదము నుపయోగించుకొనలేదు. ఛందోదర్పణము చతుర్థాశ్వాసము చివర__

ఉ. శ్రీనిధి చక్రవర్తి గురు
శేఖర పుణ్యకటాక్ష లబ్ధ సు
జ్ఞానుఁ డనంతధీమణి ల
సన్మణి భోజచరిత్ర చెప్పి, అ

క్ష్మీనరసింహుఁ గూర్చిన ప్ర
సిద్ధుఁడు వేడుకతో నొనర్చె ఛం
దోనుతి యోగిహృద్విమల
తోయజవర్తి కనంతమూర్తికిన్. ౧౩౨. ప.

అని తనను 'అనంతధీమణి' అనినాఁడు గాని అమాత్యబిరుదము నుపయోగించుకొనలేదు. తన మూఁడవకృతియగు రసాభరణములోఁగూడ—

శా. జానొందన్ శకవర్షముల్ బుతు శర
జ్వాలేందులై యొప్పు న
య్యానందాబ్దమునందు మాఘమునఁ గృ
ష్ణైకాదశీభౌమయు
క్తానామామృతవేళ నీకృతి యనం
తాఖ్యుండు సమ్యగ్రస
శ్రీ నిండన్ ధ్రువపట్టణాధిపున కి
చ్చెన్ భక్తిపూర్వంబుగన్.

అని తన్ను అనంతాఖ్యుఁ డనియే చెప్పికొనినాఁడు. అయినను లోకవ్యవహారమున నీతఁడు అనంతామాత్యుఁడుగా ప్రసిద్ధుఁ డయినాఁడు. పూర్వము నియోగులు ఎక్కువగా మంత్రులుగా నుండుటవలన అమాత్యపదము వీరికి సాధారణబిరుదమై యుండును. శబ్దరత్నాకరకర్త మొదలుకొని అనంతయను ప్రస్తావించిన తరువాతివా రందఱు ఇతనిని అనంతామాత్యుఁ డనియె పేర్కొనినారు. కవికి మాత్రము ఆ అమాత్యబిరుదముపై మోజున్నట్లు లేదు. ఉన్నచో ఎక్కడనో వాడుకొని యుండెడివాఁడే.

## దేశము

అనంతామాత్యుని దేశ కాల కృతికవిత్వాదులనుగూర్చి ఇప్పటి కొందఱో పరిశోధనలు చేసి విషయములను బయలుపఱచినారు కాన ఈ నా డందుకై మన శ్రమ చాలవఱకు తగ్గిన దనవచ్చును. అనంతయ భోజరాజీయమున తన తండ్రి యగు తిక్కనామాత్యునిగూర్చి యిట్లని సాఁడు—

సీ. విలసితంబగు కృష్ణవేణి మలాపహా
రిణి భీమరథినా ధరిత్రియందుఁ

వనరుహనదీత్రయాంతర్వేదియగు పావ
నక్షేత్రమున శోభనములకెల్ల
ధర నివాసంబగు పెరుమగూరు పురంబు
నందు విద్వజ్జనానంద మైన
జీవనస్థితిచేతఁ జెన్నొంది వంశక
ర్తృత్వసంపత్తిఁ బ్రభుత్వ మొంది

తే. నెమ్మిఁ బ్రత్యక్షపరమపద మ్మనంగ
నొప్పు శ్రీకాకుళంబున కొడయఁ డైన
యంధ్రవల్లభహరిసేవ నలరుచుండుఁ
బెక్కుభంగుల ముమ్మడితిక్కవిభుఁడు. ౧. ఆ ౪౧. ప.

ఈపద్యమునుబట్టి కృష్ణానదీతీరమునందలి శ్రీకాకుళమున కధిపతియగు ఆంధ్రవల్లభ హరిని సేవించుచు అలరారు తిక్కనామాత్యుఁడు 'పెరుమగూరు' నివాసి యని తెలుచున్నది. శ్రీ చాగంటి శేషయ్యగారు ఆంధ్రకవితరంగిణిలో అనంతా మాత్యునిగూర్చి వ్రాయుచు పెరుమగూరు శ్రీకాకుళమునకు సమీపమున నుండి యుండు ననియు కవియు, కవి తండ్రియు నీ గ్రామముననే వసించి యుండవచ్చు ననియు ఊహించినారు. "జానొందఁగా శకవర్షముల్" అను పద్యమునుబట్టి రసాభరణము ధ్రువపట్టణాధిపునకు అంకితము చేయఁబడినట్లు తెలియుచున్నది. ఈ ధ్రువ పట్టణాధీశుఁడు 'వ్రజవధూవరుడును, రుక్మిణీశుఁడు'ను అగు శ్రీకృష్ణుఁడు కావచ్చును. ధ్రువపట్టణమున గోపాలకృష్ణాలయ ముండి యుండవచ్చును. ఆ స్వామి కీ రసాభరణ మంకితమై యుండవచ్చును. అని ఒక ఊహ.

అట్లయినను ఈ ధ్రువపట్టణ మేది? గుంటూరుమండలములోని ధూళిపూడి యని కొందఱ తలంపు. కృష్ణామండలములోని దరువూ రని శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు ఛందోదర్పణ ద్వితీయముద్రణ పీఠికలో వ్రాసియున్నారు. ధ్రువ శబ్దమునకు మట్టి, మోడు అను నర్థము లుండుటచేత మట్టిపూడి, లేక మట్టివాడ అను పేరును కవి సంస్కృతీకరించినా డనియు, కృష్ణామండలమున గన్నవరము తాలూకాలో మట్టివాడయు, దివితాలూకాలో మోదుమూడియు నున్నవనియు, ఈ రెంటిలో ఏదో యొకటి ధ్రువపట్టణము కావచ్చుననియు, ఎట్లయినను ఈ కవి కృష్ణామండలమువాఁడే యనియు శ్రీ శేషయ్యగారు తలంచిరి. పెరుమగూరు

పెనమకూ రన్న వాదమును గూడ నీ రంగీకరింపలేదు. మొత్తముమీద సరియగు నాధారములు దొరకువఱకు సత్యము తేలుట కష్టమే.

కాలము :

అనంతయ కాలమునుగూర్చి వివాదములు లేవు, "జానొందఁ శకవర్షముల్ ఋతుశరజ్మాలెందులై యొప్ప .." అను పద్యమున తాను రసాభరణము చెప్పుడు ధ్రువపట్టణాధిపున కిచ్చినదియు కవి చెప్పినాడు. ఆ తిథి శాలివాహనశకము 1356 ఆనందసంవత్సర మాఘబహుళ ఏకాదశీమంగళవారము. దీనికి సరియైన ఆంగ్లతిథి, క్రీ. శ. 1435 జనవరి 25 వ తేది. దీనినిబట్టి ఈ కవి పదునైదవశతాబ్ది మధ్య నున్నట్లు తెలియుచున్నది. ఇది రసాభరణము ముగించిన కాలము. అంతకుముందే ఛందోదర్పణరచనము జరిగినది. దానికి పూర్వము భోజరాజీయకావ్యరచన ఈనాటికి కవికి ఏబదిసంవత్సరముల వయస్సుండవచ్చును. ఇదే సత్యమయినచో ఈతడు శ్రీనాథునికన్న కొంచెము చిన్నవా డని చెప్పవచ్చును.

కృత్యాది :

ఈకవి ఇష్టదేవతలను స్తుతించినపిమ్మట వాల్మీకిని వ్యాసుని సంస్తుతించి కాళిదాసాదుల నిట్లు ప్రణుతించినాఁడు___

చ వివిధపదానుయోజనఁ బ్రవీణుఁడు దండి, సమంచితార్థ గౌ
రవమునఁ బెద్ద భారవి; ధురంధరుఁ డయ్యుపమాకవిత్వ స
త్ప్రవణతఁ గాళిదాసు; శ్రివిధంబున మాఘుఁడు మేటి నాఁగ ని
ట్లవనిఁ బొగడ్త కెక్కిన మహాకవులం బ్రణుతింతు నాఢ్యులన్. ౧. అ. ౨. ప.

సంస్కృతములోని దిగువ శ్లోకమునే యాంధ్రీకరించి కాళిదాసాదుల నీ పద్యమునందు కవి నుతించినాఁడు.

శ్లో॥ ఉపమా కాళిదాసస్య, భారవే రర్థగౌరవమ్,
దండినః పదలాలిత్యం, మాఘే సన్తి త్రయో గుణాః.

తెలుగు కవులలో కవిత్రయమును, రంగనాథ, భాస్కర, అమరేశ్వరులను మాత్రమే పేర్కొని తక్కిన సోమనాథాదులను "ఆదిగాఁ జన్నకవీంద్రుల" వని సంగ్రహించినాడు. తరువాత భాగవత సంకీర్తనమును, గురుచరణస్మరణమును జేసి తన వంశప్రశంసకు పూనుకొనెను. కావ్యప్రశంస చేయుచు మమ్మటభట్టుని కావ్యప్రకాశములోని—

"కావ్యం యశసేఽ ర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే
సద్యః పరనిర్వృతయే కాంతాసమ్మితతయోపదేశయుజే."

అను శ్లోకమును క్రిందిరీతిగా అనువదించి సందర్భోపయోగిగా చేసికొన్నాడు.

సీ. సకలవిద్యలయందుఁ జర్చింపఁ గవిత యు
త్కృష్టమం; ద్రది నిత్యకీర్తికొఱకు,
నర్థాప్తికొఱకును, వ్యవహారలక్షణం
బెఱిఁగెడికొఱకు, ననేకవిధము
లగునమంగళముల హరియించుకొఱకును, ను
చితనిత్యసౌఖ్యసంప్రాప్తికొఱకు,
నొనరఁ గాంతాసమ్మితోపదేశంబునఁ
బ్రీతిమై హిత మాచరించుకొఱకు,

ఆ. నయ్యె గానఁ బెద్ద లాదరించెద రంచు
నేర్చుకొలఁదిఁ గృతియొనర్పఁ బూని
యస్మదీయకృతికి నధిపతిఁ గావింప
నర్హుఁ డెవ్వఁ డొకొ యని తలంచి. ౧. ఆ. ౫౯. ప.

కృతి భర్త

తన కావ్యమునీయ నర్హు డెవ్వడా యని ఆలోచించుచు కనుమూయు నంతలో స్వప్నములో శ్రీ నరసింహస్వామి దరిసెన మిచ్చినాడట. ఆ దేవుని వెను వెంటనే కవిగారి గురుమూర్తియు వచ్చి కవిని చేర రా బిలిచి ఆదరించి ఆ స్వామి ఆదినృసింహు డని చెప్పి ఆయనకు కావ్యము నంకిత మిమ్మని యుపదేశించినాడట.

చ. అదె జగదేకవంద్యుఁ డగు నాదినృసింహుని దివ్యరూపసం
పద, గనుఁగొంటె; నర్వసులభంబుగ నీకృతి లక్ష్మికిఁ వరుం

దొదవె, ఫలించె నీతలఁపు, యోగ్యుఁడ వైతి యశోవిభూతి క
య్యదధివరేణ్యుచాడ్పున మహోన్నతజీవన వైభవంబునన్. ౬౪

ఉ. కావున నిమ్మహాత్ము నవిఖండితతేజుఁ గృపావిధేయు భ
క్తావనశీలుఁ బావనతరాంఘ్రిసరోరుహజాతదేవతా
శైవలినీకు నాకలితచక్రు నహోబలతీర్థనాయకున్
శ్రీవనితాధినాథుఁ బతిఁ జేయుము నీకృతికిన్ లసన్మతిన్ ౧-౬౫

అనంతయది ఎంత అదృష్టము! సర్వసులభముగ తన కృతికి జగన్నాయకుడే పతి యైనాడు. అనంతయకు కవిత్రయమునందును వారి కవితారీతులయందును మక్కువ యెక్కువ అందును తన ముత్తాతయగు బయ్యన్నను 'భవ్యభారతి' అని పొగడిన తిక్కనసోమయాజిమీద నీతనికి భక్తి ప్రపత్తు లెక్కువగా నుండుననుట వింతకాదు. కనుకనే తన కావ్యమును అహోబలనరసింహస్వామి కంకిత మిచ్చు పట్టున తిక్కనగారి కృతిసమర్పణమార్గమునే అనుసరించినాడు. తిక్కనకు కలలో తండ్రియగు కొమ్మనామాత్యు డగపడుట, ఆయన హరిహరనాథుని తిక్కనకు పరిచయము చేయుట మున్నగునది జరిగెను గదా. అట్లే అనంతుని విషయమునను గురుమూర్తితోచి ఆదినరసింహునికి కృతి యిమ్మని యుపదేశించినాడు.

ఒక్క భోజరాజీయమే కాక, అనంతామాత్యుని తక్కిన రెండు కృతులు గూడ భగవదంకితములే యగుట అతని ఈశ్వరభక్తికి చక్కని తార్కాణ. ఛందోదర్పణముగూడ అనంతమూర్తి యగు శ్రీకృష్ణునికే అంకితము చేయబడిన దని ఛందోదర్పణము చతుర్థాశ్వాసములోని "శ్రీనిధిచక్రవర్తి... వేడుకతో నొనర్చె ఛందోనుతి యోగిహృద్విమలతోయజవర్తి కనంతమూర్తికిన్" అను పద్యముచే తెల్లమగుచున్నది గ్రంథారంభముగూడ ఆ అనంతుని ప్రార్థనముతోనే జరిగినది. గ్రంథమధ్యస్థ పద్యాంతములందుగూడ "కృష్ణా!" అను సంబోధనములను కవి వాడినందువలన ఇది శ్రీకృష్ణార్పిత మైనదనుటలో సందేహము లేదు. ఇక రసాభరణము సైతము ధ్రువపట్టణాధిపు (డగు వ్రజవధూవల్లభు) న కిచ్చినట్లు "జానొందన్..." అను పద్యములో కవియే చెప్పికొనినాడు గదా! తిక్కనామాత్యుని ఆదర్శముగా పెట్టుకొన్న కవి ఇట్లు చేయుట యెంతయు సమంజసము.

కృతిప్రస్తావన :

ఇట్లు ఆదినరసింహదేవునకు తన కావ్యమును సమర్పింప దలచిన కవి తన కవిత్వము సహృదయులకు రుచించునో లేదో యని శంకించి సమాధానము చెప్పికొనినాడు.

చ. వెలయఁగఁ దొంటిపెద్దల క
        విత్వము వోలె రుచించు నొక్కొ యేఁ
    బలికెడు నూత్నకావ్య రస
        భావము లైనను భూమిఁ దల్లిదం
    డ్రులకు నిజాగ్రసూనుల ప
        టుప్రచురోక్తులకంటెఁ జిన్నబి
    డ్డల వెడతొక్కు బల్కులు ద్బృ
        ఢంబుగ ముద్దుల నీన కుండునే. ౧. ఆ. ౬౫. ప.

ఈ పద్యము కవి వినయమును సూచించుచున్నది.

ఇంతకు తాను వ్రాయ దలంచిన కావ్యము నూతనము. ఇతఃపూర్వమే జక్కన కవీంద్రుడు రచించిన విక్రమార్క చరిత్రము—అందలి కథలు అందఱ మన్ననలను చూఱగొన్నవి. తానుగూడ అట్టి లోకోత్తరనాయకుని గూర్చికొని నూత్నకథాబహుళమగు కావ్యమును వ్రాయవలయును. అందుకే—

సీ. నూతనం బయ్యుఁ బురాతనకృతు లట్లు
        సంతతశ్రవ్యమై జరుగు ననియు
    నాదిరాజసమానుఁ డగు భోజభూపతి
        చరిత మీ కవితాప్రసంగ మనియు
    నిందుఁ జెప్పెడి కథ లిన్నియు వోలిఁ బ్ర
        శస్త ధర్మోపదేశంబు లనియు
    నఖిలజగన్నాథుఁ డగు నహోబలనాథుఁ
        డీపుణ్యకృతికి నధీశుఁ డనియు

ఆ. బృథివి నెల్ల జనులు ప్రియభక్తియుక్తిఁ బా
    టింతు రనియు నూఱడిల్లి యేనుఁ

పరమసౌఖ్యమైన భవదాభిముఖ్యంబు
నెమ్మిఁ బడసి యధికనిష్ఠతోడ. ౧, ౭౭ ప.

అని తన కావ్యనాయకుని ఘనతను, తన కావ్యకథల నూతనత్వమును సూచించి, నూతన మైనను బురాతనకృతు లట్లు తనకృతి సంతతశ్రవ్యము కాగల దని ధైర్య పడినాడు. సప్తమాశ్వాసాంతమునగూడ తన కృతి "వివిధ కథా నూత్నరత్న భూషణాభిరామ" మని (179) చెప్పుకొనినాడు.

జనసామాన్యమున ప్రచారమునం దున్న ఆ యా కథలను ఆధారముగా చేసి కొని పురాణకథల పోకడలను పోహళించుకొని స్వప్రతిభావశమున సంవిధానముల నేర్పఱచుకొని స్వతంత్రముగా రచించినట్టిదే ఈ భోజరాజీయము. ఈ విషయ మును కవి యిట్లు చెప్పినాడు—

క. సూత్రకథ భోజరాజ చ
రిత్రము యానడుమ ధర్మరీతులు నీతుల్
చిత్రకథలై తలిర్పఁగ
శ్రోత్రసుఖముగా నొనర్పఁ జొప్పడి యుండున్. ౧౫. ప.

ఇందు సూత్రకథ భోజరాజచరిత్ర మని కవి చెప్పినాడు గాని ఆ భోజరాజ చరిత్ర మీ కావ్యమున కొంతవఱ కైనను వివరింపబడలేదు. భోజకాళిదాసకథలలో చెప్పుకొనబడు పుక్కిటిపురాణములు భోజచరిత్రాంశములు కావు. భోజుడు ధారా నగరమున నుండి మాళవదేశమును పాలించిన సుప్రసిద్ధ రాజకవి. 11 వ శతాబ్దిని జీవించిన ఒక మహాకళాపోషకు డగు భూపాలుడు. తాను స్వయముగా సరస్వతీ కంఠాభరణము, చారుచర్య, రామాయణచంపువు మున్నగు సంస్కృతగ్రంథములను వ్రాసిన కవిదిగ్గజము తన ఆస్థానశిల్పాచార్యుడగు సమరాంగణసూత్రధారునిచేత సమరాంగణసూత్రధారమను ప్రమాణభూత శిల్పవాస్తుగ్రంథమును వ్రాయించుటకు తోడ్పడిన మహనీయుడు. పలువురు కవులను, పండితులను, కళానిర్మాతలను పోషించి భారతసంస్కృతిని ప్రోదిచేసిన కళాతపస్వి భోజరాజునకు సంబంధించిన ఎట్టి చారిత్రకసత్యము లేవియు ఈ భోజచరిత్రములో ప్రస్తావింపబడ లేదు. ఇందలి భోజరాజకథ ఇది.

### వక్త - శ్రోత :

మహుండను కాంభోజరా జొక్కడు కుష్ఠవ్యాధిపీడితుడై గౌతమీనదిలో బడి ప్రాణములను వీడుటకు యత్నించును. ఆగౌతమియు ఈతని కుష్ఠగంధమును సహింప జాలక ఒక మునిభామినిగా దరిసెన మిచ్చి "హేమకూటపర్వతమున శ్రీమన్నారాయణుడు దత్తాత్రేయుడై అవతరించి యున్నాడనియు, ఆతని నాశ్రయించిన రోగవిముక్తి చేకూరు ననియు" చెప్పి దత్తాత్రేయమంత్రము నుపదేశించి తనదారిన బోవును. పిమ్మట మహుడు దత్తాత్రేయుని దర్శించి ఆతని యనుగ్రహమున రోగ విముక్తుడగును. తరువాత మహుని ప్రార్థనమువలన దత్తాత్రేయుడు శ్రీరంగ, హేమకూట, ప్రయాగముల ప్రభావముల నుగ్గడించును. ఆ సందర్భమున ప్రయాగ యందు బడి మరణించినవారు ఇష్టకామ్యసిద్ధి నందుదు రని విన్న మహుడు అట్టివారి చరిత్ర చెప్పు మని వేడగా దత్తాత్రేయుడు భోజచరిత్రమును చెప్పును. కనుక నీ కథకు దత్తాత్రేయమునీంద్రుండు వక్తయు, మహుండు శ్రోతయు అయినారు.

## భోజ చరిత్ర

భోజుడు పూర్వజన్మమున ఒక దరిద్రబ్రాహ్మణుడు; అతిసంతానవంతుడు. అతని భార్యకూడ బుద్ధిహీనురాలే. ఈసంసారభారమును, దారిద్ర్యబాధను భరింప లేక విసిగి ఆతడు కాశికి బోయినాడు. అచ్చట గొన్నిదినంబు లుండి "కాశిలో మరణమువఱకు పడియుండిన గాని సిద్ధి కలుగదనియు, ఆసిద్ధి గూడ శివస్వరూప ప్రాప్తి తక్క వేఱు వైభవము లేమియు కా" వనియు తలచి ప్రయాగ కేగి ప్రయాగమాధవుని సేవించుచుండెను. ఒకనా డాతడు గంగలో స్నాన మాడు చుండ నలుగురు స్త్రీలచ్చటకు వచ్చి తమకు రాబోవు జన్మలో సిద్ధింపవలసిన మగల లక్షణములను వర్ణించి సంకల్పము చెప్పుకొని ప్రయాగతీర్థమున మునిగి మరణించిరి. (౨. ఆ. ౨౮—33) ఆ విప్రుడు ఉపాయశూన్యవనుడయినను ఈ మగువలను గాంచగనే ఉపాయము తట్టినది గాబోలు పాపము! "ఈతరుణీమణుల నల్వురను రాబోవుజన్మమున నాకు భార్యలు గావలయు" నని సంకల్పించుకొని ప్రయాగలో ప్రాణములు విడిచినాడు. మఱుజన్మమున ఆతడు భోజుడై పుట్టి సుగంధి, పద్మగంధి, కనకవతి, చంద్రప్రభ—అను పేర్లతో రాచకన్నెలుగా జన్మించిన ఆనలుగురు సుదతులను పెండ్లాడి, లాటదేశమునందు ధారానగరాధీశ్వరుండై చెన్నారెను. ఇట్టిభోజు డొకనాడు అడవికి వేటకై యేగి ఒక పెద్దమఱ్ఱి చెట్టు కొమ్మకు పాదముల దగిల్చి తలక్రిందుగా తప మొనరించుచున్న సర్వటి మును

సిద్ధుని గాంచి వానిని ప్రసన్నుని జేసికొనినాడు. ఇరువురికి సంభాషణము సాగినది. సర్పటి రాజును పొగడి సపరివారముగా ఆతనికి ఆతిథ్య మిచ్చినాడు. ఈ ఆతిథ్య సంభారములు సర్పటికి కామధేనుసంస్మరణమువలన చేకూరినవట. కడకు సర్పటిని భోజుడు తన నగరమున కాహ్వానించుటయు, ఆతడు వచ్చుటయు జరిగినవి. అచ్చట భోజుడు సర్పటి కుచితసత్కారములు చేసి ఒక్కచో విడియించినాడు. ఆరాత్రి సర్పటి తన్ను వేడుకపడి కొని తెచ్చిన రాజున కొక్క మేలు చేయదలంచి పంచలోహ మయమగు నాతని కొలువుచవికెను సువర్ణ మొనర్చుటకు ఒక్క యౌషధమును దీపశిఖపై వైచి పోయినాడు. ఇక నేమి! తెల్లవారుసరికి పంచలోహమయమగు మేడ పసిడి యైపోయినది. రాజీ వృత్తాంతము నెఱిగి సర్పటిసిద్ధుడు ధూమవేధి విద్యచేత చేసిన పరమాద్భుతకృత్యముగా దెలిసినవాడై ఆతని వెదుక చారుల నంపెను. సర్పటి యెచ్చటను నగపడ లేదు. అంత భోజు డొక కపటోపాయమును బన్నినా డట: భోజనగరిలో శబ్దభేదివిద్య గలదని చాటింప జేసెను. ఆవార్త దేశ దేశములందు వ్యాపించినది. పుడమిపై నున్న సిద్ధు లందఱు ఆ విద్యను బరికింప మొదలిడినారు. ఆ వచ్చినవారికి భోజుడా పసిడిమేడను విప్పించి కప్పెరలు, లోతములు, కమండలువులు చేయించి ఈయసాగినాడు. ఈ సంగతి మాత్ర మెవ్వరికి తెలియనీయ లేదట. ఈ వార్త విన్న సర్పటిసిద్ధు డాశ్చర్యపడి ధారానగరమునకు బిచ్చేసి "తన ధూమవేధి నిత్తు ననియు, దానికి ప్రతిగా శబ్దభేదిని తన కీయవలసిన" దనియు భోజుని కోరెను. భోజు డంత ధూమవేధి నాతనినుండి గ్రహించి "శబ్దభేది తనకు తెలియదనియు, ధూమవేధిని పరిగ్రహించుట కీ యుపాయమును పన్నితి" ననియు సర్పటికి నివేదించెను. అందుకు సర్పటి కోపించి అనపత్యుడవు గమ్మని భోజునకు శాపమిచ్చెను. తుదకు రాజప్రార్థనముచేత సర్పటి శాపమును గ్రమ్మ ఱించినాడు.

ఈ సందర్భమున మహోదాత్తనాయకుడగు భోజరాజు సర్పటిని మోసగించి విద్యాగ్రహణము చేసె నని చెప్పుట సమంజసముగా లేదు కావ్యనాయకుని కిది యొక మాయని మచ్చ. సర్పటికూడ మోసముచేతనే ఈ ధూమవేధిని గ్రహించినా డని కవి ఈ క్రింది కారణమును జెప్పినాడు:

ఒక వారవనిత ఒక దేవాలయములో ఒకసిద్ధుని గాంచి ప్రతిదినము ఆతనిని సేవించుచుండెను. ఆమె సేవకు మెచ్చిన సిద్ధు డొకనాడు ఆ యా ఔషధములను జెప్పి, అవి నూరి దీపశిఖమీద వైచిన ధూమవేధవలన లోహములు హేమ మగు నని యుపదేశించినాడు. పిమ్మట వేశ్య కన్నులు లేనివా డొకడు దొరకినచో వాని

చేత మందులు నూరించి కార్యము సాధింపవచ్చునని తన చెల్లెలితో చెప్పుచుండుట సర్పటి విన్నాడు. మఱునా డాతడు గ్రుడ్డివానివలె నటించుచు వేశ్యయింటికి భిక్షార్థియై వచ్చెను. వేశ్యయు అతని గ్రుడ్డితనము కల్లయో నిజమో తెలియ గోరి పెంచికలో అశుద్ధము వైచినది అతడు దానిని భోజ్యముగా నెంచి తినబోగా నిజముగా గ్రుడ్డియే యని తలచి వానిచే ఓషధులు నూరించినది. ఆ అట్లాత డా విద్య నంతయు నేర్చి తా నంధుడ గా నని యున్న సంగతిని తేటపఱచెను. అందు కామె ఆగ్రహించి నీవును నావలెనే ఈ విద్యావిషయమున మోసపోదు వని శపించిన దట. అందుచేతనే సిద్ధుడును భోజునిచే మోసగింపబడినా డట. ఇట్టి కారణ మున్నను మోసముచేసినభోజు డుదాత్తు డని చెప్పుటకు శాస్త్ర మొప్పునా?

పిమ్మట భోజుడు సర్పటిని ఆతిథ్యము తీసికొని పొమ్మని కోరుటయు, సర్పటి తనకు పంచభిక్షానియమ మున్నందున ఏకభిక్ష సేయ ననుటయు—అది కారణముగా భోజసర్పటుల సంవాదములలో పలు కథలు ప్రవచింపబడుటయు జరుగును. భోజరాజీయమునగల భోజచరిత్ర మీపాటియె. ఇందలి సూత్రకథకు నాయకుడైన భోజుని కవి యిట్లు వర్ణించినాడు—

క. భోజుఁడు ప్రసన్నవదనాం
భోజుఁడు నిఖిలార్థికల్పభూజుఁడు విలస
త్తేజుఁడు సంభృత సుకవి స
మాజుఁడు రూపాది జిత రమాజుఁడు జగతిన్ ప్ర. ఆ. ౪౩ ప.

సీ. అమరమహీజంబు లైదును నైదుభూ
తములుగాఁ గూర్చి దేహము సృజించి
యతనుఁడై చరియించు నంగజు బ్రాణంబు
నెమ్మిఁ బ్రాణంబుగా నిర్వహించి
అదితికి దేవేంద్రుఁ డావిర్భవించిన
పుణ్యంపుఁ బ్రొద్దునఁ బుట్టు వొసఁగి
భారతి దాది యై గారవం బారఁ బో
షించునట్లుగ నియమించెఁ గాక

ఆ. నలినభవుఁడు; కానినాఁ డిట్టి వితరణం,
బిట్టి రూపమహిమ, మిట్టి విభవ,

మిట్టి విద్య- యితని కెట్లు గల్గె ననంగ
భూమిఁ బ్రణుతి కెక్కె భోజరాజు. ౨. ౬౦. ౪౭, ప.

భోజభూపాలుని సృష్టి యిట్టి వస్తువులతో జరిగినది కనుకనే ఆత డంతటి మహాగుణశాలి యైనాడు. ఇంకను రెండుమూడు పద్యములలో ఆతని రాజ్యలీలను ఔన్నత్యమును సుందరముగావర్ణించి సప్తమాశ్వాసాంతమునగూడ ఆతడు మను నిభు డనియు, ఆతనిమార్గము తక్కినరాజుల కబ్బ దనియు వర్ణించినాడు. సామాద్యుపాయముల నాతడు ప్రయోగించురీతి నుగ్గడించి దిగువపద్యములో నాతని నిట్లు ప్రస్తుతించినాడు.

సీ. చర్చింప రెండవచంద్రుఁడు, మూఁడవ
యశ్విని, నావల యగ్నిదేవుఁ,
డైదవ లోకపాలాఖ్యుఁ, డాఱవ పాండు
సంతాన, మేడవ చక్రవర్తి,
యెనిమిద యగు సమ్మనీశుఁడు, తొమ్మిద
యగు భోగిపతి, పదియవ విరించి
పదునొకొండవ చక్రపాణి, పంద్రెండవ
శూలి, పదమూఁడవ సూర్యుఁ డనఁగఁ

ఆ దనరుఁ గాంతి, రూపమునఁ, బ్రతాపమున, స
త్యమున, ధర్మచరిత, నాజ్ఞ, శుచిని,
భూరిసత్త్వమునఁ, బ్రబుద్ధతఁ, గలిమిని,
భూతిఁ, దేజమునను భోజవిభుఁడు. ౬. ఆ. ౧౬౬, ప.

ద్వితీయాశ్వాసమున 85, 86 వ పద్యములలో భోజుని దినచర్యయు, 90 నుండి 95 వఱకు గల పద్యములలో ఆతని ప్రాతఃకృత్యములును వర్ణితము లయినవి. ఇట్టి మహనీయుఁడైన భోజునికీర్తిచేత జగ మీరీతిగా ప్రకాశించుచున్నదట.

తే. క్షీరపూరిత ఘటము, కర్పూరయుతక
రండ, ముద్యదిందుద్యుతిరమ్య మైన
కైరవాకర మనఁగ జగంబు మెఱయు
భోజవిభు నిత్యకీర్తి విస్ఫూర్తిఁజేసి ౬. ఆ. ౧౬౭. ప.

ఔను. కావ్యమున వర్ణింపబడు నాయకుని గుణగౌరవముచేతనే కావ్యము జగన్మాన్య మగుచున్న దని అలంకారశాస్త్రము—

“ప్రబంధానాం ప్రబంధౄణా మపి కీర్తిప్రతిష్ఠయోః
మూలం విషయభూతస్య నేతు ర్గుణనిరూపణమ్.

ప్రతాపరుద్రీయమ్,

కావ్యాంతమున భోజునికి అభినవభోజు డుదయించుట అతనినుండి గూడ సంతాన విచ్ఛేదము లేకుండ భోజవంశము కొనలు సాగెనని చెప్పుటతో ఉపక్రమోపసంహారములకు ఐక్యము చేకూరి భోజరాజీయము ముగియుచున్నది.

క. ఈ భోజరాజచరితము
భూభువనమునందు నిఖిలపుణ్యాస్పదమై
శోభిల్లు, నధికతేజో
లాభంబుల నిచ్చు శ్రోతలకు వక్తలకున్ ౭ ఆ. ౧౭౪. ప.

## ఈ సంగ్రహము

ఆంధ్రప్రదేశ సాహిత్యఅకాడమీవారు భోజరాజీయమును రెండువందల పుటలలోనికి సంగ్రహింపవలసిన దని నన్ను ఆదేశించిరి. వారి ఆదేశమును పురస్కరించుకొని ఈ కార్యమునకు నేను పూనవలసివచ్చినది. భోజరాజీయము ఏడాశ్వాసముల చంపూకావ్యము. ఇందు 2092 గద్యపద్యము లున్నవి. దాదాపు 17 కథలు గలవు. ఇంకను ఒండు రెండు శాపవృత్తాంతములవంటి కథలు నున్నవి. ఈ కథలలో ముఖ్యములైనవియు, పరిహరింప వీలు గానివియు నగు ఏడింటిని మాత్రమే నేను స్వీకరించి 1241 గద్యపద్యములలోనికి కావ్యమును కుదించితిని. అయినను ఇది రెండువందల పుటలకు మించక తప్ప లేదు అనేక కథలతో గూడిన కావ్యమును సంగ్రహించునట్టుల ఇట్టి హెచ్చులొచ్చులు తప్పవని అనుభవముచేత తెలిసినది. ఇందు నేను సంగ్రహించిన కథల సంగ్రహస్వరూపము దిగువ నుదాహరింపబడుచున్నది. ఇందలి కథ లన్నియు ఇంచుమించుగా అతిథిపూజాప్రభావమును, అన్నదానమాహాత్మ్యమును వివరించునట్టివే. వానిని ప్రధానముగా జేసికొనియె సత్యవ్రతము, పాతివ్రత్యము– ఇత్యాది నీతి ధర్మవిశేషములును చాటబడినవి. భోజుండు సర్పటితో “గృహపతికి నతిథిం గడపుట యతినింద్యంబుగా విందు నిది యేమి చందం బానతిమ్మ”ని నప్పుడు సర్పటి పుష్పగంధికథను చెప్పెను.

## ౧. పుష్పగంధి కథ

పుష్పగంధి కళింగదేశమున పుండరీకాధిపతియగు సంపాతికిని చంద్రరేఖకును పరమేశ్వరవరప్రసాదమున బుట్టిన యేకైకపుత్రిక. ఆమె జాతకమునుబట్టి ఆమెను పెండ్లాడినవాడు వివాహము జరిగిన యేడవనాడు బ్రహ్మరాక్షసువాతబడు నని దైవజ్ఞులు చెప్పిరి. రాజు చేయునదిలేక ఆమెకు సకల విద్యలు నేర్పియు పెండ్లి చేయ నిచ్చగింపకుండెను. పుష్పగంధి యౌవనవతి యైన పిమ్మట ఒకనాడు నెచ్చెలులతోగూడ పూదోటలో విహరించుచుండెను. మాళవనందభూపతి కుమారుడు రత్నమండను డనువాడు డేగవేటకై చెలికాండ్రతోగూడ నేగి సంపాతి నగరసమీపమునకు వచ్చుట సంభవించినది. అప్పుడు రత్నమండను డొక పక్షి కోసమై విడిచిన డేగను పుష్పగంధి పట్టుకొన్నది. డేగజాడ తెలిసికొనబూనిన రత్నమండనుడు పుష్పగంధిని చూచెను అంత నయ్యిరువురికిని పరస్పరము ప్రేమోదయ మయినది. పిమ్మట రత్నమండనుడు పుష్పగంధిజన్మలగ్నదోష మెఱింగియు ఆమెను పెండ్లాడెను. జాతకఫలితము ననుసరించి ఆతడు పెండ్లి జరిగిన యేడవనాడు బ్రహ్మరాక్షసునకు చిక్కనే చిక్కినాడు. అప్పు డాతడు తలిదండ్రులకీ సంగతి చెప్పి వచ్చి బ్రహ్మరాక్షసున కాహార మయ్యెద నని ఆతని నమ్మింపజూచెను. అందుకు రాక్షసు డొప్పుకొనకపోగా సత్యవ్రతమును పాలించిన గోవుకథను రత్నమండనుడు చెప్పెను. తుదకు రత్నమండనునిచేత ఒట్టు పెట్టించుకొని బ్రహ్మరాక్షసు డాతనిని వదలిపెట్టెను. ఆతడును గృహమున కేగి బంధువర్గమునకీ వృత్తాంతము నెఱింగించెను. పతివ్రతయు ఉపాయశాలినియు నగు పుష్పగంధి భర్త వెంబడి బ్రహ్మరాక్షసుని చెంగటకు వచ్చి వాడు మగనిని కబళింపబోవుతఱి పురుషభిక్షము పెట్టుమని యడిగెను. బ్రహ్మరాక్షసు డామె తెలివికి సంతసించి రత్నమండనుని విడిచిపుచ్చెను కనుక ఆకొన్నయతిథికి ఆహారమిడుట పరమధర్మమని కథాంతమున గల యీ పద్యము చాటుచున్నది.

క. కుడుపుతఱి నతిథి గ్రాసం
బడిగినఁ దన కుడువఁదొడఁగు నశనం బైనన్
వడి నొసగంగా వలయుట
యడర మహాపురుషుచేత నభినుత మయ్యెన్. ఉ. ఆ. ౧౦౪.

## ౨. గోవ్యాఘ్రముల కథ

ఒక విప్రుని గోవొకనాడు అడవిలో మేయుచుండగా ఒక పెద్దపులి వచ్చి దానిని తినబోవును గోవు పులిసంరంభము నాపి "నా కొక కొడుకున్నాడు. వాడు పుట్టి కొలదికాలమే యైనది. నే నింటికి బోయి వానికి కడుపార పాలిచ్చి బుజ్జగించి వచ్చి నీ కాహార మయ్యెదను. నన్ను పోయి రా నిమ్మ" ని వేడుకొనును. పులి యందు కంగీకరింపదు. గో వప్పుడు సత్యవాక్యమహిమను దెలుపు మదనరేఖకథను జెప్పి పులి నొప్పించి యింటికిబోయి కొడుకునకు చన్ను గుడిపి బుద్ధులు చెప్పి వాని నంగీకరింపజేసి పులివద్ద కేతెంచును పులి గోవు సత్యనిష్ఠకు సంతసించి దానిని తిన నొల్లదు. అంత విష్ణుమూర్తి ప్రత్యక్షమయి గోవ్యాఘ్రములకు పరమపద మొసంగును. ఈ కథగూడ సత్యవ్రతనిష్ఠనే కాక ఆకొన్న యతిథి కోరినప్పుడు స్వీయ దేహమునైనను ఆహారముగా నొసంగవలయుననెడి యతిథి సంతర్పణావశ్యకతను గూడ బోధించు చున్నదనవచ్చును.

## ౩. మదనరేఖ కథ

మగధదేశమున అంభీరుడను రాజునకు పుత్రకామేష్టిచేయగా పావకలోముడు, మదనరేఖ అను కొడుకును కూతును కల్గుదురు. రాజు వారికి సకలవిద్యలు నేర్పించును. మదనరేఖ యౌవనవతి యైన పిమ్మట గురుపుత్రుడామెను కామించి బలాత్కరించును. కాని మదనరేఖ మెత్తపడదయ్యెను. చివరకు గురుపుత్రుడు మూర్ఛ నందగా మదనరేఖ తనకు బ్రహ్మహత్యాదోషము కలుగునని యెంచి తనకు పెండ్లియైన పిదప భర్త నంగీకరింపజేసి ఆతనివాంఛ నెఱవేర్తు నని మాట యిచ్చి తప్పించుకొని పోవును. కొంతికాలమున కామెను తంత్రి యను రాజపుత్రుడు పెండ్లాడును. నాటిరాత్రి ప్రథమసంగమవేళ ఆమె భర్తకు జరిగిన కథ నెఱింగించి గురుపుత్రుని వాంఛ దీర్ప ననుమతి గైకొని బయలుదేరును. దారిలో నొక రాక్షసుడామెను బట్టి భక్షింపబోవును. మదనరేఖ వింతయైన తన కథ నంతయు నాతనికి జెప్పి మఱల వత్తు నని యొట్టు వేసి గురుపుత్రునికడకు బోవును. అప్పటి కాతనికి బుద్ధి కలిగి యామె నంటకయే మెచ్చుకొని పంపివేయును. మదనరేఖ రాక్షసు నొద్దకు రాగా వాడును ఆమె సత్యనిష్ఠకు వింతపడి తన ప్రాణిహింసాపరతకు సిగ్గొంది ఆమెచే ధర్మోపదేశము నంది ధన్యు డగును. తంత్రి భూపాలుడుగూడ తన ధర్మపత్ని సూనృతోక్తికి, పాతివ్రత్యప్రభావమునకు ముగ్ధు డగును అంత శ్రీహరి ఆ దంపతులకు ప్రత్యక్షమై వరము లొసంగును. ఈ మదనరేఖకథను గోవు

పులికి జెప్పె నన్న సంగతి మఱువ గూడదు. మదనరేఖ అన్నయగు పావకలోముని
కథను గూడ పులి కోరగా నోవే చెప్పెను.

## ౪. పావకలోముని కథ

పావకలోముని తండ్రికి ఒక సువర్ణకారకుడు మంత్రి యట. ఆతనికి కుంభి
యనునొక కొడుకు గలడు. ఈ కుంభికిని పావకలోమునికిని స్నేహము. వీరిరువురు
ఒకనాడు నాట్యనగరాధిపుడగు అజవత్సుని కూతురైన అనుమతి యను నామె
స్వయంవరము జరుగుచుండగా అచ్చటకు పోయిరి. ఆ రాజు యంత్రమయహంసము
నొకదానిని దెచ్చి ఆ హంస మెడలో రత్నహారము నుంచి, అంచమీద అనుమతిని
గూర్చుండబెట్టి అంచ ఆకసమున బాఱునప్పుడు దాని కంఠసీమ నున్న హారమును
బాణముతో గొట్టి క్రిందబడకుండ చేతిలోనికి దీసికొనువాడు తన తనయకు భర్త
కాగలడని ప్రకటించెను. ఆ పందెములో పావకలోముడు గెలిచినాడు. కుటిలబుద్ధి
యగు కుంభి అనుమతిని హరింప దలచినవాడై యాతనిని అజవత్సుని ప్రోలికి బోనీక
నిజనగరమున కేగు సెపమున అడవిదారి పట్టించెను. ఇంతలో అనుమతికి దప్పి
కలిగినది. నీరు వెదుక మిత్రు లిరువురు బయలుదేరిరి. కుంభి అటు నిటు దిరిగి వచ్చి
అనుమతిని అపహరింప జూచెను. ఇంతలో రక్షసు డొకడు కుంభిని పాఱద్రోలి
అనుమతిని హరించుకొని పోయి తన కొండగుహకు చేరెను. పావకలోముడు
గుహలో ప్రవేశించి రాక్షసుని చంపి అనుమతిని దెచ్చుచుండ కుంభి మఱల మోస
ముచే అనుమతిని దీసికొని అజవత్సుపురము చేరెను. అయినను అనుమతి అంగీకరింప
నందున వారికి వివాహము జరుప లేదు. కొంతకాలమునకు ఒక యోగినివలన అను
మతి తండ్రినగరముననే తనకై నిరీక్షించుచున్నదని వినిన పావకలోముడు నాట్య
నగరమున కేగి కుంభిచేసిన మోసమును దెలిసికొని అనుమతిని పెండ్లాడెను. కుంభిని
శిక్షింతురు. తరువాత భోజుడు అతిథిసపర్యాఫలమును దెల్పు మని ప్రార్థింపగా
మహుడు దిగువ కథ నుపన్యసించును.

## ౫. అన్నదానపరుఁ డగు విప్రుని కథ

ఒక బ్రాహ్మణునకు మువ్వురు కొడుకులు గలరు. వారిలో మూడవవాడు
నిరతాన్నదాతయై తన సర్వస్వమును అతిథిపూజలకు వెచ్చించుచుండెను. ఇది
సరిపడక వానివదినెలు తమ భర్తలకు కొండెములు చెప్పి వేఱు కాపురములు
పెట్టించినారు. ఆవిప్రు డొకనాడు తన యింటికి వచ్చిన యతిథులను అన్నదాన
ఫలము నెఱింగింపు డని కోరెను. వా రాసంగతి తమకు తెలియదనియు, కాశిలోని

అన్నపూర్ణాదేవికి మాత్రమే యిది తెలియు ననియు చెప్పి వెడలిపోయిరి. అంతే నా విప్రుడు కాశికి పయనమై పోవుచు దారిలో చెప్పులనిమిత్త మొక చర్మకారుని యింటి కేగెను. ఆచర్మకారుడును విప్రుని కాశీప్రయాణవృత్తాంతము నెఱింగి తాను గంగాదేవి నడిగిన ట్లామెకు చెప్పవలసినదనియు, ఆమె తన కేదైన ప్రత్యుత్తర మొసగినచో ఆసంగతి మఱలి వచ్చునప్పుడు తన కెఱింగింపు మనియు ప్రార్థించెను. అంత విప్రుడు కాశి కేగి అన్నపూర్ణాదేవిని అన్నదానఫలము తెలుపు మని ప్రార్థింప ఆమె యిట్లనెను. హిమవద్గిరిదగ్గఱ వారణగంగయని యొక నది కలదు. దాని చెంగటి హేమవతిపురమును అంగీరుడు పాలించు చుండును. ఆయనభార్య సుమతి. నీవా రాజదంపతులకడ కేగి వారి కొక కుమారు డుదయించుననియు, ఆబిడ్డ పుట్టగనే వానితో మాటాడుట కవకాశము గలిగింపు మనియు వేడి, ఆశిశువు నడిగినచో వాడు నీ కన్నదానమహిమ నుగ్గడించును. అంత నావిప్రుడు హేమవతిమునకు బోవుచు దారితప్పెను. అప్పటికి సాయంకాల మైనది.

### ౩. వ్యాధుని కథ

అట్లు త్రోవ తప్పిన విప్రు నొక వ్యాధుడు తన చేనివద్దకు గొంపోయి చాఱబియ్యమును తేనెయు నొసగి వానిని తృప్తి పఱచెను. పిదప వ్యాధుడు తన భార్యను, బ్రాహ్మణుని మంచెపై నిద్రింప నేర్పాటు చేసి తాను మంచెక్రింద క్రూర మృగములు రాకుండ కావలి యుండెను. అట్లు అరుణోదయముదాక మేలుకొనతో నున్న వ్యాధుడు తెల్లవారె నని కన్ను మూయగా నొక పెద్దపులి వచ్చి వానిని వధించెను. ఆతనిభార్య వానితో సహగమనము చేసినది. విప్రు డంత హేమవతము నకు బోయి పార్వతి చెప్పినచొప్పును రాజున కెఱిగించి యటనే కొన్నిదినంబు లుండెను. సుమతి ప్రసవించినపిదప విప్రు డా శిశువును అన్నదానప్రభావము దెల్పు మన ఆత డిట్లు చెప్పినాడు: నే నలనాడు దారి తప్పిననిమ్ము నా చేనికి దోడ్కొనిపోయిన వ్యాధుడను. ఆవేళ మీకు చాఱబియ్యమును, తేనియను బెట్టి అతిథిపూజ చేసినందుకు ఫలముగానే ఈరాజకుటుంబమున రాజకుమారుడనై జన్మించితిని. నేను చేసిన స్వల్పమగు నన్నదాన మిట్టిఫలము చేకూర్చినది. నిరంతరాన్నదానశీలుడవగు నీ కెట్టిఫలము గల్గునో ఆ పరమేశ్వరుడే యెఱుంగును.

తరువాత విప్రుడు కాశికి మఱలి వచ్చి భవాని యనుజ్ఞ నంది స్వగ్రామము నకు పయనించుచు అంత్యజునిమాట దలంచి గంగను గాంచి వానివృత్తాంతము నెఱింగింప ప్రార్థించెను. గంగాదేవి ఆమాదిగవానికథ నిట్లు చెప్పినది.

## ౭. మాదిగవాని కథ

పూర్వ మొక యెండ్రిడిలేమ గర్భవతియై పిల్లల గనెను. కర్కటి యీనగనే మరణించుట స్వభావము. కాని యీకర్కటిమాత్రము కథ సాగవలసియున్నందున గాబోలు పాపము! చావలేదట. ఒకనాడు మాటలసందర్భమున దన కొడుకున కొకని కాయెండ్రి గంగామహిమ నుగ్గడించెను. అంత అతనికి గంగలో స్నానము చేయ నిచ్ఛ వొడమ తల్లి యనుజ్ఞ వడసి గంగ కేగుచుండెను. దారిలో ఒక ఖగ మా యెండ్రిని భక్షించెను. మఱుజన్మమున నాకర్కట కుమారుడు ఒకరాజుగారి ఆల మందలో ఒకగోవుకడుపున కోడెదూడయై జన్మించెను. తరువాతి పుట్టువున నా వృషభము కొంకణదేశమున సితదత్తనృపతికి వంజరుడను పుత్రుడై పుట్టెను. అతనికి పూర్వజన్మవాసనావశమున గంగాస్నానము చేయబుద్ధి పొడమగా, తండ్రియనుమతి గైకొని గంగ కేగినాడు. సితదత్తుడు పుత్రవియోగదుఃఖముచే మరణించెను. మంత్రు లీసంగతిని వంజరునకు దెల్పి తండ్రి కగ్నిసంస్కారాదు లొనర్ప దోడ్కొని వచ్చిరి. వంజరుడు పితృక్రియలు నెఱవేర్చి పట్టము గట్టుకొని వివాహితుడై సంతానమును గాంచెను. కొంతకాలమునకు రాజ్యభారమును తనయునిపై బూన్చి గంగాదర్శనము చేసికొని తపోవృత్తి నుండెను. అట్లు తపస్సు చేయుచున్న వంజరుపాలికి ఒక్క వనితతోగూడ నల్వురు పురుషులు వచ్చి తమ తగవు దీర్పుమని ప్రార్థించిరి. ఆ కలహపరిష్కారము మువ్వురి కనుకూలము గానందున వారు ఈ రాజర్షిని శపించినారు. ఆ శాపఫలముగా వంజరుడు ఒకే స్త్రీకి భర్తయును, తోబుట్టువును, శిశువును అగుటయు, వనితానిమిత్తమున వహ్నితప్తుడు గావలసివచ్చుటయు సంభవించినది. పిమ్మట వంజరు డొక రాజపుత్రిని చెట్టవట్టి శాపఫల మనుభవించెను. ఆమెచేతనే కారణాంతరమున మఱల శపింపబడి చండాలత్వము నందెను ఆమెకుకూడ వంజర సంసర్గమున చండాలత దాపురించినది. ఆ వంజరదంపతులే ఈ చండాలదంపతులు.

ఉ. కావున వాఁడు క్షత్రియుఁడు
గాని, తలంపఁగ హీనజాతి గాఁ
డోవసుధామరేంద్ర! యత
డున్నెడకుం జని చెప్పు మయ్య నా
జీవనగౌరవం, బటులు
చెప్పిన నప్పుడు వాఁడు ముక్తుఁడై

పోవఁ బ్రియాసమేతుఁడయి
పోయెను సమస్తము విస్తరించితిన్. ౭ ఆ. ౧౨౩. ప.

అని గంగాదేవి విప్రునకు జెప్పినది. మిక్కిలి పెద్దదైన యీకథ గంగాస్నానమహిమను బొగడుచు విచిత్రముగా నున్నది. విప్రు డంత చండాలదంపతులవద్దకు వచ్చి గంగ చెప్పినచొప్పు దెలిపి వంజయని ప్రశంసించినాడు ఇది వినుటతోడనే వారి చండాలత్వము నశింపగా ఆదంపతులు శివసారూప్యము నందినారు.

క. సత్సంగతి గదుఁ బుణ్యము,
సత్సంగతి సేయవలయు సత్పురుషులకున్;
సత్సంగతిఁ గని వంజరుఁ
డుత్సుకమతి నభవుపురికి నొప్పుగఁ జనఁడే! ౭. ౧౩౯.

ఆ విప్రుడును తన యింటి కేగి భార్యతో సుఖించుచు అన్నదానఫలజనిత పుణ్యములచే ఐశ్వర్యశాలియై యొప్పినాడట. సర్పటి యిట్లన్నదానఫలమును గూర్చి

సీ. అన్నంబు బలకరం బన్న మాయుర్వృద్ధి
కర మన్న మత్యంత కాంతికరము
తనుఁ జంప వచ్చిన ఘనశత్రునకు నైన
నన్నంబు బంధుత్వ మావహించు
నన్నంబువలనన యమరులు ప్రీతులై
పరులకుఁ గోరినవరము లిత్తు
రన్నదానముఁ బోల నన్యదానంబులు
ధరణిలోపల నెల్లదానములకు

ఆ. ఫలము సరిగఁ జెప్పఁబడుగాని యన్నదా
నంబుసేఁత కీఫలం బనంగ
నబ్జభవుఁడు నోపఁ డటు గాన నీవును
నన్నదానపరుఁడ వగుము భూప! ౭. ౧౫౪.

అని భోజునకు జెప్పినాడు.

కవిత్వ ప్రశస్తి.

అనంతామాత్యుని కవిత్వమునుగూర్చి అభిజ్ఞుల యభిప్రాయము లిట్లున్నవి: శబ్దరత్నాకరకర్త యగు శ్రీబహుజనపల్లి సీతారామాచార్యులవారు తమ గ్రంథ

మున్నగు ఆంధ్రకవుల నందఱను ఆఱు తరగతులుగా విభజించినారు. మొదటి తరగతిలో కవిత్రయమును నాచనసోమనాథుని, రెండవతరగతిలో పోతన శ్రీనాథాదులను, మూడవతరగతిలో రంగనాథుడు, భాస్కరుడు, జక్కన, వెన్నెలకంటిసూరన, అనంతాదులను జేర్చినారు. అనంతునిగూర్చి వ్రాయుచు "భోజరాజీయము మంచికావ్యము. అందు వింతవింత కథలు గలవు" అనినారు.

శ్రీ జనమంచి శేషాద్రిశర్మగారు వావిళ్ల వారు మొదటిసారి ప్రకటించిన భోజరాజీయమునకు పీఠిక వ్రాయుచు "ఈ మహాకవి కవిత్వము రసికమహాజనులకుం గడుంగడు హృద్యము శైలి సలక్షణ మైనది కౌతుకలు పడక సందర్భశుద్ధి తప్పక యతిప్రాసములకై వ్యర్థపదముల వెదకి పడరానిపాట్లు పడక సహజగాంభీర్యమున నలరారుచుఁ దన పావనతచే నొప్పుచున్నది. ఏ పద్యమును చదివినను శ్రవణముల కత్యంతానందము నిచ్చుచుండును" అనినారు.

శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారు తెలుగు విజ్ఞానసర్వస్వములో తెలుగు వాఙ్మయము ప్రబంధపూర్వయుగమును బరిశీలించుచు ఇట్లనుచున్నారు. "అనంతామాత్యునిలో శిల్పప్రౌఢి ఎక్కువ. ఈతని వర్ణనలయందు భావనకంటె స్వాభావికత పైచేయిగా నుండును ప్రజ్ఞావిలసితమైన పాత్రనిర్మాణమున ఈతనికి దృష్టి మెండు. చిన్నచిన్న యుపాఖ్యానములను దీసికొని సుబోధమగు భాషలో ఇంత అర్థగాంభీర్యము, శిల్పవిన్యాసము, ప్రజ్ఞ ప్రకటింప గలిగిన కొద్దిమంది ఆంధ్రకవులలో అనంతామాత్యు డొకడు. గోవ్యాఘ్రసంవాదఘట్టమున ఈ కవి చేసిన ధర్మప్రతిపాదన మీతని ధార్మికపరిజ్ఞానమును వ్యక్తము చేయుచున్నది. కావ్యరచనావసరమున ఒక కన్ను నీతివైపునను ఒకకన్ను శిల్పమువైపునను నిల్పి వానిని సమ్మేళనము చేసి కావ్యమున శిల్పసౌందర్యము ధర్మసౌంద్యము వీడరానివను సిద్ధాంతమునకు ఇతడు తన కావ్యమును లక్ష్యముగా చేసి చూపెను."

శ్రీ కాటూరి వెంకటేశ్వరరావుగారు తెలుగువిజ్ఞానసర్వములో అనంతామాత్యునిగూర్చి వ్రాయుచు ఈఅభిప్రాయములను వెలిపుచ్చినారు. "జక్కన విక్రమార్కుని కథలవలె కాక, అనంతునివి స్వకపోల కల్పితములు, ఈ కథలలో భోజుడు నాయకుడు కానే కాడు. ఇవి యన్నియు అన్నదానసుకృతమునుగూర్చి చెప్పఁవి. . . .భోజరాజీయమే ఆంధ్రమున ప్రథమస్వతంత్ర కావ్య మని చెప్పవచ్చును నిజమునకు ఈగ్రంథము నన్నదానమాహాత్మ్య మనదగునే కాని, కావ్యమనరాదేమో! .....ఇంతకు కావ్యరచనము వేరు, కథాకథనము వేరు, కావ్యమందువలె కథలో అడుగడుగున కవి కన్పించగూడదు. కథ శ్రవ్యమైనను దృశ్యకావ్య

మునకు దగ్గరిచుట్టము. ఆకార చేష్టా స్వభావములు కనులకు గట్టునట్లు పాత్రలకు ప్రాణప్రతిష్ఠ చేయనిచో నాటకమును కథయు రక్తి కట్టవు. ఈ నేర్పు తిక్కనకు, అనంతునకు, సూరనకు అలవడినట్లుగా ఇతరుల కలవడినది కాదు."

## సంవిధానాదులు:

ఒకకథను గద్యముగానో, పద్యముగానో కూర్చుట వేఱు, దానిని కావ్యముగా గ్రథించుట వేఱు. కావ్యమనగానే దానికి కొన్ని లక్షణము లుండుటవసరము రసము, ఔచిత్యము, వర్ణనలు, సంభాషణాచాతురి, సంవిధానము, పాత్రచిత్రణము మున్నగునవి తగుపాళ్ళలో అమరినగాని కావ్యకన్య శోభింపదు. ప్రధానమగు కథా శరీరమునకు వలసిన ఆ యా అంగములకు హెచ్చులొచ్చులు వాటిల్లకుండునట్లు వానిని కావ్యశిల్పసుందరములుగా మలచుకొను ప్రజ్ఞ కవికి ముఖ్యము అది లేనినాడు ఆకావ్యము సర్వాంగసుందరము కానేరదు కవిత్రయమువారి కిట్టి కావ్యనిర్మాణ శిల్పము బాగుగా తెలియును. తిక్కన "ఉభయకావ్యప్రౌఢిఁ బాటించు శిల్పమునం బారగుఁడ" నని చెప్పుకొనుట కేవల ప్రగల్భోక్తి కాదు. ఆశిల్పపు లోతుపాతులను స్వానుభవముచే నెఱింగియే ఆత డట్లన్నాడు. కవిత్రయరచననే గాక కాళిదాసాది గీర్వాణకవీంద్రుల రచనలనుగూడ చదివి కావ్యశిల్పమార్గము నెఱింగిన అనంతుడు తన్మార్గమునే అనుసరించి తన కావ్యమును తీర్చిదిద్దుకొన్నాడు. కావ్యములో వీలైనపట్టుల రసభంగముకానీయక అష్టాదశవర్ణనలను ఈతడు చేసినాడు. ఆయారసములనుగూడ సాధించినాడు. ఇతడు శృంగారమున గెలుపొందినాడనుటకు పుష్పగంధికథ నుదాహరణముగా గైకొనవచ్చును.

ఇది శృంగారప్రధానమైన కథ. నాయికానాయకులు ప్రథమదర్శనములోనే స్వసౌందర్య విలాసములచేత ఆకర్షింపబడినారు. వెనువెంటనే యిట్టికోరికలు వారి హృదయముల నూటాడించినవి.

క. కోరుదు రొండొరుఁ గదియఁగఁ
గోరుదు రితరేతరోపగూహన సుఖముం
గోరుదు రన్యోన్యాధర
సారసుధారుచులు దనివి సనఁ గ్రోలంగన్. ౩. ఆ. ౬౪. ప.

అనంతయకు అనేకవిషయములలో తిక్కన గురువని నాయభిప్రాయము. ఆతనివలెనే కథను నడపుటలోను, వర్ణనలొనర్చుటలోను ఈతడును చతురుడు. పెక్కుఘట్ట

ముల నీతడు తిక్కనగారి ననుకరించుచునే యుండును. పుష్పగంధిసోయగమును గూర్చి రత్నమండనుడు చెచ్చెలియగు నింద్రదత్తుని కిట్లు చెప్పుచున్నాడు.—

సీ. చిగురుటాకులలోని జిగి గూర్చి యాబాల
యడుగుఁగాళ్ళఁ జేతుల నలఁది రొక్కొ
పసిఁడితీఁగెలమీఁది ప్రభ దెచ్చి యాకాంత
మెయిదీఁగ యంతట మేది రొక్కొ
చంద్రబింబముకాంతి సవరించి యాలేమ
మోమున నునుపుగాఁ దోమి రొక్కొ
క్రొమ్మెఱుంగులమించు గొనివచ్చి యాయింతి
కలికికన్నులఁ గీలుకొలిపి రొక్కొ

ఆ. యనఁగ నవతులేని యభినవాకారంబు
తోడఁ జెలులఁ గూడి యాడుచుండెఁ
జామ యొ ర్తు మరుని సామ్రాజ్యలక్ష్మియు
బోలె దానిఁ జూచి బేలుపడితి. ౩. ౭౬. వ.

ఈ పద్యమునకు తిక్కనగారి విరాటపర్వములోని దిగువపద్యము మాతృక కావచ్చును.

సీ. నెత్తమ్మిరేకుల మెత్తఁదనము దెచ్చి
యచ్చునఁ బెట్టిన ట్లందమొంది
చక్రవాకంబుల చందంబు గొని వచ్చి
కుప్పలు చేసిన ట్లొప్పు మెఱసి
చందురు నునుఁగాంతి కందేర్చి కూర్చి బా
గునకుఁ దెచ్చినయట్లు గొమరు మిగిలి
యళికులంబులకప్పు గలయంతయును దెచ్చి
నారుపోసినభంగి నవక మెక్కి

తే. యంఘ్రితలములు, గుచములు, నాననంబుఁ
గచభరంబును నిట్లున్న రుచిరమూర్తి
యనుపమానభోగములకు నాస్పదంబు
కాదె యీ॥తిపుడేటికిఁ గమలవదన. వి. రా. ౨. ఆ. ౫౨.

పుష్పగంధి ప్రథమసంగమోత్సవమును కవి సహజసుందరముగ వర్ణించిన తీరు తరువాతి కవులు చేసిన సంభోగవర్ణనమునకు మార్గదర్శకమైన దనవచ్చును.

సీ. జలజాక్షి దన్ను నచ్చెలులు పానుపుమీఁద
        మనుచుచోఁ బెనఁగక పెనగుటయును,
పెజ్జకు వచ్చియుఁ జెలులు నవ్వెద రని
        మో మెత్తగా నోడు ముగ్ధతయును,
నొక్కొక్కపవివెంట మవిద లేఁగినఁ జిత్త
        మూటాడుచుండంగ నుండుటయును,
జిట్టంబుచేఁతల పిగ్గుకీ లెడలించి
        పలికింప నల్లనఁ బలుకుటయును,

తే. తనువు పులకింప నధరామృతంబు గ్రోలి
కౌఁగిలించిన మర్మంబు కరఁగుటయును,
దనకు నత్యంతసౌఖ్యప్రదంబు లగుచు
నలర సురతోత్సవాబ్ధి నోలాడె విభుఁడు ౪. ౩౭. ప.

ఆ ప్రథమ రతమునందు బంచసాయకతంత్ర
మంతవట్టు దనకు నవగతముగ
నభ్యసించె నసఁగ నయ్యింతి భర్తచి
చిత్తంబు వట్టు బహువిధంబులందు. ౪. ౩౮.

ఆ. బాహ్యరతులఁ దొలుత బాలికఁ గరఁగించి
కూటమందు గెలుపు గొందు వమషఁ
గదిసి విభుఁడు దాన కరఁగఁ జొచ్చుఁ, బరస్ప
రానురాగమహిమ యడుగ నేల? ౪. ౩౯.

ఇటీవలి కొన్ని ప్రబంధములలో ఈసురతవర్ణనము కొంత పచ్చిగా పరిణమించినది.

మదనరేఖకథలోగూడ శృంగారము లేకపోలేదుగాని, అది గురుపుత్రవిషయమున రసాభాసమైనది. ఈ రసాభాసమును గూడ కవి నేర్పుతోనే నిర్వహించినాడు. భారతములో గురుపుత్రికయగు దేవయాని తండ్రి శిష్యుడగు కచుని వరింప జూచినది. ఈకథలో అందుకు విపరీతముగా గురుపుత్రుడే తండ్రిగారి శిష్యురాలగు మదనరేఖను బలాత్కరించినాడు. ఈఘట్టమున కవి మదనరేఖాగురుపుత్రుల

సంభాషణమున నాటకీయతను నెఱపి ఔ నని పించుకొన్నాడు. పెండ్లయినపిమ్మట పతి యనుమతి నంది నిన్ను బొంద వత్తు నన్న మదనరేఖతో గురుపుత్రుడు "లేమ! వనంబునఁ జున్ను రేచి తియ్యని మధుపాన మెల్లక రయంబున నొండులపాలు సేయుదునే?" (4. 93) అని అన్నమాట సముచితమై పాఠకహృదయముల చమత్కారభరితముల నొనర్చుచున్నది.

మదనరేఖ గురుపుత్రుని కిచ్చిన మాట చెల్లించుకొనుటకు భర్త యనుమతిని గోరెడుఘట్టమును కవి అతిచాతుర్యముతో నిర్వహించినాడు. తనసంభోగముకోస మువ్విళులూరుచున్న ప్రియుని ఇంకొకనివద్దకు పోవుట కనుమతింపు మని కోరుట ఎంత సాహసము! పోనీ గురుపుత్రునికి నామములు పెట్టరాదా యన్న అసత్య దోషమునకు తాను పాత్రురాలు కావలసివచ్చును. అసలీ కథ సత్యవ్రతమాహాత్మ్యమును దెలుపుటకే యుపక్రమింపబడినందున అట్లు సేయుట పాడి గాదు. ఇట్టి సందర్భమున కవి మదనరేఖ హృదయావస్థను చక్కఁగా చిత్రించినాడు.

సీ. విప్రుపాలికిఁ బోయి వేగ వచ్చెద నన్న
నృపదూతికల నాకు నిల్ప రాదు.
మగనికోరికి దీర్చి మఱి వత్తు నని యేను
జనిన నసత్యదోషంబు వచ్చు,
నీమాట దప్పించి యెల్లి చూచెద నని
పతివేడ్కఁ జెఱచుట పాడి గాదు,
పతితోన చెప్పి యూపని యొనర్చెద నన్న
నెఱుఁగరా దతని హృదయసరణి,

ఆ. ధర్మసూక్ష్మ మెవ్విధము? దుర్బలప్రబ
లంబు లెఱిఁగి నిశ్చయంబు సేయ
వార లెవ్వ రిచట? వాక్రుచ్చి యొకరితోఁ
జెప్ప రాదు, ద్రోపు సేయరాదు ౪, ౧౦౧.

ఇప్పట్టున మదనరేఖ పడ్డ బాధ, సంశయము ఇంతింత గాదు. కవి ఆమె నిట్లు సమర్థించినాడు పాపము!

ఆ. అట్లు కాదె ముగ్ధయటె, క్రొత్తపెండిలి
కూఁతు రట్టె, మగఁడు లాతి యట్టె,

యదియుఁ బ్రథమసంగ మాసన్నవేళ యై,
సిగ్గుపేర్మి వేఱ చెప్ప నేల ? ౪. ౧౦౬.

చివర కట్లో తెగించి ఉపాయముగా కలరూపు చెప్పి అనుజ్ఞ వేడినది. కాని భర్త కిప్పుడు కర్తవ్య మేమి ? పంపవలెనా ? అక్కఱలేదా ? పాపము ! అతడుగూడ యోగ్యుడే కాదు, పరమయోగ్యుడు కూడ. కనుక నే ఆడువారి నెట్లు నమ్ముట యని మొదట శంకించినాడు_కాని తుదకు___

క. ఎఱిఁగి యెఱిఁగి యొరుపాలికిఁ
దెఱవఁ బనుచుపనికి సమ్మతింపదు చిత్తం ;
బఱిముఱి నసత్యదోషము
పఱతెంచుట సిద్ధ మెట్లు పనుపక యున్నన్ ? ౪. ౧౧౧.

అని సంశయించుచుండగా మదనరేఖ స్త్రీల శిష్టత్వ దుష్టత్వములనుగూర్చి చిన్న యుపన్యాసము చేసినది. ఆయుపన్యాసముతో నిజసలిని నమ్మి అతడు గురుపుత్రు నొద్దకు పంపినాడు. చేరవచ్చె గదా యని గురుపుత్రు డామె ననుభవించినాడా ? లేదు అప్పటికి గురుపుత్రునికి తాను చేయబూనిన దధర్మమని తెలిసి మనసు మార్చు కొన్నాడు. అయినను మదనరేఖ అతనిని ఊపి చూచినది. అతడు చలింపక___

క. నీపంతము చెల్లించితి ;
నీపతికడ కేఁగు మింక ; నీసూనృతని
ష్ఠాపారీణత జగమున
దీపించుం గాక ! సంస్తుతికిఁ బట్టగుచున్. ౪. ౨౬౦.

అని దీవించి పంపినాడు. త్రోవలో దన్ను బట్టి భక్షింప నుంకించిన రాక్షసునకు గురుపుత్రుని వాంఛ దీర్చి వత్తునని చెప్పివచ్చినది గదా. రాక్షసు డామెను గాంచునప్పటి కామె యీవిధముగా నున్న దట.

ఆ. తావి గొనని పుష్పదామంబువిధమునఁ
జిదుమఁ బడని మావిచిగురు భంగిఁ
ద్రావఁ బడని నవసుధాధారపగిదిని
జెలువఁ జూడ సురతచిహ్న లేదు. ౪. ౧౬౩.

ఈ పద్యమునకు మాతృక కాళిదాసుని అభిజ్ఞానశాకుంతలములోని యీ శ్లోకము.

"అనాఘ్రాతం పుష్పం కిసలయ మలూనం కరరుహై
రనావిద్ధం రత్నం మధు నవ మనాస్వాదితరసం."

పిమ్మట నారకసుడుగూడ మదనరేఖ సత్యవాక్యనిష్ఠకు పాతివ్రత్యమునకు వింత పడి ఆమెను దినుటకు మారుగా ఆమె యుపదేశము నంది తరించినాడు.

మదనరేఖకథలోని ముచ్చటైన మూడుపాత్రలుగూడ మూడుకాలము లందును చెక్కుచెదరక నిలువగలవి. ఇంగు ఒకరిని మించిన శీలసౌభాగ్యమును, నిగ్రహమును, ఔదార్యమును ఇంకొకరు ప్రదర్శించి ధన్యులైనారు. కవిగూడ వీటికథానిర్మాణమున సంవిధాన పాత్రపోషణాదులలో ఔచిత్యమును నిండించి గెలుపు గొన్నాడు. ఈ కథ నీతిధర్మప్రభోధకమైన ఒకమణిపూస.

భోజరాజీయ నూత్నకథారుచిర రత్నహారములో గోవ్యాఘ్రసంవాదకథ నాయకమణివంటి దని అభిజ్ఞుల అభిప్రాయము. నిజమున కది అట్టి గుణభరితమైనదే. ఈ కథను నిర్మించుటలో గూడ కవి ప్రతిభాసమున్మేషము మిక్కిలిగా ప్రకాశించి నది. పరమసాధువగు గోరత్నమును కవి యిట్లు చిత్రించినాడు.

సీ. ఒక విప్రవర్యుని హోమధేనువు నిత్య
సత్యవర్తిని, సదాచారమూర్తి,
కలహంబునకుఁ బోదు, కలిగినంతనె తుష్టి
నొందు, సందడికోర్చు, నుట్టు వేయ
వలపదు. పిదుకుచో వరవృష్టిధారల
చెలువునఁ జన్నులు చేఁపి కురియుఁ,
దెవు రెఱుంగదు, తొమ్మతీండ్ర సాలఁగఁ గర్గి
కురుమట్టమై చాలఁ గూడి యుండు,

తే. ఇట్టిగోరత్న మొక్కనాఁ డేకతంబ
పోకు మేయుచు నుండ బెబ్బులి యొకండు
దానిఁ గని పొంచి యొడసెల్లఁ దాఁచి వాల
మవనిఁ దాటించుచును ద్రేయ నడరుచుండెను. 4. 26.

ఇట్లు తనపై విజృంభించిన శార్దూలమును గాంచి ఆవు కళవళపడక నిలకడతో. నిలునిలు మను నప్పటికి అది చిత్తరువున వ్రాసినట్లు నిలబడిపోయిన దట. ఆవున

కెంత నిబ్బరము! ఇట్టి నిబ్బరము ఎవ్వరికిగాని కార్యసిద్ధిని చేకూర్చితీఱును. కలగక పలుకుమాటకు గల శక్తి అట్టి దట.

వ. పులి యఱె, దీపనానలముప్పొంగున గ్రమోగుచు నుక్కి యట్టె, యి
మ్ముల నొకపాటి గో వపుడు ముందటికిం జనుదెంచు నట్టె, హో
విలు మనినం బయింబడక నిల్చి కనుంగొనునట్టె, బాపురే!
కలఁగక యాడుమాట లయకాలుని నైన శమింపఁ జేయదే. ౪. ౫౯.

ఆవు దూడకు పాలిచ్చి వత్తు నని పలువిధముల దీనముగా పులిని వేడుకొన్నది. పులి మనసు కరగలేదు. గోవు మదనరేఖ కథను జెప్పి మనసు మార్చ జూచినది అయిన నేమి అది పులి గదా! నమ్మ లేదు. కడకు జాలిగదురు మాటలతో ధర్మమును స్వార్థమునుగూర్చి యిట్లన్నది.

తే. అతిథిసత్కారమునకంటె నధిక మైన
ఫలము లేదంద్రు పెద్ద లీపట్టునందు
నీవ యతిథివి నాకు నిన్నిచట డించి
పోయి తా కున్నఁ భావంబు పొరయ కున్నె? ౬. ౯.

ఆ. కన్నకడుపు గానఁ గడుఁ బిన్నగాన నే
నతనిఁ బాసి దూర మరుగునట్టి
వేళ గాన వాని వీక్షించి రాకున్న
వగపు మాన దనిన వదలవైతి. ౬. ౧౦.

ఈ మాటలకు పులి మెత్తవడి కొన్ని శపథములు పలికించి పోయిరా ననుమతి యిచ్చినది. ఈ సందర్భమున ఆవు పలికిన శపథములు సర్వాదరణీయములు. ఇందలి కథాసంవిధానచాతురి, సంభాషణలవైఖరి, గోవ్యాఘ్రముల పలుకుబడులు సహజ సుందరములు. ఆవు దూడనువర్ణించు నీపద్య మతిస్వభావరమణీయము.

సీ. పొట్టపొంగునఁ దల్లిపొది వాపి వీథికిఁ
బాటి క్రమ్మఱుఁ బెద్దపరుపుతోడఁ
దల యెత్తి చూచుచుఁ బలుమాఱుఁ దను దల్లి
పిలువంగ నిట నటఁ బొలసి యాడు
విలమీఁద మో మిడి యేమేని మూర్కొనుఁ
బసి వెట్టుకొనుచుఁ దత్ప్రాంతమందు

నంతంతఁ బసిబిడ్డ లడ్డంబు సుడిసిన
జంకించి మిన్నంటఁ జౌకళించు

తే. నిట్లు శైశవక్రీడల నెసఁగుచున్న
కొడుకుదెసఁ జూచి కన్నీరు గ్రుక్కుకొనుచుఁ
గటకటా యిట్టి నెత్తురుఁగందు నిచట
వైచిపోవంగ వలసెనే నీచగతికి. ఉ. ౨౩.

ఈ నీసపాదములు చదువుచున్నంత సేపు కోడెదూడ మనకన్నులయెదుట ఆ యా చేష్టలు చేయుచున్నట్లె ఎగురుచున్నట్లె యుండును. ఇది యెంత మధురమగు స్వభావోక్తి! గీతములో వర్ణితమైన గోవుస్థితి కరుణరసప్రచురము తరువాత దూడను వీడి ఆవు పోవుటకు గల కథాభాగ మంతయు పాఠకులచే కన్నుల నీరు పెట్టించును. ఇప్పట్టున గోవు కుమారునకు చేసిన నీతిబోధ అతనికే కాదు, సమస్త మానవకోటికిని ఆచరణీయమే.

క. ఆడకు మసత్యభాషలు,
కూడకు గొఱగానివానిఁ, గొంకక యొరులె
గ్గాడిన నెదు రుత్తర మీఁ
జూడకు విని వినవివాని చొప్పునఁ జనుమీ. ఉ. ౨౮.

క. మమకారంబు నహంకా
రము సంసారానుబంధరజ్జువు లని చి
త్తముల విసర్జింతురు సం
యము లీవును నడుపుమా తదాచారంబుల్, ఉ. ౨౯.

ఇంతటి నీతిబోధ చేసి తల్లి లేని పిల్ల లెట్లు లోకులకు చులుకన యగుదురో గుండె కరగునట్లు దిగువపద్యములో బోధించుచున్నది.

క. చులుకన జలరుహతంతువు,
చులుకన తృణకణము, దూది చుల్కన సుమ్మీ,
యిల నెగయు ధూళి చుల్కన,
చులుకన మఱి తల్లి లేనిసుతుఁడు కుమారా! ఉ. ౩౫.

ఈ కథయందలి గోవు ధర్మనిష్ఠ, లోకజ్ఞత, పుత్రప్రేమ, అధ్యాత్మజ్ఞానపరత, పరలోకవిశ్వాసము — ఇత్యాదులన్నియు మానవులకు ఆదర్శప్రాయములే. కొడుకు నూఱడించుఘట్టమున గోవన్నమాటలు వరాలమూటలు

చ. అరుదుగ సత్యవాక్యము సహాయముగాఁ బులిజేని వక్త్రగ
హ్వర మను పెద్దత్రోవను రయంబున స్వర్గసుఖంబుఁ జూఱకో
నరుగుచునున్నదాన; విది హర్షమునొందెడువేళ గాక, దు
స్తరమగు శోకముం బొరయుదానికిఁ గారణ మేమి చెప్పుమా? ౧. ౪౪.

క. పుట్టినపిమ్మటఁ జావును
గట్టి; వృధామరణమొందుకంటె బుధులకు
దట్టమగు కీర్తి సుకృతము
లిట్టలముగఁ గల్గు చావు లింపులు గావే? ౧. ౪౫.

తరువాత గోవు సత్యనిష్ఠకు పులిమనసు మాఱుట, గోవునది విడిచిపుచ్చుట మొదలుగా గల కథ యంతయు సర్వాంగసుందరము. పాఠకులద్దానిని చదివి తృప్తిపడుదురు గాక.

ఇందలి పావకలోముని కథ పంచమాశ్వాసములోనిది. మదనరేఖకథను చెప్పిన పిమ్మట, ఆ మెసోపవునికథనుగూడ చెప్పుమని పులి కోరగా, గోవీకథ చెప్పినది. కాని ఈ కథకు ప్రధానకథలలోగాని, నీతిధర్మప్రబోధములోగాని సముచితస్థాన మగపడదు. సత్యనిష్ఠకుదాహరణముగా మదనరేఖ కథను జెప్పించుటకు పూనిన కవి అనవసరముగా ఈ కథకు ప్రసక్తిని గల్పించుకొన్నాడు. అన్నదాన మహిమనుగాని సత్యవ్రత ప్రభావమును గాని యీకథ బోధింపదు. ఒక జాతిని నిందించుటకు, ఆ జాతివారు అమాత్యాద్యుత్తమ పదవులకు అర్హులు గారనుటకు కవి ఈకథ నిందు జొనిపినట్లు సూక్ష్మదృష్టికి తోపక మానదు. ఇది ఆ జాతివారి కవమానాపాదిగా నున్నది. కవి తజ్జాతివారిని నిందించునభిప్రాయము లేనివాడగుచో. కంభిని ఏ విప్రజాతివానినిగానో యేల చిత్రింపడు? ఒక జాతి మొత్తమును నిందించుకథలు వ్రాయుట ఎట్టి రచయితలకును భావ్యమైన పని గాదు. ఒకవ్యక్తిలోని చెడుగు జాతికంతటికి కేల సంక్రమించును? మోసగించుటకుగాని, దుష్ప్రవర్తనకుగాని జాతి కారణము కాదు. అవి ప్రత్యేక ప్రత్యేక వ్యక్తినిష్ఠము లైన గుణములు. ఇట్టి జాతినిందలు సాహిత్యములో నుండరాదనుటకే ఈ వాక్యములు వ్రాయబడినవి. సహృదయులీ సత్యమును సరిగా నర్థము చేసికొందురుగాత మని ప్రార్థన.

అన్నదానపరుడగు విప్రునికథ సమష్టికుటుంబమువారు కలసి మెలసి యుండ నందున గలుగు కష్టనష్టములను, కొందఱు తోడికోడండ్ర చూపోపమిని బోధించుచు స్వాభావికమై యున్నది. వ్యాధుని కథలో వ్యాధదంపతుల నడవడి ఎవ్వరికేని ఆదర్శప్రాయమే. ఈ కథలలో వంజరునిది అతివిచిత్రమైనకథ యని చెప్పికొంటిమి ఇందు మూఁడుజన్మముల వృత్తాంతము వర్ణిత మగుట ఒక విశేషము. ఇది గంగాస్నానఫలము నుగ్గడించుచు విచిత్రముగా పరిణమించినది. ఈ కథలోసైతము శృంగారము సముచితముగా పోషింపబడినది. ఈ కథలయందన్నింటను అనంతుని కథాసంవిధానచాతురి కొట్టవచ్చినట్లు ఔచితీయుతమై పొడకట్టుచునే యున్నది.

## అనుకరణములు

కవి ఈ కావ్యకథలను కొంతవఱకు భారతరామాయణాదులలోని అంశములను గ్రహించియే తీర్చినాడు. అంభీరునికి పుత్రకామేష్టి సేయగా మదనరేఖా పావకలోములు పుట్టుట భారతములో ద్రుపదునకు యజ్ఞకుండమున ద్రౌపదీ ధృష్టద్యుమ్నులు పుట్టుటను బోలియున్నది. ఈపుత్రకామేష్టియు దశరథుని పుత్రకామేష్టికి ప్రతిబింబమే. మదనరేఖను గురుపుత్రుడు వలచుట దేవయాని కచుని వలచుటను గాంచి సృష్టించుకొన్నదే యని చెప్పికొంటిమి. పావకలోముడు యంత్రమయ హంసమును గొట్టి అనుమతిని వరించుట అర్జునుడు మత్స్యయంత్రము నేసి ద్రౌపదిని పరిగ్రహించుటను బోలియున్నది. తరువాత అనుమతిని రక్కసుఁడు హరించుకొని పోవుట రావణుని సీతాపహరణమును తలపించుచున్నది. సీతాదేవి నగలను గాంచి రాముడు ఆమె రావణహృత యైనదని నిశ్చయించినట్లే, అనుమతిభూషణములను జూచియే పావకలోముడును ఆమె రాక్షసాపహృత యని నిశ్చయించినాడు. కిరాతుడు తనకు దొరకిన అనుమతిచేతి రత్నమును పావకలోమున కిచ్చుట, ఆత డద్దానిని బహుమానించుట, హనుమంతుడు సీతనుండి తెచ్చిన మణిని గాంచి రాముడు సంతసించుటను బోలియున్నది. వంజరుడు రాజపుత్రికి ప్రతిజ్ఞ చేసి గాంధర్వవిధిచే నామెను పెండ్లాడుట శకుంతలాదుష్యంతుల వివాహమును దలపించుచున్నది. ఇట్లు అనేకవిషయములందు పూర్వచరిత్రోదంతము లీకవిచే ననుకరింపబడినవి. ఇతడు పూర్వకావ్యముల ననుకరించినట్లే, ఇతని తరువాతి కవులును ఈతని కథాంశములను అనుసరించినా రని అభిజ్ఞులు తలంచుచున్నారు. భోజరాజీయ ద్వితీయముద్రణకు విపులమగు పీఠికను వ్రాసిన శ్రీ బులుసు వేంకటేశ్వర్లుగారు ఇట్లు వ్రాసినారు. "ఆముక్తమాల్యదయందలి మాలదాసరికథ

భోజరాజీయమునందలి మదనరేఖకథ కనుకరణము. అన్నదానపరుడగు విప్రునకు అన్నదాన మాహాత్మ్యమును అపుడే పుట్టిన బాలుడు చెప్పినకథకు కళాపూర్ణోదయమునందలి మధురలాలస బాల్యవృత్తాంతము ననుకరణమే యన వచ్చును" అన్నట్లు అప్పుడే పుట్టిన శిశువు మాటాడి కథ చెప్పుట అనునది భోజరాజీయ కళాపూర్ణోదయముల రెంటను గనుపట్టుచున్న సత్యమే. భోజరాజీయమున సర్పటి వేశ్యను మోసగించి ధూమవేధిని గ్రహించి శాప మందుటకును, మనుచరిత్రమున ఇందీవరాక్షుడు బ్రహ్మమిత్రుని వంచించి ఆయుర్వేదమును గ్రహించి శాప మందుటకును పోలిక యున్నది.

ఈ అనుకరణములమాట యెట్లున్నను మొత్తముమీద అనంతామాత్యుడీ కావ్యమున కొన్ని కమ్మని కథలను, కొన్ని లోకోత్తరాదర్శచరిత్ర గల పాత్రములను సృష్టించినా డనుటలో వింత లేదు. క్రూరస్వభావము గల వ్యాఘ్రరాక్షసులు నవనీతహృదయు లైనా రన్నచో ఇది అసాధారణము కాదా! సత్యధర్మముల కున్న మహాప్రభావము అట్టి దన్న మాట.

అనంతామాత్యుడు కథానిర్మాణమున పూర్వకథల ననుకరించినట్లే, కవిత్వములో గూడ పూర్వకవుల పోకడలను అనుకరించియున్నాడు. తనకు గురుస్థానీయు లనదగు కవిత్రయమువారి కవితామార్గములు తనకు మెచ్చుగూర్చుటచే వారి పద్యములనుం బోలిన పద్యములను, పద్యభాగములను ఈతడు తన కావ్యములో రచించుకొనినాడు. నన్నయ్య ని ట్లనుకరించినాడు—

చ. మతజలపూరితంబులగు
    మాతులు నూఱిటికంటె సూనృత
వ్రత యొక బావి మేలు; మఱి
    బావులు నూఱిటికంటె నొక్క స
త్క్రతు వది మేలు! తత్క్రతుశ
    తంబునకంటె సుతుండు మేలు; త
త్సుతశతకంబుకంటె నొక
    సూనృతవాక్యము మేలు చూడఁగన్.     భార. ఆది. ౪-౯౩

క. శతకూపాధిక దీర్ఘిక;
  శతవాప్యధికంబు క్రతువు, శతయజ్ఞసము

న్నతుఁ డొక్క సుతుఁడు; దత్సుత
శతకంబున కెక్కు డొక్క సత్యోక్తి నృపా! ౬. ౮౪.

ఇది నన్నయ్య పద్యమునకంటె చిన్నదై అంతయర్థము నొసంగుచు ధారణాయోగ్యమై యొప్పుచున్నది.

చ విమలయశోనిధీ! పురుష
వృత్తి మెఱుంగుచు నుండుఁ జూవె వే
దములును బంచభూతములు
ధర్మవు సంధ్యలు నంతరాత్మయుఁ గా
యముఁడును జంద్రసూర్యులు న
హంబును రాత్రియు న న్మహాపదా
ర్థము లివి యుండఁగా నరుఁడు
దక్కొన నేర్చునె తన్ను ముచ్చిలన్. ఆది. ౪, ౮౦

చ. ఒక ఘటికాద్వయంబుపని
యూరక యింత విచారమేల? యిం
చుక యిటు నిల్చి నానిజము
చూడు నిశాచర! భూమి, తోయ, పా
వక, పవనాంబరంబులు, ది
వంబులు రాత్రులు సాక్షి నాడు మా
టకు నిది గాక నీమన సొ
దంబడ నే శపథంబు సేయుదున్. ౪. ౧౪౬.

ఇది మదనరేఖ రాక్షసునితోఁ నన్న మాట

ఉ గంగ నిజాంగదీప్తి లెసగం జనుదెంచి .. ఆది. ౬. ౬౩.

మ. అనినం గంగ నిజాంగదీప్తి నిచయం బవ్వాహినీమధ్య . ౬. ౧౮౭.

ఎఱ్ఱాప్రగడ నీవిధముగా అనుకరించినాడు.

ఆ. కీర్తి విడువఁ జాలఁ గీర్తితో మెలఁగఁగఁ
జావు వచ్చె నేనిఁ జత్తుఁ గాని

జగములోన నెల్ల సతి కంటెఁ జావు మే
లనఁగఁ బరగుమాట యనఘ వినవె। ఆరణ్య. ౭ ౨౬౩.

క. పుడమి నపప్రథ యగునెడఁ
బడతికి దేహంబు విడువఁ బాడియ కాదే
సడి కంటెఁ జావు మేలను
నొడువు పురాతనము గాక నూతనపదమే. భోజ. ౨. ౮౨.

అనంతుడు తిక్కన నెక్కుడుగానే యనుకరించినాడని చెప్పుకొంటిమి.

ఆ. ఏను బుట్టి వేయి నిన్నూఱు మున్నూఱుఁ
గలవు వత్సరములు గాన నెందు
బాలు యౌవనస్థుఁ బ్రౌఢుని వృద్ధునిఁ
జచ్చిపోయి మగిడి వచ్చువాని. శాంతి. ౩ ౩౭౫.

ఆ. అనినఁ దానితేగువ కద్భుతస్వాంతుఁడై
పుండరీక మేను బుట్టి పెరిగి
యింతపాఁడ నైతి నింత నిష్కపటుల
నిట్టిధీరమతుల నెఱుఁగ నెందు. భోజ. ౬. ఆ. ౬౦. ప.

ఉ ఎవ్వరిదాన వీవు ? కుల మెయ్యది ? యెయ్యదీ నీదు పేరు ? నీ
కెవ్వఁడు భర్త ? యొంటి నిటు లేవ్వనియింటికి మధ్యరాత్ర మీ
వెవ్వరుఁ గానకుండ వెస నేఁగెదు ? నా కెఱిఁగింపు. "భోజ" ౪. ౧౩౨.

ఉ. ఇయ్యరవిందగంధి కుల
మేమి ? చరిత్రము చంద మెట్లు ? పే
రెయ్యది ? నాథుఁ డెవ్వఁ డిది
యెచ్చట నెప్పుడు నుండు ? నిప్పు డా
నియ్యెడ కేఁగుదేవలయు
షేపని సేయఁగఁ బూని దీనిపై
నెయ్యము కల్మి యేకాలఁది
నీమది ? కింతయు నాకుఁ జెప్పుమా ? విరాట. ౨. ఆ. ౪౦. ప.

ఇట్టి యనుకరణములు పెక్కు లున్నవిగాని విస్తృతిభీతి యుదాహరింపనిచ్చుట లేదు. సంస్కృతశ్లోకములనుగూడ వలసినపట్టుల శ్రీనాథునివలె తెనిగించి యుపయోగించుకొనుటకు అనంతామాత్యుడు వెనుదీయడు. ఇదివఱకే కొన్నియుదాహరించియుంటిని.

శ్లో॥ గురుశుశ్రూషయా విద్యా పుష్కలేన ధనేనవా
అథవా విద్యయా విద్యా; చతుర్థా నోపలభ్యతే.

అన్నశ్లోకము నిట్లు ఆంధ్రీకరించి వాడుకొనినాడు.

చ గురునకు సేవ చేయుట తగుం దగువిద్యఁ బరిగ్రహింపఁగా;
నరుడుగ నర్థ మిచ్చి పడయందగు నొండె; సువిద్య యిచ్చి వి
స్తరముగ విద్యఁ గైకొనుట దా నొకపక్షము; మూఁడు రీతులం
బరగుట దక్క నాలవ యుపాయము లే దని చెప్పుశాస్త్రముల్. ౨. ౧౧౬.

ఇట్లే "స్త్రీరత్నం దుష్కులాదపి..." అన్నశ్లోకమును క్రిందిరీతి ననువదించుకొన్నాడు.

ఉ. తక్కువజాతియందు వని
తామణి యున్నను, నీచమర్త్యునం
దెక్కువ విద్య చొప్పడిన,
నెంగిలిచోట సువర్ణ మబ్బినన్
దక్కక పెన్విషంబున సు
ధారస ముండిన గ్రాహ్య మండ్రు; వాఁ
డొక్క మనుష్యమాత్రుఁడె మ
హోన్నతుఁ డున్నతరాజపూజ్యుఁడున్. ౨. ౧౧౪.

ఈ పద్యద్వయము భోజునివద్దకు శబ్దభేదిని గ్రహింప బోవునప్పుడు సర్వటి యనుకొన్నట్టిది.

"రాజా రాష్ట్రకృతం పాపం, రాజ పాపం పురోహితః." అన్న శ్లోకమును

తే. రాష్ట్రమున నైనపాపంబు రాజుఁ బొందు
క్షితిపు పాపము మఱి పురోహితుని బొందు
మగువ చేసినపాపంబు మగనిఁ బొందు
శిష్యపాపంబు గురుఁ బొందు సృష్టియందు. భోజ. ౫. ౧౪౫.

అని తెనిగించుకొన్నాడు.

అనంతుడు పూర్వకవుల పద్యముల ననుసరించినట్లు అనంతుని పద్యములను గూడ తరువాతికవు లనుసరించినారు. గృహస్థుని గొప్పదనమునుగూర్చి సర్పటి భోజునితో ని ట్లన్నాడు.

తే. అధిప! పెఱయాశ్రమస్థుల కందఱకును
విను గృహస్థాశ్రమమువాఁడె వెలయ నూఁత. ౨. ౬౪.

షష్ఠాశ్వాసమున భవాని విప్రుని యింటి కేగవలసినదని చెప్పుచు ఇట్లన్నది.

క. మఱి యాశ్రమస్థు లెల్లను
వఱలు గృహస్థాశ్రమంబువారిన కానం
బఱతెంతురు తమదగు న
క్కఱ దీర్చుకొనంగ నొండుగతి లే కునికిన్. ౬. ౧౮౨.

ఈ యర్థమునే మనుచరిత్రములో పెద్దన "కొలఁకుల నున్న తరగెటిజున్న గృహమేధి .. ..భూసురోత్తమ గార్హస్థ్యమునకు సరియె." (మను. 1-66) అన్న పద్యముల విస్తరించినాడు.

పుష్పగంధికథలో రత్నమండనుడు బ్రహ్మరాక్షసునితో బలికిన ఈ పద్యము—

సీ. ఏను బోయినజాడ యెఱుగక నా తల్లి
దండ్రులు నెంతయుఁ దల్లడిలుచు
నుండుదురో నన్ను నొరంతప్రొద్దును
నెత్తి పెంచినదాది యెంత వగచు
చుండునో నాచేయు నుద్యోగముల కెల్ల
ననుకూలుఁడై వచ్చు నాప్తుఁ డింద్ర

దత్తుఁడు దా నెంత తలఁకునో నాకు దో
సిలి యొగ్గి యే సౌఖ్యములును లేక
ఆ. పుష్పగంధి యెంత పొగులునో యేఁ బోయి
వారి కెల్ల నుచితవచనరచనఁ
జేసి యూరడించి శీఘ్రంబ వత్తు నీ
యాన నన్నుఁ బనుపు మనిన నతఁడు. ౪. ఆ. ౪౭. వ.

పెద్దనగారి దిగువ పద్యమునకు మూలముగా నగపడుచున్నది.

సీ. నను నిముసంబు గానక యున్న నూరెల్ల
నరయు మజ్జనకు డెంత తదలునొక్కొ
యెపుడు సంధ్యలయందు నిలు వెళ్ళనీక న
న్నోమెడుతల్లి యెం తొఱలు నొక్కొ
యనుకూలవతి నాదు మనసులో వర్తించు
కులకాంత మది నెంత కుందు నొక్కొ
కెడఁ దోడునీడలై క్రీడించు సచ్ఛాత్రు
లింతకు నెంతఁ జింతింతు రొక్కొ. మను. ౨. ౧౩.

భోజరాజీయములోని—

క. మగఁ డెఱుఁగవలయుఁ గాదే
మగువ యెఱుఁగవలయుఁ గాక మనుగడ తెఱఁ గ
మ్మగువయు మగఁడును వెలిగా
జగమున సంసార మెట్లు జరుగును జెపుఁడీ! ౬. ౧౧౪.

అను పద్యము ననుసరించియే సూరన కళాపూర్ణోదయములోని దిగువపద్యము వెలసి యుండును.

క. కాంతుఁ డుచితజ్ఞుఁ డైనం
గాంతకు పిగ్గువడఁ జెల్లుఁ గాక కటకటా

కొంతుఁడు పిబ్బితికాఁడై
కొంతయు నష్టైన నెట్లు కాఁపుర మింకన్. కళా. ౪, ౪౬.

ఆ. కాముకునకుఁ, బాపకర్మున, కవివేకి,
కవనిపతికిఁ, గోపవివశమతికి,
మదవిజృంభితునకు, మద్యపాయికిఁ, గ్రూర
చేతసునకుఁ- దగవు చెప్ప రాదు. భోజ. ౭. ౩౭.

ఆ. వారిజాక్షులందు, వైవాహికములందుఁ,
బ్రాణ విత్త మానభంగమందుఁ,
జకితగోకులాగ్రజన్మరక్షణమందు,
బొంకవచ్చు నఘము వొందఁదధిప! భాగ. ౮ స్క. ౫౮౫. ప.

మ. నరకం బైనను నాక మైన మది నా
నందంబు గావింపదే. భోజ ౭. ౧౧౮

మ. నిరయం బైన నిబంధ మైన ధరణీ
నిర్మూలనం బైన భాగ. ౮. స్కం. ౫౯౩. ప.

పైపద్యములలోని పోలిక లారయుదగినవి. ఇట్టి సాదృశ్యములకు కారణము లనేకములు. ఒక్కొక కవి పూర్వకవులమీద గౌరవాదరముల చేతను, ఇంకొక డసమర్థత చేతనుగూడ అనుకరణమునకు పాల్పడవచ్చును అసామర్థ్యజనితమగు ననుకరణము వెంటనే బయలు పడగలదు. ఇంకను వర్ణ్యవిషయ సాదృశ్యమునుబట్టియు నొకేరీతి భావములు దొరలుచుండుట కవుల కనుభవసిద్ధమే.

## వర్ణనలు

కావ్యమున కుండవలసిన అంగములలో అష్టాదశవర్ణన లొకటి యని ఆలంకారికు లన్నారు. ఇవి శాస్త్రకారుల లక్షణతాసిద్ధికోసము కాక, భావౌచిత్యముల పరిపోషణ కుపయోగించుకొనుట ఉత్తమకవుల కర్తవ్యము. అనంతయు ఈయుత్తమ మార్గమునే యనుసరించి అవసరములగు నా యా పట్టుల తగువర్ణనములను జేసి

కృతార్థు డైనాడు. ఈత డేవర్ణనము చేసినను, అది అస్వాభావికము కాక, అతి పొంతి బోక సహజసుందరమై కావ్యమునకు సొంపు నింపుచుండును. ఇది సంగ్రహ గ్రంథ మైనందున పెక్కువర్ణనల తొలగింపవలసి వచ్చినది. ఆతొలగింపు సమష్టి కావ్యశోభ కేపాటి లోటును కలిగింపకుండునట్లు ప్రయత్నము చేయబడినది. ఇట్లు చేయుటచేత ఒక విధముగా పాఠకుడు కథాగ్రహణమున మిక్కిలి కుతూహలి యగుటకుగూడ మార్గ మేర్పడిన దని తలంచెద. అగు గాక. అనంతామాత్యుని వర్ణనలు అతిసుందరములును అప్రయత్నముగనే హృదయమున కాహ్లాదము గూర్చ నవియును. భోజుని ధారానగరము నిట్లు వర్ణించినాడు.

ఉ. సారకవీంద్రచాతక విశాలహిరణ్మయవృష్టిధార, ని
స్సార దరిద్రభార తరుషండ విలాసకురారధార, సం
సార కృశానుత ప్త జన శైత్యకరామృతధార గాక యా
ధార తలంప నన్యవసుధారమణీశపురోపమానమే. ఆ. ౨. ప. ౪౧

ఈ పద్య మంత్యానుప్రాసముతోను అర్థగాంభీర్యముతోను నొప్పుచు హాయిని గూర్చుచున్నది. ప్రయాగయందలి గంగాయమునల సంగమము నిట్లు అతిరుచిర ముగా వర్ణించినాడు.

చ. అవె దివిజాపగాజలము లల్లవె యా యమునాజలంబు లా
ధవళతయుఁ విసీలతయుఁ దార్కొని చూడ్కికి వేడ్క చేసె మా
ధవసదనాంగణం బగుటఁ దత్పరిచారిక లర్థిఁ జందన
ద్రవమునఁ గ్రొత్తకస్తురిని దక్కక రేకలు పెట్టిరో యనఁ. ౨. ౧౮.

క. గంగాయమునల విమలత
రంగంబులు ధవళచామరంబులు, నసితో
త్తుంగబహుబర్హ నివహము
లంగజజనకునకు వైచునట్లొప్పెఁగడుఁ. ౨. ౧౯.

ఈ ఉత్ప్రేక్షలు నిరాడంబరములై పాఠకునకు హాయి గూర్చుచున్నవి. చతుర్థా శ్వాసమున చేసిన బ్రహ్మరాక్షసవర్ణనము స్వభావోక్తిసుందరమై ఆతని రూపును కన్నులకు గట్టుచున్నది.

ఉ. క్రూరపుఁజూపులు, న్నిడుద
కోఱలు, నుగ్రపుమోము, నెత్తుటం
బేరిన కోరమీసములు,
బిఱ్ఱనవెంట్రుకలుం, గృశత్వముం
గూరినదేహము న్వెడద
కుక్షియు, ఘోరరవంబు గల్గి యే
పారినబ్రహ్మరాక్షసుఁ డు
దగ్రబలుం డొకఁ డవ్వనంబులోన్. ౪. ౪౨

పార్వతీపరమేశ్వరుల బొందులు ప్రాణములు ఏకమై యొప్పు దివ్యస్వరూపులని వర్ణించు నీ పద్యములోని చమత్కారముం గాంచునది.

ఉ. బొందులు వేఱు గాని తల
పోయఁగఁ బ్రాణము లేకమం డ్రిలం
గొందఱు; లేఁతమాట లవి
కూరిమిపట్టున నంచుఁ బ్రాణముల్
బొందులు నేకమై రనఁగ
బొల్పగు శంకరుని న్భవాని న
స్పందిత భక్తిమైఁ గదిసి
బ్రాహ్మణపుంగవుఁ డానతాంగుఁడై. ౬. ౧౪౬.

ఇట్టి చమత్కారార్థస్ఫూర్తితో మెఱయునట్టిదే ఈ దిగువపద్యమును. ఇది సహజ వైరము గల గోవ్యాఘ్రములను మిత్రములుగా చేసిన అనంతుని మహిమను వర్ణించునట్టిది.

చ. కలువలఁ దమ్ములన్ సమవి
కాసము నొందఁగఁ జేయు క్రాయిగ
న్నులు గలనీకుఁ, బాన్పును మ
నోజ్ఞరథంబునునాగ తద్విరో

ధు లయిననీకు నారయఁ జ
తుర్భుజ! చేయఁగ రాదె గోవునుం
బులియును శత్రుభావములఁ
బోనిడి మైత్రి యొనర్చునట్లుగన్. ఉ. ౨౦.

సుందరోచితమగు సంధ్యావర్ణనము—

క. దంపతుల రాగరసముల
పెంపో, మన్మథతమంబు పెంపో యనఁగా
సొంపగు సంధ్యారాగ ప
రంపరయును జీకువాలుఁ బ్రబ్బెఁ బయిపయిన్. ఆ. ౩౩.

చంద్రవర్ణనము—

చ. జలజభవాండ మొప్పెఁ గల
శంబువిధంబున, నందులోన ను
జ్జ్వలమగు చంద్రికాపటలి
నన్నుతి కెక్కెఁ బయఃప్రపూరమై,
లలితకలాకలాప సద
లంకృత చారుసుధామరీచి యిం
పుల గనియై తనర్చెఁ బయిఁ
బొంపిరి గట్టిన మీఁగడో యనన్. ఆ. ౩౫.

గురుపుత్రునికి 'తరువాత రాగలఁ' నని వాగ్దానము చేసి యింటి కేతెంచిన మదన రేఖను, గురిదూఱ నాటి తిరిగి గొనకే తెంచిన, మరుసాయకముతో పోల్చినాడు కవి.

ఆ. అరిగె రాజపుత్రి మరుసాయకము గుఱిఁ
దూఱ నాటి తిరిగి దొనకు నేఁగు
నట్లు నిర్వికారయానంబుతోఁ గ్రి
సదన మైన తండ్రిసదనమునకు. ఆ. ౯౩.

అనంతయకు ఉపమా స్వభావోక్తులమీద నెక్కువ యాసక్తి. కాళిదాసువలె సుందరోపమల నీతడు సృష్టించగలడు. ఉత్ప్రేక్షాదుల వాడినను అవి కృతకము

లుగా కన్పట్టును. అతిశయోక్తినిగూడ నీకవి అట నట నుపయోగింపక పోలేదు. దృష్టాంతార్థాంతరన్యాసముల నీతడు చక్కగా నుపయోగించి తన కావ్యమునకు శోభ నొడగూర్చుకొన్నాడు.

'కలఁగక యోడుమాట లయకాలుని నైన శమింపఁ జేయదే.' ౪. ౫౯.

'పురాణగోష్ఠి కెనయే సౌఖ్యంబు లోం డెవ్వియుఁన్ ?' ౬. ౨౦౯.

'వనంబున జున్ను దేచి తియ్యని మధుపాన మొల్లక రయంబున నొండుల పాలు చేయునే ?' ౪. ౯౩.

'భూవలయంబునన్ బలికి బొంకుటయుఁన్ బ్రతుకే తలంపఁగన్ ?' ౬. ౭.

'నాతికిఁ జారుభర్తయ ధనంబులు సొమ్ములు పేయు నేటికిన్' ౭, ౫౫.

'తళియఁ బెట్టిన యశనంబు తలఁగఁ ద్రోచి
పిదపఁ గుడిచెద ననువాఁడు బేల కాఁడె ?' ౪ ౪౮.

'మానము వెలియగు ప్రాణము
మానినులకు నేమి ప్రీతి మహి నూహింపన్ ?' ౭ ౮౪.

ఇట్టి వీ కావ్యములో పెక్కు రానివి.

కవితాగుణములు

అనంతామాత్యుని కవితాశైలి ప్రసన్నగంభీర మైనట్టిది. కవిత్రయ కవితా మార్గము నొఱవడిగా బెట్టుకొన్నవాడగుటచేత పురాణోచిత సాధుతర శయ్యా మార్గముననే యీతడు ప్రాధాన్యము నిచ్చినాడు. ప్రబంధకవితామార్గమునకు లొబడినయెడల ఈకావ్య మింతగా సర్వారాధ్య మయ్యెడిది కాదు. అట్లని ప్రాబంధికుల పోకడలను పూర్తిగా త్రోసిరాజన లేదు. మచ్చునకుమాత్ర మచ్చ టచ్చట వానిని గాంచగలము. సులభముగానర్థమగుగుణ మీతని శైలిలోని ప్రత్యేకత. కథను లోకసిద్ధమైన వృత్తము ననుసరించి సమాజమనోహరముగా జిత్రించుటలోనే ఈతని కాసక్తి మెండు. ఈయంశము అన్నదానపరుడగు విప్రుని వదినెలు వేఱు కాపురము పెట్టించుటకు తమభర్తలకు చేసిన బోధల సందర్భముననను ఇతరఘట్టము లందును తెల్లము కాగలదు. మానవపాత్రల తనుమనశ్చిత్రణము చేయుపట్టులనే కాక, తిర్యక్కుల ఆకారచేష్టాస్వభావముల నిరూపించునప్పుడును ఈతడు వెనుకబడ

లేదు ఈయంశముగూడ ఆయా కథలసందర్భమున పాఠకు లారయగలరు. కవిత్వమునకు జీవగఱ్ఱలని చెప్పదగిన సామెతలను, దృష్టాంతములనుగూడ ఎక్కువగా వాడుకొనినాఁడీ కవి. కొన్నింటినిమాత్రము పరికింతము —

సామెతలు - జాతీయములు.

1. దుక్కెద్దు దేశాంతర మరిగినట్లు ౨ ౧౪.
2. వెదకం జనవలసిన సొమ్ము దానచనుదెంచిన చాడ్పున. ౩. ౯౭.
3. ముల్లు ముంటఁ గొని పుచ్చక రోఁకటఁ బుచ్చ వచ్చునే? ౩. ౧౦౪.
4. చచ్చునంతటి కల గన్న నోలి మేలుకనియె యుండవలయు. ౪. ౧౦.
5. నడుము నడికి యున్న నడుకునె బడె పెట్టు? ౪. ౧౩.
6. చెప్పెడువారు చెప్పినఁ, వినియెడివారికించుక వివేకము పుట్టదె? ౪. ౬౮.
7. కడి పోయిన పువ్వులు మఱి
ముడుచునె రసికుఁడగువాఁ డమోఘవివేకా! ౪. ౭౭.
8. గతోదకసేతువులఁ బ్రయోజనంబు గలదె తండ్రి! ౫. ౬౦.
9. బుద్ధి చతుర్గుణ మనుట సకలయందు నిశ్చితార్థం బగుటఁ. ౬. ౯౧.
10. పులిమీసల నుయ్యేల లూగవచ్చునే? ౭. ౨౨.
11 ఎంత చెప్పిన నావగింజంత భూతి
పూయువానికి గుమ్మడికాయయంత
వెట్టి గల దను నార్యోక్తి వినమె తొల్లి. ౭. ౩౧.
12. వేసరినవాఁడు వెలుఁగుమీఁద వేన్నీళ్ళు చల్లినట్లు. ౭ ౩౮.
13. కామాంధో హి న పశ్యతి. ౭. ౩౫.
14. సడికంటెఁ జావు మేలు. ౭. ౮౭.
15 గ్రుడ్లు దినుటయె కాక గూడెక్కి కూసినట్లు. ౭, ౯౮.
16. పులికిఁ బుట్టినకూన పులు మేసెడినే? ౭. ౧౭౧.
17 ఆపదలు గాఁపు లుండవు. ౫. ౧౧౦.

ఇట్టి నానుడులతోపాటు చక్కని జాతీయములనుగూడ సందర్భోచితముగా కవి యిక్కావ్యమున వాడినాడు —మందున కడుగు, చిటికెన వట్టు, కాయో పండో, కలరూపు, కాదు కూడదను, కన్నకడుపు, తలపువ్వులు వాడకయుండ, చెక్కడి చిన పాలువడుచు, పని చేసి పాయవడు, గోళ్ళు మీటుకొను, అంతియ పదివేలు, ఇచ్చట నున్నట్లు వచ్చు, ఏయూరి కేత్రోవ, నోరికండ తిప్పు,ఇత్యాగులు.

## ఛందో వ్యాకరణ విశేషములు

అనంతుని ఛందోవ్యాకరణవిశేషములనుగూర్చి ఛందోదర్పణ ద్వితీయ ముద్రణపీఠికలో శ్రీ నిడుదవోలు వెంకటరావుగారును శ్రీ గంపూరి దొరసామిశర్మ గారు తాము వ్రాసిన సమీక్షలోను అనేకాంశములను పరామర్శించినారు. అందు శ్రీ వెంకటరావుగారు భోజరాజీయ సప్తమాశ్వాసములోని 48 వ పద్యమునందలి ప్రాసస్థాన పదములను 1. నవ్వుచు. 2 యవ్వన. 3. ఉవ్విళులూరు. 4. ఇవ్విధ మెల్ల-అనువానిని- నావుడు, యావన, ఊవిళులూరు, ఈవిధ మెల్ల - అని పండితులు దిద్దినారని వ్రాసినారు కాని అది దిద్దినట్లు తోచుటలేదు. ఆ పద్యమునకు ముందున్న పద్య మిది.

ఆ. ఏను బాల నగుట యెఱుఁగరే నాయందుఁ
గడఁగి కొఱఁత లెన్నఁగలరె మీరు ?
నోలిఁ దప్పు లైన నొప్పులుగాఁ జూడుఁ
డిట్లు లవధరింప నేల యనఘ ! ౭. ౪౭.

ఇది వంజరుడు రాజపుత్రిని వలచుఘట్టము. పై పద్యము రాజకుమారి పలికి నట్టిది తరువాతి పద్యమే "నావుడుఁ గౌక్కమీటి ....." అనునది. రాజపుత్రి అనఘ ! అని తన వాక్యమును ముగించినది. దాని తరువాత "అనిన, నావుడు—" ఇత్యాగి సంధానవాక్యము లుండవలయును గదా ! అట్లు లేకయే "నవ్వుచు..." వంజరు డేదో యనుట పొసగదు గదా ! కనుక నవ్వుచు, అనునదికాక 'నావుడు' అనునదియే కవి కిష్టమగు పాఠమేమో యని నాకు దోచుచున్నది. ఆ పక్షమున యావనమే కాని యవ్వనము కావలసిన యవసర ముండదు. అట్లే 3 వ ఆశ్వాసము లోని దని శ్రీ వెంకటరావుగారు చూపిన "జవ్వనమునోన నిలఁ గల యవ్వనంబు తెలమిఁ బొంద" అనునదిగూడ "జవ్వనముతోన" అని యుండవచ్చును. ఇట్లని

"యవ్వన" శబ్దమును కవులు వాడలేదని నే ననుట లేదు శ్రీ దొరసామిశర్మగారు ఛందోదర్పణసమీక్ష 91 వ పుటలో—"ప్రాది నిత్యసమాసాద్యుభయ యతులందుఁ జేరని స్వరసంధిఘటిత శబ్దములందు సంధ్యక్షరమునకు హల్లుతో యతిమైత్రి పాటించుట యఖండయతి యందురు. కవిజనాశ్రయమం దఖండయతి చెప్పఁబడినది. అనంతుఁ డీ యతిభేదమును బేర్కొనలేదు గాని యాతని పద్యములలో నఖండవళ్ళు చూపట్టుచున్నవి

అ l క్షే శోదంచిత భుక్తిముక్తిఫలదుఁ*గీర్వాణనిర్వాహకుఁ. (భోజ. ౬. ఆ.)

జ్ఞానమునకు యోగ్యమగుట*ననుభావంబై. (రసా. ౨. ౯.)"

అని వ్రాసినారు ఇది నిజమే. ఇట్టి ప్రయోగములు భోజరాజీయమున అగపడినవి. మఱొకటి—

సీ అష్టాంగయోగప్రియా*సంగతుండు. ౫. ౧౭౬.

శ్రీ బులుసు వెంకటేశ్వర్లుగారు భోజరాజీయపీఠికలో "అలికులవర్ణు నున్నతరథాకృత చారుసుపర్ణు- (2-25) లో యతిభ్రంశము కానవచ్చుచున్నది. దీనికి వేఱు పాఠ మేమియు లభింప లేదు." అని వ్రాసినారు సరి యగు పాఠము-"అలికులవర్ణు నున్నతరథాకృతి చారుసుపర్ణు" కాని "రథాకృత" కాదు రథ+ఆకృతి యైన చారుసుపర్ణుడు కలవాడని యర్థము. సంప్రసారణము హేతువుగా సంఖ్యార్థక 'త్రి' వర్ణమునకు తకారముతో ప్రాస చెప్పిన యీతడు (ఛందో. 1. ఆ. 45, 46, 47) భోజరాజీయము దిగువపద్యములో 'క-క్ర' లకు మైత్రి చెప్పినాడు.

క. ఆకర్కటి గర్భమున న
నేకంబులు పుట్టెఁ బిల్ల లీనుచు మృతయై
పోక యది యేమికతమున
నో క్రమ్మఱ బతికియుండె నొగిఁ గర్కటియుఁ. ౬. ౧౯౨.

త్రి వర్ణమునకు, తకారమునకు, మాత్రమే సంప్రసారణకారణమున మైత్రి చెప్పి తద్భిన్నమగు 'క-క్ర' లవిషయమున నిట్లు చేయుట విశేషము. ఇంతకు అనంతుడు ఛందోవిషయమున తాను చెప్పిన లక్షణములకు లోబడని లక్ష్యములనుగూడ సృష్టించినాడనుట సారాంశము. చేయు, పోయు మున్నగు ధాతువులకు చేతురు

పోతురు – ఇత్యాది రూపములు ఈ కవి కష్టములే. వానిని పెక్కుచోట్ల ప్రయోగించి యున్నాడు. షష్ఠీవిభక్తియందు కుప్రత్యయము పరమగు నప్పుడు నగాగమమునుగూడ ఈతడు పలుతావుల చేయలేదు అది వికల్ప మనుట ఇతని కభిమతము కాబోలు. విను ధాతువుమీద 'వింధుము' అను రూపము నీతడు వింధుము, అని ప్రాసస్థానమున గూడ ప్రయోగించి యున్నాడు ఆనుదురు – అందురు – అంద్రు, అనువానిని దృష్టిలో నుంచుకొని యీతడిట్లు చేసినాడా? అట్లయినను 'విందుము' లక్ష్యము లలో మృగ్యము గదా! బాలికాశబ్దమును, 'బాలకి,' అని యీతడు వాడి యున్నాడు. పూట. తోకొను, బ్రాతి, ఎలనాగ – అనుపదములు సానుస్వారములా? అను విషయమున పండితులలో అభిప్రాయ భేదము లున్నవి. అనంతుడుమాత్రము 'పూట' 'బ్రాతి' 'ఎలనాగ'–అను పదములను నిరనుస్వారములుగాను, తోఁకొను, శబ్దమును సానుస్వారముగాను భావించినట్లు తోచుచున్నది. ఈ సానుస్వార నిరనుస్వారముల చర్చ అనేకాభిప్రాయ భేదములతో గూడియున్నందున విస్తరింపక విరమించుటయే మేలని తోచుచున్నది.

భోజరాజీయము ప్రథమాశ్వాసము 19 వ పద్యములో "క. అతనికి నయ్యాతివకు నప్రతిమ మనోదారు లరయ .." అనియు, సప్తమాశ్వాసములో 129 వ పద్యములో–"ఆ. అట్లు ప్రస్తుతించి యతఁడు సేమంబున నున్నవాఁడె నా మనోన్నతియును .." అనియు రెండు ప్రయోగము లగపడుచున్నవి. ఈ రెండును మొదటిది 'మహోదారు' లనియు, రెండవది 'మహోన్నతియు' నని కవి వ్రాసి యుండునేమో యని నాతలంపు కానిచో, మనస్సుచేత ఉదారులు–అనగా ఉదారమైన మనస్సుగలవా రని యర్థము చెప్పుకొనవలయును. అప్పుడు మన ఉదారు లని రూపము కావలసి వచ్చును. అట్లే "మన+ఉన్నతి" కూడ 'మనోన్నతి' అగుటకు సంస్కృతివ్యాకరణ మొప్పదు. దానిని ఒప్పించవలయు నన్నచో "కేచిత్సకారాన్తా అకారాన్తా అపి భవన్తి" అను న్యాయమును ఆశ్రయింప వలయును. ఈ పక్షమున ప్రయోగము లుండవలయును గదా! "విచకర్త శిరాన్ ద్రౌణి రథః పాదరజోపమాన్" "శ్వః శ్వః పాపీయదివసాః" (పాపీయశ్శబ్దము సకారాన్తమైనందున "పాపీయో దివసాః" అని యుండవలయును) అను ప్రయోగముల నూతగా గొనుటకు అవి ఆర్ష ప్రయోగము లైనవి. పై న్యాయముచేతనే జప

తపాదులు, మనోల్లాసము, దుర్వాసముని-ఇత్యాదులు కదురును. కాని భాసమహాకవి ప్రతిమా నాటకము సప్తమాంకమున—

"హృత్వా రిపుప్రభవ మప్రతిమం తమౌఘమ్
సూర్యోఽ న్ధకార మివ శౌర్యమయై ర్మయూఖైః."

అని ప్రయోగించినాడు. తమశ్శబ్దము సకారాంతముగదా. దాని నిచ్చట అకారాన్తము చేసికొనినగాని తమ+ఓఘము - తమౌఘము కాదు. భాసునిది లౌకిక ప్రయోగముగదా! ఇట్టివానికి ముం దుదాహరించిన న్యాయమే శరణ్యము. ఇంతగా శ్రమపడి 'మనోదారులు, 'మనోన్నతి'-అనువానికి సాధుత్వమును గూర్చినను, వచ్చిన అర్థవిశేషము లేదు. ఉదారత యనుగుణము మనోధర్మమే కావున 'మనోదారులు' అనుటలో విశేష మగపడుట లేదు. అట్లే 'మనోన్నతి' అన్నప్పుడు గూడ కనుక వానిని 'మహోదారులు' 'మహోన్నతి' గా భావించుటే సమంజస మని నాకు తోచుచున్నది.

## ర స వా ద ము

మనదేశమున లోహములను బంగారుగా మార్చు విద్య అనాదిగా నున్నట్లున్నది. స్పర్శవేధివలన లోహములు బంగారు కాగల వని మనకు పెక్కు కథల వలన తెలియుచున్నది. పాదరసమును ముద్ద కట్టించి బంగారు చేయు యోగము గూడ ఒకటి కలదు. దానిని రసవాదవిద్య యందురు. వేమన, సింహాద్రివిశ్వనాథావధూత మొదలగు సిద్ధు లీ రసవాదముకొరకు మిటీవలి కాలమున పరిశ్రమించినా రనియు, కొంతవఱకు సిద్ధినిగూడ పొందినా రనియు తెలియుచున్నది. ఈ కావ్యమున సర్పటి ధూమవేధిచేత బంగారు చేయుటను నేర్పినాడు కదా! అట్టివానికి శబ్దభేది యేల కావలసివచ్చినదో? శబ్దభేది ప్రభావముగూడ లోహములను బంగారుగా మార్చుటయే యని భోజరాజీయమునుబట్టియే తెలియుచున్నది. లేక ధూమవేధికంటెను శబ్దభేది లోహములను, చులకనగా బంగారు చేయగలదా? ఏమో! ఎట్లయినను సర్పటి గాఢవిద్యావ్యసనము గలవా డని దీనిచే తెల్లము. 'శబ్దభేది' అనునది ధనుర్విద్యలో అగపడుచున్నది గాని బంగారు చేయు యోగములం దగపడుట లేదు.

లేదా, శబ్దభేరి పదమునకు భోజుడు సర్వటికి చెప్పిన యర్థము (2-112) నైనను భావించి తృప్తిపడవలయును అట్లయినను ఇది 'శబ్దభేది' కాని 'శబ్దవేధి' కాదు.

## సంగ్రహించిన తీరు

ఇందు మిక్కిలి పెద్దవైన వంజరపావకలోముల కథలను సంగ్రహించుటలో కొన్ని కథాభాగములనుగూడ తగ్గింపవలసివచ్చినది. ఇట్లు కథాభాగములను వర్ణనలను తగ్గించుటలో కొన్ని పద్యములను గద్యములుగా మార్చుట, ఒకటి రెండు పద్యములలోని పదములను మార్చుట తప్ప లేదు. ఆమార్పు లిట్టివని సూచింపనైతి. పూర్ణగ్రంథమును దగ్గఱ నుంచుకొని చూచిననే గాని ఆ చిఱుమార్పులు పాఠకులకు తెలియవు మొత్తముమీద కథల సర్వాంగసౌందర్యము చెడకుండునట్లు మెలకువ చూపబడినది ఈ సమీక్షలో నుదాహరించిన కథలు, పద్యములు, వ్యాకరణాది విశేషములు సంక్షిప్తగ్రంథమునకుమాత్రమే పరిమితములు. పూర్ణ గ్రంథమునకు ఈ సమీక్ష విస్తృతము కాదు.

## పరిష్కరణము

భోజరాజీయమును తొలుదొల్త శ్రీ కందుకూరి వీరేశలింగము గారు ముద్రించినారట. తరువాత వావిళ్ళవారు రెండు ముద్రణము లొనర్చిరి. వీనిలో నాకు దొరకినట్టిది 1952లో వావిళ్ళవారు ప్రకటించిన రెండవ కూర్పు ప్రతి. నాకు దొరకినప్రతి ఒక్కటే అయినందునను, పరిష్కరణమునకంటెను సంగ్రహము చేయుటయే నాకు ముఖ్యకార్య మయినందునను ఇందు నేను చేసిన పరిష్కారము కొలదిపాటిదే యని మనవి చేయుచున్నాను. నేను చేపట్టిన ప్రతిలో సమంజసములు గావని నాకు తోచిన పాఠములను దిద్ది, సమంజసములని తోచిన వానిని చేర్చితిని. ఆ పూర్వ ముద్రణములోని పాఠములను పాదటీక (Foot Note) లో చూపితిని. నా కుచితములు గావని తోచి, మార్పు వీలుగాకున్న సందిగ్ధములకు బ్రాకెట్టులో ( ? ) ప్రశ్నార్థకము వేసి చూపితిని. కొన్ని కఠినపదముల కర్థములు గ్రంథాంతమున చేర్పబడినవి.

## కర్తవ్యము :

మన సంస్కృతాంధ్రకావ్యములకు విపులవిమర్శలు - సమీక్షలు వెలయవల సిన యవసర మెంతయో కలదని నా యభిప్రాయము. ఈ దృష్టితోనే నేను నిరం కుశోపాఖ్యానమునకు విపులమగు 'కావ్యమీమాంస' (ఆ సమీక్షపేరు)ను సంత రించియున్నాను ఈ కావ్యమునకు 40 పుటల ఉపోద్ఘాతమే వ్రాయవలసియున్నను ఇది అంతకు మించక తప్పలేదు ఇప్పటికిని అనేకాంశములను తడవడకుండ నిగ్రహముతో సంగ్రహముగానే ఈ సమీక్ష వ్రాయుట యైనది. విస్తృత సమీ క్షయే యైనచో ఇది నూఱు పుట లయ్యెడిది ఇట్టి సమగ్ర సమీక్షలు - విమర్శలు వ్రాయించుపనిగూడ మన అకాడెమీ చేపట్టుట కావ్యజగత్తునకు క్షేమము. ఆంగ్లాదిభాషలలో సాహితీవిమర్శలు ఎట్లు శాఖోపశాఖలుగా విస్తరించినవో సహృ దయు లెఱుంగనిది కాదు.

## ఉపసంహారము:

ఇట్టివిశేషములతో గూడిన భోజరాజీయము ఆంధ్రమున ఒక అసదృశకావ్య మనుటకు సందేహింప బనిలేదు కైశికీవృత్తిరమ్య మైన యీకావ్యమును ద్రాక్షా పాకశోభితముగా రచించి ఆంధ్రుల కంగించి అనంతామాత్యుడు ధన్యు డయి నాడు శబ్దరత్నాకరకారాదు లీగ్రంథమును ప్రామాణికముగా గూడ స్వీకరించి యున్నారు. ఇందలి కథ లనేకములు—— ముఖ్యముగా గోవ్యాఘ్రములకథ వంటివి ఆంధ్రులకు చిరపరిచితములు ఈ కవి తన గ్రంథ మాచంద్రార్కము ముండవలయు నని తలంచి యి ట్లన్నాడు.

సీ. అఖిలజగత్సేవ్య మై భూమిపై నహో
బలము దా నెందాఁక వెలయుచుండు
నాతీర్థమందుఁ బ్రఖ్యాతమై భవనాశ
నీనది యెందాఁక నెగడుచుండు
నామహానదిపొంత నత్యంతపూజ్యమై
గరుడాద్రి యెందాఁకఁ గదల కుండు

నయ్యద్రి శిఖరంబునందును నెందాఁక
శ్రీనృసింహస్వామి స్థిరత నుండు
ఆ. నస్మదీయకృతియు నందాఁక సంతత
శ్రావ్యమై సమస్తసభలయందు
విస్తరిల్లుఁ గాత వివిధకథా నూత్న
రత్నభూషణాభిరామ మగుచు. ౭

ఇట్టి యుత్తమ కావ్యమును సంగ్రహపఱచి ఆంధ్రుల కందించుచున్న ఆంధ్ర ప్రదేశ సాహిత్య అకాడెమీ వారు అభినందనీయులు. ఈ కార్యమును నా యందలి దయతో నా కప్పగించిన అకాడెమీ కార్యదర్శి శ్రీ దేవులపల్లి రామానుజరావు గారి కనేక కృతజ్ఞతాపూర్వక నమోవాకములు.

———

శ్రీ

# భోజరాజీయము

## ప్రథమాశ్వాసము

### ఇష్టదేవతాస్తుతి

శ్రీరమణీపయోధరప
రిస్ఫుటకుంకుమ ఫాలభాగక
స్తూరిక లిష్టకేళిగతిఁ
జోఁకినభంగి నురంబునందుఁ బ్ర
స్ఫారితరత్నలాంఛనవి
భాయుగళంబు దలిర్ప నొప్పు ల
క్ష్మీరమణుం డహోబలనృ
సింహుఁడు మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్. ౧

చ. శ్రుతితతు లుద్భవించిన విశుద్ధగృహంబు లనంగఁ జాలి వా
క్సతికి నివాసభూములనఁగాఁ దగి యెవ్వని మోముఁదమ్ము లం
చితగతి నొప్పు నట్టి సరసీరుహసంభవుఁ డిచ్చుఁగాత మ
త్కృతికిఁ జిరాయువు న్విమలకీర్తియు సజ్జనరంజకత్వమున్. ౨

చ. ఒకదెస మాతృభావమును నొక్కదెసం బితృభావమున్ సమాం
శకముగఁ దాల్చి యోగిజనసంతతి గన్గొను నంతరంగదృ
ష్టికి గుఱియై తపస్వులకుఁ జేరువచుట్టమనంగ భక్తరా
జికి నఱచేతిసొమ్మగు శశిస్ఫుటమౌళిఁ దలంతు శంకరున్. ౩

ఉ. విఘ్నము లెల్లఁ బాపి పృథివిన్ భవసీరధిపేర్మి గుల్పసం
దఘ్నము చేసి నిల్తు రుచితస్థితి నెవ్వనిభృత్యు లట్టి దుః

ఖఘ్నుఁడు షణ్ముఖప్రథమగణ్యుఁడు శీఘ్రగజాస్యుఁడైన యా
విఘ్నవిఘుండు మత్కృతికి వేడుకతోడ సహాయుఁ డయ్యెడున్. ౪

ఉ ఏపతిలావు లేక నరు లెవ్వరు నోరు మెదల్పలేరు ప
ద్మాసన వాసుదేవ నిటలాక్షులు లోమగ నా త్రివిష్టపా
వాసులు పుట్టఁ జేరు జెఱవంబును నేరికి దాఁప నట్టి వా
ణీపతి మన్ముఖాబ్జమున నిల్చి విశేషవరంబు లీవుతన్. ౫

## పూర్వకవిస్తుతి

ఉ శ్రీకరమైన రామకథఁ జెప్పి కృతార్థులఁగా నొనర్చె భూ
లోకమువారి నే ఋషి త్రిలోకములుం బొగడంగ నట్టి య
స్తోకవచోభిరాముఁడు విశుద్ధతపోవిభవాధికుండు వా
ల్మీకిమునీంద్రుఁ డెప్పుడుఁ జలింపక నామదిలోన నుండెడున్ ౬

ఉ. ఏకపుఁబ్రోకయైన శ్రుతులెల్లను నేర్పున నేర్పరించి సూ
త్రాకృతు లొప్పఁ దీర్చి యితిహాసపురాణచయాదు లోలి న
య్యైకరణిం బ్రబోధనుల ప్రార్థ్యములై వెలయన్ రచించె న
వ్యాకులబుద్ధి నేపురుషుఁ డట్టి పరాశరసూనుఁ గొల్చెదన్. ౭

చ. వివిధపదానుయోజనఁ బ్రవీణుఁడు దండి, పమంచితార్థగౌ
రవమునఁ బెద్ద భారవి, ధురంధరుఁ డయ్యుపమాకవిత్వస
త్ప్రవణతఁ గాళిదాసు, త్రివిధంబున మాఘుఁడు మేటి నాఁగ, వి
ట్లవనిఁ బొగడ్త కెక్కిన మహాకవులం బ్రణుతింతు నాఢ్యులన్. ౮

ఉ నన్నయభట్టుఁ దిక్కకవినాయకు భాస్కరు రంగనాథుఁ బే
ర్వెన్నిక కెక్కినట్టి యమరేశ్వరు నెఱ్ఱయమంత్రి నాదిగాఁ
జన్నకవీంద్రులన్ నవరసస్ఫుటవాణు లనంగ ధాత్రిలో
నున్నకవీంద్రులం దలఁతు మల్ల మెలర్పఁగ వాగ్విభూతికిన్. ౯

## భాగవతసంకీర్తనము

సీ. ఏమహాత్ములచేత నీజగత్త్రియము నా
ప్యాయితం బయ్యె నయ్యమృతకరుని

చేఁ బోలె, వైదూర్యలచేతఁ బోలె సురక్షి
తం బయ్యె, నూత్న రత్నములచేతఁ
బోలె నలంకృతిఁ బొరసెఁ, బాత్రిత మయ్యెఁ
బుణ్యతీర్థముచేతఁ బోలె, నట్టి
వైష్ణవప్రవరుల వైనతేయు గజేంద్రు
శేషుఁ బావని నంబరీషు ధ్రువుని

తే. బలి విభీషణుఁ బ్రహ్లాదుఁ బాండవేయుఁ
బుండరీకు వేదవ్యాసుఁ బుత్రు భీష్ము
నారదునిఁ బరాశరుని శౌనకుని భృగుని
విదురు నక్రూరు గోపాలవితతిఁ దలఁతు, ౧౦

## గురుస్మరణము

సీ. భూనభోహారిదంత పూరితనుతకీర్తి
శాలి తిర్వేంగళచక్రవర్తి
సకలసాత్త్వికశుకప్రకరసత్ఫలపూర్ణ
సహకార మళఘరిచక్రవర్తి
ఘనతరాజ్ఞానాంధకారవిఖండన
చండాంశుఁ డౌబళచక్రవర్తి
నానార్థిజనచాతకానూనధనవృష్టి
జలదంబు శ్రీదేవచక్రవర్తి

తే. యనఁగ శ్రుతిచతుష్టయముతో నెనయునట్టి
యగ్రజులతోడఁ బుట్టిన యస్మదీయ
గురునిఁ దిరుమల నల్లానువరతనూజుఁ
దలఁతు గోవిందచక్రవర్తులఁ బ్రియమున. ౧౧

వ. అని యిష్టదేవతానమస్కారంబును విద్వజ్జనాభివందనంబును భాగవతసంకీర్తనంబునుం జేసి వాణీవరప్రసాదలబ్ధ వాగ్విభవుండనై కృతి యొనర్ప నుద్యోగించి తత్కృతిలక్ష్మికి ముఖమండనంబుగా నస్మదీయ వంశ ప్రశంస యొనర్చెద నది యెట్టి దనిన. ౧౨

## కవివంశాభివర్ణనము

సీ. శ్రీరమ్యుఁడగు నాదినారాయణునినాభిఁ
బొలుపార విరిదమ్మిపువ్వు వొడమె
నాపువ్వులోఁ బుట్టె నఖిలలోకంబులు
పుట్టింపఁ జాలెడు ప్రోడపట్టి
యాపట్టిమోముల నామ్నాయవితతితో
నావిర్భవించె విప్రాన్వయంబు
నాయన్వయంబున నతిదృఢాచారస
మృద్ధులు పెక్కండ్రు ఋషులు పుట్టి
ఆ. రట్టిఋషులలోన నధికతపోవిశే
షుండు వేదశాస్త్రశోభితుండు
ఘనుఁడు సూనృతైకధనుఁడు కౌండిన్యము
నీశ్వరుండు మెఱసె విశ్వనుతుఁడు. ౧౩

శా. ఆకౌండిన్యమునీంద్రవంశమున దుగ్ధాంభోధిసంజాతుఁడై
రాకాచంద్రుఁ డెలర్చుమాడ్కి నుపధారంభైకసంరంభుఁ డ
స్తోకానందుఁడు నందనార్యుఁడు ప్రసిద్ధుం డయ్యె నార్యప్రియుం
డాకారస్మరుఁ డచ్యుతాంఘ్రికమలధ్యానానురక్తుం డిలన్. ౧౪

ఉ. నందితశిష్టలోకుఁడగు నందనమంత్రికి లక్కమాంబకున్
నందను లుద్భవించిరి జనార్దనశంకరనిర్విభేదము లా
నందమయాత్ములాదిమునినాయకసత్యుఁడు సత్యమంత్రియున్
మందరశైలధీరుఁ డసమానుఁడు మాత్రిపురాంతహార్యుఁడున్ ౧౫

వ. అం దగ్రసంభవుండు. ౧౬

ఉ. సత్యవచోవిలాసుఁడు ప్రశస్తయశోవిభవాభిరాముఁ డా
దిత్యసమప్రకాశుఁడు సుధీజనచిత్తసరోజమిత్రుఁ డౌ
చిత్యపరుండు సర్వజనవిత్తవిదుం డన మంత్రికోటిలో
సత్యనమంత్రి యొప్పె నుడుసంఘములోపలఁ జంద్రుకైవడిన్. ౧౭

ఉ. సత్యముతో నహింస విలసద్గతిఁ గూడి చరించుచాడ్పునన్
సత్యనమంత్రిఁ గూడి గుణశాలిని తాళమ నిత్యనిర్మలా

పత్యసమేతయై నిఖిలబంధుజనంబులకుం బ్రమోదసం
పత్యుదయైకహేతువయి ప్రస్తుతి కెక్కె ధరాతలంబునన్ ౧౮

క. అతనికి నయ్యతివకు న
ప్రతిమ*మహోదారు లరయ భాసురకవితా
చతురుఁడు బయ్యనయును మతి
యుతుఁడగు నందనయు సత్ప్రియుఁడుతిక్కనయున్ ౧౯

వ. ఆసత్యనామాత్యు ననుసంభవుండు ౨౦

సీ. మారాంబ కెనయైన మారాంబ పత్నిగాఁ
గనియె నార్వుర వంశకరుల సుతుల
నిశ్చలధ్యానై కనిష్ఠా గరిష్ఠుఁడై
షణ్మాసములు పురశ్చరణ చేసి
మావంశజులయింటి మార్జాలమునకైన
నరకంబు లేకుండ వరము వడసెఁ
గడఁగి పునర్మాతృగర్భంబు సొరకుండఁ
బ్రతిన గైకొని బ్రహ్మపదముఁ బొందె

ఆ. ననిన నతనికీర్తి యఖిలదిక్తటములఁ
గప్పుకొనుట వేఱ చెప్ప నేల
విపులపుణ్యసదనుఁ ద్రిపురాంతకబ్రహ్మఁ
బోలఁ గలరె యితరపురుషు లెల్ల. ౨౧

ఉ. నిత్యులు తత్తనూభవు లనింద్యులు దేవనయున్ సురేశ్వరా
మాత్యసముండు నందనయు మాన్యుఁడు కొమ్మనయున్ గుణాఢ్యుఁ డా
దిత్యవిభుండు నాశ్రితవిధేయుఁడు మాచనయున్ బ్రశస్తసా
హిత్యుఁడు తిక్కధీమణియు నెన్నిక కెక్కిరి బంధుకోటిలోన్. ౨౨

సీ. ఆసత్యనామాత్యు నగ్రసూనుఁడు పయో
నిధిగభీరుఁడు గదానిపుణుఁ డధిక

---

* మనోదారులు.

తేజుఁ డాశ్రితకల్పభూజుఁ డుత్కటకృపా
రసపూర్ణహృదయుఁ డరాతిభయద
బాహాఢ్యుఁ డసహాయసాహసుం డంగనా
జనభద్రుఁ డభినవమనసిజాతుఁ
డాశాంతవిశ్రాంతయశుఁ డార్తరక్షాతి
దక్షుఁ డున్నతవక్షుఁ డక్షరాది

ఆ. విద్యలందుఁ జతురుఁ డుద్యద్గుణశ్రేష్ఠుఁ
డనుపమానవిభవుఁ డమితపుణ్యుఁ
డనఁగ నెగడె భైరవామాత్యచంద్రుండు
రాజసభలయందుఁ బూజ వడసి. ౨౩

చ. క్షితిఁ గ్రతుకర్తృతామహిమ చేకొని పంచమవేదమైనభా
రతముఁ దెనుంగుబాస నభిరామముగా రచియించినట్టియు
న్నతచరితుండు తిక్కకవినాయకుఁ డాదట మెచ్చ భవ్యభా
రతి యనఁ బేరు గన్న కవిరత్నము బయ్యనమంత్రి యొప్పఁడే. ౨౪

చ. శరధిసుత న్వరించుజలజాతవిలోచనుమాడ్కి శీతభూ
ధరజఁ బరిగ్రహించుహిమధామకళాధరుపోల్కి సద్గుణా
భరణపవిత్రమూర్తిఁ గులపాలిక నాఁ దగు ప్రోలమాంబికన్
బరిణయ మయ్యె నెయ్యమున బయ్యచమూపతి పైఁడివోన్నతిన్. ౨౫

క. పతిభక్తి నరుంధతి, సూ
నృతమతి భారతి, జగద్గుణితసౌభాగ్య
స్థితి రతి, శాశ్వతవిభవా
యతి శ్రీసతి, యనఁగఁ బ్రోలమాంబిక వెలసెన్. ౨౬

చ. గుణయుతు లవ్వధూవరులకున్ జనియించిరి త్రేత రామల
క్ష్మణు లయి పుట్టి ద్వాపరయుగంబునఁ దిం దగ రామకృష్ణులై
గణనకు నెక్కి యీకలియుగంబున నిట్టుదయించె లోకర
క్షణుఁ డగు విష్ణుదేవుఁ డన గంగనమంత్రియు సుమ్మడన్నయున్. ౨౭

వ. ఆ గంగనామాత్యు గుణవిశేషంబు లెట్టి వనిన, ౨౮

సీ. దుగ్ధాబ్ధిలోపలి తోయజాక్షుల మేలు
కనిపి తీరంబున మనుపకున్న
హరుకంఠమున నున్న గరళానలము కప్పు
విరియ నౌషధము ద్రావింపకున్న
విందుబింబములోని యిఱ్ఱికి దీమంబు
చూపి వెల్వఱిచి పోఁ జోఁపకున్న
సీరపాణికి నీలిచీరమీఁది ప్రియంబు
మాన్పి వెల్లలు గట్ట మరపకున్న

తే. నితనికీర్తికి సరి చెప్ప నెట్లు వచ్చు
ననఁగ బొగడొందు బయ్యదండాధినాథు
కూర్మిపుత్రుండు కౌండిన్యకులపవిత్రుఁ
డంగసంభవనిభుఁడైన గంగవిభుఁడు. ౨౯

క. సోముఁడు రోహిణి నధిక
ప్రేమమున వరించుక్రియ గభీరాదిగుణ
శ్రీమహిమకీర్తి శోభిలి
కామాంబ వరించె మంత్రిగంగన ప్రీతిన్. ౩౦

క. ఆదంపతులకు హృదయా
హ్లాదకరులు సుతులు పెద్దనార్యుఁడు సుగుణా
మోదిఘనుఁ డప్పలన్నయుఁ
బ్రాదుర్భావంబు నొంది పరఁగిరి పేర్మిన్. ౩౧

వ. ఇట్టి సంతానంబువలన వెలయు గంగనామాత్యు ననుసంభవుండు ౩౨

చ. కడిమిఁ గిరీటి, దానమునఁ గర్ణుఁడు, భోగమున న్సురేంద్రుఁ, డె
క్కుడువిభవంబునన్ హరి, యకుంఠితబుద్ధిఁ బురందరేజ్యుఁ, డు
గ్గడువగుధీరతన్ సురనగప్రవరుం డనఁ బ్రోలమాంబయు
మ్మడి బెడఁగొందె రూపమహిమ న్మరుముమ్మడియై జగంబునన్. ౩౩

సీ. పితృబుద్ధి వదలక పేర్చి యచ్యుతుసేవ
యనిశంబు చేయు ప్రహ్లాదుఁ డనఁగ

నగ్రజన్మునితోడ విగ్రహింపక శౌరి
        శరణు చొచ్చిన విభీషణుఁ డనంగ
ప్రభుత యెన్నఁడుఁ గోలుపడక సద్భక్తి ను
        పేంద్రుఁ బూజించు బలీంద్రుఁ డనఁగ
వైవాహికక్రియావైభవం బుడుగక
        బిసరుహాక్షునిఁ గొల్చు భీష్ముఁ డనఁగ

ఆ. నితరమతములందు హృదయంబు చొనుపక
యొగిఁ దదేకనిష్ఠ యుల్లసిల్లఁ
పరమభాగవత విభాసితుండై యొప్పెఁ
బ్రోలమాంబసుతుఁడు ముమ్మవిభుఁడు. ౩౪

క. ఆముమ్మడిప్రెగ్గడ శ్రీ
రాముఁడు సీతను వరించు క్రమమున సుగుణ
స్తోమాభిరామ నమితకృ
పామండిత నెఱ్ఱమాంబఁ బరిణయ మయ్యెన్. ౩౫

సీ. పతిభక్తివిరతిని సతి యరుంధతిఁ బోల్పఁ
        దగు ననుమాట వ్యర్థంబు గాదు
సత్యవాక్ప్రౌఢిని సతి సరస్వతికంటె
        నెఱవాది యనుమాట కుఱుచ గాదు
సౌభాగ్యగరిమను సతి రతిదేవితోఁ
        బురుణించు ననుమాట బొంకు గాదు
సంపదపేర్మిని సతి శ్రీసతికి సదృ
        క్షం బను మాట సంశయము గాదు

ఆ. అనిన నితరసతుల కలవియె సతతని
శ్రాణనక్రియాధురీణహస్తుఁ
డైన ముమ్మడీంద్రు నర్ధాంగలక్ష్మి నా
నతిశయిల్లు నెఱ్ఱమాంబఁ బోల. ౩౬

క. ఆరమణీరమణులకుఁ బ్ర
భారమ్యుఁడు తిక్కవిభుఁడు ప్రకటితశాంతి

స్ఫారుఁడు సింగనయును నను
వారలు పుట్టి రిలఁ బుష్పవంతుల మాడ్కిన్. ౩౭

వ అయ్యిరువురయందు నగ్రసంభవుండు. ౩౮

సీ. సత్యభాషణమును సాధుపోషణమును
సహజభూషణముగా జరగువాఁడు
ఆర్తరక్షణము దయార్ద్రశిక్షణము ను
దాత్తలక్షణముగాఁ దనరువాఁడు
సుకృతభావనమును సుకవిసేవనమును
నిత్యజీవనముగా నెగడువాఁడు
విష్ణుకీర్తనమును విమలవర్తనమును
విహితవర్తనముగా వెలయువాఁడు

ఆ వాఁడె చూడుఁ డనుచు వసుధాజనంబులు
ప్రస్తుతింప నొప్పు భవ్యచరితుఁ
డుభయకులపవిత్రుఁ డురుకీర్తిధవళిత
దిక్కుఁ డెఱ్ఱమాంబ తిక్కవిభుఁడు. ౩౯

సీ విలసితంబగు కృష్ణవేణీ మలాపహా
రిణీ భీమరథినా ధరిత్రియందుఁ
దనరునదీత్రయాంతర్వేది యగు పావ
నక్షేత్రమున శోభనమున కెల్ల
ధర నివాసంబగు పెరుమగూరుపురంబు
నందు విద్వజ్జనానంద మైన
జీవనస్థితిచేతఁ జెన్నొంది వంశక
ర్తృత్వసంపత్తిఁ బ్రభుత్వ మొంది

తే. నెమ్మి ప్రత్యక్షపరమపద మ్మనంగ
నొప్పు శ్రీకాకుళంబున కొడయఁ డైన
యంధ్రవల్లభహరిసేవ నలరుచుండుఁ
బెక్కుభంగుల ముమ్మడితిక్కవిభుఁడు. ౪౦

చ. చిరతరశోభనుం డగువిశిష్టమునీశ్వరుఁ డయ్యమంభటిం
బరిణయ మై గృహస్థగుణభాసితుఁడై వెలుఁగొందుమాడ్కిఁ గా
తరపరిరక్షణానవరతవ్రతశీలుఁడు తిక్కమంత్రిశే
ఖరుఁడు వివాహ మయ్యె గుణగౌరవశోభిని మల్లమాంబికన్. ౪౧

సీ. శ్రీవత్సగోత్రాబ్ధి శీతాంశుఁ డగునక్క
దండాధినాథుఁ డీతరుణి తండ్రి
లావణ్యగుణపుణ్యలక్షణాన్విత యైన
యక్కమాంబిక యీలతాంగి తల్లి
చిరకీర్తివిరతులు చిట్టనమంత్రియు
నయ్యలార్యుఁడు నాతి కగ్రజమ్ము
లచ్యుతాంఘ్రిసరోరుహార్చనారతుఁడు ద
మ్మనమంత్రి యీయింతి యనుఁగుఁదమ్ముఁ

తే. డనఘుఁ డగుకోటకరుణాకరార్యుఁ డను ఘ
నుండు ముదునూరిపెద్దవిభుండు వివ్వ
ధూమణికిఁ గూర్మిగల మేనమామ లనిన
మగువ లెనయె తిక్కనమంత్రిమల్లమకును. ౪౨

సీ. ఈయింతిప్రియభాష లెల్లపెద్దలకును
బరమానురాగ సంపాదకములు
నీయింతిహస్తాబ్జ మెల్లబంధువులకు
లలితకల్పద్రుమ ఫలితశాఖ
యీయింతివర్తనం బెల్లయింతులకుఁ బ
తివ్రతాచారోపదేశకర్త
యీయింతిమందిరం బిందిరాదేవికి
సతతమనోజ్ఞ విశ్రామభూమి

ఆ. యనఁగ సకలశోభనావాసదేశమై
యఖిలకులవధూజనావతంస
మగుచు వెలసెఁ దిక్కనామాత్యవిభుదేవి
మల్లమాంబ లోక మెల్లఁ బొగడ. ౪౩

సీ. ఈగృహస్థుని కిట్టి యిల్లాలు గలుగుట
ప్రాగ్భవార్జిత పుణ్యఫలము గాదె
యీపతివ్రత కిట్టి హృదయేశుఁ డబ్బుట
పరికింప ఘనతపఃఫలము గాదె
యీమహాప్రభువున కిట్టి సజ్జనురాలు
గలుగుట సంసారఫలము గాదె
యీపుణ్యకాంతకు నిట్టి ధర్మక్రియా
పరుఁడు గల్గుట దానఫలము గాదె

ఆ. యనఁగ మహిఁ బరస్పరానుకూలత్వంబు
మిక్కుటముగ మంత్రితిక్కవిభుఁడు
మల్లమాంబికయును మహనీయజీవన
సౌఖ్యవార్ధిఁ గేళి సలుపుచుండ ౪౪

మ. అరిషడ్వర్గముఁ దూలఁ దోలి ధరలో నైశ్వర్యషడ్వర్గ మీ
వరుసన్ ప్రాగ్భవ మొందె నాఁగ సుతషడ్వర్గంబు జన్మించెఁ ద
త్పురుషస్త్రీతిలకంబులందు ఘనసంతోషంబు తద్బాంధవో
త్కరముల్ పొంద సమగ్రసంపద నిజాగారంబునం జెందఁగన్. ౪౫

వ. వా రెవ్వ రంటేని. ౪౬

ఉ. భూనుతకీర్తి ముమ్మడివిభుండు మదగ్రజుఁ, డేను వైష్ణవ
ధ్యానసమాహితాత్ముఁడ ననంతసమాఖ్యుఁడ, నాదు తమ్ము ల
జ్ఞానవిదూరు లక్కనయు, సత్కవి చిట్టనయున్, వివేకవి
ద్యానిధి రామచంద్రుఁడు, నుదారుఁడు లక్ష్మణనామధేయుఁడున్. ౪౭

క. ఈయార్వురు నొక్కొక్కఁడు
వేయిండ్లకు మొదలుగాఁగ వెలయుదు రని కా
దే యాఱువేల పే రిడి
రీయన్వయమునకు నేష్య మెఱిఁగినపెద్దల్. ౪౮

వ. ఇట్టి సంతానలతావితానంబునకు మూలకందం బనందగు తిక్కనామాత్య
నసంభవుండు ౪౯

చ. బలమున నాహలాయుధుఁ, డపారపరాక్రమలీలయందుఁ గే
వలమృగరాజు, రూపవిభవంబున వాసవసూతి, నీతికౌ
శలమున నయ్యుగంధరుఁడు, సత్యనిరూఢిని ధర్మజుండు నా
నిల నుతి కెక్కె ముమ్మరధినీశ్వరుసింగన బంధుకోటిలోన్. ౫౦

వ. అతని యతివ యెట్టి దనిన, ౫౧

సీ. రమణీయమైన భారద్వాజవంశవ
ర్ధనుఁడు సింగనమంత్రి తనకుఁ దండ్రి
యఖిలసంపదలకు నావాసభూమి నాఁ
దగునన్నమాంబిక తనకుఁ దల్లి
ఘనుఁడు నారనమంత్రియును గడాకుశలుండు
మారనార్యుండును మహితమూర్తి
సింగధీమణియు ననంగసన్నిభుఁడు మా
చనమంత్రియును సర్వసన్నుతుండు
తే. వల్లభన్నయు ననఁగలవారు తనకు
ననుఁగుఁదమ్ములు దా నౌబళాంబ యనఁగ
నలరునయ్యింతి తనకు నిల్లాలు గాఁగ
మహితగుణశాలి సింగనమంత్రి వెలసె. ౫౨

ఉ. ఆతనినందనుల్ హరిపదాబ్జరతుండగు సింగమంత్రి, ని
ర్భీతుఁడు చిట్టయన్నయు, గభీరగుణాఢ్యుఁడు ముమ్మడన్న, ప్ర
ఖ్యాతుఁడు సింగశౌరి, ఘనుఁడౌ తిరువెంగళసింగరన్న నా
నాతతసచ్చరిత్రముల నన్వయపావను లైరి మేదినిన్ ౫౩

వ. ఇట్టిపుత్రరత్నంబులచేత నలంకృతుండగు సింగనమంత్రి సౌమిత్రియుం
బోలెఁ దనకు ననవరతప్రీతి గావింప నస్మదీయ జనకుం డగు తిప్పనా
మాత్యచంద్రుఁడు రామచంద్రుండునుం బోలె ధీరోదాత్తగుణోత్తముండై
మెఱయుచుండు ౫౪

ఆ. దేవతాన్వయంబు దేవేంద్రుచేఁ బోలె
మహితపుణ్యుఁడైన మనువుచేత

క్షత్రకులము వోలెఁ గౌండిన్యగోత్రంబు
వెలసెఁ దిక్కామంత్రివిభునిచేత. ౫౫

క. ఏతద్వంశపయోనిధి
శీతాంశుఁడ బుధచకోరచిత్తప్రియుఁడన్
వీతకళంకుండఁ గళో
పేతుఁడ నిర్ధూతదురితపృథుతిమిరుండన్. ౫౬

క. నరహరిచరణసరోజ
స్మరణామృతపానసతతసంతుష్టాంతః
కరణుఁడ సంతత వాణీ
వరప్రసాదానులబ్ధ వాగ్విభవుండన్. ౫౭

క. శ్రీయువతీకారుణ్యర
సాయత్తకటాక్షవీక్షణాపాదితసు
శ్రేయస్కుఁడఁ గవినికరవి
ధేయుండ ననంతనామధేయుఁడ జగతిన్. ౫౮

## కావ్యప్రస్తావన

సీ. సకలవిద్యలయందుఁ జర్చింపఁ గవిత యు
త్కృష్ట మం డ్రది నిత్యకీర్తికొఱకు,
నర్థాప్తి[1]కొఱకును, వ్యవహారలక్షణం
బెఱిఁగెడికొఱకు, ననేకవిధము
లగునమంగళముల హరియించుకొఱకు, ను
చితనిత్యసౌఖ్యసంసిద్ధికొఱకు,
నొనరఁ గాంతాసమ్మితోపదేశంబునఁ
బ్రీతిమై హిత మాచరించుకొఱకు,

ఆ. నమ్మెఁ గానఁ బెద్ద[2]లాదరించెద రంచు
నేర్పుకొలఁదిఁ గృతి యొనర్పఁ బూని
యస్మదీయకృతికి నధిపతిఁ గావింప
నర్హుఁ డెవ్వఁ డొక్కొయని తలంచి ౫౯

1. కొఱకునా. 2. లాచరించెదరంచు.

క. మనమునఁ దలపోయుచు నటు
గను మోడ్చినవేళ యొక్క ఘనతరతేజో
ధనుఁ డస్మత్స్వప్నంబున
ననుకంపాయత్తచిత్తుఁ డై పొడచూపెన్. ౬౦

సీ. అభవ్యుఁ డఖిలచరాచరాంతర్గతుం
డైనయాదిమవిష్ణుఁ డని యెఱింగి
యాదేవు దివ్యభవ్యావతారంబుల
నిట్టి యద్భుతమూర్తి యెద్ది యొక్కొ
యని చూచుచో మందహాసచంద్రిక గల్గు
సింహవక్త్రంబునఁ జెలువమైన
మనుజదేహంబును మహితాంకతలమున
నక్షీణసంపత్కటాక్షరుచులఁ

ఆ. దనరుకాంతయును, సుధాధామరుగ్ధామ
సమము లైన శంఖచక్రములును,
దివ్యమాల్యములును, దివ్యాంబరంబులు
దివ్యభూషణములు దేజరిల్ల. ౬౧

క. ఆమూర్తికి నీమూర్తికి
నేమి విభేదం బనంగ నింపగు రూప
శ్రీమహిమఁ దనరి మద్గురుఁ
డామూర్తిన కదిసి యుండి యాదర మెసఁగన్, ౬౨

ఆ. 'ఇందు రమ్ము వత్స!' యేను నీమీఁది కృ
పాతిశయముపేర్మి నరుగుదెంచి
వాఁడ' ననుచుఁ బిలిచి నన్నాదరించి ప్ర
హర్షవార్ధి నోలలార్చి యపుడు. ౬౩

చ. అదె జగదేకవంద్యుఁ డగు నాదినృసింహుని దివ్యరూపసం
పదఁ గనుఁగొంటి సర్వసులభంబుగ; నీకృతిలక్ష్మికి న్వటిం
పొదవె, ఫలించె నీతలఁపు, యోగ్యుఁడవైతి, యశోవిభూతి క
య్యుదధివరేణ్యుచాడ్పున మహోన్నతజీవనవైభవంబునన్. ౬౪

ఉ. కావున నిమ్మహాత్ము నవిఖండితతేజుఁ, గృపావిధేయు, భి
క్తావనశీలుఁ, బావనతరాంఘ్రిసరోరుహజాతదేవతా
శైవలినీకు, నాకలితచక్రు, నహోబలతీర్థనాయకుణ్,
శ్రీవనితాధినాథుఁ బతిఁ జేయుము నీకృతికిణ్ లసన్మతిణ్. ౬౫

వ అని యుపదేశించె, నంత నమ్మహామూర్తియుం దదనురూపంబులగు మధు
రాలాపంబుల నన్ను గారవించె; నంతన మేలుకవి మేను బెద్దయుం బ్రొద్దు
తదీయధ్యానానందనిష్పందంబగు డెందంబుతో ననన్యసులభం బగు నప్ప
రమ సౌఖ్యంబు ననుభవించి "నృసింహా! యిది యంతయు నీకృపావిశే
షంబుగా నిశ్చయించి నీమహానుభావంబు భావించి. ౬౬

సీ. వేదంబు లేదేవు పాదాబ్జములయందు
నవిశంబు మ్రోయు నయ్యలులభంగి
నలువయేదేవుని నాభిసరోవరం
బున నంబుపక్షులపోల్కిఁ జదువు
శేషుఁ డేదేవుని చెవిఁ జేరి యాస్తవ
గ్గమువోలెఁ బరమార్థసమితిఁ బల్కు
నింద్రాదిదేవత లేదేవుఁ గైవార
మొనరింతు రవ్వందిజనులభంగి

ఆ. నట్టిదేవదేవు నఖిలాండనాయకు
నాదివిభు నహోబలాధినాథు
వరదుఁ బరమపురుషు శరణాగతత్రాణ
పరునిఁ బ్రస్తుతింప నోరులవశమె. ౬౭

వ అట్లు గావున. ౬౮

చ వెలయఁగఁ దొంటిపెద్దల కవిత్వమువోలె రుచించునొక్కొ యేఁ
బలికెదునూత్నకావ్యరసభావము లైనను భూమిఁ దల్లిదం
డ్రులకు విజ్యాగ్రసూనుల పట్టుపచురోక్తులకంటెఁ జిన్నబి
డ్డల వెడతొక్కుపల్కులు దృఢంబగుముద్దుల నీనకుండునే ౬౯

వ. [1]అని నీదగు జగద్గురుత్వం బుపలక్షించి" మఱియును. ౭౦

1. అనిన.

చ. సదయుఁ డహోబలేశుఁడు ప్రసన్నగుణాఢ్యుఁ డనాథనాథుఁడై
చదువులకుం గరంగఁడు నిజంబగుభక్తిరసోక్తిఁ బోలె ముం
జదివినభార్గవాదులకు సన్నిధి చేసెనె దైత్యజాతుఁ డ
య్యదన సమస్తమందుఁ గల డంటకు దృష్టము చూపిన ట్లొగిన్. ౨౧

క ఇది సార మిది యసారం
బిది యల్పము ఘన మిదనక యెందును దానై
పొదలుటఁ దెలుపఁడె దితిసుత
సదనస్తంభమున నెల్ల జగములు నెఱుఁగన్. ౨౨

ఉ పోఁడిగ నెందునుం గలఁడు పొమ్మనుదాసుని జిహ్వనుండియో
వేఁడి రమావిభుం డనెడివీఁడి దైత్యునిదృష్టినుండియో
వాఁ డది ప్రేయు నింక నని వావిరిఁ గంబమునందునుండియో
నాఁ డటు లుద్భవించుట యనం దగు సర్వగతాత్ముఁ డల్పుఁడే. ౨౩

సీ. మశక పిపీలికా మక్షికా ప్రభృతులై
చరియించు నజ్ఞాన జంతువులకుఁ
దృణగుల్మభూరుహ దృషదాదికంబులై
చను జడస్థావర జాతములకు
నపవర్గసుఖసిద్ధి యటువేరెయన మన్నఁ
దెలివియు భక్తియుఁ గలుగునట్టి
జనులకు గమనాగమన శూన్య మగు[1]సౌఖ్య
గతి [2]వ్రాతె యిది యీయగణ్యపుణ్య

ఆ తీర్థసేవన వినుతింపఁ బెంపారున
త్యుత్తమమయి మహి నహోబలాఖ్య
తీర్థ మిట్టిమేటి తీర్థమునకుఁ గర్త
యగున్నృసింహుమహిమ యడుగనేల. ౨౪

క. కనుఁగొనిన నధికసుకృతము,
వినినం గల్మషహరంబు, వెలయఁగఁ జిత్తం

1. నాఖ్య. 2 వ్రాతి.

బునఁ దలఁప మేలుసేకుఱుఁ,
జనదె హరినాశ్రయింప సత్పురుషులకును. ౨౫

వ. అని పురాణవేదు లగు నాదిపురుషులు చెప్పునప్పుణ్యవచనంబులు మున్న కని
యునికింజేసి నిశ్చితుండనై. ౨౬

సీ. నూతనం బయ్యుఁ బురాతనకృతులట్ల
సంతతశ్రవ్యమై జరుగు ననియు
నాదిరాజసమానుఁ డగుభోజభూపతి
చరిత యీకవితాప్రసంగ మనియు
నిందుఁ జెప్పెడికథ లిన్నియు నోలిఁ బ్ర
శస్తధర్మోపదేశంబు లనియు
నఖిలజగన్నాథుఁ డగునహోబలనాథుఁ
డీపుణ్యకృతికి నధీశుఁ డనియుఁ

ఆ. [1]బృథివి నెల్లజనులు ప్రియభక్తి యుక్తిఁ బా
టింతు రనియు నూఱడిల్లి యేను
బరమసౌఖ్యమైన భవదాభిముఖ్యంబు
నెమ్మిఁ బడసి యధికనిష్ఠతోడ. ౨౭

సీ. వర్ణితప్రహ్లాదవాక్యజయస్తంభ
మగుమహాస్తంభంబునందు వెడలి
సురసిద్ధఖేచరనరయోగిహృద్ధ్యేయ
మగుమహోజ్జ్వలకాయ మమరఁ దాల్చి
భూరిదానవవంశపూర్ణతటాకంబు
కట్ట నాఁ దగు దైత్యుపొట్ట వ్రచ్చి
శిష్టజనవ్రజాభీష్టదానసమర్థ
మగునహోబలతీర్థమందు నిలిచి

తే. యవని నాబాలగోపాల మగుసమస్త
జీవులకు నందుబడి యైనదేవభూజ

---

1. బృథివి నెల్లజనులు ప్రియభక్తి, బాటింతురనియు నూఱడిల్లియేను.

మయ్యె నేదేవుఁ డట్టిమహానుభావు
నాదినరసింహదేవుని నాశ్రయించి ౭౮

## షష్ఠ్యంతములు

క. అనితరసదృశమహాత్మున
కనిమిషవంద్యునకు బుధజనారాధ్యునకున్
వినమితసుత్రామునకును
ఘనతరకలిదోషతిమిరకమలాప్తునకున్ ౭౯

క. వినతాసుతగమనునకును
మనసిజజనకునకు వార్ధిమందిరునకుఁ బా
వనతరమూర్తికి సన్ముని
మనస్సరోజాంచితభ్రమరవర్యునకున్. ౮౦

క. తామరసోదరునకు ను
ద్దామభుజావీర్యనిర్జితప్రతిభటపూ
ర్వామరునకు నజరామర
తా మహిమాస్పదునకును బుధప్రతిమునకున్. ౮౧

క. భవనాశనీనదీతీ
రవిహారోత్సుకునకు [1]నిందిరావనకేళీ
ప్రవణునకును యోగానం
దవినిర్మలమూర్తికిని సుధామయమతికిన్. ౮౨

క. శ్రీదేవీవరునకుఁ బ్ర
హ్లాదవచనపాలమోదితాత్మునకు జగ
న్మోదావహకారణునకు
నాదినృసింహున కహోబిలాధీశునకున్. ౮౩

వ. అఖిలజగద్ధితావతారుండ వగు నీకు విన్నపంబు సేయు విధంబుగా నే నొప్పం
బూనిన కథాప్రసంగం బవధరింపుము. ౮౪

---

1. నిందిరానవకేళీ.

# కథా ప్రారంభము

క. సూత్రకథ భోజరాజచ
రిత్రము, యానడుమ ధర్మరీతులు నీతుల్
చిత్రకథలై తలిర్పఁగ
శ్రోత్రసుఖముగా నొనర్పఁ జొప్పడి యుండున్ ౧

వ. అదియును దత్తాత్రేయమునీంద్రుండు వక్తయు, మహుం డను కాంభోజ మహీశుండు శ్రోతయుంగా నధిగతవిద్యాసమాజుండగు భోజుండు పూర్వజన్మంబున బ్రాహ్మణుండై యుండి దారిద్ర్యభారంబు ఘోరంబగుటవలన సంభవించిన విరక్తి కారణంబుగాఁ దీర్ఘయాత్రచేయుచుఁ బ్రయాగయందు నిష్టకామ్యసిద్ధి పొంది శరీరవిసర్జనంబు చేసి సజ్జనప్రియుండై పుట్టి లాటదేశంబునందు ధారానగరంబున కధీశ్వరుండై రాజ్యంబు సేయుచు నొకనాఁడు మృగయావినోదార్థంబు వనంబునకుం జని యందు సర్పటి యను నొక్కసిద్ధపుంగవుం గని తన పట్టణంబునకుఁ దోడ్కొని వచ్చుటయు వాఁడట్లు చనుదెంచి యొక్కరాత్రి రహస్యవృత్తిం దన ప్రభావంబు నెఱపం దలంచి పంచలోహమయంబై యొప్పు నప్పుడమిఱేని కొలువుచవికెం దనచేతి ధూమవేధి యను నౌషధంబుచేత శుద్ధసువర్ణంబుఁ గావించి యెందేనియుం బోవుటయు మఱునాఁ డవ్విధంబు చూచియా యద్భుతకర్మంబు సర్పటికృతం బని యతని వెదకించి కానక యొక్క కృతకమతంబున నాకర్షించి భోజుండు ధూమవేధిఁ దా నపహరించుటయు నతండు కోపించి శాపంబిచ్చుటయుఁ దదీయప్రార్థనంబున శాపంబుఁ గ్రమ్మఱింపుటయుఁ దదనంతరంబు భోజననిమిత్తంబున భోజసర్పటులకు సంవాదవశంబున వివిధపుణ్యకథాప్రసంగంబులు పుట్టుటయు నను వృత్తాంతంబులంగలిగి యిక్కావ్యంబు సర్వజనాకర్ణనీయం బై భోజరాజీయం బను పేరంబరగుఁ దత్ప్రారంభం బెట్టి దనిన. ౨

క. మహిత సముజ్జ్వల తేజుఁడు
విహితాచారైకరతుఁడు వీరవినోద
స్పృహుఁడు బహుకార్యదక్షుఁడు
మహుఁ డను కాంభోజరాజు మహిఁ గడునొప్పెన్, ౩

క. ఆనరపతిరాజ్యంబున
మానవు లందఱును ధర్మమార్గప్రవణుల్
దానత్యాగపరాయణు
లానందరసార్ద్రచిత్తు లధికధనాఢ్యుల్. ౭౮

క. నరు లడిగినట్లు వానలు
[1]గురియును, సస్యములు పండుఁ గొలఁదికి మిగులన్,
సురభులు ఘనముగఁ బిదుకును,
ధరణిఁ బ్రజావృద్ధి తనరుఁ దద్రాజ్యమునన్. ౭౯

వ. ఇట్లు సకలజనానురాగం బగురాజ్యంబు నిరంతరపూజ్యంబై చెల్లుచుండఁ బెద్ద కాలంబు సనుటయుఁ బురాకృతకర్మంబు కారణంబుగా నప్పుడమిఱేనిమేన నతినికృష్టంబగు కుష్ఠరోగంబు ప్రవేశించిన నతండు ౮౦

ఉ. 'అక్కట! యేమి చేయుదు, మహౌషధసేవల దేవసేవలన్
దక్కక యీమహారుజ వృథా పరితాపముఁ బొంద నేల నే
నిక్కడనుండి చేయుపని యెయ్యది? గౌతమి కేఁగి యందులో
మ్రుక్కక మేను వైతు మఱిరోగము గీగము మాను నంతటన్.' ౮౧

క. అని తలఁచి తనదు తలఁపె
వ్వనికిఁ బ్రకాశింపకుండ వసుధాపరిపా
లనమునకుం దనతనుజ
న్మని నునిచి నిగూఢమార్గమున వెలువడియెన్. ౮౨

వ. ఇట్లు కృతనిశ్చయుండై యరుగుదెంచునారాజురాకఁ దన దివ్యజ్ఞానంబున నెఱింగి యమ్మహానది యాత్మగతంబున. ౮౩

ఉ. ఈతఁడు నన్నుఁ జొచ్చి తనహేయపుదేహము నుజ్జగించి ప్ర
ఖ్యాతిగ నూర్ధ్వలోకములు గాంచుటకుం జనుదెంచుచున్నవాఁ,
డీతనికుష్ఠగంధము సహించుట దుష్కర మేమిభంగిఁ బోఁ
ద్రోతునొకో యితండు కడుదూరమునంద తొలంగునట్లుగన్. ౮౪

క. అని తలఁచి తగునుపాయము
గని మునిభామినివిధంబు గైకొని శీఘ్రం

1. గురియుచు.

బున నతఁడు వచ్చుమార్గం
బున కెదురుగ నొక్కబ్రమానిపొంత వసించెన్. ౯౫

వ. అయ్యవసరంబున. ౯౬

క. స్రుక్కినయంగుళములు, దళ
మెక్కినదేహమును, గాంతి యెడలినమొగమున్,
మక్కినచెవులును, ముడిఁగిన
ముక్కును నై వచ్చి మహుఁడు ముద్దియఁ గనియెన్. ౯౭

చ. కని మునిభామఁగాఁ దలఁచి గ్రక్కునఁ జేరి నమస్కరించి మో
డ్చినకరయుగ్మము న్నెదుటఁ జేర్చిన నావనితాలలామ దీ
వన లొకకొన్ని యిచ్చి 'బుధవత్సల! యెచ్చటనుండి వచ్చి? తే
పని కెట పోయె దీవు? పరిపాటిగఁ జెప్పుము నాకు' నావుడున్. ౯౮

వ. 'ఏను గాంభోజదేశంబునుండి వచ్చితి, నాపోయెడిపని యే పని చెప్పుదుఁ దల్లి! తొల్లి మహామహీభారధౌరేయుండనై యుండునప్పుడు సకలజనంబులకు దృష్టిప్రియంబై యుండునట్టి నాగట్టి యొడలి కిట్టి కట్టిఁడిరోగంబు దైవకృతంబున సంభవించిన, ౯౯

చ. కడుకొని కామినీజనుల కౌఁగిట నేమని యుండు వాఁడ, నా
కొడుకులఁ బొత్తునం గుడువఁ గొంకక యేమని పిల్చువాఁడ, నా
యెడ కరుదెంచుసేవకుల కేమని యేఁ గొలు విచ్చువాఁడ, నే
కడ చనువాఁడ, నేది కడగా నిటు వేగెడువాఁడ ధీరతన్, ౧౦౦

చ. అని మది రోఁత పుట్టుడు రయంబున గౌతమి కేఁగి యందులోఁ
దనువు దొఱంగువాఁడ నయి తత్పరతం జనుచున్నవాఁడ నే,
ననవుడు 'నమ్మచెల్ల తను వాఱడిఁ బుచ్చుట ధర్మమార్గమే
జనహితు లైనరాజు లిటు చచ్చిన మెత్తురె శాస్త్రకోవిదుల్? ౧౦౧

చ అదియును గాక పూర్వకృత మైన యఘంబులు వ్యాధిరూపమై
పొదివినఁ దాను గై కొనక పోవునె చచ్చినఁ, గర్మశేషమై
వదలక క్రమ్మఱం దగిలి వచ్చుట సిద్ధ ముపాయయుక్తి మై
మెదలినఁ గీడు తప్పుఁ, దుది మే లొదవున్ విను నిక్క మెంతయున్. ౧౦౨

వ. కావున నీ కొక్కయుపాయంబు చెప్పెద. సకలజనవిధేయుం డగు నారాయణ దేవుండు దత్తాత్రేయుం డను నామధేయంబుతో హేమకూటశైలంబున నున్న వాఁ డందుఁ జనిన నీ కోర్కి సఫలం బగు, నయ్యోగీశ్వరేశ్వరుండును మనుష్యులకు దృష్టిగోచరుండు గాఁ డతనిఁ గనుటకై యొక్కమంత్రంబు చెప్పెద నది యనుష్ఠించునప్పుడు గౌతమియందు దర్శనస్పర్శనాదుల వర్జింపవలయు నిల్లు చేయనినాఁ డీమంత్రంబు పని చేయ దని చెప్పి యెప్పుడు నతండు తన్నుఁ దడవకుండునట్టి వైరాగ్యంబు పుట్టించి యొకమంత్రం బుపదేశించి యతని మరలించి గౌతమి యపేక్షం జనియె నది యట్ల కావె ౧౦౩

క. ఉత్తము లార్తులఁ గృపా
యత్తతఁ జేపట్టి ప్రోతు, రటు గావున నా
రిత్త చనఁ జేయ రెందు ని
మిత్తంబున నైన బ్రతుకు మెయిపోనిఁ జేత్తుర్ ౧౦౪

వ అట్లు గౌతమిచేత నివర్తితుం డయి పోయి హేమకూటముం గాంచి రోగ వేదనం డిగ్గఁద్రావుచు ౧౦౫

ఆ. అట్లు చేరి యాతఁ డాపర్వతాగ్రంబు
నందు నొక్క రమ్య మైనచోట
విపులనిష్ఠతోడఁ దప మాచరింపంగ
మెచ్చి దివ్యవేష మచ్చుపడఁగ. ౧౦౬

వ. దత్తాత్రేయుండు దరిసెనం బిచ్చిన మహుండు ౧౦౭

ఉ అత్రిమహామునీశ్వరు తపోవనిజాత ఫలత్వలంబు, దే
వత్రయమాతగాఁగఁ జెలువం బగు న య్యనసూయచెయ్వుల
బుత్రుఁడు తోయజాతభవభూతగణేశులలోనఁ బుట్టు డాఁ
పత్రపరీతుఁ డంచు నిసుఁ జెప్పుదు రార్యులు యోగిపుంగవా! ౧౦౮

వ అని బహుప్రకారంబులఁ బ్రస్తుతించు నతని వాత్సల్యంబునఁ జాల రిల్ల యమ్మహీశ్వరుండు 'ఓరీ! నీవు నా కందుఁ గాన యె ట్లెఱింగి' తనిన నతండు భయభక్తిసంభ్రమంబులు పుప్పిరిగొనుచుండఁ బ్రణామంబులు చేసి 'దేవా! యవధరింపు' మని యిట్లనియె ౧౦౯

క. "రోగమున కోడి ప్రాణ
త్యాగము సేయుటకుఁ దెంపు దలకొనుమదితో
నాగౌతమి కరుగుచు నెల
నాగను బొడగంటి నొక వనస్పతి పొంతన్. ౧౧౦

క. కని ప్రణమిల్లిన నయ్యం
గన నావృత్తాంత మడిగి కడు వగచి తపో
ధనవంద్య నిన్నుఁ జెప్పినఁ
బనివిని నీకృపకు నేఁడు పాత్రుఁడ నైతిన్. ౧౧౧

వ. ఆయవ్వ యెవ్వ రగుటయు నెఱుంగ" ననవుడు దత్తాత్రేయుఁడు తన యోగ దృష్టివలన నది గౌతమి యగుటయు నితనిపాపంబులు భరియింప నోపక యిట్లు చేసె ననియు నెఱింగి యాతని నూఱడించి "యేను బ్రతిదివసంబును బ్రాతరుచితకృత్యంబులు ప్రయాగయందుఁ జేయుదు, మాధ్యాహ్నికానుష్ఠానంబులు హేమకూటపర్వతంబున ననుష్ఠింతు, నిశాసమయకృత్యంబులు శ్రీరంగ ధామంబున నొనరింతు, నిది నాకు నియమంబై చెల్లు, నీత్రిస్థానంబులు నాకు నతిప్రీతికరంబు లయి యుండు, నట్లు గావున నింతప్రొద్దు శ్రీరంగంబునకుం జని రేపకడ వచ్చి నిన్ను రోగవిముక్తుం జేయుదు. నావచ్చునంతకు నివ్వోటన యుండు" మని విజయం చేసిన. ౧౧౨

క. ఆరాత్రి మహుఁడు తన దు
ర్వారదురితలతలు తే పవశ్యము దెగునం
చారూఢిఁ గౌతుకము మదిఁ
గూరఁగ నిద్రించె నచటఁ గుశలత్వమునన్. ౧౧౩

వ. మఱియుఁ బ్రభాతసమయం బగుటయు నమ్మహీపతికి నద్దివసంబున సంభవించు శరీరనైర్మల్యంబు సూచించుచందంబున నంధకారంబు విరిసె, నతని యంతర్గతానురాగంబు దీపించురూపం బెఱింగించు తెఱంగున బ్రాగ్దిశాభాగంబునఁ గెంజాయ పొడమెఁ దదనంతరంబ. ౧౧౪

క. జక్కవ లలరఁ, జకోరము
లెక్కుడుఁ, గమలములు విరియ, నొగిఁ గైరవముల్

స్రుక్క, సమస్తజనంబులు
మ్రొక్క, దిశలు వెలుఁగ భాస్కరుఁడు పొడతెంచెన్. ౧౧౫

వ. అప్పు డప్పుడమిఱేఁడు యథోచితకృత ప్రాతరనుష్ఠానుండై యమ్మునిశ్రేష్ఠునకు నెదురు సూచుచుండె నంత. ౧౧౬

క. తొలునాఁ డవ్విభు నచ్చో
నిలిపి చనినయోగిరూప నీరజనాభుం
డెలమి దశకొత్త లక్ష్మి
లలనాసహశయనకేళిలాలసగతులన్. ౧౧౭

చ. తెలుఁగుచు రంగధామమును జెంది విభావరి పుచ్చి, వేఁకువన్
వెడలి ప్రయాగ కేఁగి సురనిమ్నగయందుఁ బ్రభాతకృత్యముల్
సలిపి, నృపాలుపాలికిఁ దలంచినమాత్రన వచ్చెఁ గ్రేపుపై
నొలసినమక్కువన్ సురభి యుద్దవడిం బఱతెంచుచాడ్పునన్. ౧౧౮

వ. ఇట్లు చనుదెంచి యతని యవయవంబులయందుఁ దన పాదరేణువు చమరి యరోగదేహుండవు గమ్మని యనుగ్రహించిన. ౧౧౯

క. తొడిగినకుప్పస మూడ్చిన
వడువున నా రాజు మేన వపియించినయా
కడిఁదిరుజ లెల్లఁ బాసిన
నొడ లొప్పె సువర్ణభాతి నుజ్జ్వల మగుచున్. ౧౨౦

చ. కమలము నాచు వెల్వడి వికాసము నొందినయట్లు, మించుట
ద్దము తెర పుచ్చినట్టులు, సుధాకరబింబము కందు వాసిన
ట్లమరినకాంతి నొప్పె విగతామయభావ మెలర్ప; నమ్మహీ
రమణుని నెమ్మొగంబు రుచిరం బగు నేత్రమరీచు లొప్పఁగన్. ౧౨౧

క. తనమేను తాఁ గనుంగొని
మనమున నాశ్చర్యరసనిమగ్నుం డగుచున్
జనపతిప్రహృష్టమతి న
మ్మునిపతికి బహుప్రణామములు దగఁ జేసెన్. ౧౨౨

వ. అప్పు డమ్మునీంద్రుండు. ౧౨౩

ఆ. 'అడుగు మింక నెట్టి యభిలాష?' యనిన 'నా
కింతకంటెఁ గోర్కె యేమి గలదు?
స్వామి! యీకథాప్రసంగంబు వినువారు
నిరయరహితు లగుచు నెగడ నిమ్ము.' ౧౨౪

వ. అని జగద్ధితలబ్ధవరుండై యా భూవరుండు. ౧౨౫

ఉ. 'ఓమునినాథచంద్ర కరుణోర్జితచిత్త! త్వదీయదర్శనం
బేమి యొనర్ప లేదు? కడ యెవ్వరు గానఁగ లేరు నీమహ
త్త్వామృతవార్ధి, కే ననఁగ నల్పుఁడ, నెంతటివాఁడ, నార్తర
క్షామణి నీవు; నీకు సరి గల్గనె యెన్నఁడు నేజగంబులన్! ౧౨౬

ఉ. నీవు జగన్నివాసుఁడవు, నీకు సమస్తము నొక్కరూప; యి
ట్లై విలసిల్లుచుండియుఁ బ్రియంబు ప్రయాగము, హేమకూటమున్,
రా వగు రంగధామము ననంగలరావుల మూఁడు నంటి, ల
క్ష్మీవర! యందుఁ జొప్పడు విశేషము నాకు నుపన్యసింపవే! ౧౨౭

వ. అనిన దత్తాత్రేయుం డిట్లనియె. ౧౨౮

క. యాగంబుల నగుఫలమును
యోగంబులవలన నగు సమున్నతియును నా
నాగమవిహితార్చల నగు
భోగము శ్రీరంగసేవఁ బొలుపుగ నెగడున్. ౧౨౯

ఆ. అఖిలతీర్థఫలము నంతనంతం బగుఁ
గాని, రంగధామగామి యైన
యతని కొదవు నపునరావృత్తిసౌఖ్యంబు;
దీనిఁ బోల వితరతీర్థతతులు. ౧౩౦

వ. మఱియు హేమకూటమహత్త్వంబు చెప్పెద దత్తావధానుండవై యాక
ర్ణింపుము. ౧౩౧

చ. అజునకుఁ బైడికొండయు, సుధాంశుకళాకమనీయమౌళికిన్
రజతనగంబుఁ బోలె, ననురాగ మొనర్ప మదీయబుద్ధికిన్
సుజనవరేణ్య! వెండియును జూతుము విందుము గాని యిట్టి య
క్కజ మగు పర్వతంబు మఱి గల్గదు సుమ్ము ధరాతలంబునన్. ౧౩౨

క. తక్కటి నెలవులకంటెను
నొక్కటి లక్షయును గోటియును గుణితములై
యెక్కుడు ఫల మొసఁగుట నీ
చక్కటి కెవ్వోటివారుఁ జనుదెంతు రొగిన్. ౧౩౩

క. హరి హర విరించు లేకో
దరులయి పుట్టుటకుఁ దాన తానక మగుని
ర్భరపై చిత్రి కలదె పెఱ
గిరులకు నీ హేమకూటగిరికిం దక్కన్. ౧౩౪

క. కావున నీ పర్వతము ప్ర
భావము వర్ణింప వశమె బ్రహ్మాదులకున్
నీ వింక వినుము చెప్పెద
భూవల్లభ! యీ ప్రయాగభూరిగుణంబుల్. ౧౩౫

చ. అతులితభక్తి యొప్పఁగఁ బ్రయాగజలంబులఁ గ్రుంకునట్టిసు
వ్రతుఁడు పురాకృతాఘనికరంబులు సర్వముఁ బాఱఁ ద్రోలు ట
ద్భుతమె ప్రయాగ యంచుఁ బెఱతోయములందు మునింగెనేనియున్
క్షితి నతినిర్మలుం డగుట సిద్ధ మతండు ధరాతలేశ్వరా! ౧౩౬

చ. వెలయఁ బ్రయాగమందు నొక విప్రున కన్నములఁ బెట్టిరేని న
య్యలఘుఫలంబు కోటిగుణ మై యొదవుం; గ్రతు వాచరించినన్
దలకొని యాగభాగములు తార భుజించు కుతూహలంబునం
దొలఁగక దివ్యతేజములతోఁ జనుదెంతురు వేల్పు లందఱున్. ౧౩౭

చ. పరగఁ బ్రయాగ మాఘము ద్విపక్షములందుఁ బ్రహృష్టచిత్తుఁడై
పరువడిఁ దీర్థమాడుఘనపావనమూర్తి పునర్భవంబులం
బొరయఁడు, వాని వంశమునఁ బూర్వుల కెల్లను సంభవించు న
చ్చెరువుగ నాకలోకసుఖసిద్ధి యనేక సహస్రవర్షముల్. ౧౩౮

క. అచ్చుగఁ బ్రయాగలోపల
విచ్చలవిడిఁ దనదు మేను విడిచినమనుజుం
డొచ్చెల్ల! యేమి చెప్పుదుఁ
జెచ్చెరఁ గను నిష్టకామ్యసిద్ధి ధరిత్రిన్.' ౧౩౯

చ. అనవుడు నా నరేంద్రుఁడు ప్రియంబున నిట్లను నమ్మునీంద్రుతో
'నొనరఁ బ్రయాగయందు మృతి నొందినమానవుఁ డిష్టకామ్యముల్
గను నని యాన తిచ్చి తనఘా! యిట మున్న ప్రయాగయందు నీ
యనువునఁ గన్నవారు గల రయ్య! జగంబున నెవ్వ రేనియున్. ౧౪౦

వ. అని తదీయనిదర్శనాకర్ణన కౌతుకాయత్తచిత్తుండై యడిగిన ౧౪౧

ఆ శ్వా సాం త ము

చ. మృగనరవక్త్రవిగ్రహవిమిశ్రసముజ్జ్వల! విస్ఫురత్త్రయీ
నగశిఖరాధిరూఢ! భువనత్రయ పాలనతత్పరోల్లస
త్సుగుణగరిష్ఠ! దానవనిషూదన! శిష్టజనాభినందనా
నుగనుతివాక్యపూజితమనోజ్ఞపదద్వయ! వైష్ణవప్రియా! ౧౪౨

క. యోగీంద్రహృదయమందిర!
భోగీశ్వరభోగశయన! భూగగనదిశా
భోగపరిపూర్ణతేజ! ద
యాగుణమణిభూష! నిర్జితాశ్రితదోషా. ౧౪౩

మా లి ని

సజలజలదవర్ణా! సంతతానందపూర్ణా!
త్రిజగదభయకర్తా! దిత్యపత్యైకహర్తా!
వృజినవనకుఠారా! వీరశృంగారసారా!
సుజనగణహృదీశా! సూర్యకోటిప్రకాశా! ౧౪౪

గ ద్య ము

ఇది వాణీవరప్రసాదలబ్ధ వాగ్వైభవ తిక్కనామాత్యసంభవ
సుకవిజనవిధేయ అనంతయనామధేయ ప్రణీతం బైన
భోజరాజీయం బను కావ్యంబునందు
ప్రథమాశ్వాసము

—:o:—

* పావన.

శ్రీ

# భో జ రా జీ య ము

## ద్వి తీ యా శ్వా స ము

క. శ్రీనారీనయన చకో
రానంద సుధాంశుబింబ ! హరిదశ్వ సహ
స్రానూనతేజ ! నిర్జర
సేనా సంసేవ్యమాన ! శ్రీనరసింహా ! ౧

ఆ. అవధరింపు దేవ ! భవదీయ దివ్యాంశ
జనితుఁ డైన యత్రిసంభవుండు
నిజపదాబ్జరేణు నిర్మలదేహుఁడై
తనరు మహుని కిట్టు లనియెఁ బ్రీతి. ౨

భో జ చ రి త్ర

తే. 'అధిప ! చెప్పెద వినుము ప్రయాగమరణ
మిష్టకామ్యసిద్ధిద మగు టెల్లఁ. దొల్లి
వేదవేదాంగతత్త్వసంవేది యొక్క
విప్రవర్యుఁడు గలఁడు పవిత్రయుతుఁడు. ౩

చ. ధనరహితుండు, పుత్రసముదాయసమేతుఁ, డుపాయశూన్యవ
ర్తనుఁ డరయంగ నా ద్విజుఁడు, తత్ప్రియభామయు బుద్ధిహీన, జీ
వన మొనరింప నేర, దిలువాడ నెఱుంగదు, భాండశుద్ధి లే
దనిశముఁ బోరుచుండుఁ దదుపాత్త పురాకృతకర్మమో యనన్. ౪

తే. అతఁడు దిరుగనియూరును, నతనిచేత
నడుగఁబడనిమానవుఁడును, నతని చొరని

తోఁటయును జూడలేదు మందునకు నైన
నగవు గా దిది నిక్క మా నట్టునందు. ౫

క. ఆలిని బిడ్డలఁ బ్రోచుట
కై లాఘవవృత్తి కగ్గ మై నిర్ధనతా
ఖీలపయోధి మునుంగుచుఁ
దేలుచు దరి దాపు లేక తిరుగుచునుండెన్. ౬

వ. ఇట్లు సర్వశూన్యం బగు దారిద్ర్యదైన్యంబు సైరింపం జాలక సంసారంబు వలన విసివి, పంకనిర్మగ్నం బగు గోవునుంబోలె నమ్మహీదేవుండు తన్ను సముద్ధరింప దిక్కెవ్వరు లేక దుఃఖంబునఁ గృశశరీరుండై యుండఁ గొండొక కాలంబు సనుటయు నొక్కనాఁడు తన మనంబున నిట్లని చింతించె. ౭

ఉ. ఓలి గృహస్థధర్మముల నుండెడువానికి గ్రాసవాసముల్
చాలఁగఁ గల్గి పుత్రులుఁ గళత్రము సౌఖ్యము నొంద, బంధువుల్
మే లన నార్యకోటి మది మెచ్చఁగ నుండుట యుక్కి గాక యే
చాలును లేక యీ చెనఁటిజాలిఁ బడం బని యేమి చెప్పుమా. ౮

తే. కుడిచి కట్టినయునికి గా కిడుమఁ బడుచు
నింట నిట్లున్నఁ బురుషార్థ మేమి కలదు?
కడఁగి యిహ మైనఁ బర మైనఁ గాక తాన
యూరకుండుట నరునకుఁ బౌరుషంబె? ౯

ఉ. లావు గలంతకాలముఁ దొలంగక తాల్చితిఁ బెక్కుభంగులన్
జీవనభార, మిప్డు ముదిసెం దల ' యంచుఁ బరోక్షసాధనా
భావము నెమ్మదిం దలఁచి భవ్యపథంబున నిశ్చితాత్ముఁడై
యా వసుధామరుం డరిగె నయ్యఘనాశిని యైన కాశికిన్. ౧౦

వ. ఇ ట్లేఁగి. ౧౧

ఉ. నిచ్చలు గంగకుం జని వినిర్మలవారిఁ బవిత్రగాత్రుఁడై
వచ్చి శివాలయంబులును వైష్ణవధామములుం గ్రమంబునన్
జొచ్చి నమస్కరించుచును సువ్రతశీలుఁ డనంగఁ గాశిలో
మచ్చిక యుల్లసిల్లఁ బలుమాఱును బెద్దలయిండ్ల కేఁగుచున్. ౧౨

వ. *ఇట్లాపుణ్యతీర్థంబునఁ గొన్నిదినంబు లుండి యొక్కనాఁడు ౧౩

సీ. ప్రాణాంతికావస్థఁ బడినయప్పుడు గాని
కలుగదు సిద్ధి యీ కాశియందు
నంత చేయఁగఁ గల్గునవి తోలు వీరలుఁ,
బునుకపేరును, జటాభూతిధార
ణంబులు, భిక్షాటనముఁ, గపాలపుఁగోర-
భూతసంగతి, ప్రేతభూమియునికి;
యివి యేల నాకు, దుర్భేద్య దేశాంతర
మరిగినట్లగును నిశ్చితి నేని,

ఆ హీనదశకు నోడి యిలు డించి పరదేశ
మునకు నిట్లు వచ్చియును నపార
విభవ మొందకున్న వృథగాదె యనుబుద్ధి
నాతఁ డచటు వాసి యరిగె ననఘ! ౧౪

ఉ. వేగమ యేఁగి కాంచెఁ బృథివీసురముఖ్యుఁ డశేషయోగిసం
యోగము, లోకకల్మషవియోగముఁ జారుతరంగమాలికా
భోగసముత్థితాంబుకణపూర్ణసమీరణపాలితాష్టది
గ్భాగము, సన్మునీంద్రపరికల్పితయాగము నాప్రయాగముఁన్. ౧౫

వ. కని కరంబులు మొగిచి యిట్లని స్తుతించె. ౧౬

తే. ఉర్విపై నశ్వమేధి యగు గర్వ ముడిపి,
బ్రహ్మహత్యాపరుం డను భయము వాపి,
యొసఁగు సుకృతికిఁ బాపికి నొక్కగతియ
యన్యతీర్థము లేనయె ప్రయాగమునకున్. ౧౭

వ అదె దివిజాపగాజలము. అల్లదె యీ యమునోదకంబు లో
ధవళతయున్ వినీలతయుఁ దార్కొని చూడ్కికి వేడ్క చేసె మా
ధవసదనాంగణం బగుటఁ దత్పరిచారిక లర్థిఁ జందన
ద్రవమునఁ గ్రొత్తకస్తురిని దక్కక రేకలు పెట్టిరో యనన్. ౧౮

---

* ఇట్లు పు.వ్య.

క. గంగాయమునల విమల త
రంగంబులు ధవళచామరంబులు నసితో
త్తుంగబహుబర్హనివహము
నంగజజనకునకు వైచు నట్లొప్పెఁ గడున్. ౧౯

వ. అని గంగాయమునల సాంగత్యవిశేషంబులు గొనియాడుచు నందుఁ గృత
స్నానుండై యా ద్విజుండు. ౨౦

చ. అలికులవర్ణు, నున్నతరథాకృతిచారుసుపర్ణు, నిందిరా
లలితకుచోపగూహనసులక్షితవక్షుఁ, బయోరుహాక్షు, నా
కలితఘనప్రతాపుఁ, ద్రిజగన్నుతరూపు, నిజాంఘ్రిజాపగా
మలసలిలోద్వహస్ఫురదుమాధవుఁ గొల్చెఁ బ్రయాగమాధవున్. ౨౧

ఉ. చూపులు విష్ణుమూర్తులకు సొమ్ముగ, జిహ్వలు విష్ణుమూర్తియా
లాపసుఖంబుఁ జెందఁగఁ, దలంపులు విష్ణుమహత్త్వచింతకుం
బైపడుచుండ, నిట్లు లగు భాగవతోత్తమకోటిచే జగ
ద్దీపిత మైన యవ్విమలతీర్థమునం దతఁ డుండె వేడుకన్. ౨౨

వ. ఇట్లుండి యవ్విప్రుం డొక్కనాఁ డెప్పటియట్ల గంగాస్నానంబు సేయు
నప్పు డొక్క వనితాచతుష్టయం బచ్చటికి వచ్చి మరణోద్యోగంబున సంక
ల్పంబు చెప్పుకొనుచుండిన నతం డద్భుతాయత్తచిత్తుండై కనుంగొనుచుండె
నంత. ౨౩

చ. కనకపుఁగుప్పలు, న్మణినికాయములున్, ధనధాన్యరాసులున్,
వినుతగజాశ్వసంఘములు, విశ్రుతగోమహిషాదికంబులున్
దన కధికంబుగాఁ గలిగి దాతయు భోక్తయు నైనవాఁడు నా
కనయము భర్త గావలయు నం చొకభామిని కోరె వేడుకన్. ౨౪

చ. తనవదనంబు వాక్పతికిఁ దానకమై చెలువొందఁ, దన్నుఁ జూ
చినజను లందఱుం గవిత చెప్ప, సమస్తకళాకలాపముల్
దనవశమై తలిర్ప, సుచితజ్ఞుఁ డనంగఁ బొగడ్త కెక్కువాఁ
డనయము భర్త గావలయు నం చొకభామిని కోరె వేడుకన్. ౨౫

చ. అనుపమసంపదాఢ్యుఁడును, నంచితనిర్మలకోమలాంగుడున్
ఘనకవితారసోదయవికాసితచిత్తుఁడునై సమస్తభూ

జనపరిరక్షణక్షమతఁ జాలఁగ నొప్పి ధరిత్రి నేలువాఁ
డనయము భర్త గావలయు నం చొకభామిని కోరె వేడుకన్. ౨౬

చ. కనకశలాకవోని తనుకాంతియుఁ బున్నమచంద్రుఁ బోలు నా
ననవిభవంబుఁ, బద్మముల నవ్వు పరిస్ఫుట నేత్రరోచులున్
దన కమరంగ భావభవతంత్రములందుఁ బ్రవీణుఁ డైనవాఁ
డనయము భర్త గావలయు నం చొకభామిని కోరె వేడుకన్. ౨౭

వ. ఇవ్విధంబునఁ బునర్భవానుభవంబు గోరి. ౨౮

చ. తలకొని నాగకన్యకలు తత్తటినీతటి కేఁగుదెంచి వి
చ్చలవిడిఁ గేలి సల్పి నిజసద్మముఁ గ్రమ్మఱఁ జొచ్చుభంగిఁ బే
రెలమి దలిర్ప నా నలువు రిందువిభాస్యలు నాస్యమండలం
బులు వికసింప నయ్యుదధిపూరమునందు మునింగి రిమ్ములన్. ౨౯

ఉ. అంతయుఁ జూచి విప్రుఁడు ప్రియంబున నేనును నిట్లు చేసి యీ
కాంతలు నాకళత్రములుగాఁగ నభీష్టసుఖోపభోగమున్
గాంతు ధరిత్రిలో నని యకంపితచిత్తసరోజుఁడై యనా
ద్యంతుఁ బ్రయాగమాధవుఁ గృపాబ్ధిఁ దలంచి నమస్కరించుచున్. ౩౦

సీ దారిద్ర్యభూతంబు తనుఁ బాసి పోవు నీ
యుదకపూరము చొచ్చి యున్న ననియుఁ
బెద్దకాలము మేనఁ బెరిగిన పాపపం
కము లిందు మునుఁగక కరఁగ వనియు
నిది శుద్ధజలరాశి యిందులో వెదకినఁ
గోర్కిముత్యములు చేకూరు ననియు
నిందు డిందిన నల్వు రింతుల వెడలించి
గుఱిలేనికోర్కిఁ గై కొందు ననియు

ఆ నిట్లు తెగువ చేసె నీవిప్రుఁ డని కొని
యాడునట్లు గాఁగ నతఁడు మునిఁగెఁ
జటులదురితతిమిరపటలప్రచండమా
ర్తాండ మగుప్రయాగ[1]కుండమందు. ౩౧

1 గుండమందు.

ఉ. అంతఁ బ్రయాగమాధవుఁ డనంతదయానిధి పద్మవాసినీ
కాంతుఁడు వారికోర్కి యొసఁగంగఁ దదీయవరోపలబ్ధి య
త్యంతనిరూఢమై నెగడునట్లుగ విప్రుఁడు సూర్యకాంతభూ
కాంతునియందుఁ బద్మవతి గాదిలితల్లిగఁ బుట్టె మేదినిన్. 32

క. అవనితలు నొక్కొక వసు
ధావల్లభునందు సముచితంబగు ప్రాదు
ర్భావము నొందిరి భాగ్య
శ్రీవిలసితరూపములు ప్రసిద్ధికి నెక్కన్. 33

వ. ఇట్లు పుట్టి యాద్విజుండు భోజుం డనుపేరఁ బ్రసిద్ధుం డయ్యె, [1]నయ్యంగనారత్నంబులు నలువురును సుగంధి పద్మగంధి కనకవతి చంద్రప్రభ లను నన్వర్థనామంబులతో నతనికి భార్య లైరి; యివ్విధంబున నతండు వివిధవిభవవిలసితుండును, నత్యంతరూపసంపన్నుండును. సకలకళాప్రవీణుండునునై లాటదేశంబునందు ధారానగరంబున కధీశ్వరుండై యనేకవర్షంబులు రాజ్యంబు చేసె నట్లు గావునఁ బ్రయాగతీర్థం బిష్టకామ్యసిద్ధిప్రదం బని పలికితి' నని చెప్పిన. 34

చ 'విమలవిచార! నీవలన వింటిఁ బ్రయాగమహత్త్వమెల్లఁ ద
త్సముదిత[2]పూర్వపుణ్యఫలజన్ముఁడు భోజవిభుండు భూమియే
క్రమమున నేలె? వాఁ డటులు రాజ్యము సేయుదినంబులన్ విశే
ష మొకటి యెద్ది యేనియును సన్మునినాయక రూఢి కెక్కనే?' 35

చ. అనవుడు నాన్నపాలునకు నామహనీయవివేకశీలుఁ డి
ట్లను; 'మును భోజుఁ డాదినృపులట్టుల రాజ్యము చేసె, వాని వ
ర్తనము నుతింప నల్పుల తరంబె? మహిం జతురుత్తరంబుగాఁ
దనరిన షష్టివిద్యలు నతం డెఱిఁగింపక కల్గ వేరికిన్. 36

చ తనుఁ గనుఁగొన్నవారు కవితాఘను లౌదురు; తద్విశేష మెం
తని గుఱి పెట్టవచ్చు మనుజాధిప! యిన్నిటికంటె నెక్కుడిం
క నొకటి చెప్పెద న్వీను మఖండితమై యొకవిద్య వేరె నా
తనికి సమస్తభూజనకదంబము ప్రస్తుతి చేయునట్లుగన్. 37

1. నంగనారత్నంబులు. 2. పూర్ణ.

వ. అది యెయ్యది యంటేని. ౩౮

ఆ. మనుజు లెల్లవిద్యలను జొచ్చి సాధింపఁ
గలరు గాని లోహకులము నెల్లఁ
బసిఁడిఁ జేయువిద్య పడయ లే రెవ్వరు;
నట్టివిద్య భోజుఁ డభ్యసించె. ౩౯

వ. కావున నశేష విశేషంబులకు నతం డాశ్రయం బనుట వేఱ చెప్ప నేల! యతని చరిత్రంబు రామచరిత్రంబునుం బోలెఁ బవిత్రంబై యొప్పు, నతని కీర్తిలతాజాలంబునకు నాలవాలం బగు ధారానగరంబు మహిమ. ౪౦

ఉ. సారకవీంద్రవ్రాతకవిశాలహిరణ్మయవృష్టిధార, ని
స్సారదరిద్రధార తరుషండ విలాస కుఠారధార, సం
సారకృశానుతప్తజనశైత్యకరామృతధార గాక యా
ధార తలంప నన్యవసుధారమణీశ పురోపమానమే. ౪౧

సీ. ఆచారమున బ్రహ్మ నైనను నోడించి
పఱపంగఁ జాలు సద్బ్రాహ్మణులును
పరశురాముని నైనఁ బ్రధనవైముఖ్యంబు
నొందింపఁ జాలు రాజోత్తములును
నలకాధిపతితోడ నైన మచ్చరికించి
కొన నమ్మఁగల మేటికోమటులును
జట్టుపై నైన రాజనమును జెఱుకును
గావింపఁ గలమహాకర్షకులును

తే. మదపుటేనుంగుతో నైన మాఱుపెనఁగి
విఱుగఁ దోలంగ నోపెడువీరవరులుఁ
గడఁగి విజితేంద్రియుల నైనఁ గరఁగఁ జేయు
జారసతులును నప్పురిఁ జాలఁ గలరు. ౪౨

చ. సురపతిదంతిసంతతియొ, సూర్యునివాజుల *పాఁగెమో, పొరిం
బొరి నల కామధేనువునఁ బుట్టిన క్రేపుల తోయమో యనం

* పాగయో.

బిరుదడి నొప్పు నప్పురము భద్రగజంబులపెల్లు, నుల్లస
త్తురగచయంబుపెంపు, నవిదూషితగోనికరంబు పేర్మియున్. ౪౩

క. మొగి నాఱును దొమ్మిదియును
నగురసములఁ గలుగుబహుపదార్థంబులు బ్రా
తిగఁ జవి గొనవినరుం డా
నగరంబున నందు కడిగినం జొప్పడునే. ౪౪

ఉ. కైపద మిచ్చువారలును, గ్రక్కునఁ బద్యము చెప్పువారలున్
రూపితసంస్కృతాదిపదరూఢి యెలర్ప మహాప్రబంధముల్
వే పొసఁగంగఁ బల్కి పృథివిం బ్రథితంబుగఁ జేయువారు ధా
రాపురమందె కాక కలరా మఱి తక్కినపట్టణంబులన్! ౪౫

వ. ఇ ట్లొప్పు నప్పురంబున కధీశ్వరుండు. ౪౬

క. భోజుఁడు ప్రసన్నవదనాం
భోజుఁడు నిఖిలార్థికల్పభూజుఁడు విలస
త్తేజుఁడు సంభృతసుకవిస
మాజుఁడు రూపాదిజితరమాజుఁడు జగతిన్. ౪౭

సీ. అమరమహీజంబు లైదును నైదుభూ
తములుగాఁ గూర్చి దేహము సృజించి
యతనుఁడై చరియించు నంగజుప్రాణంబు
నెమ్మిఁ బ్రాణంబుగా నిర్వహించి
యదితికి దేవేంద్రుఁ డావిర్భవించిన
పుణ్యంపుఁబ్రొద్దునఁ బుట్టు వొసఁగి
భారతి దాదియై గారవం బారఁ బో
షించునట్లుగ నియమించెఁ గాక

ఆ. నలినభవుఁడు కానినాఁ డిట్టివితరణం,
బిట్టిరూపమహిమ, మిట్టివిభవ,
మిట్టివిద్య యితని కెట్లు గల్గె ననంగ
భూమిఁ బ్రణుతి కెక్కె భోజరాజు ౪౮

క. బలిరాజ్యము, రామమహీ
తలపతిరాజ్యంబు, ధర్మతనయునిరాజ్యం
బిల నెట్టి దట్ల భోజుని
సలలితరాజ్యంబు సర్వసౌఖ్యములందున్. ౪౯

క. భ్రాజితమణిభూషాంబర
రాజివలన సమవిభావిరాజితు లగుటన్
భోజునియోలగమునఁ గవి
రాజుల రాజులను దెలియరా దెవ్వరికిన్. ౫౦

క. ఆపృథివీపతిధర్మం
బేపాటియు కాని యాతఁ డేలెడుధరలో
నేపట్టునఁ బొడగానము
యూపస్తంభములు లేని యూరొకచోటన్. ౫౧

చ. చతురత, నీతిపెంపునఁ, బ్రసన్నత, నున్నతవిద్యలందు, ధీ
రత, సుకుమారతన్, సుకవిరాజసమాజసమాశ్రయక్రమా
ద్భుతరతిఁ, గాంతిఁ, దేజమున, ధూతకళంకత, నెన్ని చూడఁగన్
నితఁ డొకరుండ పో నృపుల కెక్కుడు నాఁ దగుభోజుఁ డెప్పుడున్. ౫౨

చ. జనవర! భోజుఁ డట్లఖిల సమ్మతుఁడై ధర యెల్ల నేలుచున్
విను మొకనాఁడు జ్ఞానగుణవిశ్రుతుఁ డాధరణీతలేశ్వరుం
డనుపమసత్త్వశాలి మృగయారతిఁ గాననభూమి కేఁగి కాం
చనరసలిప్తపుంఖశరసంహతిఁ గ్రూరమృగాళిఁ గూల్చుచున్. ౫౩

క. తురగజవంబున మృగములఁ
బొరిగొని తమకమున నలపు పుట్టినయంతః
కరణముతో నతిదూరము
నరుగ నరుగ నెదుర నొక మహాటవిలోనన్. ౫౪

తే. అఖిలవిపినంబులకుఁ దన్న యాధిపత్య
మునకుఁ బట్టంబుగట్టినయనువు దోపఁ

---

* గానగుణ.

దరువితానంబుతో నెల్లఁ దాన యతివి
గూఢమై యొప్పు నొక్క న్యగ్రోధతరువు ౫౫

క. ఆయుర్వీరుహశిఖర
చ్ఛాయ పథశ్రాంతి దీర్ప, సరభసమున భూ
నాయకుఁడు సుఖాసీనుం
డై యుండి తదీయవిభవ మిటు గనుఁగొనుచున్. ౫౬

చ బలితపుశాఖయందుఁ బదపద్మయుగంబుఁ బెనంచి పార్శ్వశా
ఖలఁ గరకాండముల్ చొనిపి కన్నులుమోడ్చి యధోముఖాబ్జుఁడై
తలకొని వ్రేలుచున్న యొక తాపసిఁ గాంచె విభూతిభూషణో
జ్జ్వలుఁ డగువాని భోజనృపసత్తముఁ డావటభూరుహంబుపైన్. ౫౭

చ కని యితఁ డెవ్వఁ డొక్కొ యిటుగాఁ గతమెయ్యది యొక్కొ పిల్చినం
గినియక పల్కు నొక్కొ పరికించెదఁ గా కనుమాన మేల యి
మ్మునివరు నంచు హస్తములు మోడ్చి శిరంబునఁ జేర్చి భోజుఁ డా
నన మొకయింత యెత్తి నయనద్యుతి సంపద యొప్ప నిట్లనున్ ౫౮

క. వటతరుశాఖాలంబిత
పటుతరచరణ మగు మీ తపశ్చరణము దు
ర్ఘటనము మీ రెవ్వరు మీ
కటాక్షలాభంబు నాకుఁ గానఁగ వలయున్, ౫౯

వ, అనిన నతండు వినియు విననియ ట్లుండిన. ౬౦

ఉ. భోజుఁ డదేమి యొక్కొ మునిపుంగవుఁ డేఁబిలువంగఁ బల్కఁ డీ
భూజమహోన్నతిం బలుకు పొందదొ వీనుల నిట్లు గాక తా
నేఁజగడంబు నొల్లక తదేకమతిం దప మాచరించువాఁ
డై జనభాష లేమి విన నంచు గణింపఁడొ యంచునిట్లనున్ ౬౧

క, అన్యుఁడ గాను భవాదృశ
మాన్యుఁడ భోజుఁ డనుపేర మహిఁ బరగినరా
జన్యుఁడ ననుఁ జూడగదే
ధన్యుఁడ నయ్యెద ననిన నతఁడు ప్రీతుండై. ౬౨

వ, కను విచ్చి చూచి యి ట్లనియె. ౬౩

తే. అధిప! పెఱయాశ్రమస్థుల కందఱకును
విను గృహస్థాశ్రమమువాఁడె వెలయ నూఁత
యట్టి గృహమేధులకుఁ గీదు పుట్టకుండఁ
గామకర్తలు రాజులు గారె యరయ. ౬౪

క. ఏతన్మాత్రమహీపతి
వే తగవును ధర్మమును నహింసారతియున్
నీతియు ననఁగల యీగుణ
జాతము నీయంద కాదె శాశ్వత మయ్యెన్. ౬౫

క. ఏకచ్ఛత్రముగా భూ
లోకము పాలింపు బంధులోకముఁ గరుణం
జేకొని ప్రోవుము సజ్జన
లోకము మన్నింపు శత్రులోకవిదారీ. ౬౬

శా. నీ బాహాపరిరక్షణంబున గదా నిర్విఘ్నమైమా తపం
బేబాధం బడ కిట్లు చెల్లుట ధరాధీశా! గిరీశం ద్రిలో
కీబంధుం గరుణారసార్ద్రహృదయుం గీర్వాణవంద్యున్ దృఢ
ప్రాబల్యంబునఁ బట్టి యేఁ దప మొనర్పం గంటి నిశ్శంకతన్. ౬౭

క. నీవును నీ మంత్రులు నా
నావిధసుభటులును నేఁడు నా యింటికి ని
ట్లీవేళ నతిథు లయితిరి
గావున నాతిథ్య మిచటఁ గయికొన వలయున్. ౬౮

చ. అని తరుశాఖ డిగ్గి యతఁ డాతని నల్లనఁ జేరవచ్చినన్
గనుఁగొని భక్తిపూర్వకము గాగఁ బ్రణామ మొనర్చి మోడ్పుఁగే
లొనరఁగ నో మునీంద్ర! భవదుజ్జ్వలనామ మెఱుంగఁ జెప్పవే
యనవుడుఁ బిన్ననవ్వు వదనాబ్జమునం బొడమంగ ని ట్లనున్. ౬౯

క. ఒక పేరును నొక యూరును
నొక కులమును ననఁగఁ గలదె యోగీశ్వరజా
తికి? నయినను దాఁపగ నే
టికి సర్వటి యండ్రు నన్నొడికముగఁ బెద్దల్. ౭౦

చ. అని యుచితప్రసంగముల నానరనాథునిఁ బ్రీతుఁజేసి యా
తనిమది కిద్భుతం బొదవ దాఁచినచోటి పదార్థసంఘముల్
గొని చనుదెంచునట్లు మునికుంజరుఁ డాక్షణమందె తెచ్చె న
య్యనిమిషధేనుసంస్మరణమం దొడఁగూడిన యట్టిభోజ్యముల్. ౨౧

క. అట్టిది కాదె తపస్వుల
కెట్టిపదార్థములు ప్రాతియే నిస్పృహులై
యిట్టుండుదు రట్టుండుదు
రెట్టుండిన వారి నోరుల కేమన వచ్చున్. ౨౨

వ. ఇట్లు సద్యస్సంకల్పితంబు లగు నభిమతాహారంబులు దెచ్చి యారాజునకు నమాత్యభృత్య సమస్తసైన్యంబునకుఁ దృప్తి గావించిన నారాత్రి యంద యుండి మఱునాఁడు ౨౩

క. తెలతెలవాఱఁగ భూపతి
వల నొప్పఁగఁ బ్రాతరుచితవర్తనములు వే
సలుపుచు సర్పటి కిట్లను
వలయును మత్పురికి రా నవశ్యము మీరల్. ౨౪

వ. అని ప్రార్థించి పలికిన నానరేంద్రునకు నమ్మునీంద్రుం డిట్లనియె. ౨౫

తే. అధిప! మాబోటితపసుల కడవి నుండి
కూరగాయలు నమలుచు వీరఘోర
తపము సేయుచు నునికి యుక్తంబు గాక
చెలగి నగరప్రవేశంబు సేయ నగునె? ౨౬

క. నావుడు సర్పటితో నతఁ
డీవిధమున నాన తిత్తురే మీరు మదీ
యావాసం బిది వే ఱొక
రావే యి ట్లవధరింపుఁడా తెలియంగన్. ౨౭

క. ఏ మీ శిష్యుఁడఁ గానే
నామీఁది కృపాతిశయమునం జనుదేరం
గా మీకుఁ జనదె సందియ
మేమిటి కని పలుక నాతఁ డెంతయుఁ బ్రీతిన్. ౨౮

ఆ. మేలు గాక పొందఁడు మీమాట లేనిటఁ
ద్రోహ చేయఁ జాల మీపురమున
కరుగుదెంతు ననిన నౌఁ గాక యని గంధ
సింధురాధిరూఢుఁ జేసె నతని. ౫౯

క. దివిజగణంబులు గొలువఁగ
ధవళాశ్వము నెక్కి చనుశతక్రతుగతి న
య్యవనీశ్వరుండు వివిధా
హవవీరులు గొలువ నుత్తమాశ్వము నెక్కెన్. ౬౦

వ. ఇట్లు సర్వటిం దోడ్కొని చని త్ర్యంబకసఖుండగు కుబేరుండునుం బోలె నాధీశుండు వివిధవిభవోదారుం డగుచు నిరంతరాలంకారసారం బగు ధారానగరంబు ప్రవేశించునప్పుడు. ౬౧

సీ. భూచక్రమునఁ గల రాచబిడ్డల కెల్లఁ
దిలక మై పుట్టినచెలువుఁ డితఁడె
కర్ణాదిదాతల కథ లెల్ల మఱపించి
పేరు గాంచిన దానశూరుఁ డితఁడె
సారంబులగు చతుష్షష్టివిద్యలకును
దాన తానక మగు ధన్యుఁ డితఁడె
దనమోముఁ జూచిన జనుల కెల్లఁ గవిత్వ
సరణిఁ జేకుఱఁ జేయు చతురుఁ డితఁడె

తే. నిఖిలరాజన్యమకుటమణిప్రభావి
భూషితాంఘ్రిపద్ముం డగుభోజుఁ డితఁడె
యనుచుఁ గొనియాడుపౌరుల హర్షభాష
లంబునిధిఘోషమునకంటె నతిశయిల్లె. ౬౨

వ. ఇటు సమస్తజనంబులకు నయనపర్వంబు నిర్వహించుచుండం జని యేనుంగు మొగసాల చొచ్చి యానరేంద్రుం డఖిలపరివారంబు నుచితప్రకారంబున వీడుకొల్పి సర్వటి నొక్క వీడుపట్టున విడియింపను, నతనికి నర్హసత్కారంబు లాచరింపను నాప్తజనంబుల నియమించి యశ్వావతరణంబు చేసి యంతఃపురంబున కరిగి మజ్జనభోజనాదులు సల్పి యథార్హవిహారంబుల దినశేషంబు గడపి రాత్రి యగుడు. ౬౩

శా. ఆవేశన్ వివిధాశ్రితవ్రజచకోరానందుఁడై విస్ఫుర
ద్భావుండై విలసత్కలాకలితుఁడై భగ్నీకృతారాతిభూ
పావష్టంభతమస్కుఁడై కువలయాహ్లాదప్రదుండై యశ
శ్శ్రీవిభ్రాజితచంద్రికుం డయి తనర్చెన్ భోజరా జున్నతిన్. ౭౪

సీ. సంగీతవిద్యాప్రశస్తమానసులతోఁ
గూడి వినోదించుఁ గొంత దడవు
సాహిత్యవిద్యావిశారదాత్మకులతోఁ
గూడి వినోదించుఁ గొంత దడవు
నృత్తవిద్యాకళాయత్తచిత్తులతోడఁ
గూడి వినోదించుఁ గొంత తడవు
వాద్యవిద్యానిరవద్యభావకులతోఁ
గూడి వినోదించుఁ గొంత తడవు

ఆ. శబ్దశాస్త్ర మంత్రశాస్త్ర ధనుశ్శాస్త్ర
తురగశాస్త్రవిదులతోడిగోష్ఠి
నడుపుఁ గొంతతడవు నయశాస్త్రవేదులఁ
గూడి మాటలాడుఁ గొంతతడవు ౭౫

చ. దళ మగు హంసతూలనిజతల్పమునందు నిజప్రియాంగనా
లలితకుచోపగూహనములన్ మధురాధరపానలీలలం
దలకొని యంగముల్ పులకితంబులుగా సుఖియించు నవ్విభుం
డెలమి దలిర్పఁ గొంతతడ విఖశరాసనుఁ గ్రేణిసేయుచున్. ౭౬

వ. మఱియు నెవ్వేళ నెయ్యది కర్తవ్యం బట్టి కృత్యం బప్రమత్తుం డై యొనర్చు నప్పుడమిఱేనికి నిమిషార్థంబును నిరర్థకం బయి పోవ దిట్లు నిశాసమయ ధర్మంబులు చెల్లుచుండ నక్కడ సర్పటి సిద్ధుండు. ౭౭

క. నను నీతఁడు వేడుకపడి
కొనివచ్చెను, వీనితోడి గోష్ఠికిఁ దగులై
యునికి తగ; దితని కొక మే
లొనరించి యధేచ్ఛఁ జనుట యుక్తము నాకున్. ౭౮

వ. అని తలంచి పంచలోహకల్పితంబగు నతని కొలువు చవికె సువర్ణంబు
గావించుటకు నం దున్నదీపశిఖపయి నొక్క యౌషధం బెవ్వరు నెఱుంగ
కుండునట్లుగా వైచి యక్షేచ్ఛం జనియె నంత సూర్యోదయంబగుడు ౭౯

ఉ. మంగళపాఠకధ్వనులు మాగధగీతులు వందిబృందము
ప్పొంగి యొనర్చుసంస్తుతులుఁ బూర్ణపయోధిరవంబుచాడ్పునన్
సంగత మై శ్రుతిద్వితయసౌఖ్య మొనర్పఁగఁ జేర్చి భూమిభృ
త్పుంగవుఁ డార్యసమ్మతుఁడు భోజుఁడు మేల్కనియెం బ్రియంబునన్. ౮౦

క. అతఁ డట్లు మేలుకని య
చ్యుతుసంస్మృతియందుఁ దగిలి శుభలక్షణల
క్షితము లగు నిజకరాంభో
జతలంబులు చూచుచుండు సమయమునందున్. ౮౧

చ. వనధికిఁ బుట్టి నొండె హిమవద్గిరికిం బ్రభవించెఁ గాని యీ
ఘనకుచ యన్యసంజనిత కా దనఁగాఁ దగుకాంత యొ ర్తుకాం
చనమయపాత్రికన్ సురభిచందనపుష్పఫలాదివస్తువుల్
గొని చనుదెంచి చూపుమెఱుఁగుల్ వెదచల్లుచు మ్రోలనిల్చినన్ ౮౨

వ. భాగ్యదేవతాయత్తంబు లగునర్థంబు లాత్మాయత్తంబులు గావించునట్లు
భక్ష్యంబు లగు తదీయద్రవ్యంబు లంగీకరించి యారాజశేఖరుండు. ౮౩

సీ. పాదపద్మంబులఁ బసిఁడిపావలు మెట్టి
సముచిత మందయానమున వెడలి
శౌచి యై వార్చి సుస్థలమునఁ బ్రాఙ్ముఖుం
డుగ సుఖాసీనుఁడై పుణ్యకాష్ఠ
మున దంతధావనం బొనర మౌనస్థుఁడై
చేసి సుస్నాతుఁడై శిఖయు ధౌత
వస్త్రంబు నుత్తరావాసంబు గోపికా
చందనంబును దన కంద మొంద

ఆ. నాచరించె వైదికాచారవిధు లెల్ల
దాన మొసఁగె విప్రతతులఁ బిలిచి

భూమిధాన్యరత్నహేమగోమహిషాశ్వ
వస్త్రభూషణాది వస్తుచయము. ౯౫

ఉ. అంతఁ బ్రసూనగంధవివిధాభరణాదులు దాల్చి యమ్మహీ
కాంతుఁడు రాజచిహ్నాలఁ బొగ డ్త వహించి సమస్త మంత్రిసా
మంతపురోహితాప్తభటమండలి గొల్వఁగ వేత్రహస్తు లం
తంతన చూచి పాయుఁ డనునట్టి యెలుంగులువింగి ముట్టఁగన్. ౯౬

వ. భూలోకపాలనలాలసుం డగు త్రిదశపాలుండునుం బోలె నమ్మహీపాలుండు వివిధవిభవశీలుం డగుచుఁ గక్ష్యాంతరంబులు గడచి కొలువుకూటంబునకు నరుగునవసరంబున నిద్దఱు భృత్యు లెదుర వచ్చి భయభక్తియుక్తంబు లగు చిత్తంబు లుత్తలపడుచుండఁ బ్రణామంబు లాచరించి యిట్లని విన్నవించిరి

క. దేవర పెట్టిన చోటం
గావలి యుందుము మొకించుకయు నాలస్యం
బేవంకను లేదు ధరి
త్రీవర! కడు మోసపోయితిమి విను నిన్నఁటా. ౯౭

ఆ. "ఏమి దైవికంబొ యెఱుఁగ, మెవ్వారును
జొచ్చి వెళ్ళినట్టిచొప్పు లేదు;
పంచలోహమయవిభాసితం బగు మన
యనుఁగుమేడ పసిఁడి యయ్యె" ననిన. ౯౮

క. "వింటిమి మీచేఁ గ్రొత్తలు,
కంటిమె లోహంబు లెందుఁ గనక మగుట య
య్యింటికి నిట్టిమహిమ యెటు
వంటిమహాత్మకునిచేత వర్తిల్లె నొకో!" ౯౯

వ. అని వలుకుచుం దన మేనును బరిజనంబుల మేనులును గలయ నవలోకించి.

క. పసుపున నానినచీరలు
ముసుఁగు పడినయట్లు దేహమునఁ బీతరుచుల్
పొసఁగినయవి కనకగృహము
పసిమియె కాకున్నె యని నృపతి వెఱఁ గందెన్. ౧౦౧

వ. ఇట్లు వెఱఁ గందుచుఁ బోయి సౌవర్ణగేహంబుఁ జూచి చోద్య మంది. ౧౦౨

చ. ఇది కడు నద్భుతం బిచట నెవ్వఁ డొకో యిటు వేసి పోయె, స
మ్మదమున నొక్కదివ్యుఁడు విమానగతుం డయి వచ్చి యిచ్చమై
నది యిట డించి, * యీచవికె యాదటఁ దాఁగొనిపోయె నొక్కొ యె
య్యది కత యొక్కొ హేమమయమై యిటు లుండుట యొక్కరాత్రిలోన్.

చ. అని తలపోసి యాచవికెయందు వెలుంగు ప్రదీపవహ్నియుం
గనుఁగొని సర్పటిం దలఁచి కంటి నతం డిటు ధూమవేధివే
ననువుగఁ జేసినట్టి పరమాద్భుతకృత్యముగాఁగ నోపు, నా
యన యెటు పోయెనో వెదకుఁడా యని భోజుఁడు సంభ్రమంబుతోన్ ౧౦౪

క. తన పరమాప్తులఁ బంపినఁ
జని పుర మంతయును వెదకి సర్పటి నెచ్చో
టను గానక క్రమ్మఱి వ
చ్చినఁ బశ్చాత్తాపతప్తచిత్తుం డగుచున్. ౧౦౫

వ. సర్పటి యున్న వటశాఖియొద్దకు భటులం బంచిన వారును నట కేఁగి నెమకి వచ్చి యాతనిం గాన మని విన్నవించి యరిగిన. ౧౦౬

ఉ. ఆతఁడు దాను నిచ్చటికి నాదటతోఁ జనుదెంచునట్టి ప్ర
ఖ్యాతపుమార్గ మేమిగతిఁ గల్గు నొకో యని వింత వేసి యా
భూతలనాయకుండు తన బుద్ధి నుపాయ మొకండు గాంచి య
జ్ఞాతవిధంబునందు నది సాధ్యము చేయఁ దలంచి నేర్పునన్. ౧౦౭

ఆ. 'శబ్దభేది గలదు చర్చింప భోజభూ
పాలునగర' ననుచుఁ బట్టణమునఁ
జాటఁ బంచె నంత సకలదేశముల న
వ్వార్త మించె నెల్లవారలకును. ౧౦౮

సీ. అట్లు కర్ణాకర్ణి నవ్వార్తవిని భూమిఁ
గలసిద్ధు లెల్ల నయ్యలఘువిద్యఁ
బరికించువేడుక నరుదెంచుచుండంగ
నవనీశ్వరుండు రహస్యవృత్తి

---

* యాచవికె.

నప్పెంఁడిమేడ దా విప్పించి యొక్కొక
ప్రతికి నూఱును వేయి ప్రతులు గాఁగఁ
గప్పెర లాతంబు ఘనకమండలువులు
మొదలుగా నన్నియు మున్న వేసి

ఆ. యితరు లెఱుఁగకుండ నిది యెవ్వ రేమి దె
చ్చినను వానిఁ బుచ్చుకొని తొలంగ
వైచి యిచ్చుఁ దన సువర్ణకల్పితములు
బొంకు నిక్క మయ్యె భోజుమతము ౧౦౯

క. వారును దమ తెచ్చినయవి
బోరనఁ దనవిద్యవలన భోజుం డిచ్చో
గారవముఁ జేసి మా కిం
పారఁగ నిచ్చె నని సుముఖులై చనుచుండన్. ౧౧౦

తే. తీర్థముల కేఁగున ట్లెల్లదేశముల జ
నంబులును భోజవిభునిఁ బ్రియంబుతోడఁ
జూడ నరుగంగ సర్పటి చోద్య మంది
నెమ్మి నిట్లని తలఁచుఁ జిత్తమ్మునందు. ౧౧౧

చ. వెలయఁగ శబ్దభేది యనువిద్య జగంబున భోజరాజుచేఁ
గల దఁట, వాఁడెపో నృపనికాయముకెల్లను మేటి, వానిచేఁ
గలుగుట యేను మున్నెఱుఁగఁ గాని, యెఱింగినఁ బుచ్చుకొందు నాఁ
డెలమి దలిర్ప నప్పురికి నేఁగినయప్పుడ మిత్రభావనన్. ౧౧౨

ఆ. ఇంక నైన నచటి కేఁగి యానరనాథ
చంద్రుచేత నున్న శబ్దభేదిఁ
బుచ్చుకొనఁగవలయుఁ బొలుపార నాచేత
నున్నభ్రామవేధి యొసఁగి యైన. ౧౧౩

ఉ. తక్కువజాతియందు వనితామణియున్నను, నీచమర్త్యునం
దెక్కువవిద్య వొప్పడిన, నెంగిలిచోట సువర్ణ మబ్బినన్
చక్కక పెన్విషంబున సుధారస ముండిన గ్రాహ్య మండ్రు; వాఁ
డొక్కమనుష్యమాత్రుఁడె మహోన్నతుఁ డున్నతరాజపూజ్యుఁడున్. ౧౧౪

వ. అదియునుం గాక. ౧౧౪

చ. గురునకు సేవ చేయుట దగుం దగువిద్యఁ బరిగ్రహింపఁగా;
నరుదుగ నర్థ మిచ్చి పడయందగు నొండె, సువిద్య యిచ్చి వి
స్తరముగ విద్య గైకొనుట దా నొక పక్షము, మూఁడుదీరులం
బరగుట దక్క నాలవయుపాయము లే దని చెప్పు శాస్త్రముల్. ౧౧౫

క. కావున నాతనివేఁ గొన
గా వచ్చును నిట్లు నాదు ఘనవిద్యయు నా
ఘావరున కొసఁగ వచ్చును
బో వలయును భోజరాజపురమున కనుచున్. ౧౧౬

వ ధారానగరంబున కేతెంచి భోజరాజుచే సత్కృతుం డై యి ట్లనియె. ౧౧౭

తే. 'అది వేఁటమై వచ్చి మీ రల్లనాఁడు
మట్టికడ నన్నుఁ బొడగని మాటలాడి
పరఁగఁ దోఁకొని రారె మీపట్టణమున
కేను సర్పటి యనువాఁడ నెఱుఁగవయ్య! ౧౧౮

వ. మీకుఁ జెప్పకపోవుటంజేసి నాఁటికొఱంత వాపికొన వచ్చితి.' ననిన న
న్నరేంద్రుండు పెన్నిధిఁ గన్న పేదయుం బోలె నత్యంతసంతుష్టాంతరంగుండై
పునఃపునః * ప్రణౌమంబులు చేసి యి ట్లను, 'నీశ్వరేచ్ఛ గదా! దీని కేది
కొఱంత? నామీఁది కారుణ్యంబునఁ గ్రమ్మఱ నిట్లు వచ్చుటంజేసి నామనో
రథంబు సఫలం బయ్యె' నని యనేకవిధంబుల నూఱడించిన నాసన్న్యాసియు
నతనిగుణవిశేషంబులు గొనియాడి యి ట్లనియె. ౧౧౯

చ. తిరిగితిఁ బెక్కు దేశములు దేవ! భవత్సముఁ డైన మేదినీ
శ్వరుఁ బొడఁగాన, నీకు వశవర్తినియై విలసిల్లు నట్టిధా
సుర మగు శబ్దభేది యను చోద్యపువిద్య తదీయలక్షణం
బరయఁగ వేఁడి యేను ప్రియ మారఁగ వచ్చితి నిందు భూవరా! ౧౨౦

క. అల నాఁడును నీవిద్యా
జలనిధి లోఁ దెలియఁగలేక చపలాత్ముఁడనై

* ప్రణామంబు

తొలఁగితి నే; నటు లుండఁగ
వలదే రాజ ననువాఁడు వసుమతిలోనన్. ౧౨౨

క. సిద్ధులలోపల నెల్లఁ బ్ర
సిద్ధుఁడు సర్పటి యనంగఁ జేయుదు నను స
ద్బుద్ధి గల దేని, నాకుఁ బ్ర
వృద్ధం బగు శబ్దభేదివిద్య యొసఁగుమా! ౧౨౩

క. ఏనును నిచ్చెద నీకు న
నూనం బగు ధూమవేధి యొప్పుగ' ననినన్
'గానిండు మీరు పెద్దలు
గానఁ దొలుత నాకు నొసఁగఁ గావలయుఁ జుఁడీ! ౧౨౪

క మఱి నా కన్నఱెఱంగున
నెఱిఁగించెద నాదువిద్య యేర్పడ' ననినన్
దెఱఁ గేది భోజభూపతి
కఱిముఱిఁ దనవిద్య చెప్పి యతఁ డి ట్లతియెన్. ౧౨౫

ఉ 'చెప్పితి నాదువిద్య [1]యఱ చేయక నీదగువిద్య యేర్పడం
జెప్పుము నాకు' నావుడును జెన్నగుమోమునఁ గొంత వింత న
వ్వొప్పఁగ భోజుఁ డిట్టు లను 'నొచ్చెల నే నొక విద్యవాఁడనే
[2]తప్పఁగఁ జి త్తగింపకుఁడు, తద్విధ మే నెఱుఁగ న్మునీశ్వరా!' ౧౨౬

క. అనిన విని యేటిమాటలు
ఘనతర మగు శబ్దభేది గలుగుట లేదే
జననాథ! మున్న నీచే'
ననవుడు విని భోజుఁ డిట్టు లను నాతనితోన్. ౧౨౭

ఉ మించగువిద్య భోజునకు మేదినిపైఁ గల దన్నశబ్ద మొ
క్కించుక నీదు వీనుల వహించినమాత్రన [3]నీ మనంబు వే
ధించుటఁజేసి యిందుఁ జనుదెంచితి గావున శబ్దభేదినా
నంచిత మైనవా ర్త గల దంతియ కాని యెఱుంగ నెద్దియున్. ౧౨౮

---

1. యర. 2. తప్పఁగ. 3. నా.

ఉ. నావుడు నిట్లు పల్కఁ దగునా? ధరణీశులు మీరు, సిద్ధవం
శావళివార మేము, నిజ మాడుము చాలును, విద్య లేనివా
రీవిధి నెల్లవారలకు నిత్తురె కాంచనకల్పితంబు లే
లా వెడమాట లీ చెనఁటిలాగున మాకును గోప మయ్యెడిన్.' ౧౨౯

వ. అని ధట్టించి పలుకునప్పు డక్కఱకుందపసి కడకన్నులం బొడముకెంపు గని కంపించుచు నమ్మహీనాథుండు చేతులు మొగిచి 'నాకు మీచేతి ధూమవేధి సిద్ధించుటకు నిట్టి కపటోపాయంబు చేసితి, నాతప్పు మన్నింపవలయు' ననుచు మదకుంభి కుంభస్థల స్ఫర్శన కర్కశంబు లగు తనహస్తంబుల నతనిపాదంబులు పట్టుకొనఁ బోవుటయు నతండు కోపంబు డింప నోపక యడిచిపడుచుఁ దొలంగి యంతంత నిలిచి యి ట్లనియె. ౧౩౦

క. 'రాజ వని నిన్ను నమ్మితి
భోజుఁడు ధర్మాత్ముఁ డనుట బొం కయ్యెఁ గదే
యోజ చెడ నిట్లుచేఁత ప్ర
యోజనమే వలయు ననిన నొసఁగనె నీకున్. ౧౩౧

ఉ. న న్నడకించి యొడ్డరితనంబున నాదగువిద్య నీవు గై
కొన్న సహింప నేర్తునె, తగుం దగు లెస్స విచార మయ్యెఁ బో
ము న్నటు మేలుమే లనఁగ మూర్ఖుఁడవై ధనకాంక్షఁ గాదె యీ
పిన్నతనంబు చేసి తిది పెద్దలు మెత్తురె రాజధర్మమే? ౧౩౨

వ. కావున నీవు చేసిన యపరాధంబునంజేసి నీ వనపత్యుండవు గమ్మ' ని శపియించె ౧౩౩

చ. అనవుడు నమ్మహాండు వినయానతుఁడై మునినాథుతోడ ని
ట్లను 'మును సిద్ధు లెవ్వరును నారయ సర్పటిభంగి మోసపో
యినవిధ మెన్నఁడున్ విన మదేమి నిమిత్తమొకో యతండు చే
సిన కపటప్రసంగమునఁ జిక్కుట' నావుడు నాతఁ డి ట్లనున్. ౧౩౪

వ. 'దీని కొక్క కారణంబు గల దాకర్ణింపుము' 'దొల్లి రంభవోలె మిక్కిలి చక్కనిదగు నొక్క వారవనిత గలదు. ౧౩౫

క. ఆవనిత యొక్కనాఁ డొక
దేవాలయమునకు నరిగి దేవుఁడు తనకా

భావంబునఁ బొడచూపిన
కైవడి నొకసిద్ధుఁ డుండఁగాఁ బొడగనియెన్. ౧౩౬

క. కని ప్రణమిల్లిన నాతఁడు
తనతో భాషింపకున్నఁ దాఁ దొలఁగక శం
భునిఁ బురుషభిక్ష మడుగం
జనుదెంచిన రతియపోలె సన్నిధి నుండెన్. ౧౩౭

క. ధ్యానానంతరమునఁ బర
మానందవిజృంభితాక్షుఁ డై సిద్ధుఁడు 'బా
లా! నీ వెవ్వరి దానవు?
నీ నాథుం డెవ్వఁ డేల నిలిచితి విచటన్?' ౧౩౮

వ. నావుడు నాసిద్ధునకు నమ్మగువ యిట్లను 'నేను వేశ్యాధర్మంబున జరించుదాన, నిమ్మహాదేవునకు నమస్కరింప వచ్చి యిచ్చట మిమ్ముఁ గని దండప్రణామంబు చేసి మీకటాక్షం బపేక్షించి యున్నదాన' ననవుడు నతండు ప్రీతుండై చేరం బిలిచి నొసలు నిండ విభూతి పెట్టి దీవించిన 'నయ్యా! మదీయావాసంబునకు విచ్చేయ వలయు' నని యచ్చెలువ ప్రార్థించిన. ౧౩౯

క. 'ఊరు చొర నొల్ల నేను, శి
వారాధనతత్పరుండనై నెలఁ బదినా
ళ్ళీరమ్యం బగు దేవా
గారంబున నుండువేడ్క గదిరెడు నాకున్. ౧౪౦

ఉ. బాలకి పొమ్ము' నావుడుఁ దపస్విపదాబ్జయుగంబుమీఁద నీ
లాలకజాలము ల్నెరయ నాయలికుంతల సాఁగి మ్రొక్కి క్రొ
వ్వాలినకన్మెఱుంగుల నివాళి యొనర్చి రతీశమత్తఖం
డాలము నోజ బింకపునడల్ బెడఁగొందఁగ నేఁగి భక్తితోన్. ౧౪౧

క. నాఁడుమొదలుకొని యాపూఁ
బోఁడి యనారతముఁ దెచ్చి భోజన మిడఁగా
నేఁడొక్కటి చనునంతకు
వాఁ డక్కడ నుండు నుచితవర్తనలమెయిన్. ౧౪౨

వ. అంత నతం డక్కాంతతో నొక్కనాఁ డేకాంతంబున నిట్లను 'నేను నీతాత్ప
ర్యంబునకు మెచ్చితి, నీ కొక్క చోద్యంబగు విద్య యిచ్చెదం గొను' మని
యనుగ్రహించి. ౧౪౩

ఆ. ఔషధములు చెప్పి, యవి గూర్చువిధమును
జెప్పి దీపవహ్ని శిఖలమీఁద
నైవ ధూమవేధ వలన లోహంబులు
హేమ మగుతెఱంగు లెఱుఁగఁ జెప్పి. ౧౪౪

క. సిద్ధుఁడు చనుటయు నింత ప్ర
బుద్ధచరిత్ర యగు తోడఁబుట్టినసతి కా
శుద్ధి యెఱిఁగించి యౌషధ
సిద్ధి పడయుపనికిఁ జింత చేయుచు మదిలోన్, ౧౪౫

ఉ. కన్నులు లేనివాఁ డొకడు గల్గినఁ జాలు, నతండు నూరఁగా
నన్నియు మార్పవచ్చు నొరు లెవ్వరు దీని నెఱుంగకుండఁ బ్ర
చ్ఛన్నపుఁజేఁతభంగి సువిచారము సు మ్మని యొక్కరాత్రి యా
సన్నముఖాబ్జ లై మిగులఁ జప్పుడుగాని రహస్యభాషలన్, ౧౪౬

క. ఆలోచింపఁగ సర్వటి
యాలో భిక్షమున కరిగి యాపలుకులు దా
నాలించి దానికిం దగు
కీలు విచారించి మగిడెఁ గృత్రిమభంగిన్. ౧౪౭

క మఱునాఁడు విగతచక్షుని
తెఱఁగున నొక పంచఁ జేరి దీనత దోఁపం
గొఱ మాలిన యొకపెంచిక
యఱచేతం బట్టికొని నతానునఁ డగుచున్, ౧౪౮

తే. 'కపటిఁ (?) జుం డన్న యిటు నటుఁ గదలలేని
వాఁడఁ జుం డన్న యో భాగ్యవంతులార!
పుణ్యసతులార! నన్నుఁ గారుణ్యబుద్ధి
నరసి యుదరాగ్ని యార్పుఁడీ!' యనుచు మండ. ౧౪౯

క. అప్పొలఁతి చూచి నయనము
[1]లొప్పెడుకమలములు వోలె నున్నవి, యిది యే
చొప్పో కానం డట యితఁ
డప్పా! యిట వచ్చి చూడు మని చూపుటయున్. ౧౫౦

క. చూచి యితం డగుఁ బో మన
చూచినపని కనుచు వానిచూపుల సత్వం
బేచందమొ యని తెలియం
జూచుటకయి పెంచిలో నశుద్ధము కలియన్. ౧౫౧

ఉ. వైచినఁ బ్రత్యయార్థముగ [2]వాఁ డది ప్రీతి భుజింపఁ బోయినం
జూచి కరంబు పట్టుకొని శుద్ధము కన్నులు చెడ్డవాఁడకాఁ
జూచుచుఁ జెట్ట పట్టుకొని స్రుక్కక యింటికిఁ దెచ్చి నవ్వుచున్
వాచవు లైన భోజ్యములు వానికిఁ బెట్టుచు నే ర్పెలర్పఁగన్. ౧౫౨

ఆ. వలయుమందు లెల్ల వానిచే నూరింప
నతఁడు తోడుతోన యన్నిక్రియలు
నెఱిఁగి యొక్కనాఁడు తెఱవసమ్ముఖమున
నిలిచి నేత్రరుచులు నివ్వటిలఁగ ౧౫౩

ఉ. 'సింధురయాన! యేను నినుఁ జెంది కృతార్థుఁడ నైతి. నన్ను నీ
వంధునిఁగాఁ దలంచి యిటు లన్నియుఁ జూపఁగ, నీప్రసాదసం
బంధము పేర్మిఁజేసి పరిపాటి నెఱింగితి ధూమవేధి యే
నంధుఁడఁ గాను సిద్ధుఁడఁ జు మమ్మ! వధూమణి! పోయి వచ్చెదన్' ౧౫౪

క. అనవుడు సిగ్గును గోపం
బును మదిఁ బెనఁగొనఁగ 'మోసపోయితిన కదా!
నను నితఁ డిట్లు ప్రమోషిం
చినదానికి మాఱు చేయఁ జెల్లదె' యనుచున్. ౧౫౫

ఉ చేతులు మోడ్చి నిల్చి తనచిత్తము నైక్యము చేసి 'మద్గురుం
డాతతసత్యశాలి యగు టారయ విక్రమ యయ్యె నేని నే

---

1. లొప్పెడు చెలువంబు వలెను నున్నవి. 2. వాఁడతిప్రీతి.

రీతి నితండు న న్నొఱఁగి రిక్తకు రిక్త గ్రహించె విద్య; యీ
రీతినె మోసపోయెడు ధరిత్రి నితం' డని పల్కె నల్కతోన్. ౧౫౬

క. అది కారణముగ సర్పటి
విదితంబుగ మోసపోయె విను, మని సతతా
భ్యుదయుఁడు దత్తాత్రేయుఁడు
మొదలిటికారణము తెల్లముగఁ జెప్పుటయున్. ౧౫౭

చ. విని మహుఁ డమ్మునీంద్రునకు వేడుక నంజలి చేసి 'యో కృపా
వననిధి! నీ ముఖంబున నవారణమై వినఁ గంటి శ్రోత్రరం
జన మొనరింపఁజాలెడు ప్రసంగము; లప్పుడు సిద్ధుఁ డల్గి భో
జనృపతిఁ దా శపించి మఱి శాపవిముక్తి యొనర్చెనే తుదిన్?' ౧౫౮

చ. అనపుడు శాంతి నొందుటకు నారయ నెట్టిఫలంబు మీరు స
జ్జనులు గదయ్య! కోపము ప్రసాదము గల్గుట యొప్పుఁ గాక కో
దన నితరుండు చాలఁడె మహాపురుషా! యనపత్యుఁ డైవాఁ
డొనరఁగ నూర్ధ్వలోకముల యుక్తుఁడు గాఁ డని చెప్పు శాస్త్రముల్. ౧౫౯

ఉ. పాండువిభుండు సన్మునులపజ్జఁ జనం జన నమ్మునీంద్రు లిం
దుండి యపుత్రవంతులకు నొందఁగ రా, దివి దివ్యభూము, లీ
వుండుము, నావుడున్ మగిడి యుల్లము డిల్లము చెంద నవ్విభుం
డొండొక ధర్మమార్గమున నొప్పుగ సంతతి నిర్వహింపఁడే! ౧౬౦

ఉ. కాన మనుష్య లూర్ధ్వగతి గాంచుటకుం దగుసాధనంబు సం
తానము, యట్టి సంతతి య తప్పునయేని ధనంబు లేల? నా
కీనిఖిలావనీభరము నేల? శరీరసుఖంబు లేల? నీ
తోన చరింప వత్తు ననుఁ దోఁకొని పొమ్మని వెచ్చ నూర్చుమన్. ౧౬౧

వ. ఉండె నప్పుడు సర్పటి. ౧౬౨

చ. 'వలవనిదుఃఖ మేలఁ జనవల్లభ! మర్త్యుఁడు దానధర్మముల్
సలుపఁగ నూర్ధ్వలోకములు సాధ్యము గా వెటు? కన్నబిడ్డలే
గొలుపుగఁ దన్ను సద్గతికిఁ బుత్తురె? యీ వెడబుద్ధు లేల? నా
పలుకు దృఢంబుగా వినుము పార్థివశేఖర! లెమ్ము నెమ్మితోన్ ౧౬౩

క. అనవుడు 'మీయట్టిమహా
త్మున కెవ్వరు వలదు గాక, మునుకొని గృహధ
ర్మనిరూఢుఁడ నగు నాకుం
దనయులు వల దయ్యః రిత్త తర్కము లేలాః ౧౬౪

క. అరయ సంసారమునకు
దారాపత్యములు గావె తగునంగము లిం
పార నవి లేనిపురుషుని
పే రెవ్వఁ డెఱుంగు? వాని పెం పేమిటికిన్? ౧౬౫

ఆ. దివియ లేనిగృహము తెఱఁగున సంతాన
రహితుఁ డైనవాని బ్రతుకు చూడఁ
గదు నిరర్థకంబు గాదెః నావుడు నతఁ
డతనితోడ నిట్టు లనియె నధిప! ౧౬౬

ఆ. 'సుతుఁడు, నిధియు, వనముఁ, గృతియు, నల్లిల్లును,
గుడియుఁ, జెఱువు ననఁగఁ బుడమియందు
సంస్తుతింపఁ బరగు సప్తసంతానముల్
గలవు కీర్తిసుకృతకారణములు. ౧౬౭

తే. తొలుత నిందులోఁ బుత్రుండు తొలఁగె నేని
నున్నయాఱును నేలోక మొసఁగఁ జాల
వధిపః యిన్నింటిలోపల నధిక మరయఁ
గృతియ చూ నిత్యకీర్తికి గతియుఁ గాన. ౧౬౮

క. తొల్లిటిపెద్దల చరితలు
తెల్లంబుగ నేఁడు మనకుఁ దెలియుట ధరణీ
వల్లభ! యిటు వినుమా! యిల
సిల్లుకృతులవలన నగుట సిద్ధము గాదే ౧౬౯

ఉ. ఆర్వురు చక్రవర్తులుఁ బదార్వురు రాజులు నేఁటివారలే?
యుర్వి బహుప్రకారముల నొప్పుగఁ బాలన చేయరే? గుణా
ఖర్వులు వారలుం జనిరి కాదెః తదీయయశంబు లెల్లెడం
బర్వుట సత్కవీంద్రఘనభాషితసత్కృతిమూలమే కదా. ౧౭౦

క. కావునఁ గృతు లొనరింపం
గా విద్వజ్జనులఁ బంపు గారవ మెసఁగన్;
దేవాలయములుఁ జెఱువులుఁ
గావింపుము, ధనము లిమ్ము! కడు పేదలకున్' ౧౭౧

చ. అనవుడు భోజుఁ డిట్టు లను నక్కట! భూజను లెల్లవారలున్
దనయులముద్దుఁజేఁతల సుధారసపానము చేసినట్లు నె
మ్మన మలరంగ సౌఖ్యరసమగ్నులుగాఁ గనుఁగొంచు ముచ్చటల్
దనుకగ నెవ్విధంబున నలందురుచుండెడువాఁడఁ? జెప్పుమా!' ౧౭౨

ఉ. నావుడుఁ 'బుత్రమోహము ఘనంబుగ నున్నది రాజుడెందమం
దేవిధిఁ దేర్చువాఁడ? నతఁ డేమని తేర్చినఁ దేరఁ డక్కటా
నావచనం బమోఘమయినం దగ నొక్కతెఱంగు చేసి యీ
భూవిభుకాంక్షఁ దీర్తు నని బుద్ధిఁ దలంచుచు సిద్ధుఁ డిట్లనున్. ౧౭౩

క. 'ఓ రాజ! నాదువాక్యం
బేరూపున బొంకుఁ బొరయ దీవును సంతా
నారూఢి బుద్ధి వదలఁగ
నేరవు విను మొకవిధంబు నీ కొనరింతున్. ౧౭౪

క. నీవు గదా యిప్పుడు నా
చే విద్యాసంగ్రహంబు చేసితి కపట
ప్రావీణ్యంబున; నిది నీ
చే వినువారలకుఁ బంపు చేయక యుండున్. ౧౭౫

సీ. ఉర్వీశ! వినుము విద్యోపదేశము చేయు
వాఁడు తండ్రియుఁ గొనువాఁడు సుతుఁడు
నని చెప్పుదురు పెద్ద లటు గాన నీకు నే
తన్మూలమైనసంతానకరణి
లేకుండు, నది నెపంబై కాని శాపంబు
తుది డిందుపడఁగ నేరదు, తదీయ
దోషంబువలన ముక్తుఁడవుగా నొందుపా
యము లేదు గాన, నీయనువు నెనయఁ

తే. దగ విచారించి చేసితి, దానఁజేసి
పుత్రవంతుఁడ వగుము పవిత్రచరిత!
యోడకుండుము నీ' వని యూఱడించి
మనుజవిభుతోడ సర్పటి యనియె మఱియు. ౧౭౬

సీ. బొంకెడుపురుషునిఁ బొంద నొల్లదు లక్ష్మి
తొల్లింటి సిరియును దొలఁగి పోవు;
బ్రహ్మహత్యాదిపాపము లెన్ని యైనను
నిల నసత్యంబుతో నెత్తు రావు,
మద్యపానము చేయ మరగినాతనికంటెఁ
గీడు సు మ్మనృతంబు లాడువాఁడె:
యూర్ధ్వలోకముత్రోవ యుడిగించి యధమలో
కప్రాప్తి గావించుఁ గల్లతనము,

ఆ. కాన నింతనుండి మానవేశ్వర! నీవు
నిత్యసత్యనిష్ఠ నెఱపు మయ్య!
సత్యమందె నిలుచు సర్వలోకములు, స
త్యవ్రతంబుకంటెఁ దపము లేదు. ౧౭౭

క. ఇప్పుడు నీకును నాకును
జొప్పడిన వివాదమునకు శోకింపకు, నీ
తప్పున నై నది గా దిది
యప్పరమేశ్వరుఁడు మూల మఖిలంబునకున్. ౧౭౮

క. అని బోధింప నతఁడు దన
మనము శరత్కాలసరసిమాడ్కిఁ బ్రసన్న
త్వనిరూఢంబుగ నాతనిఁ
గనుఁగొని యి ట్లనియె వినయగౌరవ మెసఁగన్. ౧౭౯

క. 'మీకరుణఁజేసి వంధ్యత
లేక మదీయోదరము ఫలించినఁ జాలున్
నా కంతియ పదివేలు, ని
రాకులమతి నైతి' ననియె నని చెప్పుటయున్. ౧౮౦

క ఆకర్ణించి మహీంద్రుడు 'ప్ర
భాకరసమతేజ! నీకృపం బుణ్యకథల్
నాకు విన నయ్యె భోజుం
డేకరణిం జరించె సిద్ధుం డే మైం జనియెన్.' ౧౮౧

వ అని తదనంతరకథాకర్ణనోత్సుకుం డయి యడిగిన. ౧౮౨

చ. సరసిజనాభ! భక్తజనసంచితపుణ్యఫలప్రదాన! వా
గ్వరనుతపాదపంకజ! జగన్నివహాభయదానభూమ! మం
దరగిరిమూలమండిత! రథాయితచారుఖగాన్వయేశ! శం
కరరమణీసదాస్మరణ కారణ నిర్మల నామశోభితా! ౧౮౩

క గర్వితహిరణ్యకశిపు వ
పుర్విదళనకరణఘననిపుణనఖనికరా
పూర్వాయుధ! కరసంభృత
సర్వాయుధ! దురితతిమిర చండమయూఖా! ౧౮౪

మత్తకోకిల

నీలనీరదచారుకోమలనిర్మలాంగ! విజృంభితా
భీలదానవమానమర్దన! భీమనక్రగృహీతశుం
డాలభీతినిరాస! ఘోరకురారలూనసమస్తభూ
పాలకానన! సన్మునీశ్వరపాలనా! నరకేసరీ!

గద్యము

ఇది వాణీవరప్రసాదలబ్ధవాగ్విభవ తిక్కనామాత్యసంభవ
సుకవిజనవిధేయ అనంతయ నామధేయ ప్రణీతంబైన
భోజరాజీయంబను కావ్యంబునందు
ద్వితీయాశ్వాసము

—: o :—

శ్రీ

# భోజరాజీయము

## తృతీయాశ్వాసము

శ్రీరమణీకుచకుంకుమ
సారారుణవిపులవక్ష జలజదళాక్షా!
మారశతకోటిసుభగశ
రీర! నిగమగిరివిహార! శ్రీనరసింహా! ౧

వ అవధరింపుము దత్తాత్రేయ మునీంద్రుం డన్నరేంద్రున కి ట్లనియె. ౨

ఆ. అట్లు నిష్కళంకుఁ డై భోజుఁ డనఘ! యాఁ
కొంటి రీ నిరర్థగోష్ఠిఁ దగిలి
యారగింపకుండ లే రింత తడవు బా
లురును యోగివరులు సరియ కాన. ౩

క 'ఇంతకు మీ కోడం డ్రౌన
రింతురు భోజనము నాకుఁ బ్రియ మయ్యెడు మీ
బంతిఁ బ్రసాదము గొనఁగా
నంతఃపురమునకుఁ బోద మరుదెం డనియెన్.' ౪

క. అతఁ డట్లు తన్నుఁ బిల్చుడు
నతఁ డిట్లను నతనితోడ 'నయ్యా! నీయా
నతి యిది యిట్టిద యగు; మ
ద్వ్రతపద్ధతి వినుము చెప్పెదం దెలియంగన్. ౫

ఉ. చేయుదుఁ బంచభిక్ష, యిటు చేయుట నానియమంబు, మీరు వి
చ్చేయుఁడు వేళ యయ్యెను భుజింపఁగ' నావుడు భోజుఁ డి ట్లనున్

'బాయక దీన మీకు వ్రతభంగము గా దిది యేకభిక్షగాఁ
జేయుఁడు నేఁడు మాచనవుఁ జేకొని మద్గృహమందు' నావుడున్. ౬

తే. 'పంచభిక్షయు నాహారపరత లేక
యునికియును నొక్కరూప కావున నరేంద్ర!
వ్రతము పూనితి గురునాజ్ఞ వదల రాదు
వలదు పొం' డని సిద్ధుండు పలుకుటయును ౭

తే. 'ఎచట మీరెఱుఁగనిధర్మ మేమి గలదు
వినుఁడు మీతోడ మా టొండ వెఱతుఁ గాని
పూనియొండులప్రార్థన భోజనంబు
సదుపవాసంబుగాఁ జెప్పు శాస్త్రచయము.' ౮

వ అనిన సర్పటి యి ట్లనియె. ౯

క. 'అది యట్టిద యగు నైనను
విదితంబుగఁ బంచభిక్ష విడువక కొనువా
రది యుడిగి యొక్కభిక్షకు
మది చొనుపుదు రయ్య! యెంత మచ్చిక యైనన్. ౧౦

క. అనవుడు నవ్విభుఁ డి ట్లను
'ననఘా! భిక్షాశనంబ యత్యంతముగాఁ
గొనియాడెద రం దయ్యెడు
వినుతవిశేషంబు నాకు వినిపింపుఁ దొగిన్.' ౧౧

సీ. అనిన నిట్లను సిద్ధుఁ 'డధిప! భిక్షాశి ని
రాహారుఁ డని చెప్పు నాగమంబు
అది యప్రతిగ్రహం బై చెల్లు నె ట్లన్న
దృష్టంబు చెప్పెదఁ దెలియ వినుము
నయమునఁ బుష్ప మేమియుఁ గందకుండఁగ
మధుసంగ్రహము చేయుమధుకరంబు
కరణి గృహస్థు లెవ్వరును వేసరకుండ
నపరాహ్ణసమయంబునందుఁ జేయు

తే. భిక్ష మాధుకరం బనుపేరఁ బరగుఁ
గాన నది భూమి నప్రతిగ్రహము నయ్యె
నది నిరాహారసంకోశ మదియుఁ గాక
యొకవిశేషంబు చెప్పెద నొనర వినుము. ౧౨

క. ఈ నియమంబున భిక్షయు
మానుగఁ గొను పరమయోగిమహిమలు చెప్పం
గా నేల యతని కిడునది
దా నొక్కటి కోటిఫలము తప్పదు గృహికిన్. ౧౩

వ, అని సర్పటిసిద్ధుండు చెప్పిన విని భోజనరేంద్రుండు ముకుళీకృతకరారవిందుం డగుచు నిట్లనియె, 'గృహపతికి నతిథిం గడపుట యతినింద్యంబుగా విందు, నిది యేమి చందం బానతి' మ్మనిన నతం డతని కిట్లనియె 'మనుష్యుండు పుట్టినగోలె నిడుమలం బడి గడియించిన యొడమి పుడమిఁ దలిగి గడియ దడవులోన నాడగోలు గొన శక్తుం డగునట్లు గృహాగతుం డగు నతిథి తిరస్కృతుండై యతని పూర్వార్జితసుకృతంబు లన్నియు నపహరింపఁ జాలు, నట్లు గావున. ౧౪

క. మానుగ గృహి మధ్యాహ్న
స్నానముఁ జేసినది మొదలు సద్ధర్మరతిం
దా నశనము గొనునదితుద
గా నతిథికిఁ బెట్టవలయుఁ; గాదు గుడువఁగన్. ౧౫

క. వినుము విశేషించియుఁ బురు
షుని భోజనవేళ నతిథి క్షుత్పీడితుఁడై
చనుదెంచి గ్రాస మడిగినఁ
దనముందటి యశన మైనఁ దగు నొసఁగంగన్. ౧౬

పుష్పగంధి కథ

క. ఈ సదృశార్థమునకు నితి
హాస మొకటి గలదు విను నృపాగ్రేసర! పృ
థ్వీసతి ముఖతిలకంబు న
దీసంయుత మగు కళింగదేశమునందున్. ౧౭

సీ. పుండరీకం బను పుర మొప్పు నప్పురం
బున కధీశ్వరుఁడు ప్రభూతయశుఁడు
సంపాతి యనురాజు సద్గుణశీలుఁ డా
చారవంతుఁడు నిత్యసత్యధనుఁడు
చర్చింప శ్రీరామచంద్రుతో నెనవచ్చు,
నితరులతరముగా దతనిఁ బోలఁ;
నట్టి భూతలనాథు నర్ధాంగశోభిని
వర్ణితరూపలావణ్యసదన

ఆ. చంద్రరేఖ యనఁగ జానకిఁ బోలు న
ప్పడతి వంధ్యయగుడుఁ బ్రార్థివేంద్రుఁ
డధికనిష్ఠ నభవు నర్చించి సంతాన
మడిగె నవ్విభుండు నట్ల యొసఁగె. ౧౮

క. పరమేశ్వరుఁ డట్లొసఁగిన
వరప్రసాదమునఁ జేసి వసుధాధిపశే
ఖరుఁడగు సంపాతివలనఁ
గర మొప్పఁగఁ జంద్రరేఖ గర్భిణి యయ్యెన్, ౧౯

వ. అంత నవమాసంబులుఁ బరిపూర్ణం బగుటయు నొక్క పుణ్యదివసంబునందు

క. విమలపయోనిధివీచీ
సముదిత యగు లక్ష్మిపోలె సౌందర్యాద్యు
త్తమలక్షణలక్షిత యై
కుమారి యుదయించె రాచకోమలి కెలమిన్. ౨౧

క. సుతయుదయవేళ నయ్యెడు
వితతశుభాశుభము లెఱుఁగ వేఁడి ధరిత్రీ
పతి యడిగినఁ జెప్పెఁ బురో
హితుఁడు గ్రహస్థానములు నిరీక్షించి తగన్ ౨౨

ఉ. 'ఇప్పటివేళ చూడ మనుజేశ్వర ! తక్కిన గండదోషముల్
చెప్పఁగ లేవు, భావిఫలచిహ్న మొకం డటు చిత్తగింపుఁడా !

యిప్పడతిం గరగ్రహణ మెవ్వఁడు చేసె నతండు లేఁ డగుం
దప్పదు బ్రహ్మరాక్షసుకతంబునఁ దొమ్మిదినాళ్ళనాఁటికిన్. ౨౩

క. అని చెప్పినఁ గర్ణద్వయ
మును జూఁడినచంద మైన మూర్ఛాగతుఁడై
జనవిభుఁడు కొంతతడవున
కు నొకించుక తెలిసి యెలుఁగు కుత్తుక దగులన్, ౨౪

సీ. కొడుకు పుట్టెడు నని కొండంత యాసలో
నుండంగఁ దుదిఁ గూఁతు దుద్భవించె,
నది యైనఁ గన్నులయెదుర నెమ్మది నున్న
నుల్లంబు గొండొక యూరడిల్లుఁ,
బరమేశుఁ డిదియును బట్టక పోఁ జేసె
నట్టినందన యీఁగి యరయ నెద్ది
సంతతి లేనినాఁ డింత యెఱుంగము
కడపట దుఃఖంబు గట్టెఁ దెచ్చి

ఆ. యేమి చేయువాఁడ, నిమ్మహాదురవస్థ
నెట్టి భంగి నపనయించువాఁడ'
ననుచు వగవఁ దొడఁగె నారాజపుంగవుఁ
డరుల కైన నాత్మ నడలు వొడమ. ౨౫

క. అంతయుఁ గనుఁగొని విప్రులు
'వింతలె భూజనుల కరయ విధికృతములు, మీ
రింతటి పనికై యే లొకొ
చింతించెద రయ్య ధీరచిత్తుల రయ్యన్ ౨౬

క. తనయోత్సవసమయం బిది
జననాయక! నీకు శోకసమయమె వగవం
బని లేదు లెమ్ము శీఘ్రం
బున నడుపుము జాతకర్మములు సకలంబున్. ౨౭

ఉ. ఇం కొకనాఁడు వచ్చుపని కిప్పుడు యింత దలంక నేల? మీ
వంకఁ గృపావిధేయుఁ డగువాఁ డొకపుణ్యుఁడు గల్గె నేని న

య్యంకిలి దీర్ప కున్నె' యని యందఱుఁ జెప్పినఁ జింత దక్కి యా
పంకజపట్టణాధిపుఁడు బాలికఁ జూచి కృతార్థకృత్యుఁడై ౨౮

వ. పట్టణం బలంకృతంబు సేయించి భూసురాశీర్వాదంబులతోఁ బుణ్యాహంబు చేసి పుష్పగంధి యను * నామంబిడి సుఖం బుండునంత దాదులు పెనుప శైశవవినోదంబుల ముద్దు సూపుచు నాపుష్పగంధి రూపవిలాసవిభ్రమంబుల జిగి దళుకొత్తఁ బెరిగి చెలికత్తియలం గూడి బొమ్మపెండ్లిండ్లు సేయుచు భాగ్యప్రదంబు లగు నోములు నోముచు మఱియు వివిధవిహారంబులు సలుపుచుండ నిజపుత్రీలాలనలాలసుం డగు నమ్మహీనాథుండు తద్వయోరూపంబులకు ననురూపంబులగు విద్యావిలాసంబు లభ్యసింప నియోగించిన. ౨౯

ఉ. భారతి యొండె నొండె నల పార్వతిగాని తలంచి చూడ నీ
నీరజనేత్ర యొక్క ధరణీపతిపుత్రికమాత్ర గాదు వో
ధారుణి నంచు సజ్జనకదంబము మెచ్చఁగ, సాక్షిభూత యై
చేరి గురుండు చెప్ప నతిశీఘ్రము మెలర్ప గ్రహించె నేర్పునన్, ౩౦

క. పాటయుఁ, జదువును, వ్రాతయు,
నాటయు, వాద్యంబు నాదియగు విద్యలకున్
మేటి యని పొగడఁ దగియెడు
పాటిగఁ దా నభ్యసించె బాలిక పేర్మిన్, ౩౧

వ. అంత నొక్కనాఁడు దనకూఁతు విద్యావిశేషంబులకు సంతోషంబు నొంది గాఢాలింగనంబు చేసి మస్తకంబు మూర్కొనుచుం దొడపై బెట్టుకొని తన మనంబున. ౩౨

ఉ. పెంపు దలిర్ప నీతరుణి పెండిలి చేసితిమేని నల్లునిం
జంపును బ్రహ్మరాక్షసుఁడు, చాలము తద్దురవస్థ యేము వీ
క్షింపఁగ; నింక మాకుఁ బరికింపఁ దనూభవయుం దనూజుఁడున్
సొం పెసలారఁగానిదియ చు మ్మని నిశ్చితవృత్తి నుండఁగన్ ౩౩

సీ. బాలికజఘనంబు ప్రబలెఁ దోరంబుగ
వెడవిల్తు నేకాంతవేది యనఁగ

* నామకరణంబిడి

నెలనాగ నూగారు నేర్పడి కడు నొప్పెఁ
బంచబాణుని మీనుపడగ యనఁగ
ముదితలేఁజన్నులు మొన లెత్తి బలసె నం
గజుఁ డేలు మేటిదుర్గము లనంగఁ
గన్నియనిడువాలుఁగన్నులు మెఱుఁ గెక్కె
నతనుని క్రొవ్వాఁడి యమ్ము లనఁగ

ఆ. నతివనడపు మెఱసె రతిరాజుసాధన
గతు లనంగ, విమలకమలనేత్ర
పలుకు లమరె భావభవు మంత్రసారంబు
లనఁగ నాఁడునాఁటి కంద మగుచు. 34

క. ఆ నయనము లా నునుఁగురు
లా నగుమొగ మా మృదూక్తు లా గాంభీర్యం
బానడుపు లా విలాసము
లా నెలఁతకె యొప్పు నొరుల కలవడ వెందుఁన్. 35

ఆ. అంత నత్యంతరూపసత్కాంతులందుఁ
బువ్వువిల్కానిఁ బ్రోచు నా పుష్పగంధి
జవ్వనముతోన నిలఁ గల యవ్వనంబు
లెలమిఁ బొంద వసంత మి ట్లేఁగుదెంచె. 36

ఉ. అట్టి వసంతవేళఁ గుసుమాపచయోత్సుకబుద్ధి నెమ్మదిం
బుట్టఁగఁ బుష్పగంధి తనబోఁటులు దానును బూర్ణచంద్రు తోఁ
బుట్టినయట్టి కాంతిగల ముద్దుమొగంబు నెలర్ప నందెలున్
మట్టెలు దట్టమై చెలఁగ మందగతిం జని యవ్వనంబునన్. 37

ఉ కంతుని పూజ సేయుదము కాంచనపుష్పచయంబు లీవు, సే
వంతులు నీవు, నీవు విరవాదులు, పొన్నలు నీవు, నీవు వా
సంతిక, లీవు గొజ్జఁగులు, చంపకమంజరు లీవు దెమ్ము, మా
వంతు సరోరుహంబు లని వావిరిఁ గోయఁదొణంగి రందఱున్. 38

వ. ఇట్లు పుష్పాపచయాపదేశంబున నా రామలారామం బంతయుఁ దమమయంబ
కా విహరించి సరసాలాపంబులు నెఱయ మెఱయుచుండఁ గ్రమక్రమంబున.

ఉ. నీరధిఁ గాలకూటము జనించినయ ట్లరుదెంచె గ్రీష్మ మి
ద్ధారుణిఁ, గృత్తివాసుఁ డది దాఁ గబళింపఁ గడంగుభంగి నే
పారెఁ బయోదవేళ, సుర లంతట సంతస మందినట్టు లం
భోరుహజృంభణం బమరఁ బొల్చె శరత్సమయంబు పెంపునన్. ౪౦

క. మడుఁగులు, బావులు, కొలఁకులు
వడి వెట్టిన యమృతరసము వడువున నిండా
రెడునిర్మలజలములచేఁ
గడు రమ్యంబు లయి జగతిఁ గడుఁ బొగ డొందెన్. ౪౧

వ అ య్యవసరంబున ౪౨

క. సలిల విహారక్రియలకుఁ
దలకొనుమదితోడ నృపసుతారత్నము నె
చ్చెలిపిండుతోడ నా పు
వ్విలుతుని [1]దీమంబు వోలె వెలువడి యొకచోన్. ౪౩

చ. చిగురులపెంపుఁ, [2]గ్రొన్ననలవెన్నను, బువ్వులసొంపునై కడుం
బొగడఁగ నొప్పుశాఖల నభోవలయంబు నతిక్రమించి, మిం
చగు తరువాటికాతటమునందు మహాత్ములచిత్తవృత్తియ
ట్లొగిఁ గడు స్వచ్ఛమైన కొల నొక్కటి చేరి మహాముదంబునన్. ౪౪

సీ. తొలిఁదొలిఁ జొర నోడు చెలువలచిత్తముఁ
దెలిపి యాటలకు మైకొలిపి కొలిపి
యోలోల యని లీల నో ర్తోర్తుఁ దేర్కొని
పరువడి చెయ్యాక పాఱి పాఱి
యాదట నితరేతరాస్యపద్మములపైఁ
గరయంత్రధారలు పఱపి పఱపి
వికచపద్మపరాగవిసరంబు పుచ్చి చే
సాఁచి యొండొరులపైఁ జల్లి చల్లి

1. దీపంబువోలె. 2. గ్రొన్నెలల.

ఆ. జలజసక్త మధుపములఁ జోఁపి చోఁపి రా
యంచపదుపుఁ బట్టఁ బొంచి పొంచి
దరులఁ జెంది చెంది ధవళాయతాక్షు ల
క్కొలన నట్లు కేలి సలిపి రంత. ౪౫

ఉ. మాళవ నందభూపతి కుమారుఁడు సద్గుణమండనుండునాఁ
జాలినరత్నమండనుఁడు సత్యసమన్వితుఁ డేఁగుదెంచె వా
తూలసమానయానమునఁ దోడికుమారులు దాను సింహశా
ర్దూలభయంకరాటవులఁ దూఱుచు నేర్పున డేగవేఁటకున్. ౪౬

ఆ. అరుగుదేరఁ దేర నారాజనందనుఁ
గూడి పాఱ లేక తోడిసఖులు
నిలిచి రంబరమున నిగుడుభానునిఁ గూడి
యరుగ లేని గ్రహచయంబు నట్ల. ౪౭

క. ఇవ్విధమున నందఱు దవు
దవ్వులఁ దిగఁబడఁగ నింద్రదత్తుం డనువాఁ
డవ్విభునిఁ గూడి నెయ్యము
నివ్వటిలఁగ నడచెఁ దోడునీడయు పోలెన్. ౪౮

వ. అప్పుడు ౪౯

ఆ. డేగవేఁటయందు డెందంబు నిలిపి గో
పాలవేష ముడిగి తాలకేతు
సహితుఁడై ధరిత్రి విహరింపఁ జొచ్చిన
నందసుతునిఁ బోలె నందసుతుఁడు ౫౦

క. అనుచరుఁడుఁ దాను నే క్రియ
విన విస్మయ మైనయట్టి వేఁటలతమకం
బున నిది సమ మిది విషమం
బనక చనుచుఁ గనియె నమ్మహాపుర మెదురన్. ౫౧

చ. కని 'యిది యేపురంబు చెలికాఁడ!' మహోన్నతవప్రశాఖియై
ఘనసదనాభిశోభి యయి కంధరబంధురహర్మ్యరమ్యమై

యొనరెడుఁ గంచియో, మథురయో మిథిలాపురమో విదర్భయో
తనరు నయోధ్యయో శ్రుతిహితంబుగఁ జెప్పుము నాకు' నావుడున్. ౫౨

ఉ ఆతఁడు రత్నమండనున కాదట నిట్లని చెప్పె నప్డు 'ప్ర
ఖ్యాతిగ నీవు పేర్కొనిన యట్టివి యెద్దియుఁ గాదు సుమ్మి, సం
పాతి యనంగ నొక్కనరపాలకు ప్రోలిది, దీనిపేరు వి
న్మా తగఁ బుండరీకము రమాసదనం బిది శబ్దతుల్యతన్. ౫౩

క ఈ రాజు ధర్మవర్తనుఁ,
డీరాజ్యములోని ప్రజలు నిందఱు విహితా
చారైకరతులు దురితవి
దూరు లనుచు నెపుడుఁ జెప్పుదురు సత్పురుషుల్ ౫౪

వ అని యింద్రదత్తుండు చెప్పుపలుకులు విని రాజసుతుండు ప్రీతిచేతస్కుం
డగుచుఁ జని చని తనచేతి డేగ నొక్కమహీరుహంబుపై నున్న విహంగంబు
నకు వైచిన. ౫౫

ఉ. ఉవ్వనుమ్రోఁతతో నెదు రెఱుంగనివీఁకఁ బరాక్రమించుచో
నవ్విహగంబు తద్ఘనతరారుణదారుణనేత్రరోచులన్
నివ్వెఱఁ గంది కాల్కొనఁగ నేరక మేదినిఁ గూలెఁ గూలినం
జివ్వనఁ దేలిపోయి యొకచెట్టున వ్రాలెఁ గరంబు దవ్వులన్. ౫౬

క. ఆ డేగ యట్లు వ్రాలిన
వేడుక నవ్వనమునందు విలపితలీలం
క్రీడించుబాలికాజన
చూడామణి పుష్పగంధి చూచి కండంకన్. ౫౭

క. పట్టెదను డేగ ననుచును
నిట్టలమునఁ జెలుల మొఱఁగి యీక్షణరోచుల్
దట్టము లై ముందట వెద
వెట్టినటులు గలయఁ బొలయఁ బెద్దయుఁ బ్రీతిన్. ౫౮

క, అడుగులఁ జప్పుడు కాకుం
డెడునట్లుగఁ గదియఁ బోయి డేగా! యిదె నం

జూడు గొమ్మని యొక యెలమా
మిడివిగు రటు చూపుచుండె మెలఁతుక యంతన్. ౫౯

క. అచ్చపుఁదమకంబునఁ దన
నెచ్చెలి నచ్చోన డించి నృపతితనూజుం
డచ్చెలువ లున్నతోఁటకు
వచ్చెం దన దేగ యెందు వ్రాలెనొ యనుచున్ ౬౦

ఉ వచ్చి యతండు చూచెఁ జెలువంబుల ప్రోఁక, విలాసలక్ష్మికిం
జొచ్చినయిల్లు, సౌఖ్యములచోటు, వికాసముతానకంబు, క
న్నిచ్చల యున్కిపట్టు, కుసుమేషునికారము జన్మభూమి నా
నచ్చగుపుష్పగంధిఁ జపలాయతనేత్రఁ బయోరుహాననన్ ౬౧

క. ఆ తరుణీమణియును నృప
సూతి తనూవిలసనాతిశోభాసక్తం
బై తన చూడ్కి నిగుడఁ బ్ర
స్ఫీతగతిం దోఁచెఁ గుడ్యచిత్రము భంగిన్. ౬౨

చ. ఇరువుర చూపులుం దనకు నింపగుతూపులు గాఁగఁ జేర్చి యొం
డొరువుల మర్మము ల్గలఁగ నూఁటఁ జెందని హస్తలాఘవ
స్ఫురణ మెలర్ప శంబరనిషూదనుఁ దార్చుచుఁ బింజపింజతో
నొరయ నిరంతరంబుగ మహోద్ధతుఁడై తెగి యేసె నత్తఱిన్. ౬౩

క. కోరుదు రొండొరుఁ గదియఁగఁ
గోరుదు రితరేతరోపగూహనసుఖముం
గోరుదు రన్యోన్యాధర
సారసుధారుచులు దనివి సనఁ గ్రోలంగన్, ౬౪

క. ఇట్లు య్యిరువురుఁ దమలో
జట్లు వడనికోర్కు లక్కజంబుగ నఖు ?
చి క్లైటిఁగినఁ గార్యము తుది
నెట్లగునో యనుచు నుండ నింతటిలోనన్, ౬౫

చ. కనుఁగొని పుష్పగంధి చెలికత్తియ మాలిని నాఁగ నొక్కయం
గన చనుదెంచి యిద్దఱ ముఖంబులఁ దోఁచుమనోవికారముల్

తన మది నిశ్చయించి క్రియ దప్పదె యింకిట యే నుపేక్ష చే
సిన నని యాసరోజముఖిఁ జేరి ప్రియోక్తుల గారవించుచున్. ౭౬

ఆ. తరుణి! మనము వచ్చి తడ వయ్యె నాటలు
చాల వమ్మ! ప్రొద్దు వ్రాలె మిగుల
నీకు నెదురు చూచు నృపసతీతిలకంబు
పాలి కరుగ నింకఁ బాడి గాదె.' ౭౭

తే. అనిన నయ్యింతి సిగ్గున నవనతాస్య
యయ్యె, నేమి సేయుదు నల్ల యవనినాథ
తనయుఁ డిందుఁ బ్రవేశించె ననుచుఁ దనదు
హృదయ మావయస్యకుఁ జూపునదియ పోలె. ౭౮

వ. మఱియు నత్తెఱవ తత్సమయసముచితోక్తులు పలుకుచుఁ గైదండ యిచ్చి యమ్మచ్చెకంటి నచ్చోటు గదల్చి తెచ్చునప్పు డచ్చెలువుందు పచ్చవిల్తు నచ్చవిరితూపులచే నొచ్చి వెచ్చ నూర్చుచుం గూర్చుండం బడి పై పై నివ్వటిల్లునెవ్వగల నొగిలి మూర్ఛిల్లె; నాపుష్పగంధియుం గొంతద వ్వరిగి యరిగి మనోజాతశరవ్యాతయై సోలి వ్రాలె నంత. ౭౯

క అక్కట మనోజవేదనఁ
జిక్కె భవత్సఖుఁడు, వానిఁ జేకొను మనున
ట్లొక్కటఁ బలికెడు శుకములఁ
దక్కక కనుఁగొనుచు నింద్రదత్తుఁడు వచ్చెన్. ౮౦

ఆ వచ్చి యతనియులికిఁ గ్రచ్చఱఁ జూచి డెం
దమునఁ గొందలంబు దలకొనంగ
'హా కుమారతిలక! హా రత్నమండన!
యెట్లు సంభవించె నిట్టియెడరు?' ౮౧

వ. అని పలికి మఱియును. ౮౨

క. పాము గలదొ, కాదెఁ బెను
గాము గలదొ యదియుఁ గాక క్షత్రియకులజుం

దీమెయిఁ : బొలసిన గయికొని
యే మేనియుఁ జేయుభూత మిచ్చటఁ గలదో! ౭౩

ఉ. ఇయ్యవనీశనందనున కిప్పుడ యీదురవస్థరాఁ గతం
బెయ్యది యొక్కొ • యే నితని నేఁక్రియఁ జేకొని తేర్తు నొక్కొ ? నా
కియ్యెడ నిష్టకృత్యమున కెవ్వఁడు దోడ్పడఁ గల్గువాఁ డొకో ?
దయ్యమ! యేమి చేతు, నని తల్లడ మందుచుఁ జేరి యిట్లనున్. ౭౪

క. ధీరోదాత్తగుణోత్తర!
యో రాజకుమార! నీకు నుచితమె యిట్టి
దారుణతామసభావముఁ
గూరి వృథాఖేదమునకుఁ గుదురై యుండన్' ౭౫

చ. అనుచు సఖుండు పల్కుటయు నంకిలి దేఱిసవిత్తవృత్తితోఁ
గను దెఱవం దలంచి యధికంబుగఁ గ్రమ్మెడుబాష్పవారితో
నెనసినదెప్ప లెత్తుటయు, నెత్తి సుఖాసనుఁ జేసి కన్నుల
ల్లన నఱచేత నొత్తి వికలంబగుహారము చక్కఁ ద్రోయుచున్ ౭౬

వ. తత్సమీప పుష్పితలతాలవాలంబున మకరందబిందు సంవాసితంబు లగు నంబువులు కరపుటంబులం దెచ్చి యందిచ్చి ముఖప్రక్షాళనంబు చేయించి యాతని నవలోకించి ౭౭

క. నీ కిట్టి కడిఁది దుర్దశ
రాకకుఁ గత మేమి యనిన రాజతనూజుం
'డాకర్ణింపు మిచట నొక
కోకిలశుకవాణిఁ బుష్పకోమలఁ గంటిన్. ౭౮

సీ. చిగురుటాకులలోని జిగిఁ గూర్చి యాబాల
యడుగులఁ జేతుల నలఁది రొక్కొ
పసిడితీఁగెలమీఁది ప్రభ దెచ్చి యాకాంత
మెయిదీఁగె యంతట మెది రొక్కొ
చంద్రబింబముకాంతి సవరించి యాలేమ
మోమున నునుపుగాఁ దోమిరొక్కొ

* బొలిసిన.

క్రొమ్మెఱుంగులమించు గొనివచ్చి యాయింతి
కలికికన్నులఁ గీలుకొలిపి రొక్కొ

ఆ. యనఁగ సవతు లేని యధినవాకారంబు
తోడఁ జెలులఁ గూడి యాడుచుండెఁ
జామ యొర్తు మరునిసామ్రాజ్యలక్ష్మియ
పోలె; దానిఁ జూచి బేలు పడితి. ౬౯

ఉ. ఆ మదిరాక్షి నేత్రరుచు, లా వనజాననముద్దునవ్వు, లా
భామిని మందమంద మృదుభాషితరీతులు డెందమందుఁ బే
రామని యై తనర్చుటయు నంగజుచేతి నిశాతసాయక
స్తోమముఖంగిఁ గెందలిరు జొంపము నా కొదవించెఁ గంపమున్. ౭౦

ఉ తోఁకొనిపోయె నంత నొకతొయ్యలి యయ్యెలనాగ నప్డు పే
రాఁకలి గొన్నబెబ్బులి రయంబునఁ గృష్ణమృగార్భకంబుపై
వీఁక యెలర్పఁ బెల్లడరి వ్రేయుగతిన్ మరుఁ డుగ్రుఁడై ననుం
దాఁకిన మూర్ఛ నొందితిని దద్దయు నీవల నిప్డు తేటితిన్.' ౭౧

క. అని యి ట్లేర్పడఁ జెప్పిన
విని యతఁ డిట్లనియె 'నొక్కవెలఁదికిఁగా నే
మ్మన మింత నెగులు పఱుపఁగఁ
జనునే నీయట్టి ధైర్యసంపన్నునకున్ !' ౭౨

చ. అనవుడు 'నేమి చెప్పుదు వయస్యుఁడ! భానుఁడు తూర్పుఁగొండ యె
క్కిన మఱి యేటి చీఁకటులు ! కేశవనామము జిహ్వ నుచ్చరిం
చినతుది నేటి పాపములు ! చిత్తజుపుత్తడి గ్రేణి సేయున
వ్వనితకటాక్షదీధితులు ప్రాలినమీఁదట నేటి ధైర్యముల్ ! ౭౩

చ. విను మటు లుండె నా హృదయవేదన మానుప నోపు దేని నా
కనుఁగవ గెం పొనర్చు సితకంజనిభేక్షణ నాలతాంగి, దో
డ్కొని చనుదెమ్ము ! తే ననువుగూడని పక్షమునందు నన్ను ర
మ్మనినను వచ్చెదం బిలువు మక్కడికార్య మెఱింగి చయ్యనన్.' ౭౪

చ. అనుటయు నింద్రదత్తుఁడు నరాధిపనందను నంద యుంచి 'యేఁ
జని యిటు వచ్చునంతకు విచారము నీమదిఁ జేరనీకు, మ

వ్వనితకు నీకు నిప్పుడ యవశ్యముఁ బొం దొనరింతు’ నంచుఁ జ
య్యనఁ జనుదెంచె నాసరసిజానన లేఁగినచొప్పు వెంబడిన్. ౮౫

సీ ఈరీతిఁ జనుదెంచి యెదురుకట్లను నొక్క
మాధవీవనలతామంటపంబు
క్రింద నందఱుఁ గూడి కిసలయశయ్యవైఁ
బూఁబోఁడి నునిచి కప్పురపుధూళి
యఱకాళ్ళఁ దోముచు నఖిలాంగకములందుఁ
బాటించి చందనపంక మలఁది
పదను డించినచోటఁ బన్నీరు చల్లుచుఁ
గదళీదళంబులఁ గదిసి విసరి

ఆ తరుణిమేన విరహతాప మగ్గల మైనఁ
గాము, సోముఁ, గమ్మగాలి, నళులఁ,
బికము, శుకముఁ బేరుపేరఁ బ్రార్థింపుచు
సంభ్రమించుచున్నసఖులఁ గనియె ౮౬

వ కని ‘మీ రెవ్వరు ? మీలతాంగి కిచటన్ గామజ్వరం బేమిటన్
జనియించెన్ ? శిశిరోపచారములచే శాంతంబు గాదో కదే ?
వనితారత్నములార ! చెప్పుఁ’ డనినన్ వామాక్షు లా రాజనం
దనమిత్రు న్వేసఁ జేర వచ్చి విగళద్బాష్పేక్షణాంభోజలై. ౮౭

క. ‘అన్నా ’ యే మని చెప్పుదు
మిన్నగరమురాజుకూఁతు రీవిరహిణి యు
ద్భిన్నసరోజానన యీ
కన్నియ పే రమరుఁ బుష్పగంధి యనంగన్. ౮౮

ఉ. ఈ సతి కేము నెచ్చెలుల, మీ యెలదోఁటకు వచ్చి నిచ్చలో
ల్లాసవిలాసహాసము లెలర్పఁగ వేడ్కలు సల్పుచుండఁగా
నాసమయంబునందు నొకఁ డయ్యలరమ్ములు నిషుదండబా
ణాసనముం దొలంగ నిడి యంగజుఁ దొంటియ వచ్చుచాడ్పునన్. ౮౯

మ మిగులం జక్కనివాఁడు కాంచనరుచిన్ మేదించిన ట్లంగకాం
తి గడుం బొల్పగువాఁడు యౌవనమదోద్రేకంబునం దద్దయుం

జిగి సొంపారెడువాఁడు మాకడకు వచ్చెన్ దేగవేఁటాడుచున్
జిగురుంబోఁడియు వానిఁ జూచి తగిలెన్ జెప్పంగ నిం కేటికిన్. ౯౦

క. ఆ కన్నెఱింగి యచ్చట
నీ కన్నియ నుండనీక యిట తెచ్చితి మా
రాకొమరుఁ డెంచుఁ బోయెనొ
పీకున నిది మూర్ఛ వోయె విరహాతురతన్. ౯౧

ఉ. అప్పుడు తల్లడిల్లి గురాకులసెజ్జకుఁ దెచ్చి బాలకుం
బుప్పొడి రక్షగా నొసల బొట్టిడుచు న్మకరందబిందువుల్
చిప్పిలు పుష్పమంజరులు చెక్కుల నొత్తుచు ధౌతవస్త్రముల్
గప్పుచుఁ జందనంపుటుదకంబు పయిం జిలికించుచుండఁగన్. ౯౨

క. మిక్కుటమై విరహానల
మిక్కన్నియదేహ మెల్ల నెరియింపఁగఁ బూఁ
బక్కెర గల శుకతురగము
నెక్కిన వెడవింటిరౌతు కెరఁగితి మాత్రిన్. ౯౩

క. తక్కటి మరుబలములకును
బ్రొక్కితిమే మిటను నెవ్వగను సుముఖులు గా
రెక్కడఁ జొత్తు మనఘ, నీ
వెక్కడివాఁడ? విట యెచటి కేఁగెద?' వనినన్. ౯౪

క. 'మీ పుష్పగంధినెయ్యపుఁ
జూపులకును లెప్ప మైన సుకుమారవపు
శ్శ్రీపెంపునఁ దినరినవసు
ధాపతిసుతుసఖుఁడ నింద్రదత్తాహ్వయుఁడన్. ౯౫

చ. అతఁడును బుష్పగంధి లలితాకృతిజాలమునంచుఁ దద్దయున్
ధృతి యెడలంగ మత్స్యముగతిన్ గడు లోఁబడి పంచబాణబా
ధితుఁ డగు చేను జూచి తగఁ దేలుచు మీ కెఱిఁగింప నేఁగుదెం
చితి నిట మీఁది కృత్య మది చెప్పఁగ నేటికి మీ రెఱుంగరే.' ౯౬

క. అనవుడుఁ బనివడి వెదకం
జనవలసిన సొమ్ము దాన చనుదెంచిన చా

డ్పున విన నబ్బె నితనిముఖ
మున నిక్కార్యంబు మూలముట్టుగ ననుచున్. ౯౭

చ. రయమున నేఁగి యాసతులు రాజతనూజకు నత్తెఱంగు ని
శ్చయముగఁ జెప్ప, ము న్నసమసాయకసాయకపంక్తిచేత నొ
చ్చియు నొకకొంత యూఱడిలుచిత్తముతో నటు లేచి తా నతి
ప్రియమున నింద్రదత్తుఁ బిలిపించి తదానన దర్శనంబునన్. ౯౮

క రోగికి సుహృదులఁ గన్గొనఁ
గా గుణ మెట్టి దగు నట్టికైవడిఁ జేతో
రాగ మెలర్పఁగ నునికికి
నాగోతులు ప్రీతి నొంది యాతనితోడన్. ౯౯

ఉ. 'తమ్ముఁడ ! నీవు వచ్చినకతమ్మున మాహృయమ్ములోనితా
ప మ్మొకకొంత డిందుపడి ప్రాణము నిల్చె; భవత్సఖుండు నే
మమ్మున నున్నవాఁడె ? యొకమా టయిన న్మముఁ జిత్తగించునో
నెమ్మది దేగవేఁటకును నెక్కొనుచిత్తముతోఁ జరించునో ?' ౧౦౦

క. అనవుడు 'నాతనివేఁటల
పని యిట యిం కెమి చెప్ప భావజుఁ డీ భా
మిని దీమంబుగఁ జూపి య
తనిఁ గైకొని వేఁట లాడెఁ దద్దయుఁ గడిమిన్. ౧౦౧

క. అంతటఁ బోవక మరుఁ డీ
కాంతారత్నంబు నతఁడు కారణముగ ని
ట్లింతకుఁ దెచ్చె * నెఱుంగరె
కొంత విచారంబు వలదొకో మీ కైనన్. ౧౦౨

క. తొలిఁదొలి రోగ నిదానము
దెలియక యౌషధము వేయఁ దివిరెడు వెడవె
జ్జులు వోలెఁ దొడఁగి యీ తొ
య్యలి నేమిటి కమ్మ యింత యలజడిపఱుపన్ ?' ౧౦౩

---

* నెఱుంగ వే.

ఉ. నావుడు నింద్రదత్తువచనంబుల నయ్యెలనాగ లట్లకా
దే విరహజ్వరంబు కడతేఱు నె యీచలిమందులందు నిం
దీవరనేత్రచందములు దేవికి ము న్నెఱిఁగింపకుండినం
బోవునె ముల్లు ముంటఁ గొని పుచ్చక రోఁకటఁ బుచ్చవచ్చునే! ౧౦౪

వ అని తలంచి ౧౦౫

క. 'వినవలయు నతనిరాష్ట్రము
తనిపట్టణ మతనితల్లిదండ్రులపే ర్లా
తనిధామ మతనిప్రియభా
మిని యభిధానంబు మాకు మేలుగఁ జెపుమా'. ౧౦౬

చ అనిన నతండు 'మాళవసమాహ్వయదేశము వానిదేశ, మా
తనినగరంబు రత్నపురి, దాని కధీశ్వరుఁ డైనవందుఁ డా
తనిజనకుండు, తత్ప్రియనితంబిని యంబిక వానితల్లి, వాఁ
డనఘుఁడు రత్నమండనసమాఖ్యుఁడు పెండిలి లేదు' నావుడున్. ౧౦౭

క. ఒండొరులఁ జూచి యౌవన
మండలములఁ దెలివి యొలయ మాకన్నియ కా
తండు వరుం డగుఁ బరుఁడెడి
రం డని కార్యోక్తిమై మరల్చిరి వానిన్. ౧౦౮

ఆ. అంతఁ దనదుకోర్కి యబ్బినయట్లకా
నెమ్మి నుల్లసిల్లు నృపతనూజఁ
గొంచుఁ బురికి నరుగుదెంచి రయ్యంతులు;
ననియె నతఁడు నధిపతనయుకడకు. ౧౦౯

వ. ఇటు వచ్చినయింద్రదత్తుం గాంచి రత్నమండనుండు. ౧౧౦

క. 'వచ్చెం బో నా నెయ్యుఁడు
తెచ్చె నొకో మంచివార్త తే కున్నట్లే
నచ్చెఱుతనగవు మొగమున
నచ్చుపడుట కెద్దిహేతు వనవచ్చు నొకో.' ౧౧౧

క. అని మది నూహించుచు భూ
తనయాన్వేషణము చేసి తన యెదిరికి వ

చ్చినకపివరునిఁ గాంచిన
యినకులజుఁడ పోలెఁ దలఁపు లీరిక లెత్తన్. ౧౧౨

క. మెలపున నెదురుగఁ జని ప్ర
స్ఖలితవచనరచన యెసఁగఁ 'గాయో పండో
కలరూపు చెప్పు' మనవుడు
ఫలియించుచు గోర్కి పాఱఁబట్టుము వగలన్. ౧౧౩

క. సంపాతినృపతి సతియై
పెంపారెడుచంద్రరేఖప్రియసుత దనపే
రింపారఁ బుష్పగంధి ను
తింపన తగుఁ జుమ్ము మహిఁ దదీయగుణంబుల్. ౧౧౪

సీ. ఆ యింతి నీకు నిల్లాలు గాఁ దగుఁ జిత్త
గింపు నామాట లంగీకరించి
యబల నీవార్త విన్నప్పుడ నిజదేహ
జనితవియోగాగ్నిఁ బొనుఁగు పఱిచెఁ
దదనురూపంబుగాఁ దత్సఖీజనములు
నీయూరుఁ బేరును నెమ్మి నడిగి
రడిగి యాతఁ డొడయఁ డగు మానృపాత్మజు
కని కార్యగతి దేర నాడి నన్ను

ఆ. మరలఁ బనిచి రేను నరుగుదెంచితి నింకఁ
జింత దక్కి యాలతాంతగంధి
నఖిలబంధుచయము ననుమతింపఁగఁ బెండ్లి
యగుదుఁ గాక వేడ్క లగ్గలింప' ౧౧౫

క. అని యాతనిచిత్తము బో
రన నూల్కొనఁ బల్కి నిజపురంబునకుందో
డ్కొని చనియె నింద్రదత్తుం
డని సర్పటి చెప్పె నవిన నత్యుత్సుకుఁడై. ౧౧౬

క 'భోజుఁడు మఱి యే మనియె? మ
హాజననుతచరణ! సిద్ధుఁ డతనికి మఱి యే

మోజ వినిపించె నవిరళ
మై జరిగెనె తత్కథామహాలత ?' యనినన్. ౧౧౭

చ. అనుపమదివ్యతేజ! దివిజార్చితపాదసరోజ! దైత్యభం
జన! భువనైకరంజన! కృశానుశశాంకకుశేశయాప్తలో
చన! ఘనదుఃఖమోచన! ప్రసన్ననృసింహవపుర్విలాస! వే
ద నగనివాస! భక్తజనతాపరితోషణ! దోషభీషణా! ౧౧౮

క. భవనీరధిబడబానల!
భవగహనాసహ్యదావపావక! దృప్య
ద్భవసామజకంఠీరవ!
భవనిబిడతమోనిరాస భాస్కరమూర్తీ! ౧౧౯

వ న మ యూ ర ము

నీలజలదాసిత వినిర్మలశరీరా!
తాళతరుసప్తక విదారణవిచారా!
కాళియ మహాభుజగ గర్వపరిహారా!
కాలసదృశోగ్ర మధుకైటభ విదారా! ౧౨౦

## గ ద్య ము

ఇది వాణీవరప్రసాదలబ్ధవాగ్విభవ తిక్కనామాత్యసంభవ
సుకవిజనవిధేయ అనంతయ నామధేయ ప్రణీతంబైన
భోజరాజీయంబను కావ్యంబునందు
దృ తీ యా శ్వా స ము

శ్రీ

# భోజరాజీయము

## చతుర్థాశ్వాసము

శ్రీనాథ! సురక్షితనిఖి
లానాథ! దయామయాంతరంగ! శివా వా
ణీనాథసంగ! వీర
శ్రీనిర్జితదైత్యరంహ! శ్రీనరసింహా! ౧

వ. అవధరింపుము,

క. ఆమహునకు నాత్రేయమ
హాముని యిట్లనియె 'భోజుఁ డట్టులు సిద్ధ
స్వామి తగఁ జెప్పుకథలు మ
నోమోదము గాఢముగ వినుచు నిట్లనియెన్. ౨

ఆ. 'ఇంద్రదత్తుఁ డానరేంద్రపుత్రునిఁ గొంచుఁ
బురికి నరుగఁ దెల్పితిరి తదుత్త
రప్రసంగ మేమి క్రమమున వర్తిల్లె
నంతవట్టు దెలియ నానతిమ్ము.' ౩

వ అనిన సర్పటి యిట్లనియె నట్లింద్రదత్తుండు రత్నమండను మనోరథంబు నందనృపతికిం జెప్పిన నతండు సంతసించి నిజపురోహితుం డగు చంద్రశర్మను గార్యం బడుగుడు నాతండు సంపాతియొద్దకుం దగువారి నంపి క్రియాసిద్ధికిం గడంగుట కర్తవ్యం బనియె

చ. అనవుడు సంతసించి విభుఁ డార్యులఁ బంపుడు, వార లేఁగి యి
ట్లనిరి 'ఘనుండు మాళవనృపాగ్రణి నందుఁడు మద్విభుండు; ద
త్తనయుఁడు రత్నమండనుఁ డుదారుఁడు, వానికి నీదు కూర్మినం
దన నడుగంగ వచ్చితిముదాత్తచరిత్ర! కళింగభూవరా! ౪

చ. అనిన నతండు నెమ్మనమునం దొగి మోదము ఖేదముం బెనఁ
గొనఁగఁ బురోహితుం బిలిచి 'కోమలిజన్మఫలంబు మీకుఁ దోఁ
చినతెఱఁ గంతయుం దెలియఁ జెప్పుఁడు వీరికి, వీరు సమ్మతిం
చినయటు లైన లెస్స, యొఱ చేసిన దోషము వచ్చు' నావుడున్. ౬

వ. అతం డక్కన్నియ జన్మించిననాఁ డప్పుడమిఱేఁడు వినంగ నెట్లు చెప్పె నట్ల పెండ్లిదొరలతోడనుం జెప్పి ప్రియోక్తిగా నిట్లను. ౭

ఉ. నందనరేంద్రనందనుఁడు నాయకుఁ డౌటకుఁ బుష్పగంధి త
త్సుందరి యౌటకుం బరమ శోభనసంపద మద్గృహంబునం
బొందుటకుం బ్రమోదరససింధుతరంగల నోలలాడమే
యిందఱుఁ, బాపజాతివిధి యిట్టియరిష్ట మొనర్పకుండినన్.' ౮

క. అని పల్కిన 'నిది యల్పపుఁ
బనియె విచారించి చూడఁ బాడియ కాదే
యనుపుఁ డిదె పోయి వచ్చెద'
మని జనపతితోడఁ జెప్పి రప్పెండ్లిదొరల్ ౯

ఆ. మరలి పోయి నందధరణీశుతోడఁ జె
ప్పినఁ దలంకి యిట్టు లనియె నాతఁ
'డద్ది రన్న చచ్చినంతటి కల గన్న
నోలి మేలుకనియె యుండవలయు. ౧౦

ఉ. ఎక్కడి పుష్పగంధి, మఱి [1] యెక్కడి మత్సుఁతు దేమి గాఁగ నీ
మక్కువ లుల్లసిల్లెఁ గొఱమాలినదైవము త్రిప్పి త్రిప్పి పెన్
జిక్కులఁ బెట్టె నే నెటులు వేయుదు, దుఃఖము చూచి చూచి యా
దిక్కటు లుండ నిందు సుగతిం బెఱచోటుల లేరె కన్నియల్.' ౧౧

చ. అనవుడు రత్నమండనుఁ డనంగశిలీముఖపాతభీతుఁడై
జనకునిఁ జూచి 'తక్కటి విచారము లేటికిఁ బుష్పగంధికై
తను వెటు లైన నేమి వసుధం బెఱ రాజతనూజ లేల య
య్యనిమిషనాథుపుత్రిదెస నైనను నాహృదయంబు నిల్చునే. ౧౨

1 యొక్కటి

సీ. ఆపద్మముఖిఁ బాసి యేపోఁడిమియు లేక
పచ్చవిల్తునిచేతఁ జచ్చుకంటె
నిగ్రహం [1] బేద పాణిగ్రహోత్సవసౌఖ్య
మాపోవఁ దొలి తొలి ననుభవింతు
నటమీఁద బ్రతుకు దైవాధీన మెట్లయ్యె
నయ్యె గా కేమి సేయంగ వచ్చుఁ
జావు లేకుండ నాజముచేత నాకుఁ దె
చ్చినవారు గలరె యీసృష్టియందు

ఆ. [2] నడుము నడిఁకి యున్న నడుఁకునె బడె పెట్టు
వీర లెల్ల నీతివిదులు గారె
దూరభీతిఁజేసి చేరువ నగుకీడు
తప్పఁద్రోచు వెరవు చెప్పఁ గలరె. ౧౩

చ అని కడుఁ దెంపు చేసి సుతుఁ డాడినమాటకు మాఱు పల్కఁ నే
రనిమొగమోట నానృపతిరత్నము కొండొక వెచ్చనూర్చి నె
మ్మన మెరియంగ భూసురసమాజముఁ గన్గొని దీనభావ మా
ననమునఁ దోఁప మేనఁ జలనంబు గడుం బొదలంగ ని ట్లనుఁ. ౧౪

క. 'ఓ విప్రవర్యులార! మ
దావాసమునందుఁ జెందునశుభంబులఁ బోఁ
ద్రోవను, సంతతశుభములు
గావింపను మీర కారె క ర్తలు మాకుఁ. ౧౫

ఉ. కావున మాకు సేమ మగు కార్యము నేర్పడఁ జెప్పఁ' డన్న నా
భూమిబుధాగ్రగణ్యులు ప్రభూతమతిం దలపోసి చూచి దే
వా! వెఱఁ గంద నేటికి భవత్తనయుండు గుణాధికుండు మా
దీవనఁ బెక్కువర్షములు తేజ మెలర్పఁగ జీవితుం డగుఁ. ౧౬

ఆ. విప్రభక్తి గలఁడు వినుము నీతనయుఁ డా
తనికి ధర్మదేవతయ సహాయ

---

1 బేడ. 2. నుడుము.

మొనరఁ గలదు గాని యొండు గానేరదీ
సంశయంబు విడువు జనవరేణ్య!' ౧౪

వ అనిన నవ్విప్రోత్తములమాట తనకొడుకు బ్రతుకు వృద్ధికిం బూఁటగా మైకొని రత్నపురాధీశుం డాపుండరీకపురాధీశునితో వియ్య మంద నియ్యకొని సపరివారంబుగా సంపాతినగరంబున కేతెంచె నయ్యవసరంబున, ౧౮

సీ. పుణ్యనిర్మలజలంబులను సుస్నాతుఁడై
తడి యొత్తి విమలవస్త్రములు దాల్చి
కస్తూరికామిశ్రగంధంబు మై నిండ
నలఁది మాణిక్యమయంబులైన
కంకణాంగదహారకర్ణావతంసాది
కలితభూషణముల నలరఁ దొడిగి
యంచితసౌరభోదంచితకించిదు
త్ఫుల్లనానావిధపుష్పదామ

ఆ. కములు దనరఁ బూని కల్యాణచిహ్నలు
గోమరు మిగుల మంచుఁ గొండయింటఁ
బరిణయమగ నరుగు పరమేశ్వరుండును
బోలె నొప్పె నానృపాలసుతుఁడు. ౧౯

క. ముందరఁ బురోహితుండు, పి
ఱుంద సచివుఁ, డాయుధపుమెఱుంగులు మెఱయన్
గొందఱు భటు లిరుగెలఁకుల
దందడి నడతేర వందితతి నుతియింపన్. ౨౦

క. భేరీజయఘంటాది మ
హారావములును వసుంధరామరవిజయా
శీరుక్త సుశబ్దములును
గౌరీకల్యాణవిభవ గానధ్వనులున్. ౨౧

ఉ. పౌరుల సాధువాదములు బాంధవకోటి ప్రమోదభాషలున్
వారవధూవిదూషకజనంబుల నాగరికంపుమాటలున్

భేరణి యై దిగంతములఁ బిక్కటిలంగ నపారవైభవో
దారత యుల్లసిల్లఁగ నతం డరుదెంచె వివాహవేదికిన్. ౨౨

ఉ. అప్పుడు బిట్టుబిస్సు విభుఁ డాతరుణిం గనుఁగొన్నఁ బువ్వుఁదే
రుప్పరవీధిఁ దోలుకొని యుగ్రగతిం బఱతెంచి కాముఁడే
చొప్పునఁ జూపునో తన ప్రసూనశరంబులవాఁడి యంచు వా
తప్పక చాటు వెట్టిన విధంబున నత్తెర యెత్తి రత్తఱిన్. ౨౩

వ. మంగళాశీర్వాదపురస్సరంబుగా సుముహూర్తం బనుచు మౌహూర్తికుండు జయఘంటపై నక్షతలు చల్లిన ౨౪

ఉ. కింగున ఘంటపైఁ గొడుపు గ్రక్కున వైచుడుఁ దూర్యనాదముల్
నింగియు దిక్తటంబులును నిండఁగ విప్రులవేదనాద ము
ప్పొంగి చెలంగుచుండఁ దెర పుచ్చిన ముచ్చట వోవఁ జూచి ర
య్యంగజుఁ డార్వ నొండొరుల యాననపద్మము లావధూవరుల్. ౨౫

ఉ. అంతఁ బురోహితానుమతి నక్షతపాత్రలు సేరఁ దేర న
క్కాంతయుఁ గాంతుఁడున్ ముఖవికాసము లొప్పఁగ దోయిలించి య
త్యంతపుఁబ్రీతి నొండొరుల యౌఁదలలం దలఁబ్రాలు వోసి రం
తంతకు మేనులందుఁ బులకాంకురజాలము లుల్లసిల్లఁగన్. ౨౬

తే. పొలఁతి ప్రాణేశుతలఁ బ్రాలు వోయునపుడు
సిగ్గునెపమునఁ దనదు దోసిలి యొకింత
తడవునకుఁ గాని వదలదు తచ్ఛిరోజ
కరసరోజసంస్పర్శసౌఖ్యంబు మరగి ౨౭

క. తలఁబ్రాలు వోయుచో నవి
తలవెంట్రుక లింత సోఁకి తన దగు బాహాం
గుళములు దక్కటియంగం
బుల కెక్కటి సేయ రాజపుత్త్రుఁడు మెఱసెన్. ౨౮

క. గుణమణియుత యగుసతిల
క్షణ మది ప్రాణేశ్వరునకు శాశ్వతసుఖకా
రణ మనియిటు చేసె ననఁగ
గుణమణియుతఁ జేసె విభుఁడు కోమలి నంతన్. ౨౯

చ. అతనునిఁ గెల్తు నీసతి సహస్థితి గల్గిన నంచునో, పురా
కృతసుకృతోపభోగతతికిం గుదు రీసతి యంచునో, యనా
గతఘనదుర్దశందలఁగఁగా వెర వీసతి గాంచు నంచునో,
యతఁ డిటు చేసె నాఁగఁ దరిశేక్షణహస్తముఁ బట్టెఁ బ్రీతితోన్. ౩౦

వ. ఇవ్విధంబున నప్పల్లవపాణిం బాణిగ్రహణంబు చేసి శచీసమన్వితుం డగు శతక్రతుండునుం బోలె ననుపమతేజోవిశేషవిరాజితుం డగు నయ్యవసరంబున, ౩౧

తే. నేఁటిపట్టునఁ బగ లింత నిడివి యైన
నంగనాలింగనోత్సవాభ్యర్థి యైన
యానృపాత్మజుఁ దెల్లోర్చు ననుచు నర్కుఁ
డతని కవకాశ మిచ్చినయట్లు గ్రుంకె ౩౨

క. దంపతుల రాగరసముల
పెంపో, మన్మథతమంబుపెంపో యనఁగా
నొంపగుసంధ్యారాగప
రంపరయును జీఁకువాలుఁ బ్రబ్బెఁ బయిపయిన్ ౩౩

వ. తదనంతరసమయంబున ౩౪

చ. జలజభవాండ మొప్పెఁ గలశంబువిధంబున, నందులోన ను
జ్జ్వల మగు చంద్రికాపటలి సన్నుతి కెక్కెఁ బయఃప్రపూరమై,
లలితకలాకలాపసదలంకృతచారుసుధామరీచి యిం
పుల గని యై తనర్చెఁ బయిఁ బొంపిరి గట్టిన మీఁగడో యనన్. ౩౫

క. ఆరాత్రి పుష్పగంధికి
గారవమున జలక మార్చి కై సేసి సఖుల్
కోరి నృపాత్మజుశయ్యా
గారమునకుఁ దెచ్చి యతనిఁ గదియించుటయున్, ౩౬

సీ. జలజాక్షి దన్ను నెచ్చెలులు పానుపుమీఁద
నునుచుచోఁ బెనఁగక పెనఁగుటయును

సెజ్జకు వచ్చియుఁ జెలులు నవ్వెద రని
మోమెత్తఁగానోడు *ముగ్ధయును
నొక్కొక్కపవివెంట నువిద లేఁగినఁ జిత్త
మూటాడుచుండంగ నుందుటయును
జిట్టంటువేఁతల సిగ్గు కీ లెడలించి
పలికింప నల్లనఁ బలుకుటయును

తే దనువు పులకింప నధరామృతంబు గ్రోలి
కౌఁగిలించిన మర్మంబు కరఁగుటయును
దనకు నత్యంతసౌఖ్యప్రదంబు లగుమ
నలర సురతోత్సవాబ్ధి నోలాడె విభుఁడు ౩౭

ఆ. ప్రథమరతమునందుఁ బంచసాయకతంత్ర
మంతవట్టు దనకు నవగతముగ
నభ్యసించె ననఁగ నయ్యింతి భర్తచి
త్తంబు వట్టు బహువిధంబులందు ౩౮

ఆ బాహ్యరతులఁ దొలుత బాలకి గరఁగించి
కూటమందు గెలుపు గొందు ననుచుఁ
గదిసి విభుఁడు దాన కరఁగఁ జొచ్చుఁ బరస్ప
రానురాగమహిమ యడుగనేల. ౩౯

వ. ఇట్లు లబ్ధమనోరథుండై యా రత్నమండనుండు కతిపయదినంబులకు సంపాతి నృపతిచేత సత్కృతుండై యపారవిభవంబారఁ బుష్పగంధినిం దోడ్కొని తన పట్టణంబున కరిగి నందమహారాజునకు నంబికాదేవికి నమస్కరించి యథా సుఖవిహారంబుల నుండి యుండి యొక్కనాఁడు, ౪౦

క మారుఁడు రమ్యారామవి
హారంబున మెఱయుమాడ్కి నప్పరిసరకాం
తారమున కేఁగి ధీరో
దారుఁడు రాకొమరుఁ డేకతమున మెలంగన్. ౪౧

---

* ముగ్ధతనము.

ఉ. క్రూరపుఁజూపులు న్నిడుదకోఱలు నుగ్రపుమోము నెత్తుటం
బేరినకోర మీసములు బిట్టనవెండ్రుకలుం గృశత్వముం
గూరినదేహము న్వెడఁదకుక్షియు ఘోరరవంబు గల్గి యే
పారినబ్రహ్మరాక్షసుఁ డుదగ్రబలుం డొకఁ డవ్వనంబులోన్. ౪౨

చ. ఉరుధరణీజశాఖపయి నుండి ఘనధ్వనిఁ దన్నుఁ బిల్వ సుం
దరతరవక్త్రి మెత్తి వెసఁ దప్పక చూచి కుమారుఁ డాత్మన
చ్చెరువడి పుష్పగంధికయి చెప్పిన యప్పలుకు ల్దలంచి 'యే
వ్వరికిని మీఱ రా దజుఁడు వ్రాసినవ్రా' లనుమాట దప్పునే ౪౩

ఆ. ఆలతాంగిఁ బెండ్లియాడి తొమ్మిదిప్రొద్దు
లయ్యె నేఁటితోడ నదినిమిత్త
మై కదా భయంకరాకృతితోఁ బోడ
చూపె బ్రహ్మరాక్షసుండు నేఁడు. ౪౪

క. అని కొండొక చింతింపఁగ
ననుమానం బేల నాకు నాహారముగా
నిను నియమించె నజుఁడు ర
మ్మని పెండియుఁ బిల్చె నాతఁ డాగ్రహ మెసఁగన్. ౪౫

వ. ఇట్లు నెట్టుకొని పిల్చుచున్న బ్రహ్మరాక్షసునకు ధైర్యగుణమండనుం డగు రత్నమండనుండు సవినయంబుగా నిట్లనియె 'నయ్యా! నీ యానతి నేను జేసెద నా కొక్క విన్నపంబుగల దది యాకర్ణింపుము. ౪౬

సీ. 'ఏను బోయినజాడ యెఱుఁగక నాతల్లి
దండ్రులు నెంతయుఁ దల్లడిలుచు
నుండుదురో నన్ను నోరంతప్రొద్దును
నెత్తి పెంచినదాది యెంత వగచు
చుండునో నాచేయు నుద్యోగముల కెల్ల
ననుకూలుఁ డైవచ్చు నాప్తుఁ డింద్ర
దత్తుఁడు దానెంత తలఁకునో నాకు దో
సిలి యొగ్గి యే సౌఖ్యములును లేక

ఆ. పుష్పగంధి యెంత పొగులునో యేఁ బోయి
వారి కెల్ల నుచితవచనరచనఁ
జేసి యూఱడించి శీఘ్రంబ వత్తు నీ
యాన నన్నుఁ బనుపు ' మనిన నతఁడు ౪౭

తే. ' అవుర పులిచేతఁ జిక్కిన యతఁడు విడిచి
పోయి క్రమ్మఱ వచ్చుట బొంకు గాదె
తళియఁ బెట్టినయశనంబు తలఁగఁద్రోఁచి
పిదపఁ గుడిచెద ననువాఁడు బేలకాఁడె ౪౮

క అది గాక నీవు చని వ
చ్చెద ననుటయుఁ, బిదప నీవు చేరెదవని నే
వదలుటయు నయుక్తంబులు ;
చదురుఁడ వగు దేని రమ్ము చయ్యనఁగదియన్.' ౪౯

చ. అనవుడు ' నోమహాత్మ ! యిటు లాడఁగనేటికి నీదు సమ్ముఖం
బున నిటు పల్కి నాకు మఱి బొంకఁగ వచ్చునె సర్వజీవులం
దును మనుజత్వసిద్ధిగడు దుర్లభ మట్టిమనుష్యదేహ మె
త్తిన తుదిఁ గల్ల లాడి సుగతిచ్యుతి నొందునె యెట్టినీచుఁడున్ ౫౦

ఉ. కావున నాకు బొంకు పలుకం బని లేదు, వృథా వినాశమై
పోవఁగ నున్న యీచెనఁటి బొంది ఖవాదృశు లైనపెద్ద లా
పోవఁగ నారగించుటకుఁ బూని సమర్పణ చేయరా దొకో '
నావుడు నాతఁ డుగ్రముగ నవ్వి ' యి వేటికి నిన్ని మాటలున్ ౫౧

క, ప్రత్యయపరిపాలకుఁ డగు
సత్యోత్తముఁ డెచటఁ గల్గు? నప్పటి పనికై
సత్యోక్తులు పచరింపఁగ
సత్యాచారంబు మది ననాచార మగున్.' ౫౨

వ. అనిన నతం డతని కిట్లనియె ౫౩

క 'మనుజుఁడ, సత్సంగతి గల
మనుజేంద్రసుతుండఁ గల్ల మాటాడెదనే

మును తిర్యగ్జాతి యనం
జనుధేనువు సత్యనిష్ఠ సల్పుట వినవే ' ౫౪

క. అనవుడు 'నాకథ యెట్టిది
వినవలయుం జెప్పు' మనిన 'విప్రవరేణ్యా'
విను' మనుచు రత్నమండనుఁ
డెనయంగా నతనితోడ నిట్లని చెప్పెన్. ౫౫

గో వ్యా ఘ్ర ము ల క థ

సీ. ఒకవిప్రవర్యుని హోమధేనువు నిత్య
సత్యవర్తిని, సదాచారమూర్తి,
కలహంబునకుఁ బోదు, కలిగినంతనె తుష్టి
నొందు, సందడి కోర్చు, నుబ్బు వేయ
వలవదు, పిదుకుచో వరవృష్టిధారల
చెలువునఁ జన్నులు చేఁపి కురియుఁ,
దెవు లెఱుంగదు, బొమ్మ తీండ్ర సొలఁగఁ గల్గి
కురుమట్టమై చాలఁ గూడియుండు,

తే. నిట్టిగోరత్న మొక్కనాఁ డేకతంబ
పోకు మేయుచునుండ బెబ్బులి యొకండు
దానిఁ గనిపొంచి యెడ లెల్ల దాఁచి వాల
మవనిఁ దాటించుచును బ్రేయ నడరుటయును. ౫౬

క కళవళము లేక 'యోహో
నిలు నిలు' మని సురభి యిట్లనియెఁ జయ్యన న
ప్పులితో 'నాకొక చన వీ
వలయు వివేకించి నాదు వాక్యము వినుమా.' ౫౭

క, అనినఁ బులి గోవుపై నె
త్తినకేలును భీషణాకృతియుఁ బటమున వ్రా
సినవి త్తరురూపువిధం
బున ఖచరుల కద్భుతంబు పొదలఁగ నుండెన్. ౫౮

చ. పులి యటు, దీపనానలము పొంగున గ్రోఁగుచు నుర్కి యట్టె, యి
మ్ముల నొకపాఁడిగో వపుడు ముందటికిం జనుదెంచు నట్టె, హో
నిలు మనినం బయిం బడక నిల్చికనుంగొను నట్టె బాపురే
కలఁగక యాడుమాట లయకాలుని నైన శమింపఁ జేయదే. ౨౯

వ. ఇట్లు నిల్చి యప్పుండరీకం బాధేనువున కిట్లను 'నామిషార్థినై వచ్చు న న్నిట్లు వారింపఁ గారణం బేమి? నీ వేమి చెప్పెదు? చెప్పు' మనిన నది దాని కిట్లనియె ౬౦

చ. మును మునుఁ బుట్టె నాకు నొక ముద్దులపట్టి, యతండు పుట్టి యే
డెనిమిదినాళ్ళపాటి గలఁ డింతియ, పూరియు మేయ నేరఁ డేఁ
జని కడుపారఁ జన్గుడిపి చయ్యన వచ్చెద, నన్నుఁ బోయి ర
మ్మని సుకృతంబు గట్టికొనవన్న దయాగుణ ముల్లసిల్లఁగన్. ౬౧

వ. అని పల్కుచుఁ దనలో నిట్లని విచారించు ౬౨

క. 'రేపు వను గుడిపి వచ్చితి
నేపున నం దంద పరువు లిడి యంతటిలో
నాపుడిసెడు నఱిగినఁ గొడు
కేపాటులఁ బడునొ వాని కెయ్యది గతియో ౬౩

క ఏ నట్టు నాకుమండఁగఁ
దా నను నండ గొని చెవులు దాల వయిచుచున్
మే నెఱుఁగక యుండెడు నా
కూనకు నెవ్వారు దిక్కొకో యిట మీఁదన్. ౬౪

సీ. నన్నుఁ గానక పోయి నాపుత్త్రుఁ డేయావు
పొదు గైనఁ దొడుకంగఁ గుదిలి కొనుచుఁ
గొమ్ముక నదరంటఁ జిమ్మునో సుడిసిన
నడ్డంబు దాఁకునో గొడ్డుటావు
లుగ్రమహోక్షంబు లొండొంటిఁ దొడరుచోఁ
ద్రొక్కునో జరఠాగ్నిఁ బొక్కిపడుచుఁ
బొరుగిండులకు నొంటిఁ బోవఁ గుక్కలు దోలి
కఱమనో గతిమాలి యఱచుకొనుచు

ఆ. దిరిగి తిరిగి యధికదీనవక్త్రముతోడఁ
దోఁట దొడ్డి చొరఁగఁ దోలఁ బోయి
పడుచు పైద వెంటఁ బడి నొవ్వ నదుచునో
యేమి సేతు' నంచుఁ బ్రేముడించు. ౬౫

వ. అంతఁ దన యంతరంగం బంత యెఱింగిన నప్పులి సంశయించునో యను తత్తఱంబునం జిత్తం బొక్కింత చేసికొని వైవర్ణ్యంబు దోఁపనీక క్రమ్మఱ నమ్మొదవి ట్లనియె. ౬౬

ఉ. గుమ్మెడుపాల నాసుతునకుం బరితృప్తిజనించుఁ గాని మాం
సమ్ము సమస్తముంగొనక చాలదు నీ యుదరాగ్నికైన, ని
క్కమ్ముగ నిందులోఁ బ్రథమకార్యవినిర్గతి నీవెఱుంగవే,
పొమ్మనవన్న! వ్యాఘ్రకులభూషణ! చయ్యనఁ బోయి వచ్చెదన్ ౬౭

చ. అనవుడుఁ బుండరీక మపహాస్యము చేసి 'యి దేమి గోవ! యి
ట్లనియెదు, నన్ను బేల్పఱచి యాత్మజుఁ డున్నెడ కేఁగి సత్వరం
బునఁ జనుదెంతు నంటి, విది పోలునె, చెప్పెడువారు చెప్పినన్
వినియెడువారి కించుకవివేకము పుట్టదె యింత యేటికిన్ ౬౮

ఆ. గుండె నిమురుకొనుచుఁ గొదుకుపాలికి నేఁగి
కడుపు నిండఁ జన్ను గుడిపి నీవు
నెమరు వెట్టుకొనుచు నెమ్మది మందుగా
కిచటి కేల వచ్చె దెఱిఁగి యెఱిఁగి. ౬౯

వ. అనిన నప్పుండరీకంబునకు వివేకంబు లేదు గదే యని శోకంబు నొందుచు నా గోకులరత్నంబు వ్యాఘ్రంబునకు నిట్లను 'నే నిన్ను నొకకొన్ని వేష భాషలం బ్రమోషించి యట పోయి క్రమ్మఱ రాకుండుదు నని నను నమ్మనేర విది సాధులక్షణంబె? యే నసత్యవచనురాలనె? ౭౦

క. ఒక యితిహాసము చెప్పెద
నకలంకత వినుము, సూనృతాత్ముల చరితల్
సకలాఘక్షయకరములు
సుకృతనిధానములు కర్ణశోభితసీలల్ ౭౧

# మ ద న రే ఖ క థ

వ. అయ్యితిహాసం బెట్టి దనిన మగధదేశంబునందు * సంభీరుం డనునొక్క మహీపాలుండు పెద్దకాలంబు తనకు సంతానంబు లేక భూదేవతల రప్పించి పుత్రకామేష్టి సేయింప నయ్యగ్నికుండంబువలన నొక్క తేజోమూర్తి యగు కొడుకును, నొక్క యధికస్వరూపిణి యగు కూఁతురుం బుట్టిన నయ్యిద్దఱకుం గ్రమంబునఁ బావకలోముండును మదనరేఖయు నను నభిధానంబు లొనరించి పెనుపుచుండునంత నయ్యిరువురు తండ్రినియోగంబున విద్యాభ్యాసంబు సేయుచు. ౩౨

చ. సదమలయుక్తిఁజేసి గురుసన్నిధిఁ బావకలోముఁ డోలిఁ బ్రాఁ
జదువులు ధర్మసంహితయు సామజశిక్షయు నశ్వశాస్త్రముం
బొదలెడు నస్త్రసాధనయు భూపతినీతియు గానవిద్యయుఁ
మొదలగు విద్య లెల్లఁ దుదిముట్ట నెఱింగెఁ బరిస్ఫుటంబుగన్. ౩౩

క. అతనిసహోదరి యగు న
య్యతివయుఁ దగఁ గావ్యనాటకాలంకార
ప్రతతు లొగి నభ్యసించుచుఁ
జతురతమై నుండె నొక్కసమయమునందున్. ౩౪

సీ. నూఁగారుఁదీఁగెకు నూతనావాలమై
తనరారు నాభిరంధ్రంబుఁ జూచి
సుభగత్వలక్ష్మికి సోపానమార్గమై
రమణీయమగు వళిత్రయముఁ జూచి
యౌవనశబరు చే నమరుమారెడుపండ్ల
క్రియ నందమగు కుచద్వయముఁ జూచి
ముఖచంద్రమండలంబునఁ దోఁచునమృతపూ
రము భంగి మధురాధరంబుఁ జూచి

తే. గురుతనూజుండు మనమునఁ గోర్కె నిగుడఁ
దోడిశిష్యుల నందఱ వీడుకొలిపి

---

* శంబరుండను. ఈ రాజు అంభీరుఁడని తరువాత పేర్కొనఁబడును.

వనిత నేకాంతమందిరంబునకుఁ దెచ్చి
కదియవచ్చిన నది వానికిఁ బెఱింగి ౭౫

చ ఇటు తగు నయ్య విప్రుఁడ వహీనగుణాఢ్యుఁడ వీవు, నీకు నే
మిటి కిటువంటి దౌష్ట్యము? శమించునె మజ్జనకుండు విన్నఁ? ద
క్కటిజను లేమి యంద్రు? మదిఁ గాంక్షయె కల్గిన నగ్నిసాక్షిగాఁ
జిటికెన వట్టి కాక వృథ సేయుట ధర్మమె కన్యకాత్వమున్? ౭౬

క. పడతికిఁ గన్యాధర్మం
బెడలినఁ గొఱ యగునె వెండి యెవ్వరి కైనం
గడివోయినపువ్వులు మఱి
ముడుచునె రసికుఁ డగువాఁ డమోఘవివేకా! ౭౭

ఉ కావున నీవు న న్నదియఁ గారణ మేమి తొలంగు' మన్న నా
భూవిబుధుండు 'నీవు నను బొందక పోయెద నన్న మైమెయిం
బోవఁగ నేల నిత్తు' నని పూని నృపాత్మజ నంటఁబట్టి వ
స్త్రావరణంబుఁ బుచ్చుటయు హస్తము చాచి విదల్చి వైచుచున్, ౭౮

చ. 'తలతల మంచివాఁడవు గదా గురుపుత్రుఁడ వంచు నిన్ను నోఁ
బలుకిక యున్న నీగతిని బాడి తొలంగెదు చాలుఁ జాలు మా
టలపని యేల? వేగిరపడం బనిలే దబలుండ! యింటివా
రల కెఱిఁగించి నీవెనఁటిరంతులు సర్వముఁ జక్కఁ జేసెదన్.' ౭౯

చ, అని కడుఁ దూలపోఁ బలుక నగ్గురుపుత్రుఁడు మూర్ఛ నొంది మే
దిని కొఱగంగ నవ్వనిత దిగ్గనఁ బట్టి నిజాంకపీఠ మా
తని కుపధానమై వెలయఁ దా నొనరించి మొగంబు చూచి ము
క్కునఁ బవనంబు లేమికి దిగుల్పడి కుత్తుకి యంటి చూచుచున్. ౮౦

క. 'అక్కట నాగురుపుత్రుం
డెక్కలిఁ గోల్పడితి, నెద్ది తెఱఁగో, విప్రుం
డెక్కడి కెక్కడఁ దలఁచెను
దృక్కరణోన్మాద మింత తీవ్రం బగునే. ౮౧

క. గురుపత్నిఁ జంద్రుఁ డమ్మని
వరపత్నిఁ ద్రివిష్టపైకవల్లభుఁడు పరా

కెరుఁ డోడరేవుపడఁతిని
మరుగుటఁ గనువేదు ఱితరమర్త్యుల వశమే! ౭౨

తే. నాకుఁగా నీతఁ డిటు మరణంబు నొందె
నేని నా కెంత పాపమో, యిప్పు డితని
కోర్కె దీర్చితినేని నా కులములోన
నెంత హీనత వచ్చునో యేమి సేతు. ౭౩

వ. నని చింతించి యొక్కయుపాయంబు [1]గాంచి, ౭౪

క. తొడ చఱచి పేరఁ బిల్చుచు
నొడికంబుగఁ గరసరోజ మురమున నిడుచున్
వెడఁ గదలుతెప్ప పొడ గని
పడఁతుక యొకకొంత డిందుపడియెడు వగతోన్. ౭౫

క. 'అనఘా! యిది యెంతటి పని,
విను నాదెస నీకు నింత వేఁడుక గలదేఁ,
గను దెఱచి చక్కఁ జూడుము
మనలో మన కింత గలదె మతిహీనుఁడవై. ౭౬

క. నవ్విధి వైనను గాకే
నివ్విధ మి ట్లెఱుఁగుదును మహీసుర! విను నే
నొవ్వం బలికితిఁ గరుణకు
దవ్వగుపని సేయ నేను ధర్మేతరనే.' ౭౭

చ. అనిన నతండు "నావలన నాదరణంబు తలంచియిట్లు [2]పే
ర్కొనియెదుఁ; గంటి మంటి" నని గొబ్బునఁ గన్నులు విచ్చిచూచి పై
కొనఁగఁ దలంచినం గుసుమకోమల తత్తఱపాటు లేని నె
మ్మనమున విప్రుఁ జూచియిటు మానుము నీ కిఁక వేగ మేటికిన్. ౭౮

క. ఏ నొక్కటి నిను వేఁడెద
దానిం గాదనక నీవు దలకొని చేయం
గా నోపిన విద్వద్వను
తా! నీచిత్తంబుఁ బట్టుదానఁ బ్రియమునన్.' ౭౯

---

1. గావించి. 2. పేర్కొనియెదు.

వ. అనిన నవ్విప్రుండు దమకించి. ౯౦

క. 'ధన మైనఁ బ్రాణమైనను
వనజానన! యేను నీకు వంచింతునె యే
పని యైన నడుగు మిప్పుడ
యొనరించెద' ననిన నప్పయోరుహముఖియున్. ౯౧

క. ధన మడుగఁ బ్రాణ మడుగన్
విను పరిణయ మైనపిదప నే నీయెడకుం
జనుదెంచి కాని మత్ప్రియు
నెనయఁగ నేఁ బొంద నాకు నీవర మీవే' ౯౨

చ. అనుటయు 'బాపు బాపు నను నాసలపా లొనరించి నెమ్మదిం
జనువెర వె ల్లెఱింగితి, విచారవిమూఢున కైన నీవు ప
ల్కినపలు కియ్యకో లగునె? లేమ! వనంబున జున్ను రేఁచి తి
య్యని మధుపాన మొల్లక రయంబున నొండులపాలు సేయునే ౯౩

చ. అది యటులుండె నీ విచటి కప్పుడు వచ్చెద నంటి వౌ, నినుం
గదలఁగ నిచ్చునే విభుఁడు? కాని ప్రసంగము లేల? నీవు నా
తుది నఱ లేక వచ్చుటకుఁ దొయ్యలి! యెవ్వరు పూఁట? యంతకుం
బదిలము నిల్వ లేను, మరుబారికిఁ ద్రోవక నన్నుఁ గావవే ౯౪

క. యాదృచ్ఛికసురతంబును,
జూదంబున గెల్వఁబడిన సొమ్మును- నుత్రో
శాదులు నప్పటి కప్పుడు
కాదే మఱి దున్నిపోవుఁ గాక నిలుచునే. ౯౫

క ఈవేళఁ దప్పిపోయిన
నావల నొకనాఁడు వత్తుననునది నిజమే
నీ వెంత చెప్పినను మ
ద్భావము నమ్మ' దనియతఁడు దాఁ బల్కుటయున్ ౯౬

సీ. 'నా రాక సిద్ధమ్ము నమ్ముమీ,' వని పెక్కు
భంగుల శపథముల్ పలికి యబల

'విను మిదె యామ్నాయవిదుఁ డైనవిప్రుఁడు
ధర్మప్రజార్థమై తగినకన్య
నరసి పెండిలియాడ నరుగుచో విఘ్నంబుఁ
గావించుపాపానఁ బోవుదాన
నప్పుడు రాకున్న' నని పల్కఁ 'బోఁబోలు'
ననియె నాగురుపుత్రుఁ, డట్ల పలికి

ఆ యరిగె రాజపుత్రి మరుసాయకము గుఱిఁ
దూఱ నాఁటి తిరిగి దొనకు నేఁగు
నట్లు నిర్వికారయానంబుతోఁ గీర్తి
సదన మైన తండ్రిసదనమునకు ౯౭

వ అంత నయ్యింతికిం దంత్రి యను రాజకుమారుండు వరుండై ప్రథమసంగమోత్సవసముత్సుకం బగు మనంబున దూతికాజనంబులం బనుప వార లచ్చెలువం బిలువం బోయిన. ౯౮

ఆ. ఆనృపాలపుత్రి యాదటఁ గై సేసి
యతనుపాలి కరుగు రతియ పోలె
నరిగి యరిగి మున్ను గురుతనూజునితోడఁ
బల్కినట్టి కడిఁదిబాసఁ దలఁచి. ౯౯

చ. మదిఁ దలపోసి 'యాగురుకుమారునితో నలనాఁడు మత్పతిం
గదియుటకంటె మున్ను నినుఁ గానఁగ వచ్చెద నమ్మ మంటి, నీ
యదన నితండు నన్ను గవయన్ గుతుకంబునఁ బిల్వఁ బంచె నా
కదియు నవశ్య, మిప్పనియు నర్థమ, యెయ్యది యాచరింతునో. ౧౦౦

సీ. విప్రుపాలికిఁ బోయి వేగ వచ్చెద నన్న
నృపదూతికల నాకు నిల్ప రాదు
మగనికోరికి దీర్చి మఱి పత్తు నని యేను
జనిన నసత్యదోషంబు వచ్చు
నీపూట దప్పించి యెల్లి చూచెద * నని
పతివేడ్కఁ జెఱుచుట పాడి గాదు

* నన్న.

పతితోన చెప్పి యీపని యొనర్చెద నన్న
నెఱుఁగ రా దాతని హృదయసరణి

ఆ. ధర్మసూక్ష్మ మె వ్విధము దుర్బలప్రబ
లంబు లెఱిఁగి నిశ్చయంబు సేయు
వార లెవ్వ రిచట వాక్రుచ్చి యొకరితోఁ
జెప్ప రాదు త్రోపు సేయ రాదు ౧౦౧

వ. అని దోలాయమానమానస యగుచు నమ్మానవతి ధర్మస్థితికిం బతియనుమతియ ముఖ్యగతిగాఁ దనమతి నిశ్చయింప దూతిక లచ్చెలువం బతితల్పంబున నిడి తొలఁగి చనిరి ౧౦౨

తే. అంత నయ్యింతి తన యంతరంగమందు
నతఁడు తనుఁ బొందఁ దైపడునంతంటె
మున్న యీ మాట వినిపింపకున్నఁ గార్య
మనువు పఱచుట దుస్తర మని తలంచి. ౧౦౩

ఉ. చెప్పఁగఁజూచి సిగ్గువడుఁ జెప్పఁగఁ, జెప్పకయున్నఁ దీర, దేఁ
జెప్పెదఁ గాక యంచుఁ దెగి చెప్పఁ దలంచు, ని దేమి మాటగాఁ
జెప్పుదుఁ, జెప్పినం బతియుఁ జిత్తమునం గలుషించునో, పరుల్
చెప్పెదువార్త కా దనుచుఁ జెప్పఁగఁ బూనునుఁ, జెప్పఁ గా దనున్. ౧౦౪

క. అప్పడఁతి యివ్విధంబున
ముప్పిరి గొను సంశయంపుముంపునఁ బతికేఁ
జెప్పక యిది మఱి యెవ్వరు
చెప్పెద రని చెప్పఁ జూచుఁ జెప్పఁగ వెఱచున్. ౧౦౫

ఆ. అట్ల కాదె ముగ్ధ యటె, క్రొత్తపెండిలి
కూఁతు రట్టె, మగఁడు లాఁతి యట్టె,
యదియుఁ బ్రథమసంగ మాసన్నవేళటె,
సిగ్గుపేర్మి వేఱ చెప్ప నేల ౧౦౬

క. అవి యన్నింటిని మిగులదే
భువి నెందును లేని యితరపురుషప్రారం

భవిచారము పతియెదురన
యవమానపుఁబనిని నాలు కాడునె తడవఁ. ౧౦౭

వ. ఇట్లు విచారించి యెట్టకేలకుఁ దెంపుచేసి యజ్జనపతికి సాష్టాంగనమస్కారంబు చేసి ముకుళితకరాంబుజయై యున్న నాతఁ డత్తెఱవ తెఱం గెఱుంగక వెఱఁగుపడి తన కెంగేలం బట్టి లేవనెత్తి యాలింగనంబు సేయుచుఁ దల్పంబు మీఁదికి రాఁ దిగిచి 'మృగాక్షీ! యేను భవదీయలక్షణపరతంత్రుండనకదా నీ వాంఛితం బెద్దియో వెఱవక యెఱింగింపుమనవుడు నమ్మగువ 'దేవా! యే నొక్క విన్నపంబు చేసెద నది యుక్తం బైన నయుక్తంబైన నీ కనుగ్రహింపక పోరా దవధరింపు' మని యతనిచిత్తంబునకుఁ గినుక వొడమకుండునట్లుగా నల్లనల్లనం జెవికిఁ జల్ల నగునట్లు మృదుభాషావిశేషంబుల నగ్గురుపుత్రు నభిలాషయుం, దన వగు సరోషప్రతిభాషలకు నోడి యతండు వాతాహతభూజంబు నోజ నేలం గూలుటయు, నక్కారణంబున బ్రహ్మహత్య సిద్ధించె నే నేమి సేయుదు నని తల్లడించి యతని బోధించుటకై తత్సమయసముచితవచనంబుల నుపచరింపం బెద్దయుం బ్రొద్దునకు నతండు దైవాధీనంబునఁ జైతన్యంబు నొంది క్రమ్మఱఁ దనతోఁ బరిచర్య సేయం దలంచినప్పు డప్పాపు దప్పింప నొండువెరవు దొరకొనమిఁ దా న ట్లొడంబడి యెడ పల్కిన విధంబునుం జెప్పి యవ్వాలంతి మఱియు నిట్లనియె. ౧౦౮

సీ. సుదతి కన్యాత్వవిచ్యుతి పొందు టపకీర్తి
గాని పత్యనుమతి నైనకర్మ
మె ట్లైన మే లని యే నప్పు డతనికిఁ
బరిభాష చేసితిఁ, బార్థివేంద్ర!
యిప్పు డాపరిభాష దప్పిన దోషంబు
ప్రాపించు, సతి కైన పాతకంబు
పతిఁ బొందు నని చెప్పఁబడు నట్లుగావున
వినిపింప వలసె నీ వివర మెల్ల

తే. నింక నిటమీఁద నీచిత్త మెట్టులుండె
నటుల చేసెద నానతి' మ్మనిన నాతఁ
డుల్ల మత్యంతచింతాపయోధి మునుఁగ
శిరము గంపింపఁ జేసి యచ్చెరువు నొంది. ౧౦౯

క. అతివలు సాహసకర్మఁలు,
లతిమాత్రము వారిబుద్ధి. య ష్టై యుఁగికిం
జతురాననకు నై నను
నతుల గెలువరాదు సహజసామర్థ్యమునన్. ౧౧౦

క. ఎఱిఁగి యెఱిఁగి యొరుపాలికిఁ
దెఱవఁ బనుచుపనికి సమ్మతింపదు చిత్తం
బఱిముఱి నసత్యదోషము
పఱతెంచుట సిద్ధ మెట్లు పనుపక యున్నన్. ౧౧౧

క. ఎయ్యది కర్తవ్య మొకో
యియ్యెడ నాలోచనమున కెవ్వఁ డొకో తో
డయ్యెడు వాఁ డీ కార్యము
నయ్యము గాకుండఁ జేయవలయు వెరవుతోన్. ౧౧౨

చ. అని తలపోయుభర్తకుఁ బ్రియంబున నిట్లను 'నింత నీమనం
బున ననుమాన మేమిటికిఁ బుచ్చఁ దలంచిన నన్నుఁ బోయి ర
మ్మను, మఱి కాక నీవు వల దన్నను మానెద' సత్యనిష్ఠతో
నెనయఁగ రావుసుమ్ము మఱి యెన్నితపంబులు నీజగంబునన్ ౧౧౩

క ధన మెల్లఁ బొలియునంతటి
పని పుట్టిన నాలి బిడ్డఁ బాసి నిరాశన్
జనునట్టియెడరు పుట్టిన
జనుఁ డేమఱకుండవలయు సత్యవ్రతమున్. ౧౧౪

క. తొల్లి హరిశ్చంద్రమహీ
వల్లభవల్లభుఁడు సత్యవాక్యము ధరణిం
జెల్లించె నతనివర్తన
మెల్లజగంబులఁ బ్రసిద్ధ మెఱుఁగమె కథలన్. ౧౧౫

వ. అది యట్లుండె నింక నొక్క విశేషంబు. ౧౧౬

క. అతివలమాయలు పెక్కులు
పతుల మొఱఁగఁ దలఁచి రేని పట్టఁగ వశమే

పతిభక్తివిరతలగు న
య్యతివలు గైకొనరు గాక యాదుర్గుణముల్. ౧౧౭

క. పతి దన కేదుగడయ గాఁ
బతియానతి మౌళిఁ బూని పతిచిత్తం బే
గతి నుండు నట్లు మెలఁగెడు
సతి గల్గినఁ బుణ్యగతి సుసాధ్యము పతికిన్. ౧౧౮

వ. ఇట్లు నడవక ౧౧౯

చ. పెనిమిటిఁ దిట్టుచున్ సతులఁ బ్రేల్చుచుఁ బందుగు గీటుకొంచు స
జ్జనుల నిరాకరించుచు నసత్యము లాడుచుఁ గన్నవారితో
డన కలహించుచున్ జొరనిరావులు చొచ్చుచు విందు వీడు వ
చ్చినఁ దల యంటఁ గట్టుకొని జిట్టునఁ జీదుచు బిట్టు మూల్గుచున్. ౧౨౦

చ. తన కడుపార ము న్గుడిచి తా నొకనాఁడును గూటిపొంతఁబో
వనియది వోలె మోము దిగవైచుచు నూరకె కాళు లీడ్చుచున్
వనరుచు నింటివాకిటికి వచ్చినవారలముందటం దగం
బనివడి లేమి చెప్పుచు నభాగ్యుఁడు వీఁ డని భర్త దూఱుచున్. ౧౨౧

ఆ. భాండశుద్ధి లేక పరగ దేవాతిథి
పూజనములపొంతఁ బోక నీచ
వర్తనమున మెలఁగు వనిత ప్రాణేశున
కుభయలోకహాని యొనరఁ జేయు. ౧౨౨

క. కావునఁ బురుషుల కెందును
భూవల్లభ! మేలుఁ గీడుఁ బొందించుటకున్
భావింప ముఖ్యహేతువు
లావనితాజనుల కాక యన్యులు గలరే. ౧౨౩

ఆ. అధిప నానిమిత్తమై నీకుఁ బాపంబు
సంభవించుపనికిఁ జాలఁ గాన
నింత చెప్ప వలసె నింక నీ తలఁ పెట్టి
దట్లు చేయుదాన నాన తిమ్ము.' ౧౨౪

చ. అనవుడుఁ బాపభీతుఁ డగు నానరనాథుఁడు నాతిఁ జూచి 'నీ
కనితరసాధ్య మైన పరమార్థవివేకము కల్మిఁజేసి యె
ట్లనినను జెల్లు, నీ పలికినట్టుల పంతము దీర్చి రమ్ము పొ'
మ్మనుడు నమస్కరించి గృహ మల్లన వెల్వడి నిర్వికారతన్. ౧౨౫

చ అనిమిషకన్యయో దితిసుతాన్వయకన్యయొ వీడు చూడవ
చ్చినవనకన్యయో యనఁగఁ జెన్నెసలారుచు నిండి సాంద్రమై
ఘన మగు చీఁకటిం గుసుమగంధి నిజాభరణప్రభావళుల్
దన కటు త్రోవ చూపఁగ ముదంబున నొంటియె యేఁగుచుండగన్. ౧౨౬

వ భయంకరాకారుఁ డగు నొక్క రాక్షసుండు రాచవీధి నన్నాతికిఁ బొడసూపిన.

క ఆరాక్షసుఁ గన్గొనియును
నారాజీవాక్షి యంతరంగమునఁ బతిం
గోరి తలంచుచు వెఱవక
బోరనఁ జనుచుండ దనుజపుంగవుఁడు మదిన్. ౧౨౭

క వెఱఁగు పడి యెట్లొకో యిటు
వెఱవనిచందంబు దీనివిధ మేర్పడఁగా
నెఱుఁగవలయు నని వెస డ
గ్గఱఁ జని వస్త్రాంచలంబు కరమునఁ బట్టెన్. ౧౨౮

ఉ. పట్టిన నేమియుం దిగులుపాటు మదిం బొరయంగ నీక యా
కట్టిఁడిదైత్యుఁ జూచి 'యనఘా! తగువాఁడవు కావె నీవు, నన్
బట్టుట ధర్మ మయ్య! పరభామఁ బతివ్రత నేను; నన్ను తోఁ
బుట్టువుగాఁ దలంచి వెసఁ బో విడు మంకిలి పేయ నేటికిన్. ౧౩౦

ఆ. అనిన నాతఁ డప్పు డమ్ముగ్ధపలుకు వి
దగ్ధభాష లద్భుతంబుఁ జేయ
నర్ధరాత్ర మెచటి కరుగుచున్నది దీని
వ రనంబు దెలియ వలయు ననుచు. ౧౩౧

ఉ. ఎవ్వరిదాన వీవు? కుల మెయ్యది? యెయ్యది నీదు పేరు? నీ
కెవ్వఁడు భర్త? యొంటి నిటు లెవ్వనియింటికి మధ్యరాత్ర మీ

వెవ్వరుఁ గానకుండ వెస నేఁగెదు? నా కెఱిఁగింపు' మన్నఁ దా
నవ్వుచు నిర్వికారవదనంబున వానిమొగంబు చూచుచున్. ౧౩౨

సీ. మాతండ్రి యంభీరుఁ, డాతని సతియైన
కుంభిని మాతల్లి. గుణగరిష్ఠుఁ
డైనపావకలోముఁ డన్న, రాచకొలంబు
మాయది, నాపేరు మదనరేఖ,
నాభర్త తంత్రిభూనాథుండు, నేఁ జను
పనియును జెప్పెద వినుము తెలియ'
నని తన్ను గురుపుత్రుఁ డాసించుటయు వాని
కపుడు దాఁ బల్కిన శపథగతియు

ఆ. భర్తచే ననుజ్ఞ వడసి యిప్పుడు వానిఁ
గానఁ బోవుచున్నదాన ననియు
విచ్చి చెప్పె వెలఁది విని దైత్యుఁ డిట్లని
పలికె నతికఠోరభాష లెసఁగ. ౧౩౩

ఉ. ఎక్కడి పేదపాఱుఁ డిల, నెక్కడి నీ పరిభాష. నేఁడు ని
న్నెక్కడి కేఁగు మంచు వెలయాలినిఁ బోలె వివేకహీనుఁడై
తక్కక యేమిగాఁ బనిచెఁ దంత్రివిభుం. డిది యట్టు లుండె, నేఁ
జిక్కినవాఁడ నాఁకట, భుజింపఁగనిమ్ము భవచ్ఛరీరమున్. ౧౩౪

వ. అనిన విని బెదరు గదురని మదితో నమ్మదిత యాయదయహృదయున కి
ట్లనియె. ౧౩౫

తే. 'కడఁగి యుదరాగ్ని యార్చుటకంటె నెక్కు
డైనసుకృతంబు గల దయ్య! యసురవర్య!
యోర్చి యుండు నీయాఁకలి దీర్చు దాన
యరిగి యిచ్చట నున్నట్లు తిరిగి వచ్చి.' ౧౩౬

ఉ. నావుడు 'మేలు మే లబల న న్నిట వెఱ్ఱిలఁ బెట్టి నెమ్మదిం
బోవఁగఁ జూచె దీ వగునె, బుద్ధివిహీనుఁడఁ గాను, మోసపోఁ
బో, విబుధు ల్సహాయ మయి పూని కడంగిన సంగరంబునన్
జేవ యడంచి పుత్తు, నిను జెంది భుజింతును మాంసఖండముల్. ౧౩౭

క. అని దనుజుఁడు ధట్టించిన
వనజానన పల్కెఁ 'నంతవాఁడవు గాదే
విను నిప్పుడు గాదంటినె
విను యుక్తాయుక్తపదవివేకము వలదే. ౧౩౮

క. ఆరయఁ బెద్దలు దుష్టా
హారము గొన రెట్టిచోట నవ్విప్రునితో
నారీతిఁ బల్కి బొంకిన
నీరోఁతశరీర మెట్టు లింపగుఁ జెపుమా ౧౩౯

ఉ. ఆతనిపాలి కేఁగి యనృతాహ్వయదోషముఁ బొందకుండ సం
ప్రీతునిఁగా నొనర్చి సుచరిత్రత యొప్పఁగ నిందు వచ్చి ని
ష్పాతక మైన మే నొసఁగఁ బంచిన వేడ్కఁ భుజింతు గాక ధ
ర్మేతరు నట్లు నీ కిచట నేటికి నిట్టి వృథా వివాదముల్ ౧౪౦

చ. అనవుడు దైత్యుఁ డి ట్లనియె 'నాడినయట్టుల చేయువారలుం,
బనివడి మున్ను గొన్నటుల పైకొని యప్పులు దీర్చువారలుం,
బొనరినమేలుగీడులకుఁ బొంగక క్రుంగక యుండువారలున్
మనుజులలోన నుత్తము; లమర్త్యులు మెత్తురు తచ్చరిత్రముల్. ౧౪౧

ఆ. అట్టిమనుజు లుర్విఁ బుట్టరు, పుట్టిర
యేని నెందుఁ దఱచు గానఁబడరు,
వెల యెఱుంగరాని విపులార్ఘరత్నము
లుదధియందు నొదిగి యున్నయట్లు. ౧౪౨

వ. కావున సూనృతవ్రతనిరతు లగుట దుర్లభం బదియును గాక ౧౪౩

క. బొంకుల కెల్లను మూలము
పంకజముఖి, యట్టినిన్నుఁ బాటిగఁ గొనినన్
గ్రుంకిడి యరుగుదు* గాకీ
వంక మరలి చూచిచేర వాలాయంబే' ౧౪౪

వ. అనినం జిఱునవ్వు నవ్వుచు నవ్వనిత యి ట్లనియె. ౧౪౫

* -గాకే

ఉ. ఒక ఘటికాద్వయంబు పని కూరక యింత విచార మేలఁ? యిం
చుక యిటు నిల్చి నా నిజము చూడు నిశాచర! భూమి తోయ పా
వక పవనాంబరంబులు దివంబులు రాత్రులు సాక్షి నాదుమా
టకు నిదిగాక నీ మన సొడంబడ నే శపథంబు సేయుదుఁ గా.' ౧౪౬

వ. అనిన నమ్మగువకు రక్కసుండు వెక్కసపడి యి ట్లనియె. ౧౪౭

క. 'నడిరేయి నిదురముంపున
నొడ లెఱుఁగక యున్నయతని నుగ్రగతిం బై
పడి పొడుచుక్రూరనరుఁ దే
గెడుగతి కేఁగెదు సుమీ మగిడి రా కున్నన్.' ౧౪౮

చ అనవుడు నట్ల కాక యని యాసతి విప్రునియింటి కేఁగి య
ల్లన నతఁ డొంటి యన్కఁ బదిలంబుగఁ జూచి సమీపమందు ని
ల్చినఁ గని బిట్టుబిట్టుఁ దన చిత్తము జల్లన మోము దేఱుకోఁ
గనుఁగొని యింత ప్రొద్దిటకుఁ గామిని! రాఁ గత మేమి?' నావుడున్. ౧౪౯

క. 'విను మెఱిఁగి యెఱిఁగి నీ వి
ట్లనఘా! న న్నడుగ నేల యలనాఁటం గో
లెను నీకోర్కికి మీ దె
త్తిన నాయౌవనము నుద్ధృతిం గనుఁగొనవే. ౧౫౦

చ. అనవుడు నద్దిరన్న మగనాలవు రాజతనూజ వీవు మ
జ్జనకుని శిష్యురాలవు పొసంగునె యెంతకు నెత్తికొంటి ప్రో
వనిత! నమశ్శివాయ, తగువారలబిడ్డలు నిట్టి నీచవ
ర్తనముల కియ్యకొందురు గదా యిటువంటివ పో ప్రమాదముల్. ౧౫౧

క. కులహానియుఁ గులవృద్ధియుఁ
గులవనితలు మెలఁగునట్టి కుచరిత్రములం
బొలు పగుసుచరిత్రములం
దలకొనుఁ గాక మఱి యే విధంబునఁ గల్గున్.' ౧౫౨

చ. అనవుడు నవ్వధూటి హృదయంబునఁ గొండొక లజ్జ నొంది యా
యన యొక శిష్టు వోలె నిటు లాడెడు, వీనికి మాఱు పల్కకుం

డినఁ దగ దంచు ని ట్లనియె 'డెందము చందము నీకు నెట్టొకో
కనుఁగొన వల్లనాఁడు తమి గాంచి ప్రబుద్ధుఁడ వైతె యింతలోన్. ౧౫౩

క. ఎఱుఁగనివారి యెదురఁ బలె
నఱిముఱి మెఱమెచ్చుమాట లాడఁగ నేలా
నెఱవాది వగుదు నీ లో
గెఱుఁగమె ముని ముచ్చుఁదనము లేమిటి కింకన్. ౧౫౪

సీ. సన్న్యస్తచిత్తుల సంసర్గఁ గరకకా
యలు కొన్ని నమలితో, యంత కంత
కశనంబు దఱిగి దేహము కొవ్వ చెఱచితో,
యిల్లాలికన్నుల కింత వెఱతో,
యిటు నటుఁ బో నని యే యింతి కైనను
బాసలు చేసితో, బలిమిగాను
వీధులఁ దిరుగంగ వేసఁ దలారులు పట్టి
కొజ్జాను జేసిరో సజ్జవారి,

ఆ. యూరకేల నన్నుఁ జేర వింతవిరక్తి
పరుఁడ వేట్లు నన్నుఁ బట్టి పెనఁగి
తల్లనాఁడు? నాఁటి యుల్లంబుపొగరు నేఁ
డెందుఁ బోయె మదనుఁ డేమి యయ్యె? ౧౫౫

క. అటు గాక దుష్టనిగ్రహ
పటుబాహాబలుఁడు నాదుభర్త యగుట న
న్నిట నీవు గదియ నోడెదొ
కటకట! మగతనము లేదుగా నీయందున్. ౧౫౬

క. వెఱవకు మత్ప్రియునకు ని
త్తెఱఁ గెఱిఁగించి మఱి యరుగుదెంచితి; నీ పి
ఱికితన ముడిగి నను డ
గ్గఱుమా పోవలయు నాకుఁ గడుఁ దడ వయ్యెన్.' ౧౫౭

ఉ. నావుడు నాద్విజుండు 'మును నా కటు చేసినబాస దప్ప కీ
ట్లీవనజాక్షి వచ్చి తగ నిప్పుడు నెట్టుకొనం దొడంగె నే

నేవిధిఁ ద్రోచువాఁడఁ బరమేశ్వర ! మారవికార మెత్తి యా
త్రోవకుఁ జొచ్చితి న్మొదల, దోషముగాఁ గొని యిప్డు డోడెదన్.' ౧౫౮

చ. అనుచు నృపాలపుత్త్రి వదనాబ్జము గారవ మొప్పఁ జూచి 'మ
జ్జనకుఁడు నీగురుండగుటఁ జామ! సహోదరి నీవు నాకు, నే
రనిపని చేసి నాఁ డటులు రాగ మెలర్పఁగ నిన్నుఁ గొంగు వ
ట్టినదురితంబు వాయుటయె డెప్పర మైనది యంత చాలదే. ౧౫౯

క. నీపంతము చెల్లించితి
నీపతికడ కేఁగు మింక నీ సూనృతని
ష్ఠాపారీణత జగమున
దీపించుం గాక సంస్తుతికిఁ బట్టగుచున్. ౧౬౦

క. అని దీవించిన నవ్వచు
వినయంబున మ్రొక్కి యతని వీడ్కొని వేడ్కన్
జనుదెంచె బాల యే లొకొ
చని రా దని దనుజుఁ డాత్మ సంశయపడఁగన్. ౧౬౧

వ. అట్లు చనుదెంచిన యారాజపుత్త్రి నిర్వికారభావంబు నిరీక్షించి యారాక్షసుం
డి ట్లనియె ౧౬౨

ఆ. 'తావి గొనని పుష్పదామంబువిధమునఁ
జిదుమఁ బడని మావిచిగురు భంగిఁ
ద్రావఁ బడని నవసుధాధార పగిదిని
జెలువఁ జూడ సురతచిహ్న లేదు. ౧౬౩

క. ఇతరు లెఱింగినఁ దిరిగితొ,
యతఁ డచ్చట లేఁడొ, నీకు నతనికి మాటల్
గతి గూడక యుండిన వ
చ్చితొ, యంతయు నున్నరూపు చెపుమా నాకున్.' ౧౬౪

వ. అనిన నయ్యసురకు నబ్జసరుహనేత్ర యి ట్లను 'నీ విప్పుడు చెప్పినయంత
రాయంబు లెవ్వియు లేవు. మద్భాగ్యనిమిత్తంబున నతనిచిత్తంబు ధర్మా
యత్తం బగుటయు నా వెట్టి దిరిగి సహోదరంగా నన్ను మన్నించి మర
లించిన నీయాఁకలి తీర్చుటకు నతిత్వరితంబున నిట కేతెంచితి. ౧౬౫

తే. ఇంకఁ దడవు సేయ నేటికి నసురేంద్ర!
జిహ్వా తృప్తితో భుజింతుఁ గాక
నాశరీర మనుచు నాతి యాతనిసమ్ము
ఖమున నిల్చె ముఖవికాస మెసఁగ. ౧౬౬

క. నిలిచినఁ గని వెఱ గందుచుఁ
దల యూఁచి కరాంగుళంబు దనముక్కు_పయిం
జెలువుగ నిడుకొని 'దానవ
కులమున నేఁ బుట్టి పెనఁటికుక్షికిఁ గాఁగ౯. ౧౬౭

ఉ. చంపితిఁ బెక్కు_జంతువులఁ జాన! భవత్సము లైన సత్యవా
క్సంపద గల్గువారిఁ బొడగాన; దురాత్ముఁడ నైననాకు సి
ద్ధింపక యున్నె దుర్గతి? సుదృష్టి యెలర్పఁగ శుద్ధదేహిఁ గా
వింపఁ గదమ్మ! నన్నుఁ' నని వేగమ వ్రాలెఁ బదద్వయంబున౯. ౧౬౮

వ. ఇట్లు వ్రాలిన. ౧౬౯

క. 'అన్నన్న! యేల యిటువలె
నన్న! మిగులఁ బ్రొద్దు వోయె నాఁకొని కృశమై
యున్నాఁడ' వనుచు నెత్తెఁ బ్ర
సన్నవదన యగుచు హస్తజలజాగ్రమున౯. ౧౭౦

క. ఎత్తిన లేచి కరద్వయ
మెత్తి లలాటమున మోపి 'యిందుముఖీ! య
త్యుత్తమధర్మపథమునకు
మత్తునిఁ గావించి కార్యయుక్తిఁ దెలుపవే. ౧౭౧

క. విను నీ సూనృతనిష్ఠయు,
ఘనుఁడగు నీ మగనిపెంపుఁ, గడపట నవ్వి
ప్రునివైరాగ్యంబును నా
మనమునకుఁ బ్రమోదరసనిమగ్నతఁ జేసె౯. ౧౭౨

వ. కావున నాకు ధర్మోపదేశంబు చేసి పురాకృతదుష్కృతంబులకు నిష్కృతి గావింపు మనిన నవ్వనిత యి ట్లను 'నీ విప్పుడు క్షుత్పీడితుండవై యున్న వాఁడ వస్మదీయదేహం బాహారంబుగాఁ గొని తృప్తుండవై మఱి నీ వెవ్వరి

చేత నైనను నుపదేశంబు గానుము "శరీర మాద్యం ఖలు ధర్మసాధనం" బనుట వినవే' యనినఁ జెవులు మూసికొని యతండు 'తల్లీ! నీ విట్లాన తిచ్చుట యుచితంబె, భవత్సాన్నిధ్యంబు నాభాగ్యవిశేషంబునం బొడమె, నా యెఱుకతీఁగె సుడివడకుండ నీవిమలవాక్యజాలం బను బ్రాఁకువెట్టి బ్రోది సేయుదు గాక, యుపేక్షించుట రక్షకుల లక్షణంబె?' యనిన నాదనుజేంద్రు నకు మనుజేంద్రనందన యి ట్లనియె ౧౭౩

క. రక్కసు లెక్కడ ధర్మం
బెక్కడ యేయూరి కరయ నేత్రోవ మనం
బెక్కడికి నీడ్చె నీడ్చిన
యక్కడి కరుగంగనైన య ట్లయ్యెఁ దుదిన్. ౧౭౪

క. అది గాక ధర్మమార్గము
వదలక చనుబుద్ధి నీకు వాలాయంబై
యొదవిన నెట్టనఁ దగఁ జె
ప్పెద విను' మని చెప్పఁ దొడఁగె బింబోష్ఠి యొగిన్. ౧౭౫

ఉ. చొంకకు మెన్నఁడున్ దనుజపుంగవ! శాంతివహించి యుండు, మే
వంకను జీవబాధ లగువాని నొనర్పకు, శౌచివై గతా
హంకరణుండవై ఘనదయామతివై విజితేంద్రియుండవై
పంకజనాభదివ్యపదపంకజభక్తిపరాయణుండవై. ౧౭౬

ఉ. నెమ్మది నుండు, నీకు నిది నేమ, మిహంబుఁబరంబుఁ గోరువా
రిమ్మహి నెవ్వరేనిఁ బరమేశు రమారమణీశు యోగిహృ
త్సమ్మతు సర్వలోకహితు సచ్చరితు న్మదిఁ గొల్వ రట్టివా
రెమ్మెయి నైనఁ గానఁగలరే కలదే మఱి దిక్కు వారికిన్? ౧౭౭

క. హరిభక్తి విరహితుం డగు
నరుఁ డసురాంశంబువాఁ డనంగను విందున్
హరిభక్తి గల్గె నేని న
సుర యైనను దేవతాంశజుం డనఁ బరగున్. ౧౭౮

వ. తొల్లి ప్రహ్లాద విభీషణాదు లగు నసురపుంగవులు హరిభక్తినిరతు లగుటంజేసి యెం తెంత వా రైరి, వారి నిప్పుడు రాక్షసు లనవచ్చునె, వైష్ణవధర్మంబునకు

సాత్త్వికగుణంబు ప్రధానం బగుఁ గాని కులంబు ప్రధానంబు గా దిది పరమ రహస్యం’ బని యుపదేశించి, ‘నా యొడఁబాటు చెల్లెఁ బో’ మ్మని మరలించి యతని వీడ్కొని చూడ్కులు దళుకొత్త నత్తన్వి నిజేశుపాలికిం జనియె, నయ్యసురయు నదిమొదలుగాఁ గ్రూరకర్మంబులు విడిచి హరిచరణస్మరణంబ శరణంబుగాఁ దపంబు చేసి వైకుంఠప్రాప్తుం డయ్యె. నయ్యింతి యిట్లు సవితంత్రిభూనాథునకుఁ దన పోయి వచ్చిన వృత్తాంతం బంతయుం జెప్పిన విని యతండు దన యతివసూనృతోక్తియు బ్రాహ్మణునివిరక్తియు నసురవరుని భక్తియుం దలపోసి సంతోషించుచుండె; నంత నయ్యిరువుర యంతఃకరణశుద్ధికి మెచ్చి శ్రీవిభుండు ప్రత్యక్షమయిన నవ్వధూవరు లిట్లని స్తుతించిరి.

క. నీకంటెఁ బరము లేదు వి
వేకింప ముకుంద! వేదవేద్యులు నీ ది
వ్యాకృతి ప్రతిదివసము నా
లోకింపుదు రంతరంగలోచనశక్తిన్. ౧౮౦

క. నినుఁ దలఁప నెల్లదురితము
లును బొలియు దవానలంబులో వైచినమె
త్తనిదూది పోలె నిన్నుం
గనుఁగొన్నఫలంబు చెప్పఁగా నేల హరీ! ౧౮౧

క. కోరికల కెల్ల నెక్కుడు
కోరిక యగుమోక్షలక్ష్మిఁ గోరక యైనం
జేరును భవదీయపదాం
భోరుహములు నమ్మియున్నబుధులకుఁ గృష్ణా! ౧౮౨

చ. అని కొనియాడుదంపతుల కాజగదేకగురుండు ప్రీతి ని
ట్లను ‘మహి నేరికిం బడయ నబ్బని సూనృతనిష్ఠ మీమనం
బునఁ జలియింప కున్కిఁ గృప పుట్టి వరం బొక టిత్తు వేఁడుఁ డీ’
రనిన మహాప్రసాద మని యచ్యుతలోకము వేఁడి రిమ్ములన్. ౧౮౩

ఉ. వేఁడిన నట్ల కాక పృథివిం జిరకాల మభీష్టసౌఖ్యముల్
పోడిఁగ మీరు గాంచి మఱి పొందెద * రున్నతి’ నంచుఁ జెప్పి యా

---

* రుద్ధతి.

వేఁడివెలుంగు లోలిఁ బదివేలసహస్రము లున్నభంగి నె
వ్వాఁడు వెలుంగు నట్టిబుధవత్సలుఁ డేఁగె నదృశ్యమూర్తియై. ౧౮౪

క. ఆరమణీరమణులు నిం
పారఁగ బహువత్సరంబు లైహికసుఖముల్
గోరి యనుభవించి తుదిన్
జేరిరి హరియందు సుప్రసిద్ధము గాఁగన్. ౧౮౫

ఉ. కావున సత్యవాక్యము జగంబున నెక్కువ యండ్రు సర్వధ
ర్మావళియందు, నిట్టిసుమహత్త్వమునం గల సూక్ష్మధర్మ మేఁ
బోవఁగఁ ద్రోతు నయ్య చెడఁ బొందికగాఁ గ్రియ మాలి' యంచు న
గ్గోవు ప్రియంబునం బులికిఁ గొంకక చెప్పినచంద మంతయున్. ౧౮౬

చ. గొనకొని బ్రహ్మరాక్షసునకున్ మనుజేశ్వరనందనుండు చె
ప్పె ననుచు సిద్ధపుంగవుఁడు ప్రీతి జనింప నుపన్యసించె భో
జున కని యత్రిపుత్రుఁడు విశుద్ధచరిత్రుఁడు విస్తరించినన్.
విని మహుఁ డంతరంగమున వేఁడుక తీఁగె లెలర్ప నిట్లనున్. ౧౮౭

ఆ. 'ఇంత యొప్పు నయ్య! యితిహాసచాతురి
శ్రుతిసుఖంబు నాత్మహితము నగుచు
జాదులును హరిప్రసాదంబు నైన నే
చంద మిదియు నట్టిచంద మయ్యె' ౧౮౮

వ. అని కొనియాడి 'తదనంతర కథాప్రసంగం బెట్టి' దని యడిగిన. ౧౮౯

ఉ. కారణసింహవక్త్ర! యలికస్థితచారునిమీలితాక్ష! శృం
గారరసాధినాయక! యఘప్రకరాంధతమోవిరాస నీ
రేరుహమిత్ర! దానవసరీసృపభంగవిహంగరాజ! వృ
త్రారిముఖాష్టదిక్పతిసదార్చితపాదసరోరుహద్వయా! ౧౯౦

క. అద్వంద్వ! యప్రతర్క్య! జ
గద్వంద్య! యనాదినిధన! గర్వితదితిపు
త్రద్విపసింహకిశోర! వి
షద్వరజదళాయతాక్ష! సన్మణివక్షా! ౧౯౧

### తోటకవృత్తము

ధరణీధర ! నిర్జితదైత్యవరా !
శరణాగతరక్షణ ! చారుగుణా !
సురయూథ సమర్చిత , సూరియుతా !
పురుషోత్తమ ! శాశ్వతపుణ్యతమా ! ౧౯౨

### గద్యము

ఇది వాణీవరప్రసాదలబ్ధవాగ్విభవ తిక్కనామాత్యసంభవ
సుకవిజనవిధేయ అనంతయ నామధేయ ప్రణీతంబైన
భోజరాజీయంబను కావ్యంబునందు
జతుర్థాశ్వాసము

— ० —

శ్రీ

# భోజరాజీయము

## పంచమాశ్వాసము

శ్రీదేవీ హృత్సరసిరు
హాదిత్య! సమస్త దేవ తార్చిత విలస
త్పాదాంబుజ! శ్రీమత్తుల
సీదళ దామాభిరామ! శ్రీనరసింహా! ౧

వ. అవధరింపుము దత్తాత్రేయ మునీశ్వరుం డా నరేశ్వరున కిట్లనియె న ట్లా భోజ
రాజునకు సర్వటి సిద్ధుండు వినిపింప రత్నమండన కథాలతకుం బాయుగొన
యగు గోవ్యాఘ్ర సంవాదంబునందు మదనరేఖ చరిత్రం బిప్పుడు చెప్పం
బడియె దదనంతర ప్రసంగం బాకర్ణింపు మయ్యితిహాసంబు చెప్పి యప్పశు
రత్నం బా పులివక్త్రంబు చూచి నీవు నన్ను నమ్మకునికిం జేసి యిట్లు సత్య
వ్రతోదాహరణంబు చేసితి వింక నేమి సేయుదుఁ జెప్పుమనిన. ౨

చ. అనితర సాధ్య సత్త్వమగు నవ్వనసత్త్వము గోవుఁ జూచి యి
ట్లను 'నిపు డీవు చెప్పిన మహా మహిమంగల పుణ్యురాలికిన్
దనరఁగ నగ్రజన్ముఁడగు ధన్యుఁడు పావకలోముఁ డెట్టి వ
ర్తనములవాఁడు? వాని సతి దా నది యెట్టిది? నాకు జెప్పుమా!' ౩

చ. అనవుడుఁ జెప్పెద న్వినుము మృగాధిప! పావకలోము తండ్రికిం
జనవరియైన మంత్రి జనసన్నుతుఁ డొక్క సువర్ణకారకుం;
డనయము వానికిం దనయుఁడై గుణహీను డొకండు కుంభినాఁ
జను, నతఁ డగ్నిలోమునకు జానగు నిష్టసఖుండు మేదినిన్. ౪

క, ఒకనాఁ డయ్యిరువురు ముది
త కుతూహల వృత్తిఁ జేసి ధనువులు నస్త్ర

ప్రకరములు దాల్చి నగరాం
తిక వనవాటికలఁ గేలిఁ దేలుచు నుండన్ ౫

క. హయములు గరులును రథ సం
చయమును వివిధాతపత్ర చామరములు నై
పయనపుసిరి యుజ్జ్వలముగఁ
బయితెరువున నరుగు భూమిపాల శ్రేణిన్. ౬

వ. కని తద్వన ప్రాచీనోపాంతంబున నిల్చి సమీపవర్తులగు జనంబులం బిలిచి
'వీర లెవ్వ? రేపని కెట పోయెద? రెఱింగింపుఁ' డనిన వార లిట్లనిరి. ౭

చ. 'వనధిగభీరుఁ డొక్కఁ డజవక్షుఁడు నాఁగలఁ, డాతఁ డుర్వి నా
ట్యనగర, మా నరాధిపు ప్రియాంగన మేఖల, దానికూఁతు పే
రనుమతి, తత్స్వయంవర మహత్త్వ నిరీక్షణ కౌతుకంబునన్
జనియెద రిమ్మహీపతులు సైన్య సమన్వితులై రయంబునన్. ౮

చ. అరయఁగ నెల్లి సూర్యు నుదయంబుపయిన్ ఘటికాద్వయంబునం
బరిణయలగ్న మే తడవుఁ బట్టదు తద్విభవంబు చూచి వే
మరలఁగవచ్చు మీరును గుమారవయస్కుల రివ్వనంబులోఁ
దిరుగఁగ నేమి సిద్ధి, యరుదెం డిది యుక్తము గాదె' నావుడున్. ౯

క. రాకొమరుడు గుంభియు నా
భూకాంతలతోడ నాట్యపురి కేఁగిరి భూ
లోక విహారముఁ గోరి ది
వాకర శశధరులు గూడి వచ్చి రనంగన్. ౧౦

వ. అప్పు డప్పురంబునందు. ౧౧

సీ. వజ్ర దీధితులు భాస్వ ద్ద్వార పూరంబు,
భూషణోత్థిత రజఃపుంజ మిసుక,
ధవళ నీలారుణాతప వారణములు పి
తాబ్జ నీలోత్పల హల్లకములు,
ఇంద్రనీలపుఁ వేరు లిందిందిర శ్రేణి,
శస్త్రాస్త్ర రుచులు మత్స్య వ్రజంబుఁ,

జలిత చామరములు కలహంసములు, మణి
ద్యుతులు రక్తాబ్జ సంతతులు గాఁగ,
తే. నెలమిఁ దత్స్వయంవరమున కేఁగుదెంచి
యున్న రాజన్య సమితిచే నొప్పు మిగిలి
యుండె నా రాజమార్గంబు విందుఁగొలని
భంగిఁ గలమంజులాలాప బహుల మగుచు. ౧౨

వ. అ య్యవసరంబున. ౧౩

సీ. అజవక్షిఁ డొక యంత్ర హంసంబుఁ దెప్పించి
యా హంస యఖుత నవర్ఘ్య రత్న
మయమైన పదకంబు నయమునఁ గీలించి
యొక సౌధవేదిపై నునిచి తనదు
తనయ శృంగారించి కొని వచ్చి యా పక్షి
మీఁద నెక్కించ నా మృదులహస్త
హస్తాబ్జమునఁ దార హారంబు శోభిల్ల
నఖిల మర్త్యులకుఁ బ్రత్యక్ష మైన

ఆ. వాణి వోని కీరవాణిఁ బీనశ్రోణి
నలి వినీల వేణి నలరుఁబోణి
నట్లు లెత్తి చూచి రందఱుఁ దమ తమ
నయన విస్తృతు లొగి బయలు పడఁగ. ౧౪

క. ఆ వేళ నమ్మహీపతు
లీ వనజదళాయతాక్షి యిఁక నెవని కగున్
భావింప నతఁడ తగుఁ బో
భావజ సామ్రాజ్య పట్టభద్రుఁడు గాఁగన్. ౧౫

క, అనువారు, నవ్వధూమణి
తనక తనక యబ్బు ననుచుఁ దత్పరులై క
న్గొనువారు, మనుజలోకం
బున కిచ్చెలువంబు క్రొత్త పొమ్మను వారున్. ౧౬

వ. ఇ త్తెఱంగునం దమ తమ చి త్తంబుల కెట్లు దోఁచె నట్లు పలుకుచున్న య న్నర
నాథలోకంబు నాలోకించి సారాసారవివేకదక్షుం డగు నజవక్షుండు సకల
మహీభార భరణ సమర్థంబగు తన హ స్తం బె త్తి కలకలంబు వారించి వారి
కిట్లనియె. ౧౭

ఉ. అంబరవీధి నీ కృతక హంసిక వాఱఁగ, దీని కంఠభా
గంబునఁ బొల్చు రత్నపదకం బొక దివ్యశరంబునందు లీ
లం * బడనేసి యీ క్షితితలంబుపయిం బడకుండఁ బాణిప
ద్మంబునఁ బట్టు నే నృపుఁ డతండు వరుండగు మ త్తనూజకున్‌. ౧౮

క. అని పలికినంత విప్రులు
మును పెట్టిన పుణ్యలగ్నమున హంసం బా
వనితా వతంసమగు న
య్యనుమతి మోచికొని పాఱె నంబరవీధిన్‌. ౧౯

చ. తడఁబడ నప్పు డొండొరులఁ దాఁకుచు దిగ్గన లేచి విండ్ల నె
క్కిడియెడు వారు, నెక్కిడక యేయఁ దొడంగెడివారు, నెద్దియుం
దడవక విండు లె త్తి బెడిదంబుగ మీఁదికి వై చువారు, సం
దడిఁ బడలేక పాసి యుచితస్థితిఁ జూచుచు నుండువారలున్‌. ౨౦

క. మిడుతల గతి, సురగరుడులఁ
బొడమిన కారాకుగముల పోలికి, జెక్కల్‌
వడపిన భుజగంబుల కై
వడిఁ దఱుచుగ నమ్ము లేయువారును దివికిన్‌. ౨౧

క. ఈ తఱుచు టంపగములా
నాతిఁ దగులకుండ మున్నొనర్చిన గేహీ
భూతరచన గడు మెఱపెం
బో తిరముగ ననుచు మెచ్చి పొగడెడువారున్‌. ౨౨

క. వడి గల్గి హంసగతికిం
గడవఁ బఱచువారు, నదియ గతిగా నాసల్‌

---

* బడి నేసి.

విడిచి తమ తమ పురంబుల
కెడపక వనువారుఁ, దిరిగి యేసెడువారున్. ౨౩

వ. ఇవ్విధంబున నివ్వసుధేశు లందఱుం దమ తమ కన్నగతిం బోవ నట వోవు హంసం జూచి రాచతనంబునకు నీచత రాకుండ నింతట నా పౌరుషంబు నెఱపవలయు నని సమద సామజ గమనంబున సతి గడవం బోయి విక్రమాధి రాముం డగు పావకలోముండు. ౨౪

సీ. ధనువు క్రిందటికొమ్ము ధరణిపై మోపి, మీఁ
దటి కొమ్ము వామహస్తమునఁ బట్టి,
తత్తఱ పడకి తద్దండమధ్యంబు ద
క్షిణ జానుకరములఁ జేసి యెత్తి,
యపసవ్య కరమున నయ్యెక్కుఁ గదియించి,
ప్రియమున నారి సారించి చూచి,
ధరణియు నభము దిక్తటములు నొక్కటఁ
దల్లడపడ గుణధ్వని యొనర్చి,

తే. శరము సంధించి దృష్టి లక్ష్యమునఁ గూర్చి
సీలఁ బుచ్చినసీల నక్కెలు ప్రిదుల
నేసి, నేలపైఁ బడకుండ నెయిది పట్టి
వక్షమునఁ దాల్చెఁ బదకంబు నాక్షణంబ. ౨౫

క. ఆ లీలా హంసమునకుఁ
గీ లప్పదకంబ యనఁగ క్షితితలమునకున్
వ్రాలె నది యతని దృగ్రుచి
జాలంబున కింపుఁ బెంపు చాతుర్యగతిన్. ౨౬

ఉ. అంబరవీధి * నాడు ఝషయంత్రము నేసిన క్రీడిఁ దొల్లి మో
దం బలర న్వరించు ద్రుపద క్షితిపాత్మజభంగిఁ బ్రీతి పూ
ర్వంబున నగ్నిలోమ జనవల్లభునిం దగఁ జేరి, వాని కం
ఠంబున వైచెఁ గాంతినిబిడం బగు హారము రాజపుత్రియున్. ౨౭

* నాఁడు.

తే. అంత నక్కాంభి తన యాత్మ నింత లేసి
రాజా లిప్తారి. తన తరమా జయంబు
గొనఁగ వ్యర్థుఁడై పోయెఁ గా కనుచుఁ గొంత
తడవునకు వచ్చె నా రాజతనయ కడకు. ౨౮

ఉ. వచ్చి కృతఘ్నుఁ దప్పు నిడు వాలికకన్నులు ముద్దుమోము నే
యొచ్చెము లేని దేహలతయుం గల కోమలిఁ జూచి లోలుఁడై
యెచ్చట మోసపుత్తు నొకొ యీ నృపపుత్రుని నెప్పు డొక్కొ యే
నిచ్చపలాక్షి నెత్తుకొని యేఁగుదు నా కిరవైన చోటికిన్ ౨౯

క. అని యూహించుచు మిథ్యా
వినయంబును. రిత్తనగవు, వెడ ప్రమొక్కుల పె
ల్లును, డక్కరిమాటల తఱ
చును, నాఱడి సంభ్రమంబుఁ జూపె సఖునకున్. ౩౦

చ. అతఁ డవి కృత్రిమంబు లని యాత్మ నెఱుంగక, నిత్య సౌహృద
స్థితిఁ జెలికానిఁ జూచి 'యిటు చేకుఱె నాకు ననర్ఘ్య రత్నశో
భిత మగు నవ్విభూషణముఁ, బ్రేమరసోదయ హేతువైన యీ
యతివయు' నంచుఁ జెప్పె దరహాస మెలర్పఁగ నెమ్మొగంబునన్. ౩౧

క. చెప్పిన విని 'దేవా! నీ
కిప్పుడు రాఁ బ్రాప్తమైన యివి యెవ్వనికిం
దప్పింప వశమె! బ్రాతిగఁ
జెప్పుదు వినుఁగూర్చి యేమి చిత్రము చెపుమా!' ౩౨

చ అని కొనియాడి యప్పు డితఁ డాదట నప్పురి కేఁగె నేని త
జ్జనపతియుం బ్రధానులును సర్వజనంబులు వీనియూరుఁ దే
రు నెఱఁగిపోదు రప్పు డొకరుండును గైకొనకుండు నన్ను న
న్మనమున నున్న యిప్పని యొనర్చుటకు న్మఱి సందు లేదగున్. ౩౩

క. అటు గాన యీ కుమారునిఁ
గుటిలాలకఁ జొప్పు దప్పఁ గొనిపోవక యుం
డుట కార్యము గాదనుచుం
జొట జొటఁ గన్నీరు దొరుఁగఁ జుట్టమ పోరెన్. ౩౪

ఉ. పావకలోముఁ జూచి పెనుఁబాలు మొగంబునఁ దోఁపఁ గుంభి శో
కావిలచిత్తునట్లు మెలపారఁగ నిట్లను 'రాచవారలుం
దేవులు నిందు నీవు చనుదెంచు టెఱుంగరు, చెప్పి రాము, వే
పోవక యున్న నెవ్వగలఁ బొందరె నీ పొడగానకుండుటన్. ౩౫

క. కొలఁదిపడదు పెండిలి వే
డ్కలతో నిట్లుంటిమేని కడుఁ దడ వౌనున్,
వెలికి వెలియఁ బోద' మనుచుఁ
దొలఁగఁగఁ గొనిపోయె దంపతులఁ బెడత్రోవన్. ౩౬

క. పులు లెలుఁగు లడవియేనుఁగు
లలరెడు సింహంబు లాది యగు మృగములచేఁ
దలచూపరాని విపినం
బుల ని ట్లద్దంబు గాఁడి పోవగ నొకచోన్. ౩౭

చ అతివకు నీరువట్టయిన నంతరభేదకుఁ దొటఁ గుంభి ద
త్సతి నొక మ్రానినీడ నిడి, శైత్య జలంబులు దె త్త మంచు భూ
పతిసుతు నొక్క దిక్కునకుఁ బంపుచుఁ దా నొక దిక్కు వోయె, నా
కృతక మతంబు లెల్లఁ బరికింపఁగ నెన్నటి కింకఁ దక్కెఁ బో. ౩౮

ఆ. రాచకొడుకు తిరిగి రాకుండమున్న నా
నేర్పు మెఱయ వలయు నీళ్ళపట్టు
దయ్య మెఱుఁగు ననుచుఁ దా నెందుఁ బోవక
మగిడి వచ్చి కుంభి మగువతోడ ౩౯

ఉ. అల్లదె కంటె యొక్క జలజాకర, మేమియు దవ్వు లేదు, నీ
వల్లభుఁ డెంతప్రొద్దునకు వచ్చునొ, చెట్టులఁ జిక్కుఁగాని నీ
యుల్లము రాఁ జరించుటకు నోపెడు నంతటి వాఁడు గాఁడు నీ
వల్లన రమ్ము నావెనుక నచ్చుటఁ జూపెదఁ బెక్కు తోయముల్. ౪౦

మ. అని గర్వోక్తులు( ? ) పల్కి యా తరుణి నుగ్రారణ్య మార్గంబునం
గొనిపోవంగ 'నదేమి? కుంభి! యిట నాకుం ద్రావ నీ రెద్ది? యా
యన యే పోకలఁ బోయెనో? తడవ వే లన్నా! కడుం దూర మి
ట్టు ననుం దెచ్చితి కల్లఁ జేసి' తనుచున్ దోలాయమానాకృతిన్. ౪౧

క. అమ్ముగ్ధ సొలసి పల్కిన
'నమ్మక నీ రేమి బ్రాతి యటు నా ల్గదుగుల్
రమ్మా డప్పితి ననక ధ్రు
వమ్ముగ నీ మనసు పట్టువాఁడ లతాంగి!' ౪౨

క. అని కైదువుఁ బిరిఁ జించుచు?
ననువరి గద రన్న కుంభి యని నీతిజ్ఞుల్
విని మెచ్చవలదె పదకముఁ
గొనియె నతఁడు, నాకు దీనిఁ గొను టనుచితమే. ౪౩

తే. నాకు బాలకి, రెండును నాఁచికొనిన
నేల పోనిత్తు? నెత్తైనఁ బాలు గొందుఁ
గాక, యని మల్ల చఱచుమఁ గసరు ముట్టఁ
బలుక నక్కుంభిఁ జూచి యా జలజనయన. ౪౪

ఉ. గమ్మన కన్నునీ రొలుకఁగా నవు డిట్లనుఁ 'బాపకర్ముఁడా!
నమ్మితిఁ గాక నీ విటులు న న్నడకించుట యె ల్లెఱుంగుదుం
బొమ్మని యాతనిం దొలఁగఁ బుచ్చితి నీకులపేరు చెప్పి, నన్
బిమ్మటఁ దెచ్చి కాఱడవిఁ బెట్టితి నీ కిది మిత్రధర్మమే?' ౪౫

మ. అని శోకాకులచిత్త యై పలుకఁగా నక్కుంభి 'యే లమ్మ! న
వ్వీన నీవీ క్రియ నెగ్గు పట్టెదవు? నే విశ్వాసిఁ జు మ్మమ్మ! నీ
వనుమానింపక వేగ ర' మ్మనుచు మిథ్యాలాపము ల్పల్కఁగాఁ
గని యత్యుగ్రపు రక్కసుం డొకఁడు వీఁకన్ వచ్చె నచ్చోటికిన్ ౪౬

ఉ. వచ్చి యనర్గళ స్ఫురిత వైర మెలర్పఁగఁ 'బోకు పోకు నీ
వెచ్చటి కేఁగె దింక నిను నిప్పుడ యుక్కడఁగింతు' నంచు వా
పుచ్చి యదల్చుచున్ గనపభూజమునం దనుజుండు వ్రేయఁగాఁ
జొచ్చినఁ గుంభి దా మరలి చూడక పాఱె మహారయంబునన్ ౪౭

వ. అట్లు పాఱిన దైత్యుం డత్తెఱవ నెత్తికొని నభశ్చరుండై యరిగె ౪౮

ఉ. రావణుబారిఁ జిక్కిన ధరాసుతచాడ్పున భీతి నొంది వా
పోవుచుఁ బోవుచు న్నృపతిపుత్రునకుం దన పోక చెప్ప భూ

దేవికి లంచ మిచ్చినగతి న్స్మరవైరి యెఱుంగకుండ రా
జీవదళాక్షి యప్డు వయిచెం దన మైతొడవుల్ గ్రమంబునన్. ౪౯

సీ. అంతఁ బావకలోముఁ డట వోయి నిర్మలో
దకపూర్ణమై యొప్పు నొక మహోత
టాకంబుఁ గని తన డప్పి యంతయుఁ బోవ
జలపాన మొనరించి సరభసమున
నచ్ఛిద్ర సరసీరుహచ్ఛదంబునఁ గొంత
యుదకంబు నునిచి యయ్యువిద కినుచుఁ
గొనివచ్చి మున్ను దా నునిచి వోయినచోటఁ
దరళాక్షిఁ గానక తల్లడించి

ఆ. దెసలు కలయఁ జూచి తిరిగి వచ్చియు లతా
కుజము లరసి యెల్ల గుహాలయందు
వెదకి యోలములు వివేకించి చఱులు భా
వించి గొల్లములకుఁ బంచె దృష్టి. ౫౦

క. ఎందును గానక తద్దయు
నందరి యెలుఁగెత్తి పిలిచి 'వనజముఖీ' నీ
వెందున్న దానవే? యీ
చందంబునఁ బిల్వఁ బల్కఁ జనదే నీకున్. ౫౧

మ. ఉదకంబు ల్వెసఁ దేక యేఁ దడవుగా నున్నంతఁ గోపించి యొ
క్క దెసం దాఁగితొ? నాదు చిత్త మరయంగా నీరముల్ దూఱితో?
పొదలం బువ్వులు గోయఁ బోయితొ? మృగంబుల్ సంచరింపంగఁ జూ
చి దిగు ల్పొచ్చి తొలంగఁబాఱితొ? ననుం జింతింపవేలే మదిన్? ౫౨

వ. అని యనేక ప్రకారంబులం బ్రలాపించి, తన యరణ్యరోదనంబునకు నొండు గతి లేకునికిం జేసి తన్నుం దా నుపశమించుకొని నా వెలికాఁడును రాఁడయ్యె నట వోయి వానిం గూర్చుకొని కార్యాలోచనంబు సేయవలె నని యూహించి యా రాజనందనుండు ౫౩

చ. పదతుకఁ గానలే కునికిఁ బాయని నెవ్వగఁజేసి యెంతయున్
నుడిపడి తాఁకుచున్ దగులుచున్ గడు దూరములందుఁ జొచ్చి వో

యెడునెడఁ గుంభి వచ్చె, నొడ లెల్లఁ జెమర్పఁగ ముల్లుకంపలం
బడి తలవీర వీరఁబడి పాఱిన భావము దప్పకుండఁగన్. ౨౩

ఉ. వచ్చిన 'నెంత ద వ్వరిగి వచ్చెదొ, వీశులు గానవో కదే,
యొచ్చెల! నిన్నుఁ జూచి వగ నొందెడుఁ జిత్తము త్రావు' మంచుఁ దాఁ
దెచ్చిన నీళ్ళ వానికి నతిత్వరితంబునఁ బోసి 'చూచితో
యెచ్చటి కేఁగెనో యబల యేఁ బొడఁగానను దొంటి చక్కటిన్, ౨౪

క. అని గద్గదకంఠంబున
వినిపించినఁ గుంభి దాను విక విక నగుచుం
'గనుతిరుగలిగా కో సతి
మన పెట్టినచోట లేక మఱి యేం దరిగెన్ ౨౫

ఉ. కందువ దప్పినాఁడ వతికాముకభావము నీకుఁ గల్మి నే
పొందు నెఱుంగ వైతి వనభూములఁ గామిను లొంటిఁ బోదురే
మందవివేక! నీవు పదమా, వెడమాటలు మాను నీకుఁ ద
త్పుందరిఁ దొంటిచోన తగఁ జూపెదఁ బాపెద నీ మనోవ్యథన్.' ౨౬

క. అని యతని బ్రమయ నడపుచు
మును దత్సతి నిల్పి చనిన భూజముకడకుం
గొనిపోవ నచట నది లే
కునికిఁ బున శ్శోకవహ్ని నుల్ల మెరియఁగన్. ౨౭

ఉ. 'ఓ చెలికాఁడ! నీవు నను నూరక తెచ్చితి గాక మున్ను నే
చూచిన చోటు గాదె యిది, చూడఁగఁ జాలక యా లతాంగిఁ బోఁ
ద్రోచెఁ జుమీ విధాత' యని తూలెడు పావకలోముఁ జూచి యా
నీచు మనంబులో నగుచు నిక్కము యాప్తుఁడపోలె నిట్లనున్, ౨౮

ఆ. 'ఇంక వగవ నేల యిది నానిమిత్తమై
వచ్చినట్టి దుర్వ్యవస్థ గాదె!
నెలఁత వద్ద నిన్ను నిలిపి నీళ్ళకు నేను
బోసి తప్పు గలిగె భూపతనయ! ౫౦

ఆ. చిత్తగింపు మబల చేతప్పి పోయిన
యపుడె పోయెఁ గాక యడిచి పడిన

నెచటనుండి వచ్చు నీ గతోదక సేతు
వులఁ బ్రయోజనంబు గలదె తండ్రి!' ౬౧

చ. అనిన నతండు నీకు నిటు లాడుట యుక్తమె కుంభి! నాదు నె
మ్మనమున మర్త్యులందును నమర్త్యులయందును నిట్టి కాంత లే
దని తలపోతు; నట్టి సుభగాకృతి యే మఱవంగ నేర్తునే
చని పరికింపఁగావలయు శైల గుహాగహనాంతరంబులన్.' ౬౨

క. అని యతఁడు వెదకఁ దొడఁగినఁ
గని కుంభియు నంత నంతఁ గాళ్ళీడ్చుచుఁ బి
ల్చినఁ బది యెలుఁగుల కొకమరి
మునుకుమ వలసియును వల్లములు సనుదెంచున్. ౬౩

క. తనచేఁత నృపతిసుతుఁ డెఱిఁ
గినఁ బైవచ్చు నని పుల్లగిలిపోఁ జూచున్,
వనసత్త్వము లత్యుగ్రం
బున మెదలఁగఁ జూచి పాఱిపోవను వెఱచున్. ౬౪

ఆ అతనిఁ దిరిగి చూచి యకట నా వెనువెంట
నితఁడు తిరిగి తిరిగి యెంత డస్సె
ననుచు నిల్చి చూచుకొనుచుఁ బావకలోముఁ
డతివ వెదకుచుండె నడవులందు. ౬౫

వ. ఇట్లు కుమారవరేణ్యుం డరణ్యమధ్యంబునం బరిభ్రమించుచు నొక్కయెడ
న య్యంతి యంతకుమున్న దిగవైచి పోయిన విమలాభరణంబు లవ్వనలక్ష్మికిం
గనక కుసుమోపహారంబు గావించిన చందంబున నందంబై చాలుపడి యుండ
నొండొండ పుచ్చుకొని తన మనంబున నిట్లని వితర్కించు. ౬౬

క. శార్దూలాది మృగంబులు
మర్దించిన నిచట రక్తమాత్రము వలదే!
దుర్దముఁడగు దనుజుఁ డొకఁడు
నిర్దయుఁడై యెత్తికొని చనియెఁ గావలయున్. ౬౭

క. అని యాందోళింపుచు న
వ్వినుతాభరణములవొప్పు విడువక చనుచుం

గనియె నెమరుకట్టుల నొక
ఘన గండశిలానిబద్ధ గహ్వర మొకచోన్. ౧౮

మ. కని యా గుండు దొలంగఁ ద్రోవఁగ నశక్యంబైన నుద్యుక్తుఁడై
కనుఁగొంచుండఁగ నా నగేంద్రమువయిం గప్పారి ధూమంబు దోఁ
చిన నా చక్కటి కెక్కి చూచుడును దచ్ఛిద్రంబులో దవ్వులన్
వినిచెన్ మానవ భాషణంబులు గడున్ విస్పష్టమై వీనులన్ ౧౯

క. వినిచినఁ బావకలోముఁడు
మనమున నాశ్చర్య మంది మనుజులొ పాతా
ళనివాసులొ చూడవలయు
నని తద్గమనేచ్ఛఁ ద్రోవ నరుగఁగ నొకచోన్. ౨౦

ఉ. సన్నపుగండి యొక్కటి రసాతలమార్గము పోలె నిమ్నమై
యున్న నతండు కుంభి వెలినుండఁగఁ దా నసహాయశూరుఁడై
మిన్నక యందుఁ జొచ్చి చని మేడలఁ జారు నికేతనంబులం
జెన్నగు నొక్క ప్రోలు గని చేరఁగఁ బోవఁగ నందులోపలన్. ౨౧

క. సరిలేని యంజి, సొగటా,
లరుదగు జూదంబు, నెత్త, మచ్చనగండ్లున్
దిర మగు నోమనగుంటలు
సరసత మెయి నాడుచున్న సతులం గనియెన్ ౨౨

మ. కని యా విప్పురుషంపుఁజోట నిటు రీ కాంతాజనంబుల్ సుఖం
బున నే చింతయు లేక వేడ్కలు మదిం బొంగార నిట్లాడుచు
న్ననిమిత్తం బిది యేమి యొక్కొ యనుచున్ భావించుచున్నంత నా
తని యేతెంచుట బిట్టుబిత్కు గని కాంత ల్విస్మయాక్రాంతలై. ౨౩

క. లేచి యెదు రేఁగి లోచన
రోచు లలర నతనితోఁ దరుణు లిట్లని రే
లా చనుదెంచితి వుగ్రని
శాచరుఁ డొకఁ డిచట నునికి చర్చింప వొకో! ౨౪

క. నిన్న నొక తరుణి నిచటికి
నిన్నిచుఁడు దెచ్చి తొలఁగ నిడి నెమ్మదితో

నున్నాఁడు నిదుర వోవుచుఁ
గన్నుఁ దెఱవఁ డాఱు నెలలు గడచన కున్నన్. ౭౫

తే కలదు వీనికి నొక చమత్కార మనఘ!
యితర పురుషుఁ డిచ్చోటికి నేఁగుదెంచె
నేని యొక జాములోనన మాను నిదుర
వాఁడు వధియించు నెంతటివాని నైన. ౭౬

క. కావునఁ బదివే లైనను
నీ వీ యెడఁ దడవుగాఁగ నిలువవలదు పొ
మ్మా' యెన ననవుడు నిట్లనుఁ
బావకలోముండు కార్యబంధురుఁ డగుచున్ ౭౭

ఉ. 'చెచ్చెర నాకు నీ వెఱపు చెప్పకుఁ డేను స్వయంవరంబునం
దెచ్చిన కన్య నీ యసుర దెచ్చె నెస న్ననుఁ గానకుండ; నే
వచ్చితిఁ దన్నిమిత్తమయి, వాని వధింపక రిత్త వోవ; మీ
రిచ్చట నిట్టు లుండఁ గత మెయ్యది చెప్పుఁడ నాకు' నావుడున్. ౭౮

ఉ ఖేచరుఁడై నిశాచరుఁడు కేవలసాహసుఁ డొంటి వచ్చి మా
యాచణభావ మేర్పడఁ ద్రియామల నిద్రితలైన రాజక
న్యాచయముం గ్రమక్రమమునం గొనివచ్చి దురాత్ముఁ డిందులో
పైచిన వాఁడు తా నెపె వివాహము గాఁగలఁడట్టె మీఁదటన్.' ౭౯

క, అని తమ తెఱఁగంతయుఁ జె
ప్పి 'నరోత్తమ! యిందు వచ్చి పెక్కండ్రు నృపుల్
సని రిట మున్న యమాలయ
మున కి ద్దానవునిచేత బుద్ధిరహితులై. ౮౦

వ. కావున నీ యసురాధముండు లేవకమున్న నీ వెందేని యరిగి ప్రాణంబులు రక్షించుకొనుట ల గ్గట్లు కాక యెప్పుదేని వీని వధించి నిన్నును మమ్మును రక్కసుబారిఁ బడకుండఁ గాపాడునది' యనిన న ప్పావకలోముండు తీవ్ర ధాముండునుంబోలెఁ బ్రతాపదీప్తుం డగుచు నచ్చోటు వాసి వచ్చి కుంభకర్ణుండు వోలె నిద్రించియున్న యసురకు దీర్ఘనిద్ర గావింపం బూని కదిసి యి ట్లున్న యునికిన వధియించుట పౌరుషంబు గాదని యమదండంబునోని యంఘ్రిదం

డంబున వాని యెదురుతొమ్ము దన్నినఁ దన్ను మైసఱచి మేల్కని పిసపాటిగా నల్ల నీల్గుచు వాఁ డవ్వలిప్రక్కయైనఁ జూచి కోపంబునఁ జాపంబు విసరి వీఁపు వ్రేసిన నులికిపడి పెడచేతం గన్ను లుసిమికొనుచు లేచి కూర్చుండి తప్పక చూచి యోరీ! నీ వే యూరివాఁడ? యిచటి కెట్లు వచ్చితి? గుహాగేహ గోళంబున విశ్రమించియున్న సింహంబుతోడఁ జెనకు సారంగంబుభంగి నా నిదుర చెఱిచితి వింక నెందుఁ జొచ్చెద?' యనుచు దంష్ట్రాధరోష్ఠ దష్టుం డగుచు జంకించిన నతం డేమియు శంకింపక 'నీ వెడబింకంబు లేల? నిశా వేళయందుఁ గొంద ఱిందుముఖులం దెచ్చి ముచ్చుఁదనంబున నిచ్చో ముచ్చ మునింగియున్న నిన్ను మెయిమెయి నుండనిత్తునే చెండివైతుంగా' కని యధికరోషంబున నా దోషకారిం గడకాలు పట్టి ఖేచరప్రీతిగా బడిసె వైచు చొప్పునం ద్రిప్పి చట్టుమీఁదఁ జొనిపి ముద్దవైచునట్లు చిదురుపలై చెదరునట్లుగా నేలతో వైచి యఖర్వగర్వంబున నప్పర్వతంబు ప్రతిధ్వాన భీకర ఘోరంబగు నట్లుగాఁ బేర్చి యార్చిన. ౮౧

క. రక్కసుఁ డీ బాలునిచేఁ
జిక్కెర మా కోర్కి నేఁడు సిద్ధించెర మా
మ్రొక్కెడు మ్రొక్కులు వేల్పుల
కెక్కెర యన్నాళ్ళ కనుచు నింతులు ప్రీతిన్. ౮౨

ఉ. గ్రక్కున నేఁగుదెంచి తమఁ గాంచిన నందఱ నాదరించి యా
చక్కటి మున్ను దా విడిన చాపము నస్త్ర సముచ్చయంబు నిం
పెక్కఁగఁ జేరి పుచ్చుకొని యెప్పు డొకో పతిఁ గాంతు నంచు న
ల్దిక్కులు చూచు నయ్యనుమతిం గని పావకలోముఁ డిట్లనున్. ౮౩

చ. 'తనులత వాడె, మాసె ముఖదర్పణ, మొప్పగు మీననేత్రముల్
ఘనవిరహాశ్రుపూరములఁ గాంతివిహీనత నొందె, మార్పు గా
డ్పును పెదవల్లుచున్నది, కఠోరమనస్కుఁడు బ్రహ్మ, వాని నే
మని యిట దూఱువాఁడ వినుమా! యిటు సేయుట మానినీమణీ! ౮౪

క. అమృతమయుం డగు చంద్రుని
యమలతనువు నాఁడు నాఁటి కఱుగం బెరుగం

గమలఁగఁ జేసిన బ్రహ్మకు
రమణి[1] యి విన్నిట్లు సేయ రాకుండెదునే! ౮౬

వ. అని యుపలాలించి తనతోడనె కూడ మంగళస్నానంబు సేయించి విపులాంబ
రాభరణశోభితం గావించి గాఢాలింగనంబున నయ్యంగన నపగతక్లేశం జేసి.

చ. నరకునిఁ జంపి వానిసదనంబున నున్న నృపాలకన్యలం
దిరముగఁ దెచ్చు కృష్ణునిగతిన్ శిఖిలోముఁడు దత్సతీతతిన్
వరుస[2] వెలర్ప ముంద రజవక్షనికూఁతురు నిర్గమించినం
దరమునఁ గాచియుండిన ప్రధానిసుతుండు మనోగతంబునన్. ౮౭

మ. ఒకభంగిన్ నృపపుత్రుఁ గన్నొఱఁగి యే నుగ్రాటవుల్ చొచ్చి యీ
సుకుమారిం గొనిపోవఁగా దనుజుఁ డచ్చో నన్నుఁ బోఁదోలి యు
త్సుకరీతిం గొనిపోయె దీనిఁ, దుది మత్పూర్వార్జితోదాత్త స
త్సుకృతం బీక్రియఁ దెచ్చి యిచ్చెఁ దరుణీచూడామణిం గ్రమ్మఱన్. ౮౮

క. అనుచుఁ దదీయద్వారం
బునఁ దెనుగుండొకటి ద్రోచి పూర్ణేందుముఖిం
గొనిపోయెఁ గుంభి యపు డ
వ్వనితారత్నంబు శోకవహ్ని నెరియుచున్ ౮౯

ఉ. ఈ మనుజాధముండు నను నెయ్యెడ కీడ్చునొ, వీని గెల్వ నా
కేమి మతంబు గల్గు నని యిచ్చఁ దలంచి యళీకహాసముల్
మోమునఁ దోఁప నిట్లనియె 'ముద్దియ చేకుఱె నీదుకోర్కి ర
మ్మా! మన మెట్టులున్నఁ బెఱమర్త్యు లెఱుంగరు చన్నసన్నయున్. ౯౦

ఉ. కావున నీవు మజ్జనకుఁ గాంచి స్వయంవరలబ్ధ యయ్యె నా
కీవనజాక్షి, యంచు జనులెల్ల నెఱుంగఁగ నన్నుఁ జూపి యా
భూవిభు మన్నన ల్గనుట బుద్ధియొ[3] ప్రముచ్చునుబోలె నొక్కెడన్
బోవుటమేలొ, మత్పురికిఁ బోదము రమ్ము వికారమేటికిన్' ౯౧

వ. అని వెడ్డువెట్టిన నతండు చెల్పెడి యట్లు చేసె, నయ్యొజవక్షుండు మహాహర్ష
వక్షం డగుచు వానికి సున్నతాసనంబు వెట్టించి సభాసదులం గలయ నవలో
కించి యిట్లనియె ౯౨

---

1. నిన్నెట్లుసేయ 2 వెలర్ప 3 ప్రముచ్చులుబోలె.

ఉ 'వాలుమగ ల్మహోమకుటవర్ధను లాఢ్యులు శత్రుహస్తు ల
వ్వేళ నొకండు నాగగనవీధిని బాఱెడు హంసయక్కునన్
వ్రేలెడు రత్నభూషణము వ్రేలను జూపఁగలేక పాసి రీ
లాలితకీర్తి నిత్యశుభలక్షణుఁ డొక్కఁడుదక్క నందఱున్.' ౯౩

వ అని. ౯౪

ఉ. వానికి నవ్వధూమణి వివాహము సేయ నుపక్రమింప, న
మ్మానిని తండ్రిఁ జూచి 'వినుమా! యొకవిన్నప మప్పు డెవ్వరుం
బూని యొనర్పలేనిపని బోరనఁ దా నొనరించె మద్వరుం
డైనయతండు పేఱ, యితఁ డాతనిఁ గొల్చినబంటు భూవరా!' ౯౫

క. అని యప్పావకలోముఁడు
దనుఁ జేపట్టినదిమొదలు దా నచటికి వ
చ్చినయది తుదియుంగా దొర
కొని యన్నియుఁ జెప్పెఁ బూస గ్రుచ్చినభంగిన్. ౯౬

ఉ. చెప్పినఁ గూఁతుమాటలకుఁ జిత్తము ఘూర్ణిలఁ గుంభిదిక్కుఁ దాఁ
దప్పక చూచె భూపతి; యతండు కరంబులు మోడ్చిఁ 'దేవ! యేఁ
జెప్పెద విన్ము, నీతనయ చెప్పినమాటలజాడ యంతయుం
దప్పదు; నన్నుఁ గాదనుటఁ దా వినఁబోలదుగాని యందులోన్ ౯౭

క. మొదలం దను నేఁ బడసితిఁ
దుదిఁ దనుఁ గొనిపోయినట్టి దుష్టాసురునిం
గదనమున నేనె గెల్చితి
సుదతి భ్రమసెఁగాని రాక్షసుల మాయలచేన్. ౯౮

చ అది మది నమ్మవే నచటి కల్పులు వోవఁగలేరు, సైన్యసం
పద మెఱయంగ నావెనుకఁ బార్థివశేఖర! నీవ రమ్ము, చూ
పెదఁ గొనిపోయి యానేలవు, భీషణమూర్తులు దైత్యు లాజికిం
గదిసిరయేని నాకుఁ బని గాదు సుమీ! మునుముట్టఁ జెప్పితిన్. ౯౯

ఆ సతులు ముగ్ధ లైన జననాథ! మీరును
ముగ్ధులయ్య! యెట్టిమూఢుఁ డైనఁ

దగిలి యొడ్ల చేఁత తనచేఁతగాఁ జెప్పు
నయ్య! రిత్తసందియంబు లేల? ౧౦౦

సీ. అనిన నయ్యజపక్షుఁ డనుమతిఁ జూచి 'యీ
యనృతంబు లేమిగా ననియె ?' దనియె;
నబల 'యెయ్యది దృష్ట' మనియెఁ దజ్జనకుండు
'కల్పిత హంపికా గళసమర్పి
తాకల్ప మేమయ్యె?' ననియెఁ దత్సుత; రాజు
* దివిరి క్రిమ్మఱఁ గుంభిదిక్కు చూచె,
మొగమెత్తి కొండొక నగియె నాతఁడు
దీని కేమి మోసముగదా భూమియందు

ఆ. నిట్టిపనులు పుట్టునే యుండెనేఁ జూపఁ
గాదె?' యనియె నృపతి; కల్లకోపఁ
బదక మాజి నెచటఁ బడియెనో! వెలఁ జెప్పఁ
దనుచు నిచ్చువాఁడ ననియెఁ గుంభి. ౧౦౧

వ. అంత నయ్యనుమతి వాని యసత్యవచనంబులకుం గలుషించి, వీనివృత్తం బన్య లెఱుంగరు, సత్యంబు కాలంబ తేటపఱచు, వీని నొల్ల, నాపతి వచ్చునంతకు శివారాధనతాత్పర్యంబునం గాలంబు పుచ్చెద నని వ్రతంబు పూనియుండె. ౧౦౨

మ. అజపక్షుం డిది పోలుఁ బోలదని కార్యాకార్యనిష్పత్తికిన్
నిజ మూహింప నశక్తుఁడై యపుడు వానిం జంప నొంపం బరి
త్యజియింప న్మది నోడి తద్దయు నివాతంబైనచో సద్భట
వ్రజముం దోయము చేసి యున్న సుఖియై వర్తింపుచుండెం బురిన్ ౧౦౩

వ. అంత నప్పావకలోముండు. ౧౦౪

క. తల యెత్తి చూచి తన తో
య్యలిఁ గానక యెదుర నడ్డమైయున్న మహా

---

* దిరిగి.

శిలఁ గని మది నద్భుతసం
చలములు దలకొనఁగ బహువిచారవివశుఁడై. ౧౦౬

చ. 'దనుజానివంకవాఁ డొకఁడు దాఁ బగ నీఁగఁ దలంచి పొంచి యేఁ
జనుపథ మిట్లు చేసెనొకొ, చంపెనొకో గుణశాలిఁ గుంభి, నే
మనఁగల దానుమిత్రసుతుఁ డన్నపిఱుందఁ జరించునట్లు నా
వెనుకను వచ్చుచుండుఁ దుది వీఁడును నేమయిపోయెనో కదే!' ౧౦౭

వ. అని యతని నుద్దేశించి మఱియును. ౧౦౮

చ. కవలునుబోలె నొప్పుచును గౌతుకమందఁగ నీస్వయంవరో
త్సవమను పేరు చెప్పి కడు దవ్వుగఁ దెచ్చి కృపావిహీనుఁడై
తివిరి దురంతదుర్దశలఁ దెచ్చె విరించి భవద్వియోగసం
భవపరితాప మేమిగతిఁ బాయునొకో యని విహ్వలింపఁగన్. ౧౦౯

ఉ. ఆతనియార్తిఁ జూచి మనుజాధిపనందన లందఱు న్మనః
ప్రీతిగఁ దద్గుణావళులు పేర్కొని యిట్లనిపల్కి 'రేల యీ
రీతి నధీరున ట్లవధరించెదు, తాల్మి వహించి లెమ్ము నీ
యాతత భాగ్యసంపదకు నడ్డము గల్గునె యెందు నెన్నఁడున్. ౧౧౦

క. ఆపదలు గాఁపు లుండవు,
చూపులకుఁ [1] గులాద్రులట్లు చుట్టుకొనుఁ, దుదిన్
రూపేది విరిసిపోవు మ
హాపవనాహత పయోధరావలి భంగిన్. ౧౧౧

వ. కావున నిశ్చింతుఁడవై మమ్మింతవట్టువారిని నీవారినకాఁ బరిపాలింపు' మనిన
నీవేళ కిదియ కార్యంబనుచు నతం డంద యుండె, నంత నొక్కనాఁ డొక
కిరాతుండు వేఁటమెయి వచ్చి యచ్చేరువ మెలంగుచుండి మున్ను కుంభి
యనుమతిం బట్టి బలాత్కారంబునఁ దిగిచి తోఁకొనిపోవునప్పు డప్పదంతి
కరంబుననుండి యూడిపడి తత్ప్రాంతం బంతయుం దనమయంబకాఁ బ్రజ్వ
లించు నొక్క యనర్ఘరత్నంబు గని పుచ్చుకొని యాశాబద్ధుండై మఱియు
నేమేమి విశేషంబులు గందునో యని [2] పరికించువాఁ డెదుర నగ్గుండు గని

1 గులాద్రియట్లు, 2. పరికించుచు.

యెట్టకేలకు దిరుగంద్రోచి యామార్గంబున బిలంబు సొచ్చి చని ధనుర్ధరుం
డగు పావకలోముం గని వెఱచి పఱవందొడంగిన పావకలోముండు. ౧౧౧

చ. కమఁగొని వానిభీతి యుడుగ న్మృదురీతి నెలుంగు సూపి గ్ర
క్కునఁ గదియంగ వచ్చి 'యిటకుం జనుదేరఁగ నేమి కారణం?'
బనవుడు నక్కిరాతుఁడు యథార్థము చెప్పుచుఁ జేరి మ్రొక్కి త
ద్ఘనమణి వాని కీయఁ దన కామినిరత్నముగా నెఱుంగుచున్. ౧౧౨

చ పొరిఁబొరి నొత్తుఁ గన్నులఁ, గపోలయుగంబున నప్పళించుఁ జె
చ్చెర, నధరప్రయుక్తముగఁ జేయు, గళంబునఁ గూర్చుఁ గోర్కెఁ జే
నురమున నున్చుఁ, దుద్చుఁ గడు నొప్ప మనోభవ భూతశాంతికై
యరుదుగ రక్షపూస యఖిలాంగములం దిగమోపుచాడ్పునన్. ౧౧౩

క 'ఓరత్నమ! నాఁడాతరు
ణీరత్నము నన్నుఁ బాసి పీ విచటను నే
పారఁగ నుండితివే మన
మారాజీవాక్షిఁ గందుమా? యింక' నను‌న్. ౧౧౪

చ. అని తన నాతిపోకకు నిరంతరచింత మునింగియు న్మనం
బునకును ధైర్యమూంచి పువుఁబోఁడుల కందఱకుం దగం బ్రసా
దనము దగంగ నిచ్చి వనితాసహితుండయి తత్పురస్పరం
బునఁ దన పట్టణంబునకుఁ బోయి ప్రణామ మొనర్చెఁ దండ్రికిన్. ౧౧౫

వ. ఇట్లు ప్రణామ మొనర్చిన కుమారుం గౌఁగిలించుకొని కరుణారస మిశ్రంబులగు
నశ్రులు కన్నులఁ దొఱుంగ గద్గదకంఠుండగుచు నతని కిట్లనియె. ౧౧౬

క. 'ఇన్నాళ్ళు నిన్నుఁ గానక
కన్నులు గల్గియును లేనిగతి నుండితి నే
నన్నా! * నన్నిటు పేయఁగఁ
జన్నే నీయట్టి సుగుణ సంపన్నునకున్? ౧౧౭

క. పోయెడువాఁడవు తదభి
ప్రాయ మెఱుఁగఁ జెప్పి పోవరాదే పీకై

---

* నీకిటు.

రేయును బగలును జింతా
తోయంబులు వెల్లివిరియఁ దోఁగితి పుత్రా! ౧౧౮

చ. అది యటులుండె దైవముదయం జనుదెంచితి చాలు నింక, నా
బ్రదుకు ఫలించెఁ; గుంభి యటరాఁ డెట వోయెఁ? దనూజ! యప్సర
స్సుదతులఁబోలు నీ రెచటిసుందరు? లిచ్చటి కెట్లు వచ్చి రే
మిదయను? జెప్పు' మన్నఁ దమ మిత్రునిపోకకు వెచ్చనూర్చుచున్. ౧౧౯

క. అనుమతిప్రసంగ మెయ్యది
యును దడవక గుహకుఁ జనుటయును నచ్చో నీ
వనితలఁ గనుటయుఁ గుంభిని
ఘనగుహవాకిటను నిలువఁగా నుంచుటయున్. ౧౨౦

ఉ. చెప్పి 'నృపాల! యే నటులు చేసి గుహోద్గమనంబు సేయుచో
నప్పుడు మత్పదంబునకు నడ్డముగాఁ బెనుగుండు ద్రోచి యే
చొప్పునఁబోక్కొ యెవ్వఁడొకొ చొప్పడ నేమివిధంబొ యయ్యయో
చెప్పఁగఁ జెట్టలే నచటఁ జిక్కితిఁ గుంభియు నెందుఁ బోయెనో! ౧౨౧

క. అచ్చోటఁ గొన్ని దివసము
లిచ్చెలువలు నేను నుండ నీయర్జునకుం
డచ్చటికి వచ్చి వెలువడఁ
దెచ్చిన వచ్చితిమి భాగధేయముపేర్మిన్.' ౧౨౨

క. అని చెప్పి తదనుమతి న
వ్వనజాక్షుల నందఱను వివాహంబై నూ
తనమన్మథుఁ డనఁగ నతం
డనుదినమును మదనకేలి నలరుచు నుండన్. ౧౨౩

చ దివిజవధూటి భావమునఁ ద్రెక్కొనుదుఃఖము లెల్లఁ బోవఁగా
నితనికి నైనదిక్కును నహీనదయామతిఁ జేసి మేనకా
సుతకును గర్భలాంఛనము చొప్పడఁగా ఘనయోగవైభవో
న్నతి నొక యోగికాంత నృపనందనుపాలికి వచ్చె వేడుకన్. ౧౨౪

వ. ఇట్లు తనమ్రోల కేతెంచిన సిద్ధవనితకు గొబ్బున లేచి మ్రొక్కి యక్కాంత చేతం గృతాశీర్వచనుండై సబహుమానంబుగాఁ దెచ్చి కూర్చుండం బెట్టి కొనిన. ౧౨౫

క. పెదవులు గదలెం గదలవు
రదనంబులు గానవచ్చె రావను పాటిన్
మృదువచన రచన లెసఁగఁగ
ముదిత యతని హృదయకమలముం గరఁగించెన్. ౧౨౬

వ. ఇవ్విధంబునఁ బూర్వరంగంబులగు ప్రసంగంబులు చెల్లం దదవసరంబునఁ బావకలోముండు. ౧౨౭

తే 'ఎచటనుండి వచ్చి తిందుల' కనిన న
య్యగ్నిలోమునకును ననియె వనిత
'సకలభూములందుఁ జరియింతు నే, నిక్క
డక్క డనఁగఁ గలదె యొక్కచోటు ?' ౧౨౮

క. అన విని 'నీవు వరించుమఁ
గనినట్టివి వింత లేమి గల ?' వని యడుగన్
గను మట్టులైనఁ జెప్పెద
నని యిట్లని చెప్పెఁ దాపసాంగన ప్రీతిన్. ౧౨౯

చ. 'అనుమతినాఁగ నాట్యనగరాధిపుఁ డయ్యజవక్షుకూఁతు రా
కనకలతాంగిఁ దత్కమలగంధిని మున్ను స్వయంవరోత్సవం
బున వరియించినాతఁ డెట వోయిననో, మఱి యొక్కఁ డేమ బొ
మ్మని కొనివచ్చి తత్పితృసమక్షమున న్మదిరాక్షి నుంచినన్. ౧౩౦

ఆ. వార లియ్యకొని వివాహంబు సేయ ను
పక్రమింపఁ గొన్ని వక్రభాష
లుచ్చరించి వీని నొల్ల, వీఁ డెక్కడి
భర్త నాకు, వీఁడు పాతకుండు. ౧౩౧

వ. వీనిం బరిహరించెద- నాపెనిమిటి వచ్చునంతకు నంబికారాధన తత్పరనై కాలంబు పుచ్చెద నని పంతగించి యున్నయది. ౧౩౨

ఆ. రాతిబొమ్మకైనఁ జైతన్య మొనరించి
కరఁగఁజేయవచ్చుఁ గాని మఱియు
రమణిదైన యంతరంగంబు గరఁగింప
నంగభవునికైన నలవి గాదు.' ౧౩౩

క. అని చెప్ప నాతపస్విని;
విని రాజతనూభవుండు వెఱ గందుచు న
య్యనుమతి నెవ్వఁడొకో తో
డ్కొని చని కడు దుఃఖపఱిచెఁ గుత్సితవృత్తిన్. ౧౩౪

చ అని తలపోసి నెమ్మనమునందు జనించు వియోగశోక మ
వ్వనితకుఁ దోఁపనీక మృదువాక్యపురస్సర సత్సుసంపదల్
తనరఁగ నిచ్చి పంపి, త్వరితంబున నయ్యజవక్షప్రోలికిన్
జని కనియెన్ వ్రతస్థయగు చాన నిజాంగనఁ జారులోచనన్. ౧౩౫

వ. అనుమతియుఁ దన శివారాధనంబు ఫలించెఁ గదా యని ప్రమోదంబు నొంది నాథురాకకు సంతసించి యతని నుద్దేశించి. ౧౩౬

చ. 'కటకటఁ గుంభి నీకుఁ జెలికాఁడని నీవెనువెంటఁ ద్రిప్పఁగా
నిటువలె నయ్యె నింక నిటు లేటికి మాటలు విన్నుఁ జూడఁగాం
చుటఁ గృతకృత్య నైతి' ననుచున్ వెస డగ్గఱ నేఁగి వానిఁ గౌఁ
గిటఁ గదియింపఁ దజ్జనని క్లేశము నొందుచుఁ జేరి యిట్లనున్ ౧౩౭

క. అమ్మమ్మ! యేల భ్రమసితి
విమ్మనుజాధిపుఁడు నీకు నెక్కడి మగఁడే!
యుమ్మలిక యుడిగి రమ్మా,
కొమ్మ! వినియెనేనిఁ గుంభి కోపించుఁ జూమీ!' ౧౩౮

ఆ. అనినఁ దల్లిఁ జూచి 'యరయిక లేనివా
క్యంబుగాక, పాపకర్ముఁడైన
కుంభిఁ బెద్దఁజేసికొని యుత్తమక్షత్ర
వంశజాతు నితని వదలఁదగునె! ౧౩౯

క. నాకింక నితనితోడిది
లోకము. నీవరుగు' మనిన లోలాక్షి మదిన్

శోకించుచుఁ జని చెప్పె మ
హీకాంతున కంతవట్టు నేకాంతమునన్. ౧౪౦

క. ఇప్పని యుక్తము గాదని
యప్పడుమకు బుద్ధి చెప్పి యదలుప కున్నన్
ముప్పగునని యడిచిపడుచు
నప్పుడ చని కూఁతుతోడ నజవక్షుఁ డనున్. ౧౪౧

ఉ 'ఆదిక దెచ్చుకొంటి. తగునమ్మ' తనూభవ! యిట్టులైన నీ
తోడికుమారికల్ నగరె. ధూర్తకళంకుని గుంభి నొల్ల కే
వాఁడొ యెఱుంగ మాతనిని నమ్ముచుఁ డందువు తప్పు గాదె, నా
తోడు మదీయబుద్ధి విను. దుఃఖముగట్టకు మాకు ముప్పునన్.' ౧౪౨

ఆ. అనినఁ దండ్రిఁ జూచి యనుమతి యిట్లను
'నేటిమాట లాడె దెఱుకమాలి
నీకుఁ గుంభిగాని నాకు వాఁడయ్యామే
ధ్యంబులోని క్రిమివిధంబు సుమ్ము. ౧౪౩

క. ఈరాజకుమారుఁడు దను
గారవమునఁ బెనుపఁ బెరిగి కడుఁ గ్రొవ్వి కదే
వారక వాఁడిటు చేసెను
మీరీ మొద లెఱుఁగ రివియె మీదు విమర్శల్. ౧౪౪

క మీతో నాఁడును జెప్పనె,
పాతకుఁడగు కుంభిమాట పాటిగఁ గొని మీ
రాతని నుపేక్షచేసితి.
రాతఁడు కీడ్పఱిచె నితని నన్యాయమునన్. ౧౪౫

తే. రాష్ట్రమునన్నైనపాపంబు రాజుఁ బొందు;
క్షితిపుపాపంబు మఱి పురోహితుని బొందు;
మగువచేసినపాపంబు మగనిఁ బొందు;
శిష్యుపాపంబు గురుఁ బొందు సృష్టియందు ౧౪౬

క. అని తన్నుఁ దూలఁబల్కిన
యనుమతిమాటలకుఁ గలఁగి యజవక్షుఁడు ము

న్నను నిది యిట్టులు పల్కె ని
తనివలనం దెలియవలయుఁ దత్కథ యనుచున్. ౧౪౭

ఉ. అవ్విభుఁ డగ్నిలోముఁ గదియం జని తేకువ యుల్లసిల్ల 'నీ
వెవ్వఁడవన్న? నీ జనకుఁ డెవ్వఁడు? మత్పురి నున్న కుంభి దా
నెవ్వఁడు? నీకు నీవనిత యేమగుఁ? జెప్పఁగదన్న! కానలే
కివ్విధిఁ జిక్కు దుల్పెద మనేకదినంబులనుండి' నావుడున్ ౧౪౮

వ. తనపేరు తాను జెప్పవలసెనని విషాదంబు నొందియుం గాలస్వభావంబు గదా
యేమి సేయవచ్చు నని తలంచి యిట్లనియె ౧౪౯

క 'పావకలోముఁడు నే, నో
భూవర! యంభీరనృపతి పుత్త్రుఁడ, నస్మ
త్సేవకుఁడు కుంభి, యనుమతి
నావనిత, స్వయంవరంబునం బడసితి నేన్.' ౧౫౦

క. అని తనకుఁ గుంభి యొనరిం
చినద్రోహము లెల్లఁ దెలియఁ జెప్పిన విని య
జ్జననాయకుఁ డాకష్టుని
కిని దగుదండనము సేయఁ గెరలినయంతన్. ౧౫౧

వ మిత్త్రద్రోహియగు కుంభి వెఱపు గదుర వడవడ వడంకుచున్నం గాంచి
పావకలోముండు. ౧౫౨

క, 'తమ్ముఁడ! యేమియు వెఱవకు
నమ్ముము నన్నిట్లు సేయ నాదెస నపరా
ధమ్మేమి కలిగె బొంకక
యిమ్మనుజాధిపునియెదుర నేర్పడఁ జెపుమా!' ౧౫౩

తే. అనిన 'సర్వాపరాధి నే నధిపతనయ!
నీవు పుణ్యాత్మకుండవు నీకుఁ దప్పు
మోప నే నెంతవాఁడ నా పాపమునకుఁ
గడమ లే' దంచుఁ జాఁగిలఁబడియెఁ గుంభి ౧౫౪

క. కనుఁగొని యజవక్షునితో
ననుమతి 'యిదె చూడు నీకు నల్లుఁడ నని వ

చ్చినద్రోహిమాట నిక్కం
బని నను గోపించి తిప్పు డైన దెలిసెనే. ౧౫౫

క. అనవుడు ముడివడు బొమ్మలు,
గనలెడుకన్నులును, నదరుకటములు, నెగ బా
ఱినమీసలునై యత డి
ట్లను భటులం గుంభి జూపి యౌడు గఱచుచు౯. ౧౫౬

సీ. 'ఈ పాపకర్ముని నిప్పుడ కొనిపోయి
పూరివెంటులు చుట్టి పురముచుట్టు
ద్రిప్పి తోకొనివచ్చి తెకతెక నుడికెడి
యుక్కుగంబముతోడ నొత్తిపట్టు,
డినుపరాగోలల నిఱికించి యంతతో
నన్యకాంతోపగూహనసుఖంబు
పైబడి కోరిన ఫలము చేసేతన
మనసార గన్గొను' ననిన నతని

ఆ. తెగువ జూచి యనుమతీవల్లభుడు 'వీని
నిట్లు సేయకున్న నేమి దప్పె?
ధరణిపతులు చేయు దండనంబునకంటె
దక్కువయ్యె! జమునిదండనంబు? ౧౫౭

వ. కావున వీనిని మీదేశంబునుండి వెడలదోలుటయె చాలు, చంపనీ' ననిన నజ
వత్సుం డల్లునిమాటమెయి నట్ల చేసె. ౧౫౮

ఉ. అంత బతివ్రతాగుణమహత్త్వము జూచి సురల్ ప్రమోదిత
స్వాంతత యొప్ప గ్రొవ్విరులవాన గురించిరి భామమీద, ది
గ్దంతిసమానబాహుబలగర్వితు డా శిఖిలోముమీద, ని
శ్చింతులునై కనుంగొని రశేషజనంబులు నవ్విశేషము౯, ౧౫౯

తే. అప్పు డజవత్సు డిరువుర నందలముల
మీద నెక్కించుకొని యప్రమేయవిభవ
మొనర గొనిపోయి యొక పుణ్యదినమునందు
బెండ్లి సేయుడు నిశ్చలప్రేమతోడ. ౧౬౦

వ తత్ప్రతీద్వితీయుండై యతండు రతిసమేతుండగు మీనకేతనుండునుంబోలెఁ బొలుపొందుచు నాట్యనగరంబునందుఁ గొన్ని దినంబు లుండి యొక్కనాఁడు తన మామచేత ననుజ్ఞాతుండై భార్యయుం దాను నిజపురంబగు దివిజపురంబు నకుం జని యంభీరమహారాజునకుం గుంభినీమహాదేవికిం దండప్రణామంబు చేసి యనుమతిం జూపిన నారాజపుంగవుండు నిజాంతరంగం బాశ్చర్యతరం గంబుగా నతని కిట్లనియె. ౧౬౧

ఉ. 'ఏలర ముద్దుకూన! నను నెప్పుడుఁ గన్నుమొఱంగి పోయె ద
వ్వేలుపుటింతులట్టి యరవిందదళాక్షుల మున్నుఁ దెచ్చితీ
బాలికఁ దెచ్చి తిప్పు డిదె భావజుదేవియుఁ బోనిదాని నీ
లీల దలంప నచ్చెరువు, లేమలఁ గందువఁ బెట్టి తెచ్చెదే.' ౧౬౨

క. అనిన నతఁ డింకఁ దాఁపఁగఁ
బని లే దంతయును జెప్పఁబడు నని చెప్పెన్
మును గుంభియుఁ దానును నటు
చనుటాదిగఁ గల్గు తత్ప్రసంగము లెల్లన్. ౧౬౩

వ. అంభీరనృపతియుఁ గొడుకుపలుకు లాలకించి కుంభినీతలకుఁ జిత్తంబునం గలుషించి 'వాఁడు నీకాప్తుఁడై యుండి యింత చేసెనే యక్కటా కృతఘ్నుల తోడ నేస్తం బిట్టిలుండుఁ గాఁబోలు' నని గుణధాముండగు పావకలోము భూమిపాలనంబునకు నభిషేకంబు చేసి తాను దపోవనంబునకుం జనిన నతండు సింహాసనస్థుండై దుష్టజననిగ్రహంబును శిష్టజనానుగ్రహంబును దనకు నిత్య కృత్యంబులుగా ననేకవర్షంబులు రాజ్యంబు చేసి పూజ్యంబగు శివసాయుజ్యంబు వడసె నని యప్పళురత్నంబు పుండరీకంబునకుం జెప్పె నని ౧౬౪

ఆ. బ్రహ్మరాక్షసునకు రత్నమండనుఁడు చె
ప్పుట యుపన్యసించె భోజపతికి
సిద్ధుఁ డంచు నిట్లు చెప్పిన విని తద
నంతరప్రసంగ మడుగుటయును. ౧౬౫

చ. ప్రణమ దశేషకల్మషపరాగ నిరాసపయఃప్రపూర! మా
ర్గణగణ నిర్గతానలశిఖా పరిశోషిత సింధురాజ! భీ

షణదశవక్త్రి వక్త్రిజలజవ్రజ చంద్ర! సమస్తలోకర
క్షణ పటువీక్షణ స్ఫురణ! గర్వితదానవ మానమర్దనా! ౧౬౬

క. దుగ్ధాబ్ధిశయన! యదుకుల
దుగ్ధాంభోరాశిచంద్ర! దుగ్ధ మరాళ
స్నిగ్ధయశ! యశోదా స్తన
దుగ్ధప్రియ! గోపసదనదుగ్ధ సుచోరా! ౧౬౭

### భు జం గ ప్ర యా త ము

రమాహృత్పయోజాత రాజీవమిత్రా!
తమా లాతసీపుష్ప ధామా బ్జనాభా!
యమా సంతతస్తోత్ర యోగ్యాభిధానా!
సముద్య త్ఖగాధీశ శైలాగ్రధామా! ౧౬౮

## గ ద్య ము

ఇది వాణీవరప్రసాదలబ్ధవాగ్విభవ తిక్కనామాత్యసంభవ
సుకవిజనవిధేయ అనంతయ నామధేయ ప్రణీతంబైన
భోజరాజీయంబను కావ్యంబునందుఁ
బ ం చ మా శ్వా స ము

—: o :—

శ్రీ

# భోజరాజీయము

## షష్ఠాశ్వాసము

శ్రీయువతీ మృదువచనర
సాయన పరిపూర్ణకర్ణ! శశివిభవర్ణా!
మాయాతీత! సువర్ణ
స్తేయాద్యంహోవిఘాత! శ్రీనరసింహా! ౧

వ. అవధరింపు మమ్మహీపతి కిట్లనియె నట్లు రత్నమండపమందు చెప్పు గోవ్యాఘ్ర సంవాద కథావిశేషంబునఁ బావకలోముచరిత్రంబు విని 'చిత్రకాయం బెటు వోయె నక్కథ విని బ్రహ్మరాక్షసుం డేమి చేసె నెఱింగింపు' మని భోజుం డడిగిన సర్పటి యిట్లని చెప్పె నాప్రసంగంబు విని. ౨

క. తా నెఱిఁగినకథ చెప్పితిఁ
బో నీ కుండెడునె యింకఁ బులి యని మదిలో
మానిన సంతసమున నా
ధేనువుఁ దాఁ జనవు మెఱపి ధృతి నిట్లనియెన్. ౩

క. 'పావకలోముని చరితము
భావ మలర వింటి వింకఁ బంపుము నన్నున్
రావలయుఁ దిరిగి వేగమ'
నావుడుఁ బులి గోవుఁ జూచి నగి యిట్లనియెన్. ౪

క. ఏమిటికి నెట్టుకొనియెదు
నీమాటల నాకుఁ గడుపు నిండునె పుత్ర
వ్యామోహ మేల విడువవు
నాముందటఁ బ్రిదుల వచ్చునా నీ కింకన్. ౫

ఆ. అకట నీవు నన్ను నడకిం వి పోఁ జూచె
దేను మోసపోను గాని గోవ!
యడవిలోన నున్నయంతనె పులి యింత
యెఱుక లేని దయ్యెనే తలంప. ౭

ఉ. నావుడు ని ట్లనుం గపిల 'నావచనంబు లనర్థకంబులే?
నీవు వివేకశీలుఁడవు నీ కిటు లాడుట యుక్తమే? ననుం
బోవిడు మంట ని న్నొఱఁగి పోవుటకే? పదివేలు చెప్పినన్
భూవలయంబులోఁ బలికి బొంకుటయుం బ్రతుకే తలంపఁగన్. ౮

తే. ఆడి తిరిగినఁ జండాలుఁ డంద్రు గాని
కులము చండాలుఁ డైనను గొఱఁత లేదు
బొంకకున్నఁ జందాలుఁడె పో ధరిత్రిఁ
బూజ్యుఁ డనుమాట వినవయ్య! పులులరాజ! ౯

తే అతిథిసత్కారమునకంటె నధిక మైన
ఫలము లే దంద్రు పెద్ద లీ పట్టునందు
నీవ యతిథివి నాకు ని న్నిచట డించి
పోయి రాకున్నఁ బాపంబు పొరయ కున్నె? ౧౦

ఆ కన్నకడుపుగానఁ గడుఁ బిన్న గాన నే
నతనిఁ బాపి దూర మరుగునట్టి
వేళ గాన వాని వీక్షించి రాకున్న
వగపు మాన దనిన వదల వైతి. ౧౦

క నీ కిష్ట మైనఁ జాలుం
గా కట్టులు సేయు' మనినఁ గారుణ్యరసో
త్సేకంబై తన చిత్తము
వే కరఁగుడుఁ బుండరీకవిభుఁ డి ట్లనియెన్. ౧౧

చ కొడుకుఁ దలంచి నీవు గడుఁ గొందల మందఁగఁ జూచి గోవ! ఎ
న్విడిచిన నాఁకటందనువు నిల్వదు నాకు గృహంబు కేఁగి యే
తడవుకుఁ గాని రావొ శపథంబులు పల్కక నమ్మఁ జాల' నా
వుడుఁ బులిఁ జూచి గోవు' వినవో మదిలో ననుమాన మేటికిన్. ౧౨

సీ. ఇంటికి నేఁగి నే నిచటికి రాకున్న
వెలఁదులసంసర్గ విడువలేని
యతి వోవుగతికి, మధ్యస్థుల మని కూడి
పాడి చెప్పెడిచోటఁ బక్షపాత
మతిఁ బల్కునాతని గతికి, నిల్లడసొమ్ము
నడగోలు గొని త్రోచు నతనిగతికి,
జట్టియుఁ బెండ్లియు సంఘటించినచోట
విరియఁ దన్నినదుష్టనరునిగతికి

తే. మిత్రుఁడై పొత్తు గుడిచి యమిత్రభావ
మాచరించి లో నిచ్చినయతనిగతికి
గోవు లుపవాస ముండంగఁ గుడిచినతని
గతికిఁ జనుదాన శార్దూలగణవరేణ్య! ౧౩

ఉ. గోవులఁ దప్పు లేకయును గొట్టినతిట్టినయాతఁ డేగతిం
బోవు పరాంగనారతికిఁ బొంచినపాతకుఁ డెందుఁ జొచ్చు ముం
జీవిత మంది రాచపని చేయక పాఱినపంద యేఁగు నే
రావున కన్ని చోట్లను బడం గలదాన ససత్య మాడినన్. ౧౪

ఉ. ప్రల్లద మాడి పెద్దలకు బాధ యొనర్చునతండు, తండ్రికిం
దల్లికి మాఱుపల్కెడు నతండును, నాఁకొని వచ్చి యొడ్లచే
నల్ల మెలర్ప మేయఁ జనుచున్నవృషంబు నదల్చునాతఁడుం
ద్రెళ్ళెడు నట్టిదుర్గతులఁ ద్రెళ్ళుడు నేమును రాక తక్కినన్. ౧౫

సీ. అపరాహ్ణవేళయం దతిథి యాఁకొని వచ్చి
యడిగినఁ బెట్టక కడపువాని
గతికి, నర్థాపేక్షఁ గన్నియఁ గొనిపోయి
ముసలికి నిచ్చుతామసునిగతికిఁ,
బాపంబు లేకయె పత్నిఁ బరిత్యజిం
చినవానిగతికి, నాశ్రితచయంబు
గ్రాసంబు లేక దుఃఖముల నొందఁగ నస
ద్వ్యయ మాచరించినవానిగతికి,

తే. ధారవోసినధన మీక తత్ప్రతిగ్ర
హీతఁ బలుమాఱు నడిగించుదాతగతికిఁ
బోవుదాన నింటికిని నేఁ బోయి మరలి
రాక తక్కితినేఁ బుండరీకవర్య!' ౧౬

క. అని శపథంబులు పలికిన
విని వ్యాఘ్రము 'నీవు ధర్మవిదురాలవు నీ
కెన యెవ్వరు ధేనువ! యే
నిను నమ్మితిఁ బోయి రమ్మ' నినఁ బటుబుద్ధిన్. ౧౭

వ. పులికిఁ బ్రదక్షిణించి తలఁపుం బలుకున్ సదృశంబు గాఁగ న
స్ఖలితవిలాసయాన మెసఁగం బురి కేఁగెఁ జతుస్తనంబులుం
బలపి పొదుంగు వ్రేఁగుపఱుపంగ గభీరరవంబుతోడ వీ
థుల నడయాడుబాలకులు దోరపుభీతిఁ దొలంగి పాఱఁగన్. ౧౮

ఉ. ఆయతరీతిఁ దద్ధ్వని రసాయనమై చెవి సోఁక నప్పు డం
బే యనుచుం బ్రతిస్వనము పెల్లుగఁ జూపుచుఁ బాఱి ధేనువున్
డాయఁగఁ బోయి వేడుక నొడ ల్గదలింపుచు వాల మార్చుచుం
బాయక గుప్పుచుం గుడిచె బాలవృషంబు నిజాంశదుగ్ధముల్. ౧౯

తే. కొడుకు చనుఁగ్రోలుచున్నంతదడవుఁ దల్లి
యడుగు దిరుగక కదలక యన్యచిత్త
గాక పై నీఁగ సోఁకినఁ గదలకుండె
నెమ్మిఁ బాషాణధేనువు నిలిపినట్లు. ౨౦

చ. కనుఁగొని యప్పు డాగృహిణి కౌతుక మందుచు వచ్చి దద్ఘన
స్తనములచాయఁ జేతికలశం బటు సాఁచిన దాని నిండెఁ బొ
మ్మని కొనియాడ నర్హ మగునట్లుగ నుఱును దాయి లేక చ
య్యనఁ బిదికెన్ సుధాసమసమంచిత సారపయఃప్రపూరముల్. ౨౧

వ. అయ్యవసరంబున. ౨౨

సీ. పొట్టపొంగునఁ దల్లి పొదివాసి వీధికిఁ
బాఱి క్రమ్మఱఁ బెద్ద పరువుతోడఁ

వల యెత్తి చూచుచుఁ బలుమాఱుఁ దను దల్లి
పిలువంగ నిట నటఁ బొలపి యాడు
నిలమీఁద మో మిడి యే మేని మూర్కొనుఁ
బసి వెట్టికొనుచుఁ దత్ప్రాంతమందు
నంతంతఁ బసిబిడ్డ లడ్డంబు నుడిసిన
జంకించి మిన్నంటఁ జొకళించు

తే. నిట్లు శైశవక్రీడల నెసంగుచున్న
కొడుకుదెసఁ జూచి కన్నీరు గ్రుక్కుకొనుచుఁ
'గటకటా యిట్టి నెత్తురుఁగందు నిచట
వైచి పోవంగ వలసెనే నీచగతికి, ౫౩

ఆ. తల్లు లరుగుదేరఁ దనయీడుకోడెలు
సదమలానురక్తి నెదురువాఱఁ
దాను గూడపాఱి తన మాతృహీనతఁ
దెలిసి బిడ్డఁ డెంత దలఁగ కున్నె?' ౫౪

వ. అని శోకించుచు మఱియును. ౫౫

ఉ. ఏఁ దనుఁ బాసి పోవుతెఱఁ గెద్దియుఁ గానఁడు వీఁడు నెమ్మదిం
దాఁ దిరుగం దొడంగెఁ బులి తద్దయు నాఁకొని యోర్వలేక నా
మీఁద నసత్యదోష మిడి మిన్నక పోవునొ యింక నాకు ని
చ్చోఁ దడయంగ రా' దనుచు సూనుని డగ్గఱి ధేను విట్లనున్. ౫౬

క. 'నిన్నుఁ గని యన్ని దినములు
చన్నిచ్చితి నేను ఋణవశంబున నిఁక నీ
వెన్నఁడు నన్నుఁ దలంపకు
మన్న' మమత్వంబు విడువు మన్న మనమునన్. ౫౭

క. మమకారంబు నహంకా
రము సంసారానుబంధరజ్జువు లని చి
త్తముల వివర్జింతురు సం
యము లీవును నడుపుమా త దాచారంబున్. ౫౮

క. ఆడకు మసత్యభాషలు
కూడకు గొఱగానివాని గొంకక యొరు లె
గ్గాడిన నెదు రుత్తరమీఁ
జూడకు విని వినని వాని చొప్పునఁ జనుమీ. ౨౯

క. ఒంటి చరింపకు పొలమున,
నింటికిఁ గడుప్రొద్దు గలుగ నేతెంచుచురా,
వెంటఁ బడి పొడుచుగోవుల
జంటఁ జనకు, ద్రయ్యఁబడక సందడి యగుచోన్. ౩౦

క. అంగజకేళికి దివిరెడు
పుంగవులను మసరు కలిసి పోరాడకు, పీఁ
కం గాలు ద్రవ్వు వృషభము
లం గదియకు తెవులుగొంటులం గూడకుమీ. ౩౧

క. తొడుకు డినఁబోవు పసరము
బడిఁ బోకుము, తురగగార్దభద్విరదాదుల్
నడచుపథంబున కడ్డము
నుడియకు, దుర్జనులు మెలఁగుచో నిలువకుమీ. ౩౨

క. నూతుల దరులనుఁ లోఁతగు
పాతటికసవులను నెట్టిపచ్చిక యున్నన్
బ్రాతిపడి మేయఁ బోకుము
మూతి నిడకు ముగ్రసత్త్వములు గలనీటన్, ౩౩

క. ఏనుఁ గలిగియుండఁగ నె
వ్వానికి నిను ముద్దు సేయ వాలాయ మగున్
గాని, యిటమీఁద నెవ్వఁడు
గానికిఁ గైకొనక చుల్కగాఁ జూచుఁ జుమీ, ౩౪

క. చులుకన జలరుహతంతువు,
చులుకన తృణకణము, దూది చుల్కనసుమ్మీ,
యిల నెగయుధూళి చుల్కన,
చులుకన మఱి తల్లి లేని సుతుఁడు కుమారా! ౩౫

ఉ. కావున నిట్టిలాఘవము గానుపకుండఁ బ్రభుత్వముఞ్ గుణ
శ్రీ వెలయంగ సజ్జనులఁ జెంది తదీయ హితోపదేశముల్
నీ విమలాంతరంగమున నిల్పుము, కాని నిరర్థగోష్ఠికిం
బోవకు మయ్య ! * దుఃఖములఁ బొందకు మయ్య ! వివేకహీనతఞ్. ౩౬

చ. అని తగ బుద్ధిఁ జెప్పెడునిజాంబఁ గనుంగొని తత్తనూజుఁ డి
ట్లను 'నిదియేమి తల్లి! యిటు లాడెదు? విప్రుఁడు నిన్ను నర్థకాం
క్ష నొకని కమ్మెనో, తనదు గాదిలిపుత్రికి నీఁ దలంచెనో,
యెనయఁగఁ బుణ్యకాలమున నెవ్వరికేనియు ధార వోసెనో. ౩౭

ఉ. నీ వెట వోయె దేను నట నీవెనుకం జనుదేరఁజాలనే
గోవును గ్రేపుఁ దల్లి మఱుఁగుల్గ నొనర్చువివేకహీనుఁ డే
రావునఁ గల్గునే! కటకటా నను డించి యథేష్టబుద్ధిమైఁ
బోవుతలంపు నీ కెటులు పుట్టె విచారము చాలదో కదే' ౩౮

వ. అనినఁ గ్రేపుమాటలకు మిక్కుటంబగునక్కటికంబు మనంబునం బొడమ
న గ్గోవి ట్లనియె. ౩౯

క. 'ఇవ్విప్రవరేణ్యుఁడు నను
నెవ్వరికిని నొసఁగఁ డేన యేఁగెద విను మం'
చవ్వివరము సర్వంబును
నవ్వత్సముతోడఁ జెప్ప నది కడు భీతిఞ్. ౪౦

క. పిడుగడిచినక్రియ, నీటెం
బొడిచినగతి, గుండె పగిలి భూస్థలిమీఁదఞ్
బడి పొరలుఁ, దన్నుకొను; ను
గ్గడువుగఁ గన్నీరు నించు, గడగడ వడఁకుఞ్. ౪౧

క. 'బే' యనుఁ, దల్లీ! నీ వెట
వోయెద? వను, 'నన్ను డించి పులివాతఁ బడఞ్
బోయెదవే?' యనుఁ, 'జెల్లం
బో' యను, 'నిం కేటిబ్రతుకు పో నాకు' ననుఞ్. ౪౨

---

* దుర్గములు.

క. ఇవ్విధమున శోకింపఁగ
నవ్వత్సశిరంబుమీఁద నానన మిడి "నీ
వెవ్వరికిఁ గాఁగ వగచెద
వివ్వలవనిజాలి పడఁగ నేటికిఁ బుత్రా! ౪౩

చ. అరుదుగ సత్యవాక్యము సహాయముగాఁ బులిత్రేని వక్త్రగ
హ్వర మను పెద్దత్రోవను రయంబున స్వర్గసుఖంబుఁ జూఱకో
నరుగుచునున్నదాన; నిది హర్షము నొందెడువేళ గాక దు
స్తర మగుశోకముం బొరయుదానికిఁ గారణ మేమి చెప్పుమా. ౪౪

క. పుట్టినపిమ్మటఁ జావును
గట్టి; వృథామరణ మొందుకంటె బుధులకున్
దట్టమగు కీర్తిసుకృతము
లిట్టలముగఁ గల్గుచావు లింపులు గావే! ౪౫

ఉ. శోకము దక్కి లెమ్ము గుణశోభిత! నీ వనఁ దల్లివాక్యముల్
గైకొని తత్తనూభవుఁడు కంపము నొందుచు లేచి 'యక్కటా!
గోకులభూష, నీకు సమకూరెడుశాశ్వతపుణ్యలోకముల్
నాకు నగమ్యదేశములె? నన్నును దోఁకొని పొమ్ము' నావుడున్. ౪౬

క. సంతతి యెడతెగి సంతన
నెంతటిపుణ్యగతు లైన నెడతెగు నని సి
ద్ధాంతము విను నాతమ్ముఁడ!
చింతింపకు మొక్క తెలివి చెప్పెద నీకున్. ౪౭

క. సుతుఁడు మహిఁ దల్లిదండ్రులఁ
బ్రతిదినమును బ్రోచు నన్నపానాదులచే;
మృతు లైనపిదపఁ బితృదే
వతపూజలఁ జేసి వారి వదలక బ్రోచున్. ౪౮

ఉ. కావునఁ బుత్రజన్మము జగంబున భుక్తికి నిత్యముక్తికిన్
దావల మండ్రు, నిన్నుఁ గని ధన్యత నొందితి; మత్పవిత్రవం
శావళి నీకతంబున నిరంతరమై కొనసాఁగె నేని నా
దేవనివాస మాదియగు దివ్యపదంబులు నాకుఁ జేకుఱున్. ౪౯

ఆ ఇంకఁ బెనఁగ వలవ దిచట నేఁ దడపిన
నచట నన్నృతదోష మావహిల్లు
దానఁ జేసి యగు నధమలోక మంత సే
యంగ నేల పసుప వయ్య నన్ను' ౫౦

చ. అని యిటు లెట్టకేలకు నిజాత్మజు శోకదవాగ్నికీల లో
య్యన వచనాంబువర్షమున నాఱఁగఁ జేయుచు దాని నచ్చటం
గొనకొని యుండఁగా నిలిపి కూరిమితోఁ బులి యున్నయట్టి య
వ్వనమునకున్ రయం బెసఁగ వచ్చుచునుండఁగ నంత నక్కడన్, ౫౧

వ. అప్పులి యి ట్లని వితర్కించు. ౫౨

క. 'పాటి గలదె పసరమునకు
వ్రేటలవిం గదిసినపుడె విఱువక నే న
మ్మాటల బేలుపడితి మొగ
మోట దరిద్రత్వమునకు నొగిఁ బొ త్తయ్యెన్. ౫౩

క. తా నొక నిజమరి పోలెం
బూని పలికెఁ బెక్కుశపథములు కడపటఁ దాఁ
గానియదివోలె నాఁకొని
యే నిచ్చట నుక్కి దలఁప దెటు వోయె నొకో, ౫౪

క పులిచేతఁ జిక్కి యొక యి
మ్ముల విడివడి పోయి దానిముందటి కేఁగొ
వులు మరలి వచ్చు నేలా
తలపోఁతలు నోరికండ తప్పెం దప్పెన్. ౫౫

క. ఏ దానితోడి చలమున
నేదినమున నైన నొక్కయెడ నడరి [illegible]
చ్ఛేదము సేయక యూరక
పోదునె యిటు గాక యున్నఁ బులినే నేనున్' ౫౬

చ. అని యుదరాగ్నిచేఁ బరవశాత్మకయై ధృతి మాలి నెమ్మనం
బునఁ దలపోయుచున్నపులిముందటి కప్పుడు వచ్చి నిల్చెవో

యనఁగ మహోద్భుతం బగురయంబునఁ దాఁ బఱతెంచి ధేను వి
ట్లను 'నిది ప్రొద్దుదాఁకఁ గడు నాఁకొని యేక్రియ నుండితో కదే. ౫౭

ఆ. ఇంత తాల్మి లేక యిల నిట్టిసుకృతంబు
లెట్లు సంభవించు నేరి కైన
నీనిమిత్తమై కదా నాతనూజుని
బుజ్జగింపఁ గంటిఁ బురికి నేఁగి. ౫౮

క. నామన సొక్కటి యయ్యెను
నీ మనసారఁగ భుజింపు నీ కే నధిక
ప్రేమమున సమర్పించితి
నా మే నిదె పుణ్యగతికి నను( బుచ్చవనా. ౫౯

ఆ. అనిన దానితెగువ కద్భుతస్వాంతుఁడై
పుండరీక 'మేను బుట్టి పెరిగి
యింతవాఁడ నైతి నింతనిష్కపటుల
నిట్టిధీరమతుల నెఱుఁగ * నెందు. ౬౦

ఉ. ఇట్టిమహానుభావులకు హింస యొనర్చి దురంతదోషముల్
గట్టికొనంగఁ జాల, మఱి కల్గవె మాంసము లొండుచోట? నీ
పుట్టువునందు నన్నుమును పుట్టఁగఁ జేసినయట్టిదైవ మీ
పట్టునఁ బూరి మేపెడినె? ప్రాణము లింతనె పోవుచున్నవే?' ౬౧

మ. అని యాధేనువుఁ జూచి 'నీ విమలసత్యప్రౌఢికిన్ మెచ్చు వ
చ్చె, నినుం జంపఁగఁ జాల, నీదుతల గాచెన్ ధర్మ మీప్రొద్దు, పో
మ్ము నిజావాసము చేర నీసఖులు సమ్మోదంబునుం బొంద నీ
తనయుం డత్యనురాగముం బొరయఁ జిత్తప్రీతి గ్రమై నుండఁగన్. ౬౨

వ. అనిన నప్పులికి నమ్మొద వి ట్లనియె. ౬౩

క. మెత్తని మనసే నాయది
యొత్తి యిటులు చూడ నేల యోపుణ్యుఁడ! నే

---

* నేను.

గ్ర మైనొందఁగన్.

నిత్తను వు నీకు మును వా
గ్దత్తము చేసినది కాదె కథ లేమిటికిన్. ౬౪

ఆ. చనువు చెఱుప వైతి, ననుఁ బోయి రానిచ్చి,
తదియ చాలుఁ గాక యుదరవహ్ని
వేఁగుచున్న నిన్ను విడిచి యేమని పోదు
గెలుచునంతదాఁక గలదె పాడి.' ౬౫

వ. కావున పగలింటి యుపవాసభారం బంతయుఁ బోవునట్లు మద్రక్తమాంసము
లతో నక్తమ్ము సేసి నాకుఁ బుణ్యమ్ము ప్రసాదింపుము ' ౬౬

క. అని గంగడోలు బిగియఁగఁ
దన మెడ యెత్తుకొని కపిల దగ్గఱఁ జనుదెం
చినఁ జూచి పుండరీకము
వెనువెనుకకె పోవుఁ గాని విఱువదు దానిన్. ౬౭

సీ. 'కుటువంగ ర' మ్మని తొడరి చుట్టముఁ బిల్వ
'నాఁకలి గా దొల్ల' ననుచుఁ బెనఁగు
నతఁడునుబోలె నాతతశోభనాంగియై
తనరునాధేనురత్నంబు దన్ను
భక్షింపు మని పట్టుపఱుప సద్యోజ్ఞాన
శాలియై పరగు శార్దూలవిభుఁడు
దా నొల్ల నని పల్కఁ దమలోన నొకకొంత
దడవు మహూర్భాషితంబు లిట్లు

ఆ. జరుగుచుండ గోవుసత్యవాక్సిద్ధికిఁ
బులికృపానమగ్రబుద్ధికిని బ్ర
సన్ను లైరి సురలు; సాధువాదము లుల్లి
పిల్లె గగనవీధి నెల్లయెడల. ౬౮

వ. అయ్యవసరంబున గరుడారూఢుండై మురవైరి ప్రత్యక్షమగుడు నాదివ్య
రూపంబుఁ గన్గొని యమ్మొదవును నప్పులియును నప్పురుషోత్తము చరణ
సరసిజంబుల కెరగిన నవ్విశేషంబు చూచి యనిమిషు లిట్లని స్తుతించిరి. ౬౯

చ. 'కలువలఁ దమ్ములన్ సమవికాసము నొందఁగఁ జేయుక్రాలుగ
న్నులు గలనీకుఁ బాన్పును మనోజ్ఞరథంబును *నాగ తద్విరో
ధులయిననీకు నారయఁ జతుర్భుజ! చేయఁగరాదె గోవునుం
బులియును శత్రుభావములఁ బోనిడి మైత్రి యొనర్చునట్లుగన్. ౨౦

క. దైవం బాదిగఁ దిర్య
గ్జీవులు తుదిగాఁగఁ గలయశేషము నీ యా
జ్ఞావిలసితవర్తనములు
గావే నీమహిమఁ దెలియఁ గలరే యితరుల్' ౨౧

వ. అని కొనియాడుచుండి రంత నయ్యనంతుండుఁ దద్గోవ్యాఘ్రంబులఁ గారుణ్య
దృష్టి నీక్షించి 'మీ సచ్చరిత్రంబులకు మెచ్చితిం జెప్పొక్క వరం బిచ్చెద
వేఁడుం' డనిన నవి 'దేవా! భవద్దివ్యలోకంబు మాకుం బ్రసాదింప వలె
నని ప్రార్థించిన. ౨౨

క. ఇచ్చితి ననుచుం జనియె వి
యచ్చరతతి పొగడ విష్ణుఁ, డవియును జనియెన్
జెచ్చెరఁ దమ తమ నెలవుల
కచ్చుగఁ దుది నొదవెఁ గోర్కె లయ్యిరువురకున్. ౨౩

వ. ఈ గోవ్యాఘ్రసంవాదంబు విన్న నరులు మృగపన్నగాది బాధలం బొరయరు,
వెన్నుండు వారికిఁ బ్రసన్నుం డగు' నని చెప్పి మఱియును, ౨౪

క. పసరం బంద్రు, వివేకము
పస చాలనినీచు నట్టిపసరమ కాదే!
వసుధపయి సత్యవాక్యం
బసదృశముగ నిర్వహించె' నని కడుఁ బ్రీతిన్. ౨౫

ఉ. మానుగ రత్నమండనకుమారుఁడు పల్కెడు బ్రహ్మరాక్షసుం
డానరనాథపుత్రు వదనాబ్జము చూచి 'యపేనిఁ బొమ్ము, ము
న్నీనిజ మే నెఱుంగ, నిట నిక్కము రా నొకమాట పల్కు, మి
చ్చో నుదరాగ్ని నేను గడు శోషిలకుండఁగ రమ్ము క్రమ్మఱన్.' ౨౬

---

* నాగ=శేషసర్పము. తద్విరోధి=దానికి విరోధియగు గరుడుఁడు.

వ. అనిన విని యతం 'డేమి పల్కెడు?' ననిన వాఁ డి ట్లనియె ౭౭

క. కుడువఁ దొడఁగునెడ నొకటఁ
గడుఁ దూలుచు నతిథి వచ్చి గ్రాస మడిగినం
గడపునతఁడు పడుపాటులఁ
బడుదు ననుము పోయి మరలఁ బడి రాకున్నన్. ౭౮

ఉ. నావుడు నట్ల పల్కుచుఁ బ్రణామ మొనర్చి పురంబు కేఁగి నం
దావనినాథుతోడ నతఁ డంతయుఁ జెప్పినఁ దిల్లడిల్లుచుం
'దైవమ! యెంత చేసి తిది తప్పఁగఁ ద్రోయ నుపాయ మెద్ది వి
ప్రావళిమాటలుం జెనఁటి యయ్యెనె కార్యము తప్పెనో కదే' ౭౯

చ. అని తనుఁ దాన దూఱుకొను, నాత్మజుఁ గౌఁగిటఁ జేర్చు, బాష్పముల్
వినుచుఁ 'దనూజ! నీ దయిన నిద్దపుమేనికి నెట్టి పాట్లొకో'
యనుఁ దల యూఁచు 'బాపు విధియా' యను 'నింతకుఁ దెచ్చితే' యనున్
'వనరుహసంభవుండు మును వ్రాసినవ్రాఁతలు దప్పునే' యనున్. ౮౦

క. ఇవ్విధమునఁ బలవింపఁగ
నవ్వాక నవ్వినటు లాననద్యుతులు గడున్
నివ్వటిల రత్నమండనుఁ
డవ్వసుధాధిపునితోడ నలరుచుఁ బల్కున్. ౮౧

ఉ. ధీరత లేనివానిక్రియఁ దేజము పెంపఱ ని ట్లలందురం
గారణ మేమి? యస్థిరము గాదె తలంప శరీర మిట్టిచో
నూరక పోవుకంటె నొకయోగ్యుఁడు కోరి భుజించు టొప్పదే
బోరనఁ బంపు నేఁ బలికి బొంకఁగఁ జాల నృపాలశేఖరా! ౮౨

తే. కులము వెలయింపఁ బుట్టినకొడుకు కొడుకు
గాక, కులనాశనుఁడు కొడుకా తలంప
వసుధ నేకల్మషము లేనివంశమునకుఁ
గల్మషముఁ బొందఁ జేయ యుక్తంబె నాకు ౮౩

క. శతయూపాధిక దీక్షిక,
శతవా ప్యధికంబు గ్రతువు, శతయజ్ఞసమము

న్నతుఁ డొక్క సుతుఁడు, దత్సుత
శతకంబున కెక్కు డొక్క సత్యోక్తినృపా! ౭౪

వ. కావున నీకు నస్మాదృశు లైన కొడుకుల నెందఱ నైనం బడయవచ్చుఁగాని, సకలజగదుద్ధారకం బగు సత్యవ్రతంబు ఘటియింప వచ్చునే, నన్నింక నంకిలి సేయక నిష్కల్మషచిత్తుండవై యుండు మేఁ బనివినియెద నని యచ్చోటు వాసి యటుపోయి. ౭౫

ఉ. నవ్వుచుఁ బుష్పగంధివదనంబు గనుంగొని 'యోలతాంగి' ము
న్నెవ్వఁడు చెప్పె నీవు జనియించిననాఁటిఫలంబు, నేఁడు నా
కవ్విధ మంతవట్టు నిజ మయ్యె, మహాపురుషుండు వానికై
యవ్వనభూమి కేఁగెద రయంబునఁ బొమ్మను చెప్ప వచ్చితిన్' ౭౬

చ అనిన ననిష్టము ల్గని యుపాయబలంబునఁ ద్రోచుఁ గాక స
జ్జనుఁ డఘముండువోలెఁ గనుసన్నను జావ నుపక్రమించునే?
విను నృపనందనుండవు వివేకివి చక్కనివాఁడ వార్తయౌ
వనుఁడవు నేఁడు నీకుఁ దగవా యిటు పల్కఁగ నాదు సన్నిధిన్' ౭౭

వ అని పుష్పగంధి పలికిన నారాజనందనుం డి ట్లనియె. ౭౮

క. 'ఇదె వచ్చెదఁ జనని మ్మని
సదమలమతిఁ బలికినాఁడ శపథ మతని కే
మొదలనె; బొంకెడుబ్రతుకును
బ్రదుకే పూఁబోఁడి వక్రభాష లుడుగుమా!' ౭౯

క. అనవుడు 'నేమని పల్కితి
వినవలయుం జెప్పు' మనియె వెలఁది; యతండా
తనతోడఁ దాను మును ప
ల్కినశపథక్రమము దానికిన్ వినిపించెన్. ౮౦

క. విని నృపకన్యారత్నము
తనమదిఁ దలపోసి చూచి దానికి నొక కీ
ల్గనియెను, బుద్ధి చతుర్గుణ
మనుట సతులయందు నిశ్చితార్థ మనంగన్. ౮౧

వ. ఇట్లు గని యయ్యుపాయంబువలన తనమగని యపాయంబు పాయు నని
నిశ్చయించి ౨౨

ఉ. 'ఔమ్మ నృపాలపుత్ర! తలపువ్వులు వాడకయుండ నెమ్మదిన్
ర' మ్మనుపుష్పగంధివచనంబులకుం దరహాసభాసురా
స్యమ్ములరంగ నాతఁడు వెసం జనుచుండగఁ బౌరకాంత లో
'యమ్మరో! చూచితే యతనియాలికి నారయ నెట్టి గుండెయో ౨౩

ఆ. రోగయుతుఁడు గాఁడు, రూపహీనుఁడు గాఁడు,
వృద్ధు గాఁడు, దుర్వివేకి గాఁడు,
పడయ రాని రాచపట్టి నేమని పుచ్చె
బ్రహ్మరాక్షసునకు భక్షణముగ.' ౨౪

క. అనువారు తల్లిదండ్రులు
మునుకొని చెప్పంగ వినియు మొఱకుండై వ
చ్చినపిదప నిల్వఁగనునం
గనవశమా? చనినఁ జనియెఁ గా కనువారున్. ౨౫

క. నాఁ డెల్లవారు నీ పూఁ
బోఁడి వలదు మాను మనఁగఁ బయిలోదక తాఁ
దూఁడరియై తఱియఁబడిన
వాఁ డితనికి నేఁడు వగవ వలద' నువారున్ ౨౬

వ ఇత్తెఱంగునం బెక్కండ్రు పెక్కువిధంబులం బలుకుచుండ నారత్నమండ
నుండు వివాహగమనోన్ముఖుండునుం బోలె సుముఖుండయ్యును నింద్రదత్త
ప్రముఖులగు సఖుల వీడుకొలిపి చంద్రశర్మాదులగు మేదినీసురులకు నమస్క
రించి నిలిపి తదాశీర్వాదంబులు తోడుగా నొక్కరుండును వెడలి యరుగునప్పు
డా పుష్పగంధియుఁ దనయుపాయంబు నెరపం బూని వానివెనుకనె యొక్క
తెయు నింతనంత నరుగుచుండె నంత నిక్కడ నమ్మహాపురుషుండు ౨౭

చ. అదె యపరాద్రిఁ గ్రుంకె నినుఁ డాఁకలి మిక్కుటమయ్యె నాకు, వాఁ
డిదె యరుదెంతు నంచుఁ జని యిప్పుడుఁ జేరఁడు రాక తక్కినన్
బ్రదుల్ఁగనీక రాజును పురిం గలమర్త్యుల నెల్లఁ బట్టి ద్రిం
గుదు' ననుచుండ నయ్యెడకు గొబ్బున వచ్చె నృపాలపుత్రుఁడున్. ౨౮

ఉ వచ్చిన సమ్మహాత్ముఁడును వావిరిఁ దత్తరుశాఖ డిగ్గి వే
వచ్చి నృపాత్మజుం గదిసి వానిశిరోరుహరాశి యొక్కచేఁ
జెచ్చెరఁ జుట్టి పట్టి యొకచే మొగ మెత్తి గళంబుచాయకుం
దెచ్చె మొగంబు దంష్ట్రికలు దీటుచు నుత్కటసంభ్రమంబునన్. ౯౯

వ. అంత నయ్యతివ తనపతిప్రాణభయంబు తప్పింప నిదియ యవసరం బని యూహించి. ౧౦౦

క 'భిక్షాం దేహి' యనుచుఁ గమ
లాక్షి యతనియెదుర నిల్చి హస్తము నెత్తన్
వీక్షించి యతఁడు 'నీ కే
భిక్ష' మనినఁ 'బెట్టు పురుషభిక్షం' బనియెన్. ౧౦౧

చ విని యతఁ డాత్మఁ జోద్యపడి వీఁ డిటఁ గ్రమ్మఱ వచ్చునట్లుగాఁ
బనిపడి యేను గొన్నపరిభాషయె నాకు మరల్చి యివ్విధం
బున నను గెల్చె నీసతి, ప్రబుద్ధులు లే రనవచ్చు నయ్య భూ
మి ననుచు నాతని న్విడిచె మెచ్చి నుతించిరి మువ్వురున్ సురల్ ౧౦౨

వ. అయ్యవసరంబున మహనీయవైభవస్థానం బైనవిమానం బొక్కటి మహికి నేఁగుదేర బ్రహ్మరాక్షసుండు తన వికృతరూపంబు విడిచి దేవరూపంబు గైకొని 'మీనిమిత్తం బై కదా నాకుఁ బుణ్యలోకంబులు సిద్ధించె' నని యా రత్నమండన పుష్పగంధుల దీవించుచు నద్దివ్యవిమానం బెక్కి యప్సరోగణంబులు గొలువ నింద్రసభకుం జనియె, నవ్వధూవరు లిరువురు నిజపురంబునకుం జని నందమహీనాథునకు బంధుయూథంబునకుఁ దమ గమనాగమనంబులక్రమంబు చెప్పిన విస్మితులై వీని కిది పునర్జన్మంబు పొమ్మని వీఁ డెవ్వరి చేతను దిట్టు వడనికాలంబునకు నిట్టి యాపద తరియించె నని పరమానందంబునుం బొంది విప్రవాక్యంబు నిక్కంబు గదే యని కొనియాడుచుండి రటు గావున. ౧౦౩

క. కుసుమపుతటి నతిథి గ్రాసం
బడిగినఁ దన కుడువఁ దొడఁగునశనం బైనన్
వడి నొసఁగంగా వలయుట
యడర మహాపురుషుచేత నభినుత మయ్యెన్. ౧౦౪

చ. అనవుడు భోజుఁ డిట్టి యితిహాసము నే నెఱుఁగంగ నేర విం
క నొకటి నాకు విన్నదుగఁగా వలయుఁ గృహమేధి కర్తృవుం
బని సదనాగతాతిధిసపర్యయకా తెలివొందెఁ జిత్త మో
మునివర! యందుఁ గల్గు ఫలము న్వివరింపఁ గదయ్య' నావుడున్. ౧౦౫

## అన్నదానపరుఁడగు విప్రుని కథ

క. భోజనృపా! విను మతిథికి
భోజన మిడునతని కొదవు పుణ్యమహిమ యం
భోజభవుఁ డైన నెఱుఁగఁడు
నా జగమున నింత నంత నా నెచ్చోటన్. ౧౦౬

సీ. ఈ యర్థమున కొక్క యితిహాస మేను జె
ప్పెద నొక్కవిప్రుఁడు సదమలాత్ముఁ
డతనికి మువ్వురు సుతు లుత్తములు వారు
పితృమాతృభక్తులై పేర్చి యుందు
రగ్రజన్ములఁ గొల్తు రనుజు లగ్రజులును
ననుజులఁ బాటింతు రనుదినంబు
నందులోఁ జిన్నవాఁ డతిధర్మశీలుఁడై
విప్రుల కశనంబు వెలయఁ బెట్టు

ఆ. నట్లు జరుగుచుండ నమ్మేలు చూడఁ జా
లక విధాత దుదిఁ గలంచె ననఁగఁ
గతిపయాబ్దములకు మృతుఁ డయ్యె నవ్విప్రుఁ
డతనియతివ తోన యనుగమించె. ౧౦౭

క. తల్లియుఁ దండ్రియు నీక్రియఁ
జెల్లినఁ బరలోకవిధులు చేసినతుది న
య్యెల్లు చెడకుండఁ దమలో
నల్ల మలరఁ గలపి మెలసి యుండిరి కొడుకుల్. ౧౦౮

క. అప్పుడు నయ్యనుజన్ముఁడు
తప్పక యతిథులకు నన్నదానము వినయం

బొప్పఁగ నిడునదిగారణ
మెప్పుడు సిరి గదల దతనియింట నృపాలా! ౧౦౯

వ. ఇట్లు జరుగుచుండ నొక్కనాఁ డాతనివదినెలుఁ దమ మఱఁది ప్రియవాదితనంబు చూచి కనుకుట్టుఁదనంబున నతనిధర్మంబునకు విఘ్నంబు గావింపఁ దలంచి తమ పురుషులం జేరి సఖేదంబుగా ని ట్లనిరి. ౧౧౦

ఉ. 'అత్తకు నేము మార్పలుక మాయమచిత్తములోనివారమై
వత్తుము. పెద్దవారు గలవారికి నన్నియుఁ జెల్లుఁగాక, నేఁ
డిత్తఱి మమ్ముఁ బుచ్చి పని యెవ్వరు గొందురు? మిమ్ముఁ జూచి నో
రెత్తగ నోడి యేపలుకు లెన్నఁడుఁ జెప్ప మెఱింగి యుండియున్. ౧౧౧

క. ఇంతట నెఱఁగెద రొండే
నంతట నెఱఁగెదరు గాక యని యుండక మీ
రెంతట నెఱుఁగరు బ్రతికెడు
పంతమె యిది మీకు నేము పగవారలమే. ౧౧౨

క. ఒకనాఁ డైనను మాతో
నొక యాలోచనముఁ జేయ కూరక మోమె
త్తికొనుచుఁ బోదురు మీ రాం
డ్రకు మగలకు నిట్టి వేఱడంబులు గలవే. ౧౧౩

క. మగఁ డెఱుఁగ వలయుఁ గాదేన్
మగువ యెఱుఁగ వలయుఁ గాక మనుగడ తెఱఁ గ
మ్మగువయు మగఁడును వెలిగా
జగమున సంసార మెట్లు జరగును జెపుఁడీ' ౧౧౪

వ. అని పలికి తమ తోడికోడలిం బ్రసంగించి. ౧౧౫

క. పని పంప వెఱతు మావిడ
పని యెప్పుడు చేసి చేసి పాయవడితి మె
వ్వనిరాజ్యమని యెఱుంగదు
తనచేఁతకుఁ దోడు మమ్ము తప్పులు పట్టున్. ౧౧౬

క. తా మాకు నత్త యైనది,
యామఱఁదియు మాకు మామయై వర్తించున్,

మే మయ్యిరువురచేతను
బాములఁ బడలేము నాతిపాపులభంగిన్. (?) ౧౧౭

ఉ. పాఱుల పేరు చెప్పుకొని పానెడుపప్పునుఁ బాయసంబు నై
దాఱు పసంట్లవంటకము నాజ్యముఁ గమ్మనికూరగాయలున్
జాఱులు దించు వారసతిపొప్పున గోళ్ళను మీటుకొంచు దా
దూఱులు పల్కి సీదగరతోఁ బడఁజాలము వేయి చెప్పినన్. ౧౧౮

ఉ. ఏతరిలాగు మానఁ డతఁ, డెవ్వరి నైనను బిల్చి పెట్టు; మీ
రాతని కొక్కమాటయును నడ్డము చెప్పఁగ లేరు; జీవనం
బీతెఱఁ గైన నేమి గల దింతయు నిప్పుడు గాపి కాదె మీ
రాతనితోడి యంశమున కర్హులు గారె విచార మేటికిన్. ౧౧౯

క తన గడన లేమ మీ తె
చ్చినయవి తోడ్తోన వ్యయము చేసెడి నింకీ
తనితోడి పొత్తు పదివే
లును వచ్చె మనకు విభక్తులును గావలయున్. ౧౨౦

క. కాకున్నను జీవనరుచి
మీకుఁ గలుగునంతదాఁక మీపెట్టినచో
నేఁరణి నైన నుండెద
మీకష్టులఁ బడఁగఁ జాల మెన్నాళ్ళైనన్. ౧౨౧

ఉ ఉమ్మడి సొమ్ము గానఁ దన యోపినయంతయు నన్నివంకల
న్నెమ్మదిఁ బాఱఁ జల్లుచును నీల్గెడు దాన ప్రదాత నంచు ని
క్కమ్ముగ వేఱు పడ్డతుది గానఁగ రాదె యతండు పొందులా
భమ్ముల కెల్ల మూల మనుపాటిగ నాలును దాను నుండఁగన్. ౧౨౨

క తన యాలును దానును గుడు
వను గట్టను, నిట్టి యీయవస్థలఁ బడ నే
మును మీరును నటె; చాలుం
దనిపితి మీ బ్రతుకుపట్టు దయ్యె మెఱుంగున్.' ౧౨౩

క, అనవుడు 'నది యట్టిద' యగు
నని యొండొరుమోము చూచి యన్నయుఁ దమ్ముం

డును నైకమత్యమై తమ
యనుజన్ముని వేఱు పెట్టి రట్టిదకాదే. ౧౨౪

తే. అన్నదమ్ములు దమలోనఁ జిన్నపెద్ద
వరుస రెఱిఁగి యథోచితప్రవర్తనముల
మెలఁగుచుండుట తమయాంధ్ర సొలపుమాట
లోలిఁ జెవిఁ బడ్డపెమ్మట నేల జరుగు? ౧౨౫

వ. ఇట్లయ్యన్నదమ్ములు మువ్వురు విభక్తులై పిన్నాతని నొంటి చేసి పెద్దవారిద్దఱు నొద్దికయై కలసి యుండి రట్లుండియుఁ గుటుంబభారంబునందు జ్రుంగుడుపడి దానమానంబులం దంతఁ బరసికొని తిరుగనె పోయెం గాని పరోపకారంబునకు నవకాశంబు లేదయ్యె, నతం డొంటి యయ్యును దొంటి యట్ల తన పట్టినవ్రతంబు వదలక యన్నదానంబు సేయుచుండె నంత నా పెద్దవారియందు ౧౨౬

చ శిశువులు కూడు కూడనుచుఁ జిందఱ వందఱ సేయ నాఁడు వా
రశనము లేక క్రొవ్వు చెడి యంటలు గట్టి చరించుచుండ దు
ర్దశలకు నెల్ల మూల మయి తా రొకయప్పుడు సిరెలుంగుతో
మశకము లట్లు తూలుచు సమరులమోములు వ్రేలుచుండఁగన్ ౧౨౭

తే పిన్న యయ్యును గుణములఁ బెద్ద గాన
వానిజీవన మేమియు హీనపడక
యుండె నయ్యుక్కి గన్గొని గుండె లెల్లఁ
గుళ్ళుచుండంగ వదినెలు కుంది కుంది ౧౨౮

చ. మగలమొగంబు చూచి 'యణుమాత్రయుఁ బేదఱికంబు లేక ఖ్యా
తిగ మనుచున్నవాఁడు భవదీయకనిష్ఠుఁడు వానిఁ బట్టి పా
లు గొనఁగ రాదె మున్నతఁడు లోన నడంపఁగఁ బోలు సొమ్ము మీ
కగపడకున్న రాజునకు నైన మొఱో యని చెప్పఁ జాలరే?' ౧౨౯

వ అని పల్కుచు నతనియతివ నుద్దేశించి యాకన్నులకల్కికి ధన మెట్టు గూడెనే యని గుసగుసలు వోవుచుండు రీ కుటిలప్రసంగంబు లెఱుంగ కతండు సౌజన్యధనుండు గావున విశేషతిథులయందు సపుత్రకళత్రంబుగాఁ దన యగ్రజద్వితయంబు రావించి తన పంక్తి నశనంబు వెట్టుచుండు నమ్మగువయు మగని

మనసులోనిద యై మెలంగుచుండు; బ్రాహ్మణోత్తములు ప్రతిదినంబును నతనిగృహంబున నాహారంబు గొని దీవించుచుం బోదు రిట్లు చెల్లుచుండ నొక్కనాఁ డాగృహసునితో గృహిణి యి ట్లనియె ౧౩౦

క. 'మీ రెల్లప్పుడు విప్రస
మారాధన తత్పరాత్ములయి వారల కా
హారములు పెట్టుచుండుదు
రారయ నందు నగుసిద్ధి యది యెద్ది యొకో.' ౧౩౧

క. అనవుడుఁ దత్ఫల మింతిం
తని యేనును మున్ను విన్నయది లే దబలా!
నను నీ విపు డడిగితి గా
వునఁ జెప్పెద విప్రపుంగవులు రా నిమ్మా' ౧౩౨

చ. అని తన యింటి కద్దివసమం దరుదెంచిన విప్రజాతి క
య్యనఘుఁడు షడ్రసాన్వితము లైనపదార్థచయంబుతోడ భో
జన మిడి వారు తృప్తు లయి చల్లనినీడ వసించి యుండ న
వ్వనితయుఁ దాను వారలకు వందన మొప్పఁగఁ జేసి యి ట్లనున్. ౧౩౩

క 'ఊహించి మాకు నొక సం
దేహము వాపుటకు నరుగుదెంచితిమి మహో
త్సాహమున విప్రవర్యుల
కాహారము వెట్టుసుకృత మది యెట్టిదియో? ౧౩౪

క. మా కేర్పడ నానతి యీ
రే కృపతో' ననుడు వార లిందఱు మది నా
లోకించి కొలఁది గానక
మూకత్వము దాల్చి రపుడు మూఢుల భంగిన్. ౧౩౫

ఉ. వారలఁ జూచి విప్రు 'లిటువంటిమహాత్ములు మీ రెఱుంగరే
యూరక యుండు టేతెలివి యుక్తివిహీనుల భంగి' నావుడున్
వారలలోన మేటి యగువాఁ డొకవిప్రుఁడు 'విప్రజాతి కా
హారము వెట్టునట్టి ఫల మన్యు లెఱుంగరు భూసురోత్తమా! ౧౩౬

ఉ వరదుఁడు కాశికాపుర నివాసుఁడు నాఁదగు విశ్వనాథుఁ డే
తరుణి వరించు నట్టిహిమధామనిభానన శీతసానుమ
ద్వరజ యెఱుంగుఁ బొ ' మ్మనిన వాఁ డది తీర్థముస్వార్థముం గదా
యరిగెద నంచు గ్రక్కునఁ బ్రయాణము గైకొని భార్య కిట్లనున్. ౧౩౭

క ' కాశికి నేఁగెద నని పర
దేశం బనుతలఁపు నీమదిం జొనుపకు మ
కేశగతిఁ దిరిగి వచ్చె
నోశశధరవదన ! యోడకుండుమి నెమ్మిన్ ౧౩౮

క. అఁకొని వచ్చిన విప్రుల,
దాఁకింపక యశన మిడుము తత్పరమతి న
ట్టాఁకలి సేయకు కుడువం
దోఁకొని రా పర్వమగు తిధుల మన వారిన్.' ౧౩౯

వ. అని చెప్పి యాతం డరిగిన నయ్యేలనాగయుం బ్రతిదినంబు నతిథిపూజ గావించుచు భర్తృభాషితంబు చొప్పునఁ దప్పక విశేషతిధులం దన బావలను దోడికోడండ్రను వారిబిడ్డలను రావించి యశనంబు వెట్టుచు వసుమతియ పోలెం దాల్మి గలిగి మెలంగుచుండె నంత నక్కాంతమగఁ డత్యంతదూరం బరిగి యొక్కనాఁడు పదత్రాణార్థం బొక్క చర్మకారసదనంబుచక్కటికిం జనిన నతం డి ట్లనియె ౧౪౦

క. ' ఎం దుండి రాక మీ రిట
కెందుల కేకార్యమునకు నేఁగెద రది నా
కుం దెలియఁ జెప్పుఁ డ ' నవుడు
మందస్మితలలితవదనమండలుఁ డగుచున్. ౧౪౧

చ. ' తిరముగ దక్షిణాంబునిధితీరమునం దొక యూర నుండి యేఁ
బరగఁగ నొక్కసంశయము పాపుకొనం జనుచున్నవాఁడ శం
కరగిరిజానివాస మగుకాశికి ' నావుడు ' నట్ల యేని నో
పురుషవరేణ్య ! నేఁడుఁ గడుఁ బుణ్యుఁడ నైతిఁ ద్వదీయసేవనన్. ౧౪౨

క. అడరఁగ నే నాజాహ్నవి
నడిగితి నని చెప్పి నాకు నయ్యుత్తర మే

ర్పడఁ జెప్పు మయ్య! యే నీ
యడుగుల కెరఁగెద మహీసురాన్వయ తిలకా!' ౧౪౩

చ. అనవుడు విప్రుఁ డియ్యకొని యచ్చటు వాసి క్రమప్రయాణఖే
లన మమరంగ సోమశకలద్యుతిశోభిజటాకలాపరం
జనుఁ డగుపార్వతీశు ప్రియసద్మమునాఁ దగు కాశికిన్ ముదం
బునఁ జని జాహ్నవీసలిలపూరము చొచ్చి పవిత్రగాత్రుఁడై ౧౪౪

శా. ఈశానుం బరమేశు పాలనయనున్ హేలాజితానంగు గౌ
రీశుం గేశవతల్పభూషణుఁ ద్రిలోకేశు న్వియత్కేశు న
క్షీణోదంచితభక్తిముక్తిఫలదున్ గీర్వాణనిర్వాహకుం
గాశీనాయకు విశ్వనాథుఁ గొలిచెం గారుణ్యపూర్ణాకృతిన్. ౧౪౫

ఉ. బొందులు వేఱు గాని తలపోయఁగఁ బ్రాణము లేకమం డ్రీలం
గొందఱు, లేఁతమాట లవి కూరిమిపట్టున నంమఁ, బ్రాణముల్
బొందులు నేకమై రనఁగఁ బొల్పగు శంకరుని న్భవాని న
స్పందితభక్తిమైఁ గదిసి బ్రాహ్మణపుంగవుఁ డానతాంగుఁడై. ౧౪౬

ఆ. అచటఁ గొన్నిదినము లతఁ డా భవానిఁ బ్రా
ర్థించుచుండఁ దద్గరిష్ఠనిష్ఠ
జూచి మెచ్చి తనదు శోభనాకృతిఁ జూపి
గౌరి యొక్కనాఁడు కరుణలోడ ౧౪౭

క. 'ఓవిప్రుఁడ! నీ వేపని
కై వచ్చితి చెప్పు' మనిన నతఁ డి ట్లనుఁ 'ద
ల్లీ! విను మే నొకధర్మము
నీవలనం దెలియ వచ్చి నీకృపఁ గంటిన్. ౧౪౮

ఉ. ఈపురి నేఁడు నాఁ డనక యెప్పుడుఁ దప్పక యున్నదాన వే
రూపమునందు నైన నొకరుండును నాఁకొనకుండునట్లుగాఁ
దీ పెసలారఁ బెట్టు దఁట దేవి! తదీయఫలంబు చెప్పుమా
యీపరమార్థనిర్ణయము నెవ్వరుఁ గానరు నీవు దక్కఁగన్, ౧౪౯

వ. అనిన నప్పరమేశ్వరి యతని కి ట్లనియె ౧౫౦

ఉ. 'వారణగంగ నాఁగ హిమవద్గిరిచేరువఁ జూడ నొప్పుఁ బెం
పారఁగ నొక్కపుణ్యనది, యానదిపొంత ననంతవైభవ
స్ఫారత నొక్కప్రోలమరుఁ, బన్నుగ హేమవతంబు నాఁగ; నం
గీరుఁడు నాఁగ నొక్క నృపకేసరి యప్పుర మేలు మేలుగన్. ౧౫౧

క. ఆవసుధావల్లభునకు
దేవి యొకర్తె సుమతి నాఁగ ధృతిమతి కాంతి
శ్రీవిలసద్గౌరవముల
రాపై పతిభక్తిచే దృఢంబై మెఱయున్ ౧౫౨

క. ఆదేవికి సంతతి మున్
లేదు పతియు నేకభామినీవ్రతుఁడై సం
పాదింపఁడు మఱి భార్యల
నాదంపతు లున్నయెడకు నరుగుము విప్రా! ౧౫౩

క. అరిగి యథోచితవేళం
గర మనురాగమున వారిఁ గదిసి ధరిత్రీ
భరణక్షముఁ డొక తనయుఁడు
హరిసత్వుఁడు మీకుఁ బుట్టు నని చెప్పుతగన్. ౧౫౪

ఆ. పుట్టినపుడ సజ్జమట్టును బెఱవారు
జనని యాదిగాఁగ సకలజనులు
తొలఁగి యుండి నన్నుఁ దొలుతఁ జూడఁగ నిచ్చి
సుతునిఁ బిదప మీరు చూడుఁ డనుము. ౧౫౫

చ. అని యొడఁబాటు చేసికొని యాశిశురత్నముఁ జేరి యేకతం
బున నడుగంగ వాఁడు దెలుపున్ విశదంబుగ నన్నదానశో
భన సుకృతంబువొప్ప' నుచుఁ బార్వతి చెప్పిన నద్భుతాత్ముఁడై
పనుపుము పోయి వచ్చెదఁ గృపారసమానస!' యంచుఁ జయ్యనన్. ౧౫౬

చ. వలగొని మ్రొక్కి నేత్రకరవారిజసంజ్ఞల నాభవాని వీ
డ్కొలుపఁ బునఃప్రణామములు గోరి యొనర్చి 'భవత్కటాక్షమే
వ్వలసను నాకు రక్ష' యనువాక్యముతోడఁ దదీయసద్మమున్
వెలువడి యొక్కరుండు కడు వేడుక నుత్తరభూమి కేఁగుడున్. ౧౫౭

## వ్యాధుని కథ

శా. అవిప్రుం డొకచోటఁ జొచ్చి వని ఘోరారణ్యమార్గంబునన్
దీవ ల్గాళ్ళను జుట్టఁ దొట్రుపడుచుం దిక్కేది విభ్రాంతుఁడై
పోవం బోవగ నొక్కబోయ గని యాపుణ్యాత్ముఁ డేయూరికిన్
బోవం బోయియొ త్రోవఁ దప్పె ననుచుం బూర్ణానుకంపామతిన్. ౧౫౮

ఉ. ఆతనిఁ జేరఁ బోయి 'వసుధామర! యేపురి కేఁగె దీవు? ఖ
ద్యోతనుఁ డస్తపర్వతగతుం డగుదెంచెఁ బథంబు దూర మీ
రీతి నరణ్యమధ్యమున రేయి చరింప వశంబె యెట్టిని
ర్భీతుల కైన [2] వన్యమృగబృందము మైమయిఁ బోవ నిచ్చునే! ౧౫౯

క. అనవుడు నాబ్రాహ్మణుఁడా
వనచరుతో 'నేను హేమవతపురమునకున్
జనుచుండి త్రోవ దప్పితి
నెనయఁగ నా త్రోవ మాపు మేఁగెద' ననినన్. ౧౬౦

క. ఏటికి వేగిరపడ నీ
పూట నిచట నిలిచి రేపు పోవఁగరాదే
మాటలఁ దప్పితి తెరు వి
చ్చోటికి నామడకుఁ బడియెఁ జు మ్మది' * యనియెన్. ౧౬౧

చ. అని తన పోడుచేనికడ కాతనిఁ దోఁకొని పోయి బోయ యి
ట్లను 'నివె పొట్టికందులును నమ్మలు నున్నవి క్రొత్తకుండ లే
దనఘ! యుపాయ మెద్ది? కడు నాఁకొని వచ్చినవాఁడ వీవు నీ
పనిచినయట్ల చేసెదఁ గృపామతి నానతి యిమ్ము' నావుడున్. ౧౬౨

క. 'నీసౌజన్యమున మదా
యాసము సర్వమును బాసె నంతియ చాలున్.
గ్రాసేచ్ఛ లేదు; నీవు వృ
థా సంకటపడకు సౌఖ్యతర మిది నాకున్.' ౧౬౩

---

* యనినన్.

వ. అని యతవి నూఱడించి యవ్విప్రుండు తన కలశోదకంబున సాయంకరణీ
యంబులు దీర్చి కూర్చుండునెడ నక్కిరాతుండు రెండుదొప్పల చారబియ్యం
బును దేనెయుం దెచ్చి యిచ్చిన నవి భగదర్పితంబు చేసి యుపయోగించి
యాప్యాయనంబుగా నుదకంబు గొని కృతాచమనుండై పర్ణతల్పంబున నుప
క్రమించిన. ౧౬౪

క. 'క్రూరమృగంబులు గల వీ
ఘోరాటవి, నిచట నిద్ర గూరుట గొఱ గా;
దీరును మత్సతియును బొద
వారిన మంచెపయి నుండుఁ' డని యెక్కించెన్.     ౧౬౫

వ ఇట్లెక్కించి యక్కిరాతుండు. ౧౬౬

ఉ. తా నొక విల్లు నమ్ములును దాల్చి ముదంబున నిద్ర గాచి యా
చేనికి దుష్టసత్వములు చేరక యుండ నదల్చుచుండ న
చ్చో నరుణోదయం బగుట చూచి యొకింమక కన్ను మోడ్చె నా
లోనన యొక్కబెబ్బులి విలోలత వచ్చి వధించె నాతనిన్. ౧౬౭

క. అప్పులి గవిసిన యప్పటి
చప్పుడు విని యక్కిరాతసతి మేల్కని వా
తప్పక యొక్కశరంబునఁ
జెప్ప నరిది గాఁగ దాని జీవము గొనియెన్. ౧౬౮

శా. ఆవిప్రుండును నప్డు బి ట్టులికి యత్యాకంపముం బొంది వా
పోవం జొచ్చెఁ; లతాంగి వె న్నణచి విప్రుం దేర్చెఁ; బద్మప్రియుం
డావా ర్త ల్విని వచ్చినట్లు కరసంఘాగ్రంబునం జీఁకటుల్
పోవం ద్రోచుచుఁ దోఁచె నాదిమదిశా భూమీధ్రశృంగంబునన్. ౧౬౯

ఉ. అంతఁ గిరాతకాంత వగ నందెడువిప్రునిఁ జూచి 'తండ్రి! యే
నింతకు నోచి యుండ నిది యేరికి వశ్యమె తప్పఁ ద్రోవ ని
శ్చింతత నేఁగుఁ డాతపముచేఁ గడుఁ జిక్కెద రింక నైన: న
ల్లంతనె పోవుత్రోవలె యుదగ్రమహోగ్రమృగప్రకీర్ణముల్.' ౧౭౦

చ. అనిన నతండు 'నాకుఁ దగవా? యిటువంటి పరోపకారి నెం
దునుఁ బొడగాన నీతఁడు మృతుం డగు చేఁ గనుఁగొంటిఁ, జూచి యే

మని చనువాఁడ మిన్నక యథాపరతంత్రము సేయ ' కంచుఁ బే
ర్చినకృపతోడఁ జేయఁ బనిచెన్ దహనక్రియ వాని మేనికిన్. ౧౭౧

క వనితయు నప్పుడు పతితో
ననుగమనము చేయఁ బూని యావిప్రుని న
వ్వనభూమి వెడలునంతకు
నవిపి మరలి వచ్చి చేయునదియై నిల్చెన్. ౧౭౨

వ. అతండును దాని నూరార్చి ' నీనేర్చువిధంబున నితనికిఁ బరలోకక్రియలు నిర్వర్తింపుము నాకుం బోవలయు ' ననిన నవ్విప్రుమాటకు నబ్బోటి యిట్లనుఁ ' దండ్రీ ! నీవీయరణ్య మార్గంబులు మున్నెఱుంగవు నిన్ననిపి వచ్చెదం బద ' మని ధనురస్త్రపాణి యగుచు నా సుశ్రోణి యతనిం దోడ్కొనిపోయి గతాగతజనంబులవలన నిరంతరసంకులం బగు హేమవతపురంబు తెరువు చూపి యతని వీడ్కొని వచ్చి పచ్యమానుండగుచున్న తనభర్తం జూచి యే నిట వచ్చెద నిలువు మని సస్మితంబుగాఁ బల్కుచు నయ్యగ్నియందుఁ బ్రవేశించె నంత నక్కడ ౧౭౩

ఉ. హేమవతాభిధానపురి కేఁగి మహీసురుఁ డాన్నృపాలచూ
డామణితో రహస్యపుతెఱ న్మును పార్వతి చెప్పినట్లు చే
తోముద మొప్పఁగాఁ బలికి ధూతకళంకతఁ గొన్ని మాసముల్
సోమకళాధరాలయము సొచ్చి జపం బొనరించుచుండఁగన్. ౧౭౪

ఉ పుట్టెఁ దనూజుఁ డాన్నృపతిపుంగవుదేవికిఁ బుణ్యవేళ న
ప్పట్టునఁ దత్తఱించుచును బాటి యథోచితభంగి నేఁగి ' మా
చుట్టమ ! కన్ను విచ్చి ననుఁ జూడుము చెప్పుము విప్రజాతికిం
బెట్టినయన్నదానమునఁ బేర్చుఫలం ' బని వేఁడె విప్రుఁడున్. ౧౭౫

చ. కల కల నవ్వుచున్ శిశుశిఖామణి యిట్లని చెప్పె నప్డు ' వి
ప్రులకుఁ బ్రయత్నపూర్వముగ భోజన మిడ్డఫలంబు చెప్ప నా
యలవియె మీ రెఱుంగరె యనంతఫలప్రద మన్నదాన మేఁ
దెలుపఁగ నేల వేఱె యొకదృష్టము చెప్పెదఁ జిత్తగింపుఁడా ! ౧౭౬

ఉ. మీ రలనాఁడు పంకరుహమిత్రుఁడు పశ్చిమవార్ధిలోనికిం
జేరెడువేళ మద్గృహము చేరినఁ బెట్టితి నింత దేనియం

జేరెఁడు చాఱబియ్యమును జిత్త మెలర్పఁగఁ దానఁ జేసి బృం
దారకరాజ్యతుల్య మగుభారుణి యేలుట కిట్లు పుట్టితిన్. ౧౭౭

వ. అని పరికి యర్భకుండు పూర్వజన్మంబునందాను గిరాతుండై యుండిననాఁ
డతనికిఁ జేసినసత్కారంబుకొలంది దెలిపి మఱియు నిట్లనియె; 'అయ్యా!
యయ్యల్పదానంబువలన నా కిట్టి యనల్పఫలంబు సిద్ధించె నీవు నిరంతరాన్న
దానశీలుండవు నీ కెంతటి ఫలంబు గల్గునో యది యాపరమేశ్వరుండె
యెఱుంగుం గాని యన్యు లెఱుంగ లేరు, నీవు విచ్చేయు' మనిన నాద్విజా
తుండు ప్రీతుండై, ౧౭౮

క అంగిరసిం దగ వీడ్కొని
యంగీకృతసుప్రయాణుఁడై ముక్తిపుర
ప్రాంగణ మగుకాశిపురి
కిం గర మనురాగమున మగిడి చనుదెంచెన్. ౧౭౯

ఉ. క్రమ్మఱ నాథవానిపదకంజయుగంబు శిరంబు సోఁక మో
దమ్మునఁ జాఁగి మ్రొక్కి 'వనితాతిలకంబ! భవన్మతంబునం
గ్రమ్మఱ నేఁగి యాశిశుముఖంబున నే వినఁగంటి నన్నదా
నమ్ముఫలం బగణ్య మని' నావుడుఁ బార్వతి ప్రీతి నిట్లనున్, ౧౮౦

క. 'విను విప్రోత్తమ! నీ వ
చ్చినపని సిద్ధించె నింకఁ జేరుము భవదీ
యనివాసమ్మునకు గృహ
స్థునకుఁ బ్రవాసైకవృత్తి దోషము సుమ్మీ! ౧౮౧

క. మఱి యాశ్రమస్థు లెల్లను
వఱలు గృహస్థాశ్రమంబువారిన కానం
బఱతెంతురు తమ దగు న
క్కఱ దీర్చుకొనంగ నొండుగతి లే కునికిన్. ౧౮౨

చ. వ్రతులు గృహస్థువాకిటికి వచ్చి యథోచితపూజఁ గానరే
నతనిగృహస్థధర్మ మది యంతయు నిష్ఫల మంద్రు; వెండి య
య్యతిథికృతాఘసంచయము లన్నియు నాతనిఁ బొందుఁ, దత్సమం
చితసుకృతంబు లయ్యతిథిఁ జెందుఁ జుమీ పరమార్థ మారయన్. ౧౮౩

క. గృహపతి లేనిగృహం బది
గ్రహపతిరహిత మగుదినము గతి మధ్యంబై
మహిమ చెడి యుండుఁ గావున
బహుచింతాలతలఁ జిక్కు వడక యరుగుమా!' ౧౮౪

చ. అనవుడు నట్ల కాక యని యంబిక వీడ్కొని యాత్మభూమికిం
జనియెడువేడ్క నివ్వటిల జాహ్నవి దాఁటి మహీసురుండు నె
మ్మనమున నల్ల యంత్యజునిమాట దలంచి యదేమిచందమో
కనుగొని పోదు నంచు నెసకంబుగఁ *గ్రమ్మటి నిల్చి యిట్లనున్. ౧౮౫

క 'ఓ దేవి! వినుము నిన్నొక
మాదిగవాఁ డడిగె వానిమాటకుఁ గలదే
యే దైన నొక్కయుత్తర
మాదట నెఱిఁగింపు నాకు నరుగఁగ వలయున్.' ౧౮౬

## మాదిగవాని కథ

మ. అనినం గంగ నిజాంగదీప్తినిచయం బవ్వాహినీమధ్య మె
ల్ల నతిస్నిగ్ధముగా నొనర్చ నయనోల్లాసంబు మందస్మితా
ననకాంతిం బొదలింపఁ గంకణ ♃రవోన్నాదంబుతో హస్త మె
త్తి నయం బారఁగఁ బల్కె నోద్విజుఁడ! యర్థిన్ వింటి నీవాక్యముల్.

ఉ. శీలగుణోన్నతుం డమలచిత్తుఁడు మత్ప్రియసేవకుండు చం
డాలుఁ డనంగ రా దతిదృఢవ్రతుఁ డాతనికిన్ శుభంబె; నా
మేలును జెప్పు మాతనికి; మిత్రజ లోనగు పుణ్యవాహినీ
జాలముతోడ విశ్వపతిసన్నిధి నెమ్మదిఁ బాయ కుందుదున్, ౧౮౮

మ. అని గంభీరరవంబునం బలుకుపుణ్యాకారిణిం బ్రీతిఁ గ
న్గొని విప్రుండు కరాబ్జము ల్మోగిచి 'నీకున్ మ్రొక్కెదన్ దేవి! యే
జనులుం గానరు నీదుదివ్యతను వస్మద్భాగధేయంబుపెం
పున నేఁ గంటి భవత్కటాక్ష మెలమిం బొందించె నాడెందమున్. ౧౮౯

* గ్రమ్మఱని చ్చి
♃ రవోన్మాదంబుతో.

క. వాఁడును గేవలపురుషుఁడు
గాఁ డెవ్వఁడొ, యంత్యజుండు గాఁ గత మేమో,
పోఁడిగ వినవలయు నినున్
వేఁడెదఁ జెప్పు మని జాహ్నవినిఁ బ్రార్థించెన్ ౧౯౦

వ అట్లు ప్రార్థించి యడిగిన నమ్మహానది యతని కి ట్లనియెఁ 'దొల్లి గౌతమీ సింధుసమీపంబున నొక్కపసులమంద యుండ నొక్కనాఁ డయ్యేటివెంట నీటివడిం బడి యొక్కగర్భిణి కర్కటి వచ్చి యచ్చో నొక్క బొక్క గావించుకొని యుండుడు దానిమీఁద నచటిగోపాలుఁ డొక్క పాలకడవ యిడిన నది ప్రమాదంబునం బగిలి తత్ప్రదేశంబు జొబ్బిలం దడిసె నంత. ౧౯౧

క, ఆకర్కటిగర్భమున న
నేకంబులు పుట్టెఁ బిల్ల, లీనుచు మృతయై
పోక యది యేమికతమున
నో క్రమ్మఱ బ్రతికి యుండె నొగిఁ గర్కటియున్. ౧౯౨

ఆ. అట్లు పుట్టి పిల్ల లాదుగ్ధపూరంబు
వలనఁ దోఁగి కమ్మ వలచుచున్న
మంచిమృత్తిక దిన మఱికొన్ని దినముల
నంతపట్టు దెగిన నరుచి పుట్టె ౧౯౩

ఉ. అం దొక యర్భకంబు దమ యమ్మకు నిట్లను 'నాదుజిహ్వ కే
చందమొ మున్ను వోలెఁ జవి చాలదు మృత్తిక రోగ మెద్దియుం
బొందదు దీపనాగ్నియును బుటక మానుట లేదు నా కయో
యిందఱి కి ట్లనో తలఁప నేమి యుపద్రవమో తలంపఁగన్.' ౧౯౪

చ అనవుడుఁ బుత్రుతోడ దరహాస మెలర్పఁగ నెండ్రిలేమ యి
ట్లను 'విన వన్న! పట్టి! యిది యచ్చపుమంటిగుణంబు *గాదు; తోఁ
చిన దొక దోష మేమియును జెప్పఁగఁ జొప్పడ, దొక్కకారణం
బున రుచి పుట్టె, యామిసిమి పోయినఁ గ్రొత్త యొనర్చె జిహ్వకున్.'

వ. అని యమ్మున్ను మున్ను పయఃపూరంబువలన రుచిపారం బగుటఁ దెలిపి 'నీవు పుట్టినకోలె నదియ సేవించి పెరిగితి గానఁగేవల మృద్భక్షణం బెఱుంగ

* గాని.

వట్లు గావున నీకిప్పు డిది యరుచి పుట్టె' ననిన విని వెఱఁగు పడి యప్పెల్ల
తల్లి కి ట్లనియె. ౧౯౬

క. పా లని చెప్పెద వది దా
నేలాగున నుండు? దాన నెనసిన యీ జం
బాలం బింత మధుర మది
గ్రోలెడువారికిని జవులు గొఱఁతయె చెపుమా! ౧౯౭

ఆ. పాలు లేనివాని బ్రతుకు నిరర్థంబు
పాలు గల్లువాఁడు చాల భోగి
పాలు మనకు నేయుపాయంబునందు సి
ద్ధించుఁ దల్లి! నాకుఁ దెలుపు' మనిన ౧౯౮

క. సురలోకమునకు నమృతము
నరలోకంబునకుఁ బా లనఁగ నీరెండుఁన్
సరి చేసెఁ బ్రహ్మ, యల్పుల
కరయంగాఁ దత్సుఖంబు లబ్బునె కొడుకా!' ౧౯౯

వ. అనిన నది మఱియు ని ట్లనియె. ౨౦౦

క. 'నరలోకం బెటువంటిది?
సురలోకం బెట్టి? దీవు చూచితె మన మం
దిరముల సాటివి యౌనో
విరచితగతి నింతకంటె విస్తీర్ణములో?' ౨౦౧

క. అం దుండెడువారికి మన
చందమొ రూపములు వేఱె చందమొ నాకా
చందము వివరింపు' మనిన
నందనుమాటలకుఁ దల్లి నవ్వుచుఁ బల్కెన్. ౨౦౨

క. మన ముండెడు బొక్కలకును
మనకును నుపమేయమాత్రమా వారల భ
వ్యనివాసస్థలములుఁ ద
ద్ఘనతాకారములుఁ దెలియ విను మట్లయినన్ ౨౦౩

క. నాక మనఁ బరగు దివిజుల
లోకము *దా నరయ నూర్ధ్వలోకము, మఱి భూ
లోక మనఁ బరగు మనుజుల
లోకము మన మిప్పు డున్నలోకము పుత్రా! ౨౦౪

చ. చరణము లూరువు ల్జఘనచక్రము లానతనాభు లంచితో
దరములు పీనవక్షము లు దారభుజంబులు కంబుకంఠముల్
సురుచిరవక్త్రపద్మములు శోభితచక్షులు ఘ్రాణకర్ణముల్
శిరములుఁ గేశపాశములుఁ జెన్నగుమేనులవారు దేవతల్. ౨౦౫

క. దేవతలకు విను ముదిమియుఁ
జావును లే దెన్నఁడును బ్రశస్తగుణాఢ్యుల్
కావున విమానయానులు
నై విహరింపుదురు వా రుదాత్తప్రీతిన్. ౨౦౬

క. జరయును రుజయును నరులకు
దొరకొనె నని కాని యాకృతులు దలఁపగ ని
ర్జరులట్ల నరులు, వారికిఁ
గరితురగాందోళికలును ఘనవాహనముల్. ౨౦౭

వ. కావున నట్టిప్రభావంబు లొక్కొక సుకృతవిశేషంబునం గాక యూర కెట్లు సిద్ధించు? మనము పూర్వజన్మంబున దూరీకృతసుకృతుల మగుట నిట్టి దుష్టజన్మంబు వాటిల్లె' ననిన విని 'జననీ! నీ కిట్టి పరమజ్ఞానం బేమివిధంబునం గలిగె? నెఱిఁగింపు మనిన వాని కిట్లనియె. ౨౦౮

శా. ఏ నాగౌతమిలోన నుండునెడ నయ్యేటం గృతస్నానులై
నానాదేశసమాగతద్విజులు నానాధర్మము ల్చెప్పుచో
నానారీతులమాట లేను వినుట న్నాకిట్టి యత్యుత్తమ
జ్ఞానం బబ్బెఁ బురాణగోష్ఠి కెనయే సౌఖ్యంబు లోం దెవ్వియున్. ౨౦౯

మ. విను మయ్యుత్తమగోష్ఠియందుఁ గొడుకా! విశ్వంభరం గల్గుపు
ణ్యనదీతీర్థవిశేషముల్ తెలిసె నెన్నం బెద్ద యాగంగ, త

---

* లోమఱియు.

ద్వినుతస్నానఫలంబునం గలుగుఁ జువ్వే పుణ్యలోకంబు లె
వ్వనికిం బొంద నశక్యమైనయవి దుర్వారప్రచారంబుగన్.' ౨౧౦

క. అనవుడు భవదుపదేశం
బునఁ దల్లీ! నాకు వేడ్క పుట్టెడు నన్నుం
బనుపుము గంగాస్నానం
బున కీదివసములు రిత్త వోవక యుండన్. ౨౧౧

ఉ. నీ కిదె చాఁగి మ్రొక్కెద ననింద్యగుణాస్పదమూర్తి! నేను గం
గాకమనీయతోయములఁ గాయము దొప్పఁగఁ దోఁచి యెత్తి య
స్తోకపురాకృతాఘముల దొంతులు సర్వము దూలఁ దన్నుదుం
గాక భవత్తనూభవతఁగాంచియు నిర్వ్యవసాయి నౌదునే! ౨౧౨

క. నాతెగువకుఁ దగ నీవును
నోతల్లి! యనుజ్ఞ యొసఁగు మొయ్యనఁ జని సు
స్నాతుఁడనై మన యన్వయ
జాతులకును బుణ్యలోకసౌఖ్య మొనర్తున్.' ౨౧౩

ఆ. అనినఁ గొడుకుమాట కడ్డంబు చెప్పంగ
నలవి గాక యుండి వెలఁది పలికెఁ
'దీర్ఘయాత్ర సేయఁ దివురువారల నడ్డ
పెట్టి పాప మేల కట్టుకొందు. ౨౧౪

ఆ. పొమ్మనంగఁ జాలఁ బోకని మాన్పంగఁ
జాల నీకు నెట్లుపోలు నట్లు
చేయు' మనిన నతఁడు చిఱునవ్వు నవ్వుచు
మాతయడుగులకు నమస్కరించి. ౨౧౫

క. మానుగ వెడలి సమంచిత
యానంబునఁ గొంతనేల యరుగఁగ నొకచో
మ్రానిపయి నుండి చూచె మ
హానిష్ఠురమూర్తి యొక విహంగము దానిన్. ౨౧౬

క. చూచి పఱతెంచి యొడిసి య
గోచరవేగమున నెత్తుకొని పోయి సమీ

పాచలశిలపయిఁ దినియెన్
వాచవి కలరుచును వాని వంజుఁడు పెలుచన్. ౨౧౭

వ. ఇట్లు తిని యాఖగం బెగసి పోయె; నాకర్కటికుమారుండును నట్లు మర ణంబు నొంది గంగాయాత్రలు సేయువారలు విధివశంబున నడుమనె మృతిం బొందిరేని జన్మత్రయంబునఁ దద్దర్శనంబు సిద్ధించు ననుట సిద్ధంబు గావునఁ దదనుకూలంబుగా నొక్కమహీపాలు కీలారంబుగోవులలో నొక్క గోవు కడుపున జన్మించి. ౨౧౮

ఆ. తనకు నెదురు లేని ఘనసత్వసంపద
నలరి గోపికాచయంబులోన
గోపకృష్ణు నట్లు గోరత్నములలోన
వృషభ మధికసౌఖ్యవృత్తిఁ బెరిగె. ౨౧౯

క. కరువునఁ బోసినవిధమున
నరుదుగఁ దనరూప మెట్టి దట్టిదకాఁ ద
త్సురభులు గ్రేపుల నీనఁగఁ
బొరిఁ బొరి నేపేటఁ గదుపు పొదు పగుదెంచెన్. ౨౨౦

క. ఈతెఱఁగునఁ బెక్కేడులు
ప్రాతిగ భోగించి తనిసి పదపడి వృషభం
బాతను వొక మృగపతికి న
నాతంకప్రీతి నొసఁగె నాహారముగన్. ౨౨౧

## వంజరుని కథ

క. మఱి కొంకణదేశంబున
నెఱసిన సితదత్తనామనృపతికి సుతుఁడై
గుఱి లేని పరమగుణముల
వఱలెఁ దృతీయభవమందు వంజరుఁ డనఁగన్. ౨౨౨

క. వంజరుఁ డఖిలాశ్రితశుక
పంజరుఁడు విరోధిభయదబాహాబలది
క్కుంజరుఁ డభిరామయశో
మంజరుఁ డన నొప్పె నతిసమంజసవృత్తిన్. ౨౨౩

ఉ. ఆతని పెండ్లిసేయుటకునై పితదత్తవిభుండు రాజక
న్యాతిలకంబులం దడవునప్పు డతండును దండ్రితోడ 'న
య్యా! తనుదోషము ల్పోలియునట్లుగ జాహ్నవి కేఁగి యందు సు
స్నాతుఁడనై నినుం గొలువఁ జయ్యన వత్తునె వేడ్క పుట్టెడున్. ౨౨౪

క. అనవుడు 'నే నెటు దలఁపఁగఁ
దనయుం డెటు దలఁచె బాపు దైవమ! యింకే
మని పల్కుదు నీతఁడు వొసఁ
గనికోరికఁ గోరె నెట్లు గా నున్నదియో.' ౨౨౫

వ. అని యింమకసేపు విచారించి యానృపసత్తముండు దన కుమారోత్తముదెసఁ
గ్రమ్మఱ నవలోకించి, ౨౨౬

క. అక్కటిక మెసఁగ ని ట్లనుఁ
'జెక్కడిచినఁ బాలు వడుచు చిన్నవడుగ! నీ
వెక్కడ గంగాస్నానం
బెక్కడ పసిబిడ్డ వేమి యెఱుఁగుదు చెపుమా! ౨౨౭

క, అని పుత్రస్నేహంబునఁ
దనుఁ బల్కినతండ్రితో నతం డిట్లనుఁ 'బ్రా
గ్జననోదాత్తసుకృతవా
సన నూనినమానసాంబుజము వికసింపన్, ౨౨౮

సీ. ధర్మకర్మము సేయుదానికి నిది ప్రాయ
మిది కాల మని వాలయింపఁ గలదె?
తన యోపినంతయుఁ దవిలి యొనర్పంగ
నట యబ్బినంతయు నబ్బెఁ గాక,
చేయార ధర్మంబు చేయఁ గాలము లేదె
యనుచు నేమఱి యున్న నజునితలఁపు
తనచేతిలోనిదే? ధర్మేచ్ఛ గలుగుట
యల్పమే? కలిగినయది నిరర్థ

ఆ. కంబు చేసికొనుట కర్తవ్యమే? నేత్ర
హీనుఁ డైనయాతఁ డెట్టు లున్న

నుండెఁ గాక తనకు రెండుకన్నులు గల్గి
యుండి యంధునట్ల యుండఁ దగునె? ౨౨౯

క. నీ వెఱుఁగని ధర్మస్థితి
భూవర! మఱి కలదె, నన్నుఁ బుచ్చుము, త్రిజగ
త్పావని యగుగంగానది
కేవిఘ్నముఁ జేయవలవ దిచ్చో' ననినన్. ౨౩౦

క. 'అన్నన్న యేల నీకీ
పిన్నాడలికి నలవిగాని పెనుఁబోకలు? నే
నున్నంతకాలమును నా
కన్ను లెదుర నుండవన్న కథ లేమిటికిన్ ౨౩౧

క. అని తన్ను నివారించిన
జనకునితో నతఁడు 'నన్నుఁ జననీ కున్నం
జనవర! నీమీఁద నభో
జన ముండుము' ననుచు గెంటనము లాడుటయున్. ౨౩౨

సీ. ఏఁ దన్ను వల దని యెన్ని చెప్పిన మానఁ
డని పంప నేఁడాది కాఱునెలల
కైనను గ్రమ్మఱ నరుదెంచు బలిమి నేఁ
డడ్డపెట్టితి నేని నశన ముడిగి
వేగంబె ప్రాణము ల్విడుచు నీవెంటియం
దును వీనిఁ గాశికిఁ బనుచుపనియె
పొసఁగి యున్నది యని వసువస్త్రధాన్యాది
కముగఁ బాథేయంబు గలుగ నొసఁగి

ఆ. పరిజనముల నుచితభంగిఁ దోడిడి కొంద
ఱవనిసురులఁ గూర్చి యవ్విభుండు
తనకుఁ బ్రణతుఁ డైన తనయుని నాశీర్వ
దించి వీడుకొలిపెఁ దెగువతోడ. ౨౩౩

క. ఈ విధమునఁ దనుఁ బాసియు
భావంబునఁ బాయకున్న బాలునిరూప

శ్రీవిభవము పలుమఱు శో
కావేశమతిం దలంచు నశ్రులు నించున్. ౨౩౪

క. నాయనుఁగుఁదనయుఁ డింతకు
నేయెడ కరుగు నను, దొల్లి యెఱుఁగండు ప్రవా
సాయాసం బను, నేనుఁ
బోయెదఁ గా కనును, గడచి పోకున్నె యనున్. ౨౩౫

క. ఇవ్విధమునఁ దలపోయుచు
నివ్వటిలెడు పుత్రశోక నిష్ఠురవహ్నిన్
గ్రొవ్వు చెడ నెరసి జీవం
బవ్విభుఁడు దొఱంగె స్వజను లాక్రందింపన్. ౨౩౬

క. సితదత్తుఁ డవ్విధంబున
మృతుఁ డగుటయు మంత్రివరులు భృత్యులును బురో
హితసామంతాదులు స
మ్మతి నాలోచించి యైకమత్యం బెసఁగన్. ౨౩౭

ఉ. ఆతనిపాలి కేఁగి 'సుగుణాకర! నీజనకుండు నిర్జర
వ్రాతములోని కేఁగె మనరాజ్యము కెవ్వరు దిక్కు లేరు నీ
వీతఱిఁ దీర్థసేవ కిటు లేఁగుట నీతిపథంబె వైరిధా
త్రీతలనాథు లిం కిట మదింపరె శిక్ష యొనర్పకుండినన్.' ౨౩౮

క. అనిన విని 'యకట నాకై
తన ప్రాణము విడిచెఁ దండ్రి, తత్పురి కే నే
మని వత్తు గంగ కరిగెద
నని వెల్వడి వచ్చి మగుడ నర్హంబగునే! ౨౩౯

క. ఎక్కడి పితృమరణము మఱి
యెక్కడి రాజ్యంబు గంగ కేఁగెడుచో మీ
రిక్కడి విఘ్నము చేసెద
రెక్కడి బ్రాహ్మణులు మరలుఁ డే రా నొల్లన్.' ౨౪౦

వ. అని విడియ నాడిన నతని యాగ్రహంబునకు నిగ్రహపడక సామోపాయంబునఁ
గార్యంబు గొనవలయు నని వార లి ట్లనిరి. ౨౪౧

సీ. 'ఏము ధర్మస్థితి యెఱుఁగనివారమే
మామాట నీకు నమ్మంగఁ దగదె
మీతండ్రి మమ్ము నేరీతి మన్నించు నీ
వును నట్లకాఁ గనుఁగొనఁగఁ దగదె
ప్రార్థితంబుగఁ జేయుపని దోష మనిపింప
నేల యీవలవనిజోలి నీకు
నంతియ వలసిన సంతతి వడసి రా
ష్ట్రమునకుఁ బుత్రుఁ బట్టంబు గట్టి
తే పిదపఁ బోయిన నడ్డపెట్టెదమె రాజ
పుత్ర!' నావుడు వీరు చెప్పుట హితంబు
గానఁ బోవుట గాదని కడఁకతోడఁ
గాళ్ళ కెదు రుండి కృతనమస్కారుఁ డగుచు. ౨౪౨

క. 'క్రమ్మఱఁ బనివినియెదఁ జు
మ్మమ్మ! భవత్సేవ' కనుచు నచ్చపుభక్తిన్
మమ్ముఁ దలంచుచు నాత్మపు
రమ్మునకుం జనియె వంజరప్రభుఁ డెలమిన్. ౨౪౩

వ. ఇట్లు చని సితదత్తమహీభర్తకుఁ బితృకృత్యంబులు యథోచితంబుగా నొనర్చి యొక్కపుణ్యదినంబునఁ బుణ్యనదీజలాభిషేచనపురస్సరంబుగాఁ బట్టంబు గట్టుకొని యప్రతిహతప్రతాపంబు దీపింప ననేకవర్షంబులు భూమి యేలుచు ధామిని యను కామినియందు నుగ్రలోచనుం డను నుదగ్రపరాక్రముం డగు కొడుకుం గని వానిమీఁద సకలసామ్రాజ్యభారంబును బెట్టి నన్ను దర్శించి తపోవనంబునకుం జనియె ౨౪౪

మ అని సిద్ధుం డల భోజరాజునకు ని ట్లైతిహ్యముం జెప్పె నం
చనసూయాతనయుండు చెప్పిన మహాం దానందము బొంది మో
డ్చినకే లౌఁదలఁ జేర్చి నమ్రుఁ డయి 'తండ్రీ! యేఁ గృతార్థుండ నై
తి నెఱింగింపఁ గదే తదుత్తరకథల్ తెల్లంబుగా' నావుడున్. ౨౪౫

చ. త్రిభువనవంద్య! దానవసతీగళమంగళసూత్రభంగ! ది
గ్విభునసముదాయసేవిత! రవిద్విజరాజసునేత్ర! సర్వలో

కభరిత ! యోగిహృద్విమలకంజమధువ్రత ! సూర్యకోటిస
న్నిభ ! యిభరాజరక్షణ ! ఫణిద్విషదద్రినివాసభాసురా ! ౨౪౬

క. కరుణారస భరితాంతః
కరణా ! సుకవీంద్రరచితకవితాచరణా !
శరణాగత జనభయపరి
హరణా ! దివిజగణసంత తార్చితచరణా ! ౨౪౭

ఇం ద్ర వ జ్ర ము

శ్రీరాజతల్పీకృత సింధురాజా !
స్వారాజ నీలామల చారుదేహా !
గోరాజ రాజానల గోవిలాసా !
క్షీరాజపత్నీ హిమసింహ కీర్తీ ! ౨౪౮

గ ద్య ము

ఇది వాణీవరప్రసాదలబ్ధవాగ్విభవ తిక్కనామాత్యసంభవ
సుకవిజనవిధేయ అనంతయ నామధేయ ప్రణీతంబైన
భోజరాజీయంబను కావ్యంబునందు
ష ష్ఠా శ్వా స ము

—.०:—

శ్రీ

# భోజరాజీయము

## సప్తమాశ్వాసము

శ్రీశ్రితవిపులోరస్థల!
యాశ్రితజనపారిజాత! యానందసుధా
మిశ్రితమానస! నిగమప
రిశ్రితఫలపాకరూప! శ్రీనరసింహా! ౧

ఉ. ప్రీతి యెలర్పఁగా నవధరింపు భవద్విమలాంశజుండు వి
ఖ్యాతతపోమహాత్ముఁ డగు నత్రితనూభవుఁ డానతిచ్చునా
భూతలనాథుతో నిటులు భోజవిభుం డడుగంగ సిద్ధుఁ డ
త్యాతతయుక్తిఁ జెప్పెను సమంచితపుణ్యకథాప్రసంగముల్. ౨

వ. అంత నవ్విప్రుండు వంజరుని తదనంతరవృత్తాంతం బెట్టి దనిన. ౩

క. 'కంజభవాన్వయదీపక!
వంజరుచరితంబు భువనవర్ణ్యము విను నీ
కుం జెప్పెద' నని యాభవ
భంజని యి ట్లనుచుఁ జెప్పె బ్రాహ్మణుతోడన్. ౪

ఉ. * వేసవికాల మాతపమువేఁడిమిఁ గాలినతాలమీఁదఁ బ
ద్మాసనలీలఁ గైకొనుచు, నంబుదవేళ నుదానవాభ్రుఁడై
వేసట లేక ఘోరతరవృష్టిని దోఁగుచు, శీతకాల మా
యాసము నోర్చి పెన్మడుగులందు వసించుచుఁ బెక్కు వర్షముల్. ౫

---

* ఇది షష్ఠాశ్వాసములోని పద్యము. కథను సంగ్రహించుటలో నిక్కడ ఉపయోగించుకొనుట యైనది.

వ. మహోగ్రంబైన తపస్సు చేయుచున్నంతఁ దదీయతపంబు చెఱుపనో యన
నచ్చరలేమం బోని కామినీమణిని. ౬

క. ఒక్కతెఁ దోడ్కొని యచటికి
నొక్క మహీసురుఁడు, నొక్క యుర్వీశ్వరుఁడున్,
జొక్కమగు నొక్క వైశ్యుఁడు,
నొక్కచతుర్థుండు వచ్చి యుండొరుఁ గడవన్. ౭

క. ఆమనుజాధీశునకుఁ బ్ర
ణామము లొనరింప నతఁడు నలుగురఁ గని 'మీ
రీమగువయుఁ దగ నిచటికి
నేమిటి కిట్లరుగుదెంచు టేర్పడఁ జెపుఁడా!' ౮

వ. అని యడిగిన నతనికి బ్రాహ్మణుం డిట్లనియె. ౯

చ. అనయము వేశ్య యీతరుణి, యాతఁడు క్షత్రియుఁ, డేను విప్రుఁడన్
విను వణిజుండు వాఁ, డతఁడు వెల్మయు నల్వురుఁ దొల్లి దీని ది
క్కునఁ జరియింపుచుండుదుము; కొండొకకాలము చెల్ల నింతి మా
మనములఁ గల్గు ప్రేమపరిమాణ మెఱుంగఁ దలంచి యిట్లనున్, ౧౦

ఉ. 'నీరును బాలుఁ బోలె మన నెయ్యము తియ్యము నొంది నేఁడు సొం
పారెడు, మీఁద నా కొకటి యైనఁ బదంపడి యే మొనర్తురో
మీ' రని యొత్తి చూచుటయు మేలుగ విప్రుఁడు 'నీకు నగ్నిసం
స్కార మొనర్చి శల్యములు జాహ్నవికిం గొనిపోదు నే' ననెన్. ౧౧

ఉ. చచ్చినతోన చత్తు ననె క్షత్రియజాతుఁడు, వైశ్యుఁ డర్థమున్
వెచ్చము సేయువాఁడ ననె, విప్రముఖంబున మించి కాష్ఠముల్
దెచ్చి దహించువాఁడ ననెఁ దెంపున నాలవజాతియాతఁ డీ
యచ్చునఁ బల్కు నప్పలుకు లాదటఁ గైకొని యుండు నింతియున్. ౧౨

ఆ. అంతఁ గొంతకాల మరుగ నాయింతి కృ
తాంతుప్రోలి కరిగె, నతఁడు దోన
చచ్చె, నితఁడు ధనము వెచ్చించె, వాఁడు ద
హించె, నేను శల్యసంచయంబు ౧౩

సీ. గంగకుఁ గొని పోయి కలుపుచో గంగ ప్ర
త్యక్షమై 'నీవు బ్రాహ్మణుఁడ వకట
శూద్రశల్యములు దెచ్చుట నీకుఁ బాడియే?'
యనిన నేఁ బూర్వవృత్తాంత మెల్ల
జెప్పి నాయెడఁబాటు దప్పక యిట్లు దె
చ్చితి నేమి సేతు నయ్యతివరూప
మచ్చొత్తినట్లు నా యంతరంగంబునఁ
బాయ కున్నది మరుబాణములకు

ఆ దెప్ప మైతి ననుచు జెప్పలఁ గన్నునీ
రపుడు గ్రుక్కికొనుడుఁ గృప దలిర్ప
నస్థిచయముమీఁద నాగంగ యొకమందు
వైవ నిది పునర్భవంబు నొందె. ౧౪

క. క్షీరాంబుధిఁ దఱువఁగ మును
శ్రీరమణి జనింపఁ దోన శీతకరుండుఁ
బోరన పుట్టినక్రియ నీ
భూరమణుఁడు పుట్టెఁ బొలతి పుట్టుకతోడఁ. ౧౫

ఉ. అంత నదృశ్యమై చనియె నాదివిజాపగ, యేను వేడ్క ని
య్యెంతికరంబు పట్టఁ గర మెత్తఁగఁ దా నెడ నొచ్చి దీనితోఁ
బంతము దక్క మున్ను ఘనపావకకీలల మేను వైచి యీ
యంతరమందు నీకుఁ గుటిలాలక నొప్పన చేసి పోదునే. ౧౬

ఆ. వలదు తొలఁగు వెఱ్ఱివాఁడ వయ్యెద వీ ల
తాంగిఁ గదిసితేని యనిన నస్థి
సంచయంబు పుణ్యజలములఁ గలిపి ప్రా
ణములు మగుడఁ బడసినాఁడ నేను. ౧౭

ఆ. నానిమిత్తమునను మానిని యిచ్చోట
బ్రతికె నింతితోడఁ *బరిణయింతు

* బరిణమింతు.

నబ్జవదనమీఁద యభిలాష విడిచి నీ
కిష్టమైనయెడకు నేఁగు మంటి.' ౧౮

వ. అనిన నతం డుపరి యాకసంబు దాఁకి యేమీ కొంకక యింకను విట్లు పల్కుమా! నాచేతికోలఁది చూతుఁ గాని, యని భుజాస్ఫాలనంబు సేయుచు నిలిచి యదల్చె: నేనును నాధౌతోత్తరీయంబు నడుమునం జుట్టుకొని నెట్టుకొని యుండితి; నప్పు డీ తనుమధ్య మధ్యస్థయై మమ్ము వారించి, నామనోనేత్రంబులకు మీరిరువురు నొక్కవిధంబు కాని భేదంబు లేదు, వాదంబు దక్కి మన పురంబునకు నన్నుం దోఁకొని పోయి నలుగురు చెప్పినట్లు పొం దని పల్కె నంత. ౧౯

క. ఇట్టిద యగు కార్యం బని
గట్టిగ నింతిఁ గొని పోయి కతిపయతిథులం
బట్టణము సొరఁగఁ గోమటి
సెట్టియు నీరెడ్డికొడుకుఁ జెటి యొకవలన౯ ౨౦

చ. కనుఁగొని హర్ష చిత్రపులకంబులు మేనుల నివ్వటిల్ల నీ
వనితకునై కదా ధనము వంచన సేయక పాఱఁ జల్లితిం,
బనివడి బేగ కట్టియలు బండ్లకుఁ బూన్చితి నంచుఁ దారు చే
సినపను లుగ్గడించుచును శీఘ్రగతిం గదియంగ వచ్చిన౯ ౨౧

ఉ. 'చేరకుఁ డింతి నెవ్వఁ డిటు చేరినఁ బ్రాణముమీఁద వచ్చు నం
భోరుహసంభవాన్వయుఁడు పూజ్యుఁడు గాన సహించి యుంటిఁ గా
కారయ నన్యు లెంతటిబలాధికు లైనఁ దృణీకరింపనే
మీర లెఱుంగ రిట్లు పులిమీసల నుయ్యాల లూఁగ వచ్చునే.' ౨౨

క. అని యా రాజకుమారుఁడు
కినిసి పలికె; నపుడు వారికిని మాకును నీ
వనితకు వాదము ముదిరినఁ
జని చెప్పితి మప్పురంబు సభవారలకు౯. ౨౩

వ. చెప్పిన విని యాసభాసదు లందఱు నొండొరుల మొగంబులు చూచి యీముడి మాచేతం దీరదు, తత్పురంబుసమీపంబున నొక్క రాజర్షి యున్నవాఁ డతని

చేతఁ జిక్కినగు, నందుఁ బొందనిన మిమ్ముఁ గాన వచ్చితి, మని యంత
వృత్తాంతంబును జెప్పి యవ్విప్రుండు మఱియు ని ట్లనియె. ౨౪

క. 'మానలువుర వర్తనములు
వీను లలర మీరుఁ దొలుత వింటిర కాదే
యీనారీరత్నము మా
లో నెవ్వరి కర్హమగుఁ * దెలుపరే కరుణన్.' ౨౫

మ అని భూదేవుఁడు పల్క వంజరనరేంద్రాధీశ్వరుం 'డేనుఁ జె
ప్పిన మీ రందఱు సమ్మతించెదరె, యీ బింబోష్ఠి మీలోన నొ
క్కని సొ మ్మయ్యెడిఁ గాన మాన రితరుల్ కామాతురస్వాంతులై
పెనఁగం బడ్డ నమంద మయ్యెడుఁ జూఁడీ పెన్పోరులై' నావుడున్. ౨౬

క. వినుతయశా! తగవునకుం
జని యోడిననరుఁడు ముదిపి చచ్చిన వగవం
బని లేదు బుద్ధిమంతుల
కనునానుడి వినమె యింత యన నేమిటికిన్. ౨౭

తే. మీరు నిఖిలార్థవేదులు మీరు చెప్పి
నట్లు గా దని త్రిప్పంగ నగునె మాకు
ననుచు నందఱు నేకవాక్యముగఁ బల్క
వారిదెసఁ జూచి యా రాజవల్లభుండు, ౨౮

సీ. పూఁబోఁడి నెక్కటిఁ బుట్టించుటకు హేతు
వైతి గావునఁ దండ్రి వగుదు విప్ర!
వనజాక్షి పుట్టుతోడన నీవుఁ బుట్టితి
కాన సోదరుఁడవు క్షత్రియుండ!
యువతి యీల్గినఁ బూని యుత్తరక్రియలు సే
యుటఁ దనూజుఁడవు వైశ్యుండ! నీవు
లలనకు నున్నకాలము కూడుఁ జీరయు
నడిపి చచ్చినఁ గట్టె లిడుటఁజేసి

---

* దెలుపవే.

తే. నీవు భర్తవు గాఁదగుఁ జూవె శూద్ర!'
యనుచు వివరించి చెప్పిన యతనిమాట
విని రయంబున శూద్రుండు వికచవదనుఁ
డగుచు నయ్యింతిఁ జేపట్టె నాక్షణంబ ౨౯

చ. కనుగొని యున్నముువ్వురును గామశరానలతప్తచిత్తులై
కనలుచుఁ బోలుఁ బోల దని కాన కితం డొక కాఁపువాని కే
మని కొనిపోయి నిష్కరుణుఁడై నవపల్లవకోమలాంగిఁ గ్ర
క్కునఁ దగ నిచ్చె మానికముఁ గ్రోఁతికి నిచ్చినమూఢు కైవడిన్. ౩౦

తే. ఎంత చెప్పిన నావగింజంత భూతి
పూయువానికి గుమ్మడికాయయంత
వెఱ్ఱి గల దను నార్యోక్తి వినమె తొల్లి
యితని యవివేక మది వేఱె యెన్న నేల ౩౧

చ. అదియునుఁ గాక పేరడవులందు మృగంబులఁ గూడియున్న పెన్
ముదుకని కెట్టు పుట్టుఁ దుదిముట్టిన నాగరికంపుఁజందముల్
వదలక తోడఁ జచ్చుట, సువర్ణము దానముసేఁత, ప్రేతరా
ట్సదనము చొచ్చి యున్నసతిఁ జయ్యనఁ దెచ్చుట యెందుఁ బోయెనో. ౩౨

క. మోపెడు *కట్టెలఁ గాల్చిన
కాపే యర్హుఁ డగునటె జగన్మోహనలీ
లాపరిచయదృగ్దీప్తి
వ్యాపారాపాంగ మైన యంగనఁ గవయన్. ౩౩

వ అని కోపోద్రేకంబు సైరింపం జాలక యాపెద్ద నుద్దేశించి 'యోయీ! నీవు మావేడ్క చెఱిచితివి గావున వనితానిమిత్తమై వహ్నితప్తుండవు గ' మ్మని బ్రాహ్మణుండును, పిదయితకు నీవు భ్రాతవు గ మ్మని క్షత్రియుండును, నీ కళత్రంబునకు నీవు పుత్రుండవు గ మ్మని వైశ్యుండును శాపంబు లిచ్చిన నెడ నొచ్చి యాశూద్రుండు వారి కిట్లనియె. ౩౪

క. "ఓహో! యిటు సేఁత గురు
ద్రోహ మగుట గాన నేరరుం గదె 'కామాం

* కట్టెలు.

ధో హి న పశ్య' త్యను పలు
కూహింపఁగ నిక్క మయ్యె నుడుగని మీచేతన్. ౩౫

తే. ఇచట మీ రిచ్చుశాపంబు లెన్ని యైన
నాక కానిండు, సత్యవ్రతైకశీలుఁ
డితఁ డనపరాధుఁ డగు క్షమియింపుఁ'' డనఁగ
నతని వారించి వారి కి ట్లనియె విభుఁడు ౩౬

ఆ 'కాముకునకుఁ, బాపకర్మున, కవివేకి,
కవనిపతికిఁ, గోపవివశమతికి,
మదవిజృంభితునకు, మద్యపాయికిఁ, గ్రూర
చేతసునకుఁ దగవు చెప్పఁ జనదు. ౩౭

వ అదియునుం గాక సకలద్వంద్వంబులు విడిచి సమలోష్టకాంచనుండనై యుండియు మీతో భాషించినదోషం బూర కేల పోవు, నైనను మీకు నాచెప్పినట్లగుం గదా యని వాలాయించి యడిగినప్పు డియ్యకొని యిప్పు డిటు చేఁత నా భాగ్యంబ కాక మీ రేమి సేయుదు రోపితి రేని శాపంబులు క్రమ్మఱింపుం డంతకు శక్తులు గా రేని యూరక పొం' డనిన వారు 'తంత్రీ! వేసరినవాఁడు వెలుంగుమీఁద పేన్నీళ్ళుచల్లినట్లు నిలు పోపక పలికితిమి గాక నిన్ను శపింప మే మెంతవార' మని యుపచారోక్తులు పలుకుచు దుప్పి పోయిరి గాని శాపంబులు మరలింప నోప రైరి; శూద్రుండు నతనిచేత ననుజ్ఞాతుండై యాసతియుం దానును నిజగృహంబునకుం జనియె, మఱి కొండొకకాలంబు సనుటయు నొక్క నాఁడు ౩౮

క. అవసరమున నొక భూపతి
భావ మలర వేఁట వోయి ప్రత్యక్షభవా
నీవిభుఁడో యన నొప్పెడు
నావంజరుఁ గాంచి నమ్రుఁడై యచ్చోటన్. ౩౯

ఉ కొండొకసేపు తద్విపులగోష్ఠి సుఖించుచు నుండి యానృపా
లుండు మహాసుభాష్ఠఁ దని లోకమువారలు చెప్ప నెప్పుడున్
వింటిని మిమ్ము నారు నిదె నేఁడు నిదర్శన మయ్యె నన్ను నీ
తండు గృతార్థుఁ జేయఁదె ముదంబున మత్పురి కేఁగుదెంచినన్. ౪౦

వ. అని తలంచి, ౪౧

క. ఆతనిఁ దనపట్టణమున
కాతతభక్తిఁ గొని పోయి యతనికిఁ బరిచ
ర్యాతంత్ర మొనర్పఁ దనూ
జాత నునుప నతివిహితసదనమునందున్ ౪౨

క. ఆరాజుచేత నతఁ డటు
లారాధితుఁ డగుచు నుండె, నంతట నొకనాఁ
డాలామారత్నము దన
చేరువ మెలఁగంగఁ గోర్కి చిగురొత్తుటయున్ ౪౩

వ. విప్రాదికంబగు విటత్రయంబువలన నైన శాపంబులు దన్నుఁ బ్రేరేఁప *సంగోతి
నతిప్రీతిం జూచి వ్యంగ్యరీతి నతం డిట్లనియె. ౪౪

క. పెక్కుఁదెఱంగుల నా కీ
క్లెక్కుఁడు పరిచర్య చేసె దీ వెప్పుడు నిం
కొక్కటియ సుమీ కడమం
జిక్కినయది తెలిసికొమ్ము శీతాంశుముఖీ! ౫౪

చ. అనవుడుఁ గేలు మోడ్చి వినయంబున నిట్లను నాలతాంగి 'మ
జ్జనకుఁడు మీపదాబ్జములు చల్లన కాన భవత్సమీపమం
దునిచిన నున్నదాన మఱి యొం డన నేరక సన్మునీశ్వరా!
కనుఁగొన సర్వముం గడమ గాక యొకం డని చెప్ప నున్నదే. ౪౬

ఆ ఏను బాల నగుట యెఱుఁగరే నాయందుఁ
గడఁగి కొఱఁత లెన్నఁ గలరె మీరు
నోలిఁ దప్పు లైన నొప్పులుగాఁ జూడుఁ
డిట్టు లవధరింప నేల యనఘ!' ౪౭

ఉ. నావుడుఁ జెక్కు మీటి 'నలినస్ఫుటలోచన! మాట లేల నీ
యౌవనలక్ష్మికిన్ భటుఁడ నైతి, ననుం గరుణింపు' మంచు వాఁ
డూవిళులూరుచుం బిలువ నుత్పలగంధియు 'నోమహాత్మ! నీ
కీవిధ మెట్లు చొప్పడియె నే నొక వ్రాతియె నీదు కోర్కికిన్. ౪౮

---

* నాగొంతి.

ఉ. కన్నియ నేను ధర్మగతి గామి యెఱింగియు నిట్టు లానతీఁ
జన్నె ?' యనన్ 'లతాంగి ! యిది క్షత్రియవంశమునందుఁ జెల్లు, నా
కిన్నియుఁ జెప్ప నేల నను నేల గదే !' యను వంజరుండు; ము
న్నెన్నఁడు లేని నింద యిది యె ట్లగునో యని తూలు బాలయున్. ౨౯

ఉ. కొమ్మపదారవిందములకుం బ్రణమిల్లె విభుండు, మేనఁ గం
పమ్ము దలిర్ప నప్పడఁతి 'పాపము గట్టకు పార్థివేంద్ర ! నీ
విమ్మెయి నిప్డు వేగపడి యీలువుపెం పెడలించి పోవఁగాఁ
బిమ్మటిమాట కోర్వ ననుఁ బెండిలిగ మ్మటు లైన మే లగున్. ౩౦

వ. అనిన నతం డిట్లనియె. ౩౧

క 'ఇది గాంధర్వవివాహము
సుదతీ ! మన కిపుడు సాక్షి సూర్యుఁడె' యన 'నో
ముదుకఁడ ! నీకొద దీఱిన
వదలెద వే నొల్ల' ననుఁ బ్రవాళాధరియున్. ౩౨

క. 'ఏ నేల నిన్ను వదలుదు
మానిని ! యనుమాన ముడిగి మన్నింపుము, నా
చే నొకశపథము గొను' మని
దానియడిగినట్ల చేసె ధరణీపతియున్. ౩౩

వ ఇత్తెఱంగున నత్తెఱవచిత్తంబు మెత్తం జేసి చిత్తజసుఖకేళిం దేలి యుండం దనివి వోక యాకన్నియ నెత్తుకొని పరదేశంబున కరిగి యొక్క వివిక్తదేవాలయంబునందు నయ్యిందువదన నునిచి, గ్రాసార్థం బాసమీపగ్రామంబునకుం జనిన నం దొక వారనారీపరిచారిక వచ్చి పరిణతవయస్కుం డయ్యు వళితపలితంబులం బొరయక తరుణవయస్కుండ పోలె నున్న యన్నరనాథుం జూచి 'మాయక్క యెక్కడనేని యొక చక్కనివాఁడు గల్గినం గాని కేవలనరమాత్రుల నెల్ల నంగీకరింపదు, నేఁ డితనిం జూపి యమ్మచ్చెకంటిచేత మెచ్చుపడయుదు, నని తలంచి యతనిం దోడ్కొని పోయిన. ౩౪

ఉ. ఆతనిఁ జూచి వేశ్యయుఁ దదాగమనోచితభాషణాదులం
బ్రీతునిఁగా నొనర్చి యధరీకృతమన్మథుఁ డివ్విటుండు నేఁ

డీతఁడు నాకుఁ జొప్పడునె యే నిల నింతకృతార్థ నౌదునే
నాతికిఁ జారుభర్తయ ధనంబులు సొమ్ములు వేయునేటికిన్. ౫౫

ఆ. ఇతనిఁ దడవు గాఁగ నిచ్చోట నిలుపను
వీని మనసులోని నింతదనము
పాయఁ ద్రోవ నేయుపాయంబు గలదొకో
యుచితభంగి యయ్యుమనుండవలయు. ౫౬

క. అవి తలఁచి వెండి పలకయుఁ
గనకపుసారెలును రత్నఖచితములై పే
ర్చినపాచికలును దెప్పిం
చి నృపోత్తము నెత్తమాడఁ జీరిన నతఁడున్. ౫౭

క. నీతోడ నాడఁ దీరదు
నాతి! నానాతి నేఁడు నావెంట నతి
ప్రీతిఁ జనుదెంచి శ్రాంతిప
మేతయగుచు నొంటి నున్న దేఁ బోవలయున్.' ౫౮

క. అనిన విని నీకు నిప్పుడు
వనితలు లే రనుట గాదు, వచ్చినపిదప
న్మనసార నిష్టసుఖవ
ర్తనముల నొక్కింతసేపు దడయుట కీడే. ౫౯

క. పోయెదవు గాని రమ్మని
యాయంబుజనేత్ర దన కరాకర్షణముం
జేయుడు నొం డన నేరక
కాయజునురిగోలఁ దగులు ఖగమును బోలెన్. ౬౦

వ. దానితో నెత్త మాడఁ గడంగిన. ౬౧

క. దశవిధముల నెత్తంబుల
శశిముఖి యే నెత్త మడిగెఁ జయ్యన నది త
ద్వశ మగు ద్యూతవిధిజ్ఞాలు
ప్రశంస యొనరింప నానృపతి లజ్జింపన్. ౬౨

ఉ. ఓటమి పొంద పైచుకొని యూరక పోపుట యెత్తు సాల ది
య్యాట యవశ్యమిుం గెలుతు నంచుఁ జలంబున నాడు, నాడి యా
యాటయు నోడి, నోడి యురియాడు నిజాంగన యున్నయున్కికిం
బాటలగంధిలో గెలువఁ బాటయి యుండమికిన్ విఘం దెదన్. ౬౩

వ. ఇవ్విధంబున నమ్మహీపాలునకుఁ గాలవిడంబంబు సిద్ధించె. నంతఁ బౌరకాంత యొకర్తె యొక్క పనివెంట నారాజపుత్రి యున్నదేవాగారంబునకుం బోయి.

క. పూచినతంగెటి వోలె మ
రీచి నిబిడమణిగణస్ఫురిత భూషణయై
లాచాతురిఁ జెలు వొందెడు
నాచపలాక్షిఁ గని యమ్మృతాత్మిక యగుచున్. ౬౪

ఉ. ఎక్కడనుండి వచ్చె నొకో యీనవనీరజకోమలాంగి తా
నిక్కడ నొంటి నుండఁ గత మెయ్యదియో శశిమౌళి మౌళిపై
నెక్కినయేటితోడఁ గలహించి హిమాద్రిజ యల్గి వచ్చి యీ
చక్కటి నిల్చెనో, యనుచుఁ జప్పుడు సేయక డాయఁ బోయినన్. ౬౫

ఆ. చెవరి చూచు లేఁడికొదమచూపులఁ గీడు
పఱచునట్టి తనదు మెఱుఁగుఁజూపు
లడరి నెమిు పచ్చి యప్పౌరకామిని
తోడ నిట్లు లనియెఁ దోయజాక్షి. ౬౬

క. ఎందుల దానవు? చెలఁది! న
నుం దా నిట డించి మన్మనోనాయకుఁ దే
గెం దడపు గలదు, రాఁడే
చందమొ కావున గదా యిచట నెచ్చోటన్. ౬౭

మ. హరవిద్వేషము దక్కి మన్మథుఁడు రుద్రాక్షంబులున్ భూతియుం
బరగం దాల్చి తదీయసత్కృపకుఁ దాఁ బాత్రుండు కాఁ బూని సు
స్థిరభక్తిం జరియింపఁ జొచ్చెనన నక్షీణద్యుతిం బొల్చు సుం
దరదేహాం డతఁ డేమి యయ్యెనొ కదా! తల్లి! తలం కయ్యెడున్. ౬౮

చ. అనుచు వివర్ణవక్త్రి యగు నానృపపుత్రిక నూరడించి 'కా
మిని! యొకదిక్కు చన్నతుది మిన్నక క్రమ్మల వత్తు రమ్మ! పో

యినపని గాక, భానుఁ డదె యిమ్ములఁ బశ్చిమవార్ధి కిన్ రయం
బునఁ జనుచున్నవాఁడు తమముం గదుఁ బెల్లగు నింకఁ బైపయిన్. ౨౦

క. చోరులు వత్తురు గాదే
క్రూరమృగావళులు వచ్చు గుడిలోపల నీ
వీరేయి యొంటి నున్కి వి
చారముగా దరుగుదెమ్ము చయ్యన నాతోన్. ౨౧

చ. ఎదురుగ వచ్చు నీదు హృదయేశుఁడు, నంతకు రాక తక్కినన్
సుదతి! మదీయగేహమున సుస్థి వహించుట భార మైనఁ గాం
చెద నతఁ డెందు నున్న' నని చెచ్చెర నచ్చపలాక్షిఁ గొంచు న
మ్ముదుసలి యేఁగె నంత నృపముఖ్యుఁడు వచ్చి యదృష్టభార్యుఁడై ౨౨

ఉ. చిత్తము జల్లన న్మిగులఁ జేడ్పడుఁ, బెద్దయుఁ గన్నునీరు చే
నొత్తుచుఁ జూచు నల్దెసలు, నూరక యిట్టును నట్టుఁ బాఱు, నె
ల్గెత్తి పొరిం బొరిం బిలుచు, నెవ్వరు పల్కిన నాలకించు, డ
గ్గుత్తిక పెట్టు నెట్లగు నొకో యను, నెక్కడి కేఁగెనో యనున్. ౨౩

ఆ. ఏను బోయి తడవుగా నున్న నబల యి
చ్చోట నాకు నెదురు చూచి చూచి
యొంటి నుండ వెఱచి యూరిలోనికిఁ బోవఁ
బోలు నను మఱియుఁ బోయి వెదకు. ౨౪

ఆ. నిప్పు ద్రొక్కినట్లు నిలువఁ డెచ్చోటను,
నాఁడుమునుకుఁ గని మహాశతోడఁ
గూడఁ బాఱి తేఱకొనఁ జూచి, య
ప్పొలఁతి గాకయున్నఁ బల్లవడును. ౨౫

చ. పలుమఱుఁ దన్నుఁ జూచి మఱి పౌరజనంబులు వీఁగి వెఱ్ఱి నా
నలయక వీధులందు నిటు లాఱడిఁ ద్రిమ్మరుచున్నయమ్మహీ
తలపతిచంద మంతయును దా విని తొల్లిటి వారకాంతయున్
వెలయఁగ నాతనిం బిలిచి వేగ వివేకము నివ్వటిల్లఁగన్. ౨౬

క. ఉపచారోక్తుల నాతని
యుపతాపము డిందుపఱచి యొయ్యొయ్యనఁ దా

నుపగూహనాదిసుఖముల
నపరిమితప్రీతిఁ జేయ నతఁ డట్లుండెన్. ౭౭

ఉ. అక్కడఁ బేదరాలినిలయంబున నాన్నపపుత్రి నెవ్వగం
బొక్కుచు మేర లేని తలపోఁతలఁ దూఁగుచు నుండ, నొక్కనాఁ
డక్కమలాక్షిఁ గన్గొనియె నప్పుర మేలెడు రాజసేవకుం
డొక్కఁడు. వాఁడు వోయి యది యున్నతెఱం గెఱిఁగించె భర్తకున్. ౭౮

ఆ. అవధరింపు దేవ! యయ్యంబుజానన
యొప్పు చూడ నేత్రయుగము చాల,
దాలతాంగిగుణము లభినుతింపఁగ నొక్క
జిహ్వ చాల దేమి చెప్ప నింక. ౭౯

క అవ్వనజాయతలోచన
యెవ్వరిసొమ్మొ ఎఱుంగ నివ్వసుమతిలోఁ
బువ్వుఁబోఁడి యతఁడ కాకొకఁ
డవ్వల మఱి కలఁడె' యని మహాశగఁ జెప్పెన్. ౮౦

క ఆరాజు వానిచే నటు
లారాజీవాయతాక్షియౌవనవిభవం
బారఁగ విని మదనాస్త్రవి
దారితహృదయుఁడయి తగవు తలఁపని మదితోన్. ౮౧

క. ఆపడఁతిఁ బిలిచి తెండని
పై పై దూతికలఁ బనుప భయ మందుచు 'నో
పాపపుదైవమ! తుది న
న్నీపాటులఁ బడఁగఁ దెచ్చితే యిచ్చటికిన్. ౮౨

ఉ. తల్లినిఁ దండ్రిఁ బాసి కులధర్మము చూడక వెఱ్ఱిదాననై
యిల్లును బట్టు డించి యిటు లేటికి వచ్చితి? వచ్చి మన్మనో
వల్లభు నిందుఁ గోల్పడితి, వాఁ డిట నెప్పుడు వచ్చు? నింతలోఁ
గల్లరిబ్రహ్మ యేమి గతిగా నొనరించెనొ యేమి చేయుదున్. ౮౩

క ఈనృపతి పాపకర్ముం,
డే నీతనిసమ్ముఖమున కే మని పోదున్,

మానము వెలి యగు బ్రాణము
మానినులకు నేమి బ్రాతి మహి నూహింపఁ. ౮౪

క. అని తలఁచి యబల దూతీ
జనముల కిట్లనియెఁ 'గొంత సైరణ వలదే
కనుమఱుఁగు లేక యూరక
తన వలసినచోట్ల మెలఁగుతరుణులు గలరే. ౮౫

ఉ. ఎప్పుడు ప్రొద్దు గ్రుంకెడినొ యించుక సైపుఁడు మీనృపాలుతోఁ
జెప్పుఁడు వేగ మేల కడుఁ జేరువ నున్నది కార్య' మంచుఁ దా
నప్పని కియ్యకొన్నయటు లాడినఁ బోయిరి వారు, నాఁటిరే
యప్పటుబుద్ధిబుద్ధియుతు లాదట మెచ్చఁ దొఱంగె దేహముఁ. ౮౬

క. పుడమి నపత్రప యగునెడఁ
బడతికి దేహంబు విడువఁ బాడియ కాదే
సడి కంటెఁ జావు మే లను
నొడువు పురాతనము గాక నూతనపదమే. ౮౭

వ. ఇట్లాసతి మృతి బొందుట విని యమ్మనుజేంద్రుం 'డిది యెట్టి పతివ్రతయొ కాక నాచేసినధౌర్త్యంబునకు లజ్జించి ప్రాణంబు లుజ్జగించె' నని పశ్చాత్తాపంబు నొందుచు నెట్టకేలకు నారాత్రి గడపి మఱునాఁడు దానికి నగ్నిసంస్కారంబు సేయ నియోగించె, నా వృత్తాంతంబుఁ గర్ణాకర్ణి నాకర్ణించి వంజరుం డది తన యింతియ కాఁ బోలు నని యాందోళించుచు వచ్చి చూచి నిశ్చయంబు బగుటయు శోకాక్రాంతుం డయి. ౮౮

చ 'నలినదళాక్షి! నీవు నలి నావెనుకం జనుదెంచి నాకుఁ బే
రెలమి యొనర్చి తిప్పు డిటు లీ వమరావతికిం జనంగ నే
నిలుచుట పంతమే, యిపుడు నీవెనుకం జనుదెంతు' నంచుఁ బొ
రులు వెఱఁ గందఁగా నుఱికె స్రుక్కక వంజరుఁ దాచితాగ్నిలోఁ. ౮౯

వ ఇట్లావిప్రశాపంబునకు ననురూపంబుగా నతండు మృతుం డగుటయు, నా వేశ్యయు 'నానిమిత్తంబై కదా వీ రిరువురు నిట్లై' రని తాను నయ్యగ్ని యందు కూలె; నమ్మువ్వురి మరణంబులకుం గారణంబై యుండి యే నూర కుండుట ధర్మంబు గాదని దాసియుం దదనుగమనంబు చేసె నంతయు విని

క. ఆరాజచ్చేరు వందుచు
నారాజసరోజముఖుల యస్థులు గంగా
వారిఁ గలిపి రం డని తన
వారిం బనుపంగఁ బోయి వారును నొకచోఁ. ౧

వ. ఒక్కవిప్రుండు పెద్దకాలంబు దేవి పురశ్చరణంబు చేసి తత్ప్రసాదంబున సంజీవని వడసి యుండుట యాప్తపరంపరవలన నెఱింగి యతని యున్నెడ కేఁగి తమతెఱంగు చెప్పి 'విప్రా! నీవు పెద్దయు నాయాసపడి గడించినదివ్యవస్తువునకుం దాత్కాలికంబై యత్యంతసుకృతప్రదంబగు ప్రయోజనంబు సిద్ధించె, వీరలప్రాణంబు లెత్తు మిదియ నీదగు నౌషధంబునకు నిదర్శనంబు నగు' నని ప్రార్థించిన నతం డట్ల చేసెన. ౨

క. తారయు జ్యేష్ఠయు లక్ష్మియుఁ
దారాధీశుండు నెవ్విధంబున దుగ్ధాం
భోరాశిఁ బుట్టి రట్టుల
యారమణులు నతఁడుఁ బుట్టి రౌషధశక్తిన్. ౩

ఆ. ఇట్లు పుట్టి యతనియింతి మన్మథవికా
రావలోకనంబు లదర నతని
చెట్ట పట్టఁ బోవఁ 'బట్టకు పట్టకు
పొలఁతి నీకుఁ దోడఁబుట్టు నైతి. ౪

వ. న న్నింక వరించుట యుచితంబు గా దూరకుండ' మనిన వెఱఁగుపడి యుండె నంత నవ్వేశ్యయు నాలా గె ట్లనిన నతండు దాని కి ట్లనియె ౫

క. 'ధర్మాధర్మపథంబుల
మర్మ మొకని కొకఁడు చెప్పుమాటయ లోకం
బర్మిలిఁ గాని తెలియ వలదె
కర్మాకర్మైకయుక్తి గనియెడుపనికిన్. ౬

క. మదిరాక్షి! వినుము నీవును,
మదంగనయు, దాసియును సమంబు సుమీ! నా
హృదయమున' కిప్పు డనవుడుఁ
బొదలెడుకోపమున రాజపుత్రిక పలికెన్. ౭

వ. ఏమే మీ గ్రుడ్లు దింటయుం గాక గూడెక్కి కూసెద వీ వేశ్యయు దాసియు నీకన్నుల కెంత ప్రియ మయిన నయిరి కాక నాకు సవతుగా నిట్లు పలుక నెట్లు నోరాడె? నీవు నన్ను వరించునప్పు డన్యకాంతాసంగమంబు సేయ కుండుటకును, నన్ను వదల కుండుటకునుం జేసినశపథంబును గాదు పలిపితి, పాపకర్ముఁడా! నీవు శుద్ధాత్ముండవైన నిన్ని యలజ ళ్ళేల వచ్చు' నని నిషేధించి పలికి యంత నిలువక. ౯౮

క. విందుము బొంకెడుపురుషునిఁ
జండాలుం డనఁగ నీవు క్షత్రకులుఁడవై
యుండియు బొంకితి గావునఁ
జండాలత నొందు' మనుచు శాపం బిచ్చెన్. ౯౯

క. అన వంజరుండు 'వనితా!
నిను గదిసిన నట్ల యగుదు, నీవును ననుఁ జే
రిన నట్టులు కావలదే'
యనుచుం బ్రతిశాప మిచ్చినట్లుగఁ బల్కెన్. ౧౦౦

ఆ. పలికి తపము సేయుతలఁపున వనభూమి
కరిగె, నదియు నొక్కయడవి కరిగెఁ,
జూచి వేశ్య వనరుచును బోయె నింటికి
దాసి తనదువెంటఁ దగిలి రాఁగ. ౧౦౧

వ. మఱియుఁ గొంతకాలంబునకు నొక్కనాఁ డవ్వంజరుండు నిజానుష్ఠానంబులు దీర్చి వన్యఫలంబు లనుభవించునప్పు డం దేమి విశేషంబు సోఁకెనో మస్తకంబు మొదలుకొని సకలావయంబులందును నొక్క ఘోర యూడి సర్పంబు కుబుసం బూడినట్లైన షణ్మాసమాత్రబాలుండై బాలలీలల మెఱయింపమంద నంత నతనికాంతయు దైవవసంబున నాపైత్రోవ నరుగుచుండి యతనిం బొడగని వీఁ డెవ్వరివాఁడో, వీని తల్లిదండ్రు లెట్లే మైరో, యామిషార్థంబు పక్షిరాక్షసులం దెవ్వ రేని వీనిం గొని పోయి పోయి చేతప్పి పడవైచిరో, కాక యిందు రాకకుం గారణం బేమి యని నలుదిక్కులం బరివరించుచు నెత్తుకొని యురంబున నొత్తుకొని. ౧౦౨

క. మే నెంతయుఁ బులకింపం
గా నప్పుడు ప్రాణనాథుఁ గౌఁగిట నిడిన
ట్లైన, మది సంశయించుచు
వానిం గొని పోయి పెంచె వనిత ముదమునన్. ౧౦౩

క. దినదిన మొక్కొక కళగాఁ
బెనుపొందెడుచంద్రుమాడ్కిఁ బెరిగె నతం డే
డెనిమిది దినములనాఁటికి
మనసిజుఁడై పడి నతిసుకుమారాకృతితోన్. ౧౦౪

వ. ఇట్లు నవయౌవనుండై యావనితపై నివ్వటిలు తనకోర్కి వితర్కించి దాని
కిట్లనియె ౧౦౫

ఉ. మాతవు నీవు, నిన్నుఁ గని మానస మారయ నేమి పాపమో
నాతి! యధర్మలక్షణమునం జొరఁ దాఁటెదు నోజ లేక. నా
కీతలఁ పేల పుట్టె నాకా యేగతి నేఁగుదు నొక్కొ' నావుడుం
జేతులు మోడ్చి యవ్వనిత వెచ్చెర నిట్లని పల్కె వానితోన్. ౧౦౬

ఉ. నీవు శిశుత్వ మొంది యవనిం బడి యుండఁగ నెత్తుకొన్నమ
ద్భావము నిట్లయై వెఱఁగుపాటు జనింపఁగఁ దెచ్చి పెంచితిం
దేవ! నిజంబు చెప్పుము. మదీయమనోహరుఁ డైన వంజర
క్ష్మావిభు నట్ల తోఁచెదవు కావు గదా యనుమాన మయ్యెడున్.' ౧౦౭

ఆ. అనిన నతఁడు చెలిసి యనుమాన మేటికి
వంజరుండ నగుదుఁ గంజనయన!
వెతలఁ బడితిఁ బొమ్ము విప్రాదులగువారి
మూఁడుశాపములను ముక్తి పడసి ౧౦౮

వ. అనిన నయ్యతివ వానికిట్లను, 'విప్రాదులనువా రెవ్వరు? వారు నిన్ను
శపింపం గారణం బేమి? నీ విప్పుడు శాపవిముక్తుండ వైతిం బొమ్మనుట
యేమిటంజేసి? యనిన నవ్విటచతుష్టయంబు వనితావాదనిమిత్తంబునం దన
సమ్ముఖంబునకు వచ్చుటయుఁ, దానుఁ దీర్చినతగవు శూద్రునకుఁ దక్కఁ
దక్కినవారలకు నసహ్యం బైనం గోపించి, శాపంబు లిచ్చినతెఱంగునుం
జెప్పి మఱియు నిట్లనియె. ౧౦౯

క. నీతోడఁ జచ్చి క్రమ్మఱ
నీతో జన్మించి పిదప నీవు పెనుపఁగా
నీతనయుఁడ వై పెరుగుట
నోతరుణి! త్రిశాపముక్తి నొందితి నంటిన్.' ౧౧౦

క. అని చెప్పుచు నెట కేనియుఁ
జన నుద్యోగించురాజసత్తముఁ గని య
వ్వనిత మది బెదరు గదుర న
తని కిట్లను మోమునందు దైన్యము దోఁపన్. ౧౧౧

క. 'ఝషగర్భంబునఁ బొడమిన
ఝషకేతునిఁ గాంచి సంతసము నొందినయా
ఝషకేతువనితఁ బోలితి
ఝషకేతుసమాన! చూడు సత్కృప నన్నున్.' ౧౧౨

వ. అని తొల్లి మన్మథుండు నిటలనేత్రు నేత్రవహ్నివలన సమసిననాఁడు శరమాయాడంబరుండగు శంబరుం డంబరమార్గంబునఁ జఱతెంచి తత్సతియగు రతి నతిత్వరితగతి నెత్తుకొనిపోయి యంతఃపురంబున వైచుకొనిన నది మాయావతి యనుపేరం దత్సంగతం బొక్కటియు వెలిగాఁ దక్కటిపను లన్నియుఁ దాన యనుసంధించుచు, స్వసంకల్పకల్పితయు స్వమూర్తిసదృశయు నగునొక్క కృతకవనిత నతనికోర్కి దీర్ప నప్ప టప్పటికి నియోగించుచుఁ దన పాతివ్రత్యంబునకు హాని లేకుండ నిట్టు చరింపుచుండఁ బెద్దకాలంబునకు ద్వాపరాంతంబున నఖిలభువనావనగుణభ్రాజిష్ణుండగు విష్ణుండు కృష్ణుండై పుట్టిన నప్పుణ్యమూర్తికి రుక్మిణీదేవికిఁ గాముండు ప్రద్యుమ్నుండై పుట్టుట శంబరుం డెఱింగి యాశిశువుం గొని పోయి సముద్రమధ్యంబున వైవ నొక్కమీను మ్రింగె, నది యొక్కవేఁటకానిచేతం దగుల్ వడి యాశంబరునకు వాఁడు కానుకగాఁ దెచ్చి యొప్పింప మాయావతిచేతం దఱుగంబడునప్పుడు శుక్తి మధ్యంబునం బొల్చు ముక్తాఫలంబునుం బోలె నాఝషజఠరకుహరంబున నున్నబాలునిం గని యతని గూఢవృత్తి నెత్తుకొని పోయి యద్దేవి రహస్య ప్రదేశంబున నునిచి పెనుచుచుండ నతండు సంప్రాప్తయౌవనుండై శంబరు వధియించి శంబరారి యనుపేర నిజసతీయోగసౌఖ్యంబు లనుభవించుచుండుటఁ జెప్పు నప్పురాతనకథారూపంబు దీపింప నాడిన నతం డిట్లనియె. ౧౧౩

ఆ. 'నళినవదన! యల్లనాఁడు నీ వాడిన
మాట మఱచి తెల్లు మాలతనము
వచ్చు నన్నుఁ జేర వచ్చిన నే నింత
కోర్వ నింక నూరకుండ నిమ్ము.' ౧౧౪

క. అని యతఁడు విడియ నాడిన
'యనఘా! యింతనెగు లైన నతులితసత్యం
బున కుపఘాతక మయ్యెడు
పని కొడఁబడుదురె వివేకపరిణతు లెందున్. ౧౧౫

ఆ. నన్ను వదలకుండ మున్ను చేసినబాసఁ
దలఁప వైతి గాన దానఁజేసి
సొలసి నిన్ను నట్లు పలికితి నీవు నా
పలుకు లింత యెగ్గు పట్టఁ జనునె? ౧౧౬

వ. అది యట్లుండ నిమ్ము. ౧౧౭

మ. నరకం బైనను నాక మైన మది నానందంబు గావింపదే
పురుషుం డింతియుఁ దానుఁ గూడి చనినం భూమీశ! వందాలయ
స్తరభావం బది నాకు నీకు సమమై సంధిల్లుఁ; బ్రారబ్ధముల్
పరిభోగం బధికంబు లౌ టెఱుఁగవే పౌరాణికప్రోక్తిమై. ౧౧౮

క. కావున మన మెట్లైనను
వైవస్వపుంజేసి బ్రతికెదము గాని ధరి
త్రీవర! నాకోరిక వృథ
గావింపకు' మనుచు మ్రొక్కెఁ గన్నీ రొలుకన్. ౧౧౯

చ. నృపతియుఁ దత్కుతూహలము నెమ్మిఁ గనుంగొని యాత్మఁ దద్దయుం
గృప దిగుపొత్త నాళీకముఖిం దగఁ గౌఁగిటఁ జేర్చి మేన ద
ట్టపుఁబులకల్ జనింపఁగఁ దొడంగి మనోభవకేళిఁ దేల్చె, నా
నెపమున నంత్యజాకృతులు నెట్టనఁ దాల్చిరి వార లిద్దఱున్.' ౧౨౦

ఉ. నాపుడు విప్రుఁ డిట్టు లను నాకమహానదితోడ 'వంజరుం
దాపల మూఁడుజన్మముల యప్పటఁగోరెను యుష్మదీయనే

వావిమలాత్ముఁ డట్టి, తుది వారక శాపము లంది యిట్టు లే
లా వివిధంబు లైన వ్యధలం బడఁజొచ్చెఁ దపంబు పెంపఱన్ ?' ౧౨౧

చ. అనిన 'నతండు ముక్తి వడయన్ సమయం బరుదెంచెఁ గాన యా
తనికిఁ బురాకృతంబు లగు దారుణకర్మము లొందె, నివ్విధం
బున నఘముక్తి గావలసె, భూసురసత్తమ! యట్లు గాక త
క్కిన భవబంధముల్ తెగునె కేవలకర్మనిబద్ధదేహికిన్ ? ౧౨౨

ఉ. కావున వాఁడు క్షత్రియుఁడు గాని తలంపఁగ హీనజాతి గాఁ
డో వసుధామరేంద్ర! యతఁ డున్నెడకుం జని చెప్పు మయ్య! నా
జీవనగౌరవం బటులు చెప్పిన నప్పుడు వాఁడు ముక్తుడై
పోవుఁ బ్రియాసమేతుఁ డయి పొమ్ము ; సమస్తము విస్తరించితిన్.' ౧౨౩

క. అని గంగానది చెప్పిన
విని విప్రుఁడు తల్లి ' యేఁ బవిత్రుఁడ నైతిన్.
బనివినియెద ' నని మ్రొక్కుచుఁ
జని కతిపయతిథుల కతనిసదనము చేరెన్. ౧౨౪

ఆ. అతఁడు నతనిరాక కత్యుత్కటప్రీతి
దనర నెదురు చూచుచునికిఁజేసి
కన్నయదియు మొదలు గాఁగ సాష్టాంగ దం
డప్రణామములు గడంగి సేయ. ౧౨౫

క. ఉర్వీసురవర్యుఁడు నా
శీర్వాదము లొనరఁ జేసి స్మితవదనుండై
'గీర్వాణుల కెన వచ్చు న
ఖర్వగుణుఁడ వీవు పవతు గలదే నీకున్. ౧౨౬

ఉ. ఏను భవన్నియోగమున నేఁగితిఁ గాశికి, గంగలోఁ గృత
స్నానుఁడ నైతి, నీదగువవస్థితి చెప్పితి నప్పవిత్రతో,
నానది దివ్యతేజ మొలయం దనరూపము చూపె మందహా
సాననకాంతితోడ నయనామలరోచులు మేళవింపఁగన్. ౧౨౭

క. తనుఁ జూచినయట్టులకా
ననుఁ జూచి ప్రహృష్ట మంది నాభృత్యుఁ డతం

డనితరసదృశుఁడు సుమ్మీ
యని ప్రస్తుతిఁ జేసె నమ్మహానది నిన్నున్. ౧౨౮

ఆ అట్లు ప్రస్తుతించి యతఁడు సేమంబున
మన్నవాఁడె? నా *మహోన్నతియును
జెప్పు మనని కినియె నప్పుడే ని ట్లంటి
గంగతోడఁ గరయుగంబు మొగిచి ౧౨౯

ఉ నీకరుణారసంబునకు నిక్కముగా నిటు ప్రాప్తుఁడైన సు
శ్లోకుఁడు హీనజాతుఁ డని మాడఁగరా దతఁ డెట్టిపుణ్యుఁడో
నా కెఱిఁగింపవే' యనిన నాకమహానది నీప్రభావముల్
కైకొని చెప్పి వీడ్కొలిపెఁ, గంటిమి నీవగునద్భుతక్రియల్. ౧౩౦

సీ. గాఢనీహారంబు గప్పినఁ దప్పునే
మార్తాండబింబ విస్ఫూర్తి పెంపు?
నీఱు పైఁ గవిసిన నాఱంగ నేర్చునే
ప్రకటితదావపావకుని వేఁడి?
మసికోక ముడిచినఁ బస చెడిపోవునే
తనరు ననర్ఘ్యరత్నంబు కాంతి?
భూరిశైవాలంబు పొదివినఁ బొలియునే
విలసదంభోరుహ విభ్రమంబు?

తే దైవవశమున నీకుఁ బ్రాప్తవ్య మైన
ఘోరదురితంబు నీఁగెడుకొఱకు నిచట
నంత్యజాకృతి నొందినయంతలోన
వర్ణ్యమగు నీ తపోమహత్త్వంబు చెడునె? ౧౩౧

క కింకుఁ డయి ధర్మజుఁడు, వల
లాంబుండై వాయుజుఁడు, బృహన్నలయై ని
శ్శంకుఁడు పార్థుఁడు, హయ గో
కింకరులై కవలుఁ దొల్లి గెలువరె దినముల్, ౧౩౨

* మనోన్నతియును.

వ నీవు వంజరుండవు గాని చండాలుండవు గావని యవ్విప్రుండు పల్కఁ బ్రస్తుతవాక్యంబు లతనిచండాలత్వంబునకు నుచ్చాటనమంత్రంబులై శివసారూప్యపదకారణంబు లగుటయు. ౧౩౩

సీ. బహుభుజంగమభోగభారంబుక్రియ మౌళి
నురుజటాజూట మచ్చెరువు గాఁగ
శకలేందుమధ్యగైరికరేఖగతి మోడ్పుఁ
గన్ను ఫాలమున కక్కజము గాఁగ
రజతాద్రిపై మంచు గ్రమ్మినపగిది భ
స్మపుఁబూఁత యొడల విస్మయము గాఁగ
ధ్రువతటిత్పుంజంబు భువి నిల్పఁ బొడిచిన
పోల్కిఁ ద్రిశూల మద్భుతము గాఁగ

తే లలితగజదైత్యచర్మంబు వెలయ భూరి
భుజగభూషణరాజవిస్ఫూర్తి యెసఁగ
నోలిఁ జండాలవేషంబు నుజ్జగించి
శంకరాకార మొందె వంజరవిభుండు. ౧౩౪

చ, అనిమిషు లప్పు డర్థిఁ గొనియాడఁగ, నాడఁగ నప్సరస్సతుల్.
పనివడి కిన్నరాంగనలు పాడఁగఁ, జూడఁగ నెల్లవారలున్
గనకవిభూషణాంబరసుగంధసముజ్జ్వలమూర్తిఁ దాల్చెఁ , ద
ద్వనితయు నావిమానగతిఁ (?) దాఁ గదిసెం బతివామభాగమున్. ౧౩౫

వ అయ్యవసరంబున ౧౩౬

ఆ. కప్పురంపుఁబ్రతిమ కైలాసనగరంబు
నొద్ది పాదరసముముద్ద యనఁగ
నాన్నపాలుపాలి కతిచిత్రగతులతో
వచ్చి నిలిచె వృషభవల్లభుండు. ౧౩౭

వ. అట్లు సదాశివలాంఛితుండును, నంగనాసమన్వితుండును, గోరాజవాహనుండును నై యారాజపరమేశ్వరుండు ప్రమథు లెదుర్కొన హరనివాసంబైన కైలాసంబున కేఁగె నట్లు గావున ౧౩౮

క. సత్సంగతి గదుఁ బుణ్యము,
సత్సంగతి సేయవలయు సత్పురుషులకున్,
సత్సంగతి గని వంజరుఁ
డుత్సుకమతి నభవుపురికి నొప్పుగఁ జనఁడే! ౧౩౯

క. ఆరాజేంద్రుం డటు శివ
సారూప్యపదంబు నొంది గనినతెఱఁగు గ
న్నారఁగఁ జూచువారికిఁ బెం
పారఁగ నవ్విప్రుఁ డిట్టు లని వర్ణించున్. ౧౪౦

ఉ. 'ఏమని చెప్పవచ్చుఁ బరమేశ్వరభక్తుల సచ్చరిత్రముల్
తామిలలట్ల యుండుదురు ధారుణిలో మఱి శంఖపాలి క
ద్దామత నేఁగుచోఁ దమప్రతాపముఁ దేజముఁ జెప్పఁ జిట్టనై
భూమిఁ బొగడ్త కెక్కి తమపోడిమి చూపుదు రెల్లవారికిన్ ౧౪౧

క. పుట్టువుల కెల్లఁ గడపటి
పుట్టువుగా నెల్లరందు పుట్టినదానం
గట్టిగ నంత్యజుఁ డని పే
రెట్టివిశేషార్థ మయ్యెనే యాతనికిన్॥' ౧౪౨

మ. అనివర్ణించుచుఁ దద్విచిత్రసుమహత్త్వాధిక్య మూహించి వా
రని వేడ్కల్ నిగుడొత్త బాష్పజలధారాధౌతగండద్వయం
బును రోమాంచసమంచితాంగకములుం బ్రోత్ఫుల్లవక్త్రాబ్జమున్
వినతాకంపితమస్తకంబుఁ దగ నవ్విప్రోత్తముం డుండఁగన్. ౧౪౩

ఉ. పౌరులు చేరి 'యోపరమపావనమూర్తి! భవత్సమాగమం
బారయ నెట్టిదో యిచటి యంత్యజుఁ డిప్పుడ ముక్తుఁ డయ్యెఁ బం
కేరుహసూతివో, వృషభకేతుఁడవో, హరివో కదయ్య! నీ
వారివరాఁ దలంపు బుధసత్తమ!' యమ్మని పల్కి రందఱున్. ౧౪౪

క. ఆపల్కుల కతఁ డిట్లను
'నోపౌరశ్రేష్ఠులార! యొప్పుగ వినుఁడే
నాపద్మజాదివిష్ణుల
లోపల నెవ్వఁడనుఁ గాఁ బలుకు లే మిటికిన్. ౧౪౫

క. విప్రుఁడ నే, నయ్యంత్యజుఁ
డాప్రమథాధిపతిభక్తుఁ డాతఁడు తనధ
ర్మప్రాభవమున నియ్యెడ
నప్రతిహతతేజుఁడై హరాద్రికిఁ బోయెన్, ౧౪౬

క. వినుఁ డతనిమహిమ చెప్పెద
నని తన కాశీప్రయాణమాదిగ మఱి యా
తనిమోక్షము తుదిగాఁ గ
ల్గునడిమివృత్తాంత మెల్లఁ గొనకొని చెప్పెన్. ౧౪౭

ఉ. చెప్పినఁ బ్రీతులై యతనిఁ జెచ్చెరఁ దోఁకొని పోయి బూరెలుం,
బప్పును, నెయ్యి, పాయసముఁ, బక్వఫలాదులు నేత్రతృప్తిగాఁ
గుప్పిరి ముఙ్ పథశ్రమము గూరినమేనికి దప్ప దీఱున
ట్లప్పురివిప్రముఖ్యులు ; ప్రియంబునఁ గైకొని యేఁగె నాతఁడున్. ౧౪౮

వ. ఇట్లేఁగి తనపురంబు చేరి యాత్మగతంబున. ౧౪౯

ఉ కాశికిఁ బోవఁ గంటి, మణికర్ణికఁ గ్రుంకిడఁ గంటి నేను, వి
శ్వేశుపదాబ్జసేవఁ బరమేశ్వరిసత్కృపఁ జాలఁ గంటి, న
క్లేశగతిన్ హిమాచలముక్రిందటిభూములుచూడఁ గంటి, న
చ్చో శివభక్తిజంబు లగు సూక్తు లొగి న్విన఼ఁ గంటిఁ దేఁటగన్. ౧౫౦

ఆ అక్కజంబులైన యట్టివిశేషంబు
లర్థిఁ జూడఁ గంటి నచట నచటఁ ;
దిరిగి వచ్చి జన్మదేశము చొరఁ గంటి
మంటి ననుచు నాతఁ డింటి కరిగె. ౧౫౧

క. భయభక్తిసంభ్రమంబులు
రయమున ముప్పిరి గొనంగఁ బ్రణమిల్లినయా
ప్రియసతి నుచితవచనసం
చయములఁ దగ గారవించి సౌహార్దమునన్. ౧౫౨

ఉ. ఇమ్ములఁ గాశికాపురికి నేఁగెడునప్పుడు, నందునుండి య
య్యమ్మికపంపునన్ హిమవదద్రిసమీపము కేఁగునప్పుడున్,

గ్రమ్మఱి వచ్చునప్పుడును గన్నవిశేషము లింతితోడ మో
దమ్మునఁ జెప్పె విప్రుఁ, డది దానును జెప్పె విహ ప్రసంగముల్. ౧౫౩

వ. ఇట్లన్యోన్యవిశేషభాషణంబులం గొండొకసేపు వినోదించి, యెల్లదానంబుల యందును నన్నదానం బసమానం బనియును, నందు సిద్ధించుపుణ్యం బగణ్యం బనియును నెఱింగినవారై యాదంపతులు తదీయాచరణంబులు తమకు శరణం బులుగాఁ బ్రవర్తింపుచు ధనధాన్యసమృద్ధియుఁ బుత్రపౌత్రాభివృద్ధియుం గలిగి బ్రతుకుచుండి రని చెప్పి సర్వవేదిసిద్ధుండు ౧౫౪

సీ. 'అన్నంబు బలకరం బన్న మాయుర్వృద్ధి
కర మన్న మత్యంతకాంతికరము
తనుఁ జంప వచ్చిన ఘనశత్రునకు నైన
నన్నంబు బంధుత్వ మావహించు
నన్నంబువలనన యమరులు ప్రీతులై
పరులకుఁ గోరినవరము లిత్తు
రన్నదానముఁ బోల వన్యదానంబులు ;
ధరణిలోపల నన్నిదానములకు

ఆ. ఫలము సరిగఁ జెప్పఁబడుఁ గాని యన్నదా
నంబు సేఁత కీ ఫలం బనంగ
నబ్జభవుఁడు నోపఁ డటు గాన నీవును
నన్నదానపరుఁడ వగుము భూప ! ౧౫౫

క. ఇది నీ యడిగినప్రశ్నకు
సదమలమగు నుత్తరంబు జనవర ! యేఁ బో
యెద' ననిన నాతఁ డి ట్లను
'నిది తగవా, మిము భజించు టి ట్లనుటకునే! ౧౫౬

సీ. అఖిలదానములందు నన్నదానంబు వి
శేషంబుగా మీరు చెప్పుచున్న
వారు తత్ఫలములవలనను జేరెడు
ననువు పేయను మీరె యగుటఁజేసి

తత్ప్రతిగ్రహము సేఁతకు మీర యర్థు లా
రయ నిప్పు డవ్వేళ యయిన దడియుఁ
గాక మీయందును గనఁగ నామీఁది య
నుగ్రహం బధికసమగ్ర మగుటఁ

తే. బరిహరింపక నావిన్నపంబు మీర
లవధరింపంగఁ దగు ' నన్న ' నవనినాథ !
యింత చెప్పంగ నేల నే వింతవాఁడ
నయ్య ! వ్రతభంగ మగు నని యంటిఁ గాక. ౧౫౩

ఆ. నృపకులాబ్ధిచంద్ర ! నీ వింత నెట్టుకొ
నంగఁ ద్రోచి పోవ నాకుఁ దగదు.
వినఁగ వలయు నాదువిధమును నీకు న
ట్లగుట నొక యుపాయ మవధరింపు ౧౫౪

చ. అనఘ ! భవద్వధూవిమలహస్తసరోరుహదత్తభిక్షయుం
దనరఁగ వేఁడి నాల్గు సదనంబులభిక్షయుఁ గాంచి యివ్విధం
బునఁ గల పంచభిక్షయును భూపవరా ! భవదీయపంక్తి విం
పెనయ భుజింతు; నొండ నకు మిప్పని దా నుభయార్థముం జుమీ ! ౧౫౫

ఉ. అచ్చటఁ దెచ్చుభిక్షయు నరాధిప ! నీయశనంబు గాదె. నీ
వచ్చపుఁగూర్మిఁ బ్రోచుమనుజావళిసొమ్ము భవద్ధనంబకా కె
చ్చటనుండి వచ్చె ? నిది యిట్టిదకా మది నిశ్చయింపు; నా
కిచ్చిన విమ్ము ' నావుడును ' నిట్టి దృఢవ్రతుఁ డెందుఁ గల్గునే. ౧౫౬

క. పట్టఁగ వలవదు వ్రత మది,
పట్టినఁ దుది విడువ వలదు, పట్టినవ్రత మే
పట్టున వదలక జరిపెడు
నట్టిజనులు పూజ్యు లనిమిషావళి కైనన్. ౧౫౭

వ. అని కొనియాడుచు నమ్మనుజేంద్రుం డనుమతింప నతండట్ల చేసె. న ట్లిరు
వురు నాహారంబులు గొనిన తదనంతరంబ. ౧౫౮

క. భోజమహీపతిచేతం
బూజితుఁడై యరిగె సిద్ధపుంగవుఁడు నరేం

ద్రా! జగతి నన్నదాన
భ్రాజిష్ణుం డయ్యె నానృపాలవరుండు౯. ౧౬౩

చ. వినుము నరేంద్ర! భోజపృథివీతలనాథుని రాజ్యలీలయుం
బొనరఁ దదీయకాలమునఁ బుట్టినయట్టివిశేషరీతులుం
గొనకొని నీదు కర్ణములకు న్విశదంబుగ విస్తరించితి౯;
మనువిధుఁ డవ్విభుం డతనిమార్గము తక్కినవారి కబ్బునే. ౧౬౪

సీ. మొదలు సామోపాయమున సర్వభూప్రజా
పరిపాలనము సేయుఁ బాడితోడ
నదరి రెండవయుపాయం బైన భేదముఁ
బచరించుచుఁ బుణ్యపాపములయందు
మొగిఁ దృతీయోపాయ మగు దానవిభవంబు
నెఱపు నశేషార్థినికరమందు
నటఁ జతుర్థోపాయ మైన దండక్రియ
యడరించు మృగయావిహారమందుఁ

తే. దనకు నెందును నెదురు లే కునికిఁజేసి
చతురుపాయములకు నిట్లు గతి యొనర్చె
నౌర యితఁ డంచు నీతిజ్ఞు లాదరింప
బుధపయోధిసుధాంశుండు భోజవిభుఁడు. ౧౬౫

సీ. చర్చింప రెండవచంద్రుఁడు, మూఁడవ
యశ్విని, నావల యగ్నిదేవుఁ,
డైదవ లోకపాలాఖ్యుఁ, డాఱవ పాండు
సంతాన, మేడవ చక్రవర్తి,
యెనిమిదయగు నమ్మనీశుఁడ, తొమ్మిద
యగు భోగిపతి, పదియవ విరించి,
పదునొకొండవ చక్రపాణి, పండ్రెండవ
శూలి, పద్మూడవ సూర్యుఁ డనఁగఁ,

ఆ. దనరుఁ గాంతి, రూపమునఁ, బ్రతాపమున, స
త్యమున, ధర్మచరిత, నాజ్ఞ, శుచిని,

భూరిసత్వమునఁ, బ్రబుద్ధతఁ, గలిమినీ,
భూతిఁ, దేజమునను భోజవిభుఁడు ౧౬౬

ఉ. ఆరసి వీరు వీ రని కృతాదియుగంబుల మూఁటియందు విం
పారఁగఁ బేర్కొనం గలుగునట్టి ఘనుల్గల రెన్నుచో బహు
క్ష్మారమణోత్తముల్ ; కలియుగంబున భోజవిభుండు సద్గుణా
కారుఁ డొకండ కాని మఱి కల్గఁడు తత్సదృశుండు భూవరా! ౧౬౭

తే. క్షీరపూరితఘటము, కర్పూరయుతక
రండ, ముదయదిందుద్యుతిరమ్య మైన
కైరకాకర మనఁగ జగంబు మెఱయు
భోజవిభునిత్యకీర్తి విస్ఫూర్తిఁ జేసి. ౧౬౮

చ. అవిరళకీర్తినిత్యుఁడు, సమంచితసత్యుఁడు, శ్రీప్రయాగమా
ధవకరుణావలోకనసుధారసజన్ముఁడు, కామినీజన
ప్రవిమలచిత్తజన్ముఁడు, ప్రభాకరతేజుఁడు భోజుఁ డొప్పు వై
ష్ణవశుభయోగలక్షణవిచక్షణుఁడై చిరజీవనోన్నతిన్. ౧౬౯

క. అభినవభోజుఁ డనంగాఁ
బ్రభవించెఁ దనూజుఁ డానృపశ్రేష్ఠునకున్,
శుభలక్షణలలితుఁడు, శ
త్రుభయంకరుఁ; డార్యసన్నుతుఁడు ధీయుక్తిన్. ౧౭౦

క. నెట్టన భోజునికడుపునఁ
బుట్టినపుత్రుఁడఁట, యవ్విభుని చారిత్రం
బెట్టి దన నేలఁ? బులికిం
బుట్టినకూన యఁట! వేఁడి పులు మేసెడినే? ౧౭౧

చ. అవనికిఁ జందనంపుఁగలయంపి, పయోధికి ఫేనచిహ్న, వృ
క్షవితతికిం బ్రసూనతతి, శైలచయంబునకున్ నితాభ్రగౌ
రవ, ముడువీథికిన్ సురతరంగిణివెల్లి యనంగ నొప్పు భూ
భువనబిడౌజుఁడైన నవభోజునికీర్తి మనోజ్ఞమూర్తి యై. ౧౭౨

ఉ. ఆతఁడుఁ గాంచెఁ బుత్రుల ననంతగుణాఢ్యులఁ, దత్తనూజులుం
జాతిగఁ గాంచి రాత్మజులఁ జారుయశస్కుల, వారలుం దనూ

జాతులఁ గాంచి రున్నతవిచారుల, నీక్రియ భోజవంశ మ
త్యాతతకీర్తి నొప్పె భరతాన్వయసన్నిభమై జగంబునన్. ౧౭౩

క. ఈభోజరాజచరితము
భూభువనమునందు నిఖిలపుణ్యాస్పదమై
శోభిల్లు నధికతేజో
లాభంబుల నిచ్చు శ్రోతలకు వక్తలకున్. ౧౭౪

వ. అని భోజరాజీయంబు నెయ్యంబున నాద్యంతంబు నత్యంతహృద్యంబుగా
నుపన్యసించి, ౧౭౫

సీ. అత్రిపుత్రుండు పవిత్రచరిత్రుండు
వితత తపోమార్గ సతతతపధికుఁ
డజ్ఞానదూరుఁ డతిజ్ఞానసారుఁ
*డంతర్వైరివిదళనాఖర్వబలుఁడుఁ
జిరతరాయుష్మంతుఁ డురుతరస్వాంతుఁ డ
ష్టాంగయోగక్రియాసంగతుండు
లక్ష్మీనివాసుండు లక్ష్మీనిరాసుండు
నిఖిలాశ్రితవ్రాతసుఖకరుండు

ఆ. నజరుఁ డచలుఁ డనఘుఁ డజుఁడు దత్తాత్రేయ
మునివరుండు దనకు వినతుఁడైన
మహుని వీడుకొల్పి మహితకృపాదృష్టి
రీతి వెసఁగ బుధులఁ బ్రోచుచుండె ౧౭౬

క. దత్తాత్రేయప్రోక్తము
దాత్తసుకృతభోగవిశ్రుతసునీతిపథా
యత్తంపై యితిహాసము
క్రొత్త గదే భూమి ననుచుఁ గొనియాడంగన్. ౧౭౭

క ఆచక్రవాళ మాపృ
థ్వీచక్రం, బాశశాంకతిగ్మమయూఖం,

---

* డంతర్వేది.

బాచతురాస్యముఖాఖిల
ఖేచర మగుఁగాత నాదు కృతిరత్నము దాఁ. ౧౭౮

సీ. అఖిలజగత్సేవ్యమై భూమిపై నహో
బలము దా నెందాఁక వెలయుచుండు
నాతీర్థమందుఁ బ్రఖ్యాతమై భవనాశ
నీనది యెందాఁక నెగడుచుండు
నామహానదివొంత నత్యంతపూజ్యమై
గరుడాద్రి యెందాఁకఁ గదలకుండు
నయ్యద్రిశిఖరంబునందును నెందాఁక
శ్రీనృసింహస్వామి స్థిరత నుండు

ఆ. నస్మదీయకృతియు నందాఁక సంతత
శ్రావ్యమై సమస్తసభలయందు
విస్తరిల్లఁ గాత వివిధకథానూత్న
రత్నభూషణాభిరామ మగుచు. ౧౭౯

క. గోవులకును బ్రాహ్మణులకు
భూవలయములోని పుణ్యపురుషులకు నభీ
ష్టావాప్తి యొదవుఁ గావుత
దేవార్చితుఁడగు నృసింహదేవుని కరుణన్, ౧౮౦

చ. అని జగదేకవంద్యునకు, నాదినృసింహున, కిందిరామనో
వనజమధువ్రతేంద్రునకు, వారిజనాభునకున్, సదోజలో
చనునకు, సూరిలోకనుతచర్యునకున్, భవబంధజాలమో
చనునకు నేను నీవిమలసత్కృతి కానుకగా నొనర్చితిన్ ౧౮౧

క. నన్ను భవద్భృత్యులలో
నెన్ని దయాదృష్టిఁ జూచి యిది మొదలుగ నీ
వెన్నఁడు వదలకు మిది నా
విన్నప మశ్లైన నఘనివృత్తుఁడ నగుదున్, ౧౮౨

చ. సరసిజపత్రనేత్ర! భవసాగరబాడబవీతిహోత్ర! ని
ర్జరపరివార! ధాత్రిచరసంఘవిదార! విఘాతపాతకో

త్కర ! సుకృతార్థకైరవసుధాకర ! యాశ్రితపారిజాత ! సు
స్థిరవరదాత ! యోగిజనసేవిత ! శాస్త్రపురాణభావితా ! ౧౭౩

క. అవయవయుతపరతత్త్వా !
భువనత్రితయాంతరాత్మ ! పూర్ణమహత్త్వా !
భవనాశనితటినీతి
రవిహారా ! భాస్వదిందిరావనికీరా ! ౧౭౪

తోటకవృత్తము

చందనకుంకుమసంయుతవక్షా !
కుందసుకుట్మలకోమలధామా !
వందితభక్తజనప్రియ ! యోగా
నంద ! యహోబలనాధ ! నృసింహా ! ౧౭౫

## గద్యము

ఇది వాణీవరప్రసాదలబ్ధవాగ్వైభవ తిక్కనామాత్యసంభవ
సుకవిజనవిధేయ అనంతయ నామధేయ ప్రణీతంబైన
భోజరాజీయంబను కావ్యంబునందు సర్వంబును
సప్తమాశ్వాసము

—: o :—

# సందర్భోచితములగు

# అర్థములు

## ఆశ్వాసము – ౧

మురపు=ఆశపడజేయు
ఉగ్గడువు=అధికము
నెఱవాది=నేర్పరి
పురణించు=పోలు
సదృక్షము=సమానము
పుష్పవంతులు=సూర్యచంద్రులు
అరిషడ్వర్గము=కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములు
ఐశ్వర్యషడ్వర్గము=ఐశ్వర్యము, జ్ఞానము, కీర్తి, శ్రీ, వైరాగ్యము, వీర్యము
ముమ్మడి=మూఁడురెట్లు
వీష్యము=భవిష్యత్తు
దృష్టము=దృష్టాంతము
ఉద్దవడి=మిక్కిలివడి
కందువ=స్థానము, జాడ

## ఆశ్వాసము – ౨

నట్టు=స్థానము, వాసస్థానము
కోర=గిన్నె
పాఁగెము=సంబంధము, సంతతి
తానకము=స్థానము
కప్పెర=బిక్షాపాత్ర
లాతము=సన్న్యాసులదండము
ఒచ్చెల=ఓచెల్లరూపాంతరము, సంతోషమును దెలుపును
ఒడ్డరితనము=ఆశపెట్టువానితనము
పెంచిక=కుండలోనగువాని పెంకు
అలందురు=దుఃఖించు
వంధ్యత=సంతానము లేకపోవుట

## ఆశ్వాసము – ౩

ఒడమి=
ఒడగోలుగొను (రూ. అడగోలుకొను) అపహరించు
నన=మొగ్గ, పూవు, చిగురు
కాలొక్కను=కాలూను, కాలుమోపు
చిట్లు=వృత్తాంతము
గాము=గ్రహము
పొలయు=సంచరించు
పుత్తడి=బొమ్మ
ఎగురుకట్లు=ఎదురు
కన్ను=జాడ
వీకు=ఉద్ధతి
పక్కెర=గుఱ్ఱము మున్నగువాని అంగీ, చొక్కాయ
లెప్పము=లక్ష్యము, గుఱి
దీమము=పక్షులు మొదలగు వానిని బట్టుటకు పెంపఁబడు పక్షి మున్నగునది

పొనుఁగుపఱుచు=వశింపఁజేయు

## ఆశ్వాసము - ౪

నడుఁకు=వణఁకు, భయపడు
బడె=చిన్న దుడ్డుకఱ్ఱ
పూట=పూచీపడుట
బిట్టుబిఱ్ఱు=తటాలున
చిట్టంటుచేతలు=నఖదంతక్షతాదులు
పోఁకు=మంచుకప్పనగడ్డి
ఉఱ్ఱు=బంధము
పైద=పిల్లకాయ
చిటికెనవట్టు=పెండ్లాడు
కడి=వాసన
చెనఁటిరంతులు=వెఱ్ఱి ఆటలు
ఉపధానము=దిండు
తెక్కలి=ప్రమాదము
బాపు=బళీ
దృక్కరణోన్మాదము=కంటిపిచ్చి, కను వేదులు
బడికము=నేర్పు, ఉపాయము
పూపు=పూనిక
ఎడ=గడువు
పరిభాష=ప్రతిజ్ఞ నియమము
వయ్యము=వ్యర్థము
సజ్జవారు=ఆయితమగు, సిద్ధపడు
అంకిలి=అడ్డగింత
నెట్టుకొను=పూనుకొను
ఉత్తుఁడు=అర్హుఁడు
ఎఱుకతీఁగె=జ్ఞానలత
నిషద్వరజము=అడుసు నుండి పుట్టిన తామర

## ఆశ్వాసము - ౫

జచ్చెము=కొఱఁత లోపము
బ్రాతి=దుర్లభము
కసరు=కోపము
కనుతిరుగలి=కంటిభ్రమ, కన్ను గుర్తింప లేకపోవుట
అడకించు=మోసగించు
గనపభూజము=పెద్దచెట్టు
జలము=వృక్షాదులచే మఱుగగుచోటు
గొల్లము=లోతగు పల్లము
కందువ=సంకేత స్థలము
మునుకు=మాఱుపలుకు
పుల్లగిలు=భయపడు
వెడ్డువెట్టు=వంచించు
ఆడిక=నింద

## ఆశ్వాసము - ౬

క్రయ్యఁబడు=కలయు
మసరు=ఆవేశము
తోడుకు=దొంగమేఁత
ఇట్టలము=అధికము
గొనుకొను=ప్రయత్నించు
కడపు=ఇయ్యకపొమ్మను
తూడరి=దుష్టుఁడు
కనుకుట్టుఁదనము=ఈర్ష్య, ఓర్వలేని తనము
పసంట్లు=పండలు
పితరి=దుర్నీతిపరుఁడు
దగర=పిశాచి
కస్తి=దుఃఖము

అక్షేశుఁడు=విష్ణువు
సజ్జ=పురిటిల్లు
జొబ్బిలు=నిండారు
నిర్వ్యవసాయి=నిరుద్యోగి
కీలారము=పసులమంద, ఘోషము
ప్రాతి=ప్రేమ, ప్రియము
వాలయించు=నిర్బంధించు
గెంటసము=పరుషపుమాట
పాథేయము=దారిబత్తెము

ఆశ్వాసము - 2

డెప్పము=లక్ష్యము
ఈలువు=పాతివ్రత్యము
ఉరియాడు=చలించు, ఊగులాడు
పుల్లవడు=స్తంభించు
ధార్ష్ట్యము=చెడ్డతనము, మోసము
ప్రుక్కు=సంకోచించు
చిట్ట=ఆశ్చర్యము
దప్పి=ఆయాసము, శ్రమము
అమ్మిక=పార్వతి.

— ० —

VEDAM PRINTERS—MADRAS-1. 1969.